విద్యుత్



మార్చి ప్రసారం చేయడంతోపాటు తిరిగి వాటిని ధ్వని తరంగాలుగా మార్చే ప్రయోగాల్లో ఇద్దరు వ్యక్తులు దాదాపు ఒకేకాలంలో సఫలీకృతులయ్యారు. 1876 లో అమెరికాకు చెందిన అలెగ్జాండర్ గ్రహంబెల్, ఎలిషాగ్రే ఏకకాలంలో ప్రోటోటైపు టెలిఫోను రూపొందించారు. ఇద్దరూ ఒకేరోజు పేటెంటుకు దరఖాస్తు చేసు కున్నప్పటికీ ఉదయం పూట తన విధానాన్ని నమోదుచేసుకున్న అలెగ్జాండర్ గ్రహంబెల్‌కీ సుదీర్ఘకాలం నడిచిన కోర్టుదావా పేటెంట్ హక్కులను ధారాదత్తం చేసింది. 1878లో తొలి టెలిఫోన్ ఎక్ఛేంజీ ప్రారంభమైంది. రేడియో టెలిఫోన్ 1900వ సంవత్సరంలో, టెలెక్స్ విధానం 1916లో, ఫోటోటెలిగ్రఫీ 1924లో, ఫ్యాక్సు మిషన్ 1949లో కనుగొన్నారు. 1979లో పోర్టబుల్ రేడియో టెలిఫోను, 1983లో వోకల్ కంట్రోలు టెలిఫోను, 1989లో సెల్ ఫోన్ వినియోగంలోకి వచ్చాయి.

### రేడియో

ఎలక్ట్రో మాగ్నటిక్ తరంగాల ఉనికిని1864లో కనుగొనడంతో రేడియో (వైర్‌లెస్ కమ్యూనికేషన్) విధానానికి దారిఏర్పడింది. 1895లో మొదటిసారిగా దూరప్రాంతాలకు వైర్‌లెస్ సంకేతాలను పంపడంలో కృతకృత్యుడైన మార్కోని 1901లో రెండు వేల మైళ్ళ దూరానికి సైతం ఎలక్ట్రోమాగ్నటిక్ సంకేతాలను చేరవేయగలిగాడు. 1909లో మార్కోనికి నోబుల్ బహుమతి లభించింది. ట్రాన్సిస్టర్ రేడియో 1948లో కనుగొనడంతో ఆధునిక కమ్యూనికేషన్ వ్యవస్థ నెలకొంది.

### టెలివిజన్

బ్రిటిష్ ఇంజనీరు జె.ఎల్.బయర్డ్ 1923లో మెకానికల్ టెలివిజన్ పరికరాన్ని రూపొందించాడు. మూడు సంవత్సరాల అనంతరం 1926లో ఆయన ప్రయోగం విజయవంతమైంది. మొదటి టెలివిజన్ కెమెరా 1923లోనే తయారుకాగా బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ 1932 నుంచి రెగ్యులర్ టెలివిజన్ ప్రసారాలను ప్రారంభించింది. జె.ఎల్.బయర్డ్ కలర్ టెలివిజన్ ప్రసారాలను 1928లోనే నిరూపించినప్పటికీ 1949లో డేవిడ్ సార్నఫ్ రూపొందించిన కలర్ ట్యూబ్ సహకారంతో బెల్ ప్రయోగశాల 1954 కలర్ టెలివిజన్ రూపొందించింది. లండన్-పారిస్ నగరాల మధ్య తొలికలర్ టెలివిజన్ ప్రసార కార్యక్రమాలను ప్రయోగాత్మకంగా పరీక్షించారు.

### విద్యుత్తు

వోల్టాయిడ్ సెల్‌గా పిలిచే ఎలక్ట్రిక్ సెల్‌ను 1800వ సంవత్సరంలో ఇటలీకి చెందిన అలసాంద్రో వోల్టా రూపొందించాడు. 1831లో గ్రేట్ బ్రిటన్‌కు చెందిన మైఖైల్ ఫారడే అయస్కాంత క్షేత్రానికి భిన్నంగా లోహపు చక్రాన్ని తిప్పినపుడు ఎలక్ట్రానుల ప్రవాహం ఉద్భవిస్తుందని కనుగొన్నాడు. దీంతో స్టీమ్ ఇంజన్ సహాయం వల్ల నడిచే మొదటి తరం జనరేటర్లు వాడకంలోకి వచ్చాయి. కేబుళ్ళ ద్వారా విద్యుత్ ప్రసారం చేయవచ్చని ఫ్రాన్స్‌కు చెందిన లాసియన్ గెలార్డ్ కనుగొన్నాడు. సెప్టెంబరు 25, 1882లో ఆయన మ్యూనిచ్ నగరానికి టెలిగ్రాఫ్ వైరు ద్వారా విద్యుత్ ప్రసారం చేశాడు.

### ఎలక్ట్రిక్ బల్బ్

నిరోధక శక్తి ఎక్కువగా ఉన్న వాహకం గుండా విద్యుత్ ప్రసారం చేసినపుడు వెలువడే శక్తి వెలుతురు శక్తిగా మారే విధానాన్ని 1878-79ల మధ్య కాలంలో ఇద్దరు శాస్త్రవేత్తలు విడివిడిగా కనుగొన్నారు. థామస్ అల్వా ఎడిసన్ అమెరికాలో పరిశోధనలు నిర్వహించగా సర్ జోసెఫ్ స్వాన్ ఇంగ్లాండులో ప్రయోగాలు చేశాడు. ఒకరిపై ఒకరు కోర్టు దావాలు నడిపిన తర్వాత సంయుక్త ప్రయోగాలకు ఒప్పందం చేసుకున్నారు. 1878లో స్వాన్ ప్రదర్శించిన కార్బన్ ఫిలమెంట్ దీపం,1879లో ఎడిసన్ రూపొందించి కార్బనైజ్డ్ కాటన్ ఫిలమెంట్ దీపం విఫలం కాగా 1880 అక్టోబరు-నవంబరు నెలల కాలంలో ఎలక్ట్రిక్ దీపాలను మార్కెట్లోకి విజయవంతంగా ప్రవేశపెట్టారు. 1909లో ఫ్రాన్స్‌కు చెందిన జార్జి క్లాడ్ నియాన్ ట్యూబును,1910లో అమెరికాకు చెందిన విలియం డేవిడ్ కూలిడ్జ్ టంగ్ స్టన్ ఫిలమెంటును కనుగొన్నారు. 70 ఏళ్ళపాటు అనేకమంది శాస్త్రజ్ఞులు నిర్వహించిన కృషి ఫలితంగా 1934లో ఫ్లోరోసెంట్ ట్యూబులు వాడకంలోకి వచ్చాయి. హాలోజన్ ల్యాంపులు 1980లో కనుగొన్నారు.

### స్టీమ్ ఇంజన్

క్రీస్తుశకం ఆరంభంలో ఏలిపైల్ పేరిట ఆవిరితో నడిచే చక్రాన్ని తయారుచేసినట్లు అలెగ్జాండ్రియాలోని ఒక గ్రీకు గణితవేత్త రచనలు తెలుపుతున్నాయి. వాతావరణంలో ఉన్న శక్తిని వినియోగించుకుని యాంత్రిక శక్తిగా మార్చాలన్న ప్రయత్నాలు వాతావరణ పీడనాన్ని కొలిచే బోరోమీటర్ తయారీకి ఉపయోగపడ్డాయి. ఫ్రాన్స్ దేశానికి చెందిన డెనిస్‌పాపిన్ నీటి ఆవిరి ఆధారంగా 1679లో ఆవిరి యంత్రాన్ని రూపొందించడంతో పాటు సేఫ్టీ వాల్వును కనుగొన్నాడు. గనుల తవ్వకం భారీ పరిశ్రమగా రూపొందిన క్రమంతో తొలిసారి విజయవంతమైన ఆవిరి యంత్రాలను బ్రిటన్‌కు చెందిన థామస్ న్యూకామెన్, థామస్‌సావరీల నేతృత్వంలో తయారయ్యాయి. 1765లో జేమ్స్‌వాట్ ఆవిరి యంత్రాన్ని మరింత ఆధునీకరించి పనితనాన్ని అభివృద్ధి చేశాడు. 1805లో జర్మనీకి జాకబ్ ల్యూఫోల్డ్ హై ప్రెషర్ స్టీమ్ ఇంజన్ నమూనాను రూపొందించినట్లుఆధారాలున్నా యి. 1805లో బ్రిటన్ దేశస్తుడైన రికార్డ్ ట్రెవిథిక్ హైప్రెషర్ స్టీమ్ ఇంజన్ రూపొందించి వాడుకలోకి తెచ్చారు.

### టెక్స్‌టైల్ రంగం

ఆవిరి శక్తి సహాయంతో ☞



స్టీమ్ ఇంజన్





### కోపర్నికస్ సిద్ధాంతం

మతాధిపతులు, ప్రజలు భావిస్తున్నట్లుగా విశ్వాంతరాళానికి భూగోళం కేంద్రబిందువు కాదని, భూమి తన చుట్టూ తాను తిరుగుతూనే సూర్యుని చుట్టూ తిరుగుతుందని కోపర్నికస్ (పోలండ్) తన 'డి రివల్యుషనిబస్ ఆర్బియం సెలెస్టియం లిబ్రి-VI అనే గ్రంథంలో ప్రతిపాదించాడు. ఈ గ్రంథం 1543 మే నెలలో ప్రచురితమైంది. మే 24 నాడు కోపర్నికస్ మరణించాడు. తన సిద్ధాంతంపట్ల క్రైస్తవ మతపెద్దల ఆగ్రహానికి వెరసి మరణ సమయానికి కొద్ది రోజుల ముందే ఈ గ్రంథం ముద్రించేట్లుగా ఆయన ఏర్పాట్లు చేసుకోవడం విశేషం. అయితే, కోపర్నికస్ కన్నా 1800ఏళ్ల పూర్వం గ్రీసు దేశస్థుడైన అరిస్టార్కస్ అనే మేధావి సూర్యుని కేంద్రంగా భూమి ఇతర నక్షత్రాలు మనుగడ సాగిస్తున్నాయనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పటికీ తదనంతర కాలంలో ఆ వాదనకు విశేష ప్రాముఖ్యత లభించలేదని తెలుస్తోంది.

### గురుత్వాకర్షణ

చెట్టుపై నుంచి పండు భూమిపైకి రాలిపడినట్లుగా చంద్రుడు భూమిపై ఎందుకు పడిపోవడం లేదన్న ప్రశ్నతో న్యూటన్ ప్రారంభించిన పరిశోధన 'విశ్వ ఆకర్షణ' సిద్ధాంతానికి దారి తీసింది. విశ్వంలోని గ్రహాలైన భూమి, చంద్రుడు తమ చుట్టూ తాము పరిభ్రమిస్తూనే నిర్ణీత కక్ష్యలో తిరుగుతూ విశ్వానికి ఒక ఆకర్షణను తమకు తాము గురుత్వాకర్షణను కల్పిస్తున్నాయని ఆయన 1685లో 'ఫిలాసఫీ నేచురాలిస్ ప్రిన్సిపియా మాథమెటికా' గ్రంథంలో ప్రతిపాదించాడు.

### సాపేక్ష సిద్ధాంతం

$E = MC^2$ అన్న సూత్రంలో పదార్థం, శక్తి మధ్య సంబంధానికి ఖచ్చితమైన అర్థాన్ని వివరించి ఐన్‌స్టీన్ సిద్ధాంతం శాస్త్ర సాంకేతిక రంగాల పురోభివృద్ధిని అనూహ్యంగా వేగిరం చేసింది. పదార్థం యొక్క శక్తి భారము ఇంటు కాంతి వేగానికి రెండింతలుగా ఉంటుందని 1915లో ఐన్‌స్టీన్ వెల్లడించారు. ఐన్‌స్టీన్ తన 26వ ఏట 1905లో ప్రతిపాదించిన స్పెషల్ రిలేటివిటీ సిద్ధాంతం అతనికి తొలి గుర్తింపు నిచ్చింది. ఆటంబాంబు తయారీలో ప్రధాన భూమిక నిర్వహించిన శాస్త్రవేత్తల ప్రతిపాదనలకు ఐన్‌స్టీన్ సిద్ధాంతాలే మూలం. హిరోషిమా, నాగసాకిలపై అణ్వాస్త్రాలు సృష్టించిన బీభత్సానికి చలించిపోయిన ఐన్‌స్టీన్ తన పరిశోధనలు ఇంతటి ఘోరవిపత్తుకు కారణమవుతాయని తెలిస్తే పరిశోధనలకు బదులు చెప్పుల తయారీకి తన శ్రమను వెచ్చించే వాడినని వాపోయాడు. తదనంతర కాలంలో సైతం ఐన్‌స్టీన్ ప్రతిపాదిత సాపేక్ష సిద్ధాంతం పరమాణుశక్తి వినియోగానికి మూలాధారమైంది.

### వైద్యం-రక్త ప్రసరణ వ్యవస్థ

మానవ రుగ్మతలను నివారించడానికి ప్రపంచ వ్యాప్తంగా అనేక ప్రకృతి సంబంధ విధానాలతో చికిత్సలు వాడుకలో ఉన్నప్పటికీ మానవ శరీర వ్యవస్థ నిర్మాణాన్ని కూలంకషంగా అధ్యయనం చేసిన శాస్త్రీయ పరిశోధనల అనంతరం ఆధునిక వైద్య విధానాలు పురోగమించాయి. 1628లో ఇంగ్లాండుకు చెందిన విలియం హార్వే రక్తప్రసరణ విధానాన్ని ప్రపంచానికి వెల్లడించాడు. అయితే, అరబ్ వైద్యుడైన ఇబన్ అల్ నీఫీజల్ ఖురేషీ రక్తప్రసరణ వ్యవస్థ గురించి 13వ శతాబ్దంలోనే స్పష్టం చేశాడని చరిత్రకారులు భావిస్తున్నారు.

### వ్యాధి నిరోధకాలు

శతాబ్దాల తరబడి అంతుచిక్కని మహమ్మారిగా ప్రజల ప్రాణాలను హరించిన మశూచి వ్యాధిపై పరిశోధనలు నిర్వహించిన ఎడ్వర్డ్ జెన్నర్ వ్యాధి నిరోధక టీకా విధానం రూపొందించాడు. జెన్నర్ ప్రయోగాలకు భిన్నంగా మశూచి వ్యాధి నివారణకు ఫ్రాన్స్‌కు చెందిన లూయిస్ పాశ్చర్ టీకా మందు రూపొందించి జెన్నర్‌కు అంకితమిచ్చాడు. రాబిస్ వ్యాధి నివారణకు సైతం పాశ్చర్ 1860లో మరో వ్యాక్సిన్‌ను కూడా రూపొందించాడు.

### పెన్సిలిన్

సర్ అలెగ్జాండర్ ఫ్లెమింగ్ 1928లో కనుగొన్న పెన్సిలిన్ ఆధునిక వైద్య చరిత్రలో గొప్ప మలుపు. మొదటి ప్రపంచయుద్ధంలో సైనిక క్షతగాత్రుల గాయాలకు వైద్యం చేస్తూ చలించిపోయిన ఫ్లెమింగ్ గాయాలకు ఆహార పదార్థాలపై ఏర్పడే బూజును రాస్తే నయమవుతాయన్న పురాతన విశ్వాసంపై దృష్టి సారించిన ఫలితంగా పెన్సిలిన్ తయారైంది. ఫ్లెమింగ్ రూపొందించిన పెన్సిలిన్ ఔషధం సంతృప్తికరంగా పనిచేయకపోయినప్పటికీ తదుపరి పరిశోధనలకు ప్రధానాధారంగా మారింది. 1940లో ఆక్స్‌ఫర్డ్ శాస్త్రవేత్తలు హోవార్డ్ ఫ్లోరి, ఎర్నెస్ట్ చైన్ ఫ్రీజ్-డ్రై విధానంద్వారా పెన్సిలిన్ తయారుచేసి సత్ఫలితాలు సాధించారు.

### టెట్రాసైక్లిన్- యల్లాప్రగడ సుబ్బారావు

పెన్సిలిన్ ఔషధానికి ప్రత్యామ్నాయంగా టెట్రాసైక్లిన్ కనుగొన్న ఘనత ఆంధ్రుడైన యల్లాప్రగడ సుబ్బారావుకు దక్కడం విశేషం. ఉన్నత విద్యాభ్యాసానికి అమెరికా వెళ్లిన యల్లాప్రగడ సుబ్బారావు పరిశోధనలు ఫలించి పేదల ఔషదంగా ఖ్యాతి పొందిన టెట్రాసైక్లిన్ రూపొందింది. కలరా, టైఫాయిడ్, ప్లేగు, అతిసారా మొదలగువ్యాధులకు దివ్యౌషధంగా టెట్రాసైక్లిన్ ఉపయోగపడుతున్నది. పిల్లల్లో బ్లడ్‌క్యాన్సర్‌ను అరికట్టే మెథాట్రెక్సేట్ కూడా సుబ్బారావు పరిశోధనా ఫలితమే.

### జీవపరిణామ సిద్ధాంతాలు

ఏకకణ జీవి నుంచి అత్యంత క్లిష్టమైన శరీర నిర్మాణం గల మానవజాతి ఆవిర్భావం కోట్లాది సంవత్సరాల జీవ పరిణామక్రమంలో భాగమని బ్రిటిష్ జీవ శాస్త్రవేత్త చార్లెస్ డార్విన్ 1859లో విడుదల చేసిన 'ఒరిజిన్ ఆఫ్ స్పీసిస్ బై నేచురల్ సెలక్షన్' గ్రంథంలో ప్రతిపాదించాడు. భూమి, సముద్రాల ☞ పుట్టుకతో ఆరంభమైన ప్రాణిసృష్టి మనుగడ కోసం పోరాటంలో ఉత్తమ జాతులే నిలుస్తాయన్న సూత్రం ఆధారంగా భూమిపై వృక్ష, జంతుజాలాలు అభివృద్ధి చెందాయి అన్న డార్విన్ సిద్ధాంతం నాటి నుంచి సం


చంద్రుడిపై మానవుడు

## అంతరిక్ష విజయాలు

అంతరిక్ష యాత్రలు ఈ విశ్వాన్ని అధ్యయనం చేయడానికి ఉపకరిస్తున్నాయి. 1957 అక్టోబర్4న సోవియెట్ రష్యా అంతరిక్ష నౌక 'స్పుత్నిక్ 1' ను ప్రయోగించడంతో అంతరిక్ష యుగం ప్రారంభమైంది. నెల తరువాత స్పుత్నిక్-2లో కుక్కను పంపి, అంతరిక్షంలో దాని శరీర భాగాల్లో వచ్చిన మార్పులు గమనించారు. అమెరికా 1958 జనవరి 31న తన తొలి కృత్రిమ ఉపగ్రహం 'ఎక్స్‌ప్లోరర్'ను ప్రయోగించింది. 1961 ఏప్రిల్ 12న అంతరిక్షంలో నడిచిన తొలి మానవుడిగా రష్యన్ యూరి గగారిన్ చరిత్రకెక్కాడు. ఆ తర్వాత 1963 జూన్ 16న అంతరిక్షంలో విహరించిన తొలి మహిళగా రష్యాకే చెందిన వాలెంతినా తెరిష్కోవా గుర్తుండి పోతుంది. అమెరికా అంతరిక్షనౌక అపోలో-2లో వెళ్లిన నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్డ్రిన్‌లు చంద్రునిపై కాలు మోపిన తొలి మానవులు. వీరితోపాటు మొత్తం 12 మంది అమెరికన్లు చంద్రునిపై దిగడమే కాకుండా 380 కిలోల రాళ్లు, మట్టి భూమి మీదకు తెచ్చారు. అంగారక గ్రహం మీదకు మానవుని పంపాలనే ఆలోచన కార్యరూపం దాల్చనప్పటికీ ప్రయత్నాలు సాగుతున్నాయి. అంతరిక్షంలో సైతం పోటీ పడిన అగ్రరాజ్యాలైన అమెరికా, రష్యాలు 1975 జులైలో అపోలో-సోయజ్, 1995, 1996లో అట్లాంటిస్-మిర్ వంటి సంయుక్త పరిశోధన కార్యక్రమాలను చేపట్టాయి. అయితే, అంతరిక్ష యాత్రలు ఖర్చుతో కూడినవి కావడంతో తక్కువ ఖర్చుతో ఎక్కువ ఫలితాలు సాధించడానికి అమెరికా 'స్పేస్ షటిల్' అనే కార్యక్రమం ప్రారంభమైంది. తొలి స్పేస్ షటిల్ 'కొలంబియా' 1981 ఏప్రిల్ 12న కక్ష్యలో ప్రవేశించింది. 1990 అక్టోబర్ 9న అమెరికా తన స్పేస్‌షటిల్ డిస్కవరి ద్వారా 'యులిసిస్' అనే అంతరిక్ష నౌకను ప్రయోగించింది. సోవియట్ యూనియన్ కూడా 1988 నవంబర్ 15న తన తొలి షటిల్ 'బురాన్'ను ప్రయోగించింది. 1986లో 'మీర్' ను ప్రయోగించింది. ఇక ఇండియా విషయానికి వస్తే, దేశంలో తయారైన తొలి ఉపగ్రహం ఇన్సాట్-2ఎను, 1992 జులై 10న ఇన్సాట్ 2బిని, 1993 జులై 23న ఐరోపా అంతరిక్ష కేంద్రం ఏరియన్ నుంచి ప్రయోగించింది.

- టి. శ్రీనివాస్







ఢిల్లీ సింహాసనం అఫ్ఘన్, టర్కీలకు చెందిన సుల్తాన్‌ల వశం కావడంతో భారతదేశంలో తొలిసారిగా విదేశీయుల పాలన మొదలైంది. మూడువందల సంవత్సరాల సుదీర్ఘ కాలం ఢిల్లీ సుల్తాన్‌ల పరిపాలన కొనసాగడంతో భారతదేశంలో ఒక కొత్త తరహా హిందుస్తాని సంస్కృతి రూపుదిద్దుకుంది. భాషా సాహిత్యాలు, సాంఘిక జీవనం, వాస్తుకళ, సంగీతం, చిత్రకళల్లో వచ్చిన కొత్త మార్పులపై 'వైద్యం ఆనందవర్ధన్' పరిచయం...

# సరికొత్త భారతీయ సమాజం

క్రీ.శ 1206 నుంచి క్రీ.శ. 1526 వరకు ఉత్తర భారతదేశాన్ని సుల్తానులు పాలించగా, ఢిల్లీని ఏలిన సుల్తానుల్లో వివిధ వంశీయులున్నారు. బానిస రాజులు, ఖిల్జీ వంశీయులు, తుగ్లక్, లోడీ వంశీయులు ఉత్తర భారతాన్ని పాలించిన వారిలో ముఖ్యులు. ఢిల్లీ సింహాసనం అధిష్టించిన మొదటి సుల్తానులు (మామ్లూక్‌లు) బానిస రాజులు. రాజుల్లో అదిక బాగం బానిసలో, వారి సంతానమో కావడంతో చరిత్రలో వారికి బానిసరాజులుగా పేరు స్థిరమైంది. మహ్మద్ ఘోరీ వద్ద సైన్యాధికారిగా ఉన్న కుతుబుద్దీన్ ఐబక్ మొట్టమొదటి బానిస రాజుగా చరిత్రకెక్కి, ఘోరీ మరణించాక భారతదేశంలోనే స్థిరపడిపోయాడు.

కుతుబుద్దీన్ అల్లుడైన ఇల్టుట్‌మిష్ సుల్తాను అయిన తర్వాతే ఢిల్లీ సుల్తానుల రాజ్యం ఆరంభమైనట్లు చరిత్రలో పేర్కొనబడింది. అనంతరం అతని కుమార్తె రజియా సుల్తానా కొంతకాలం రాజ్యపాలన చేసింది. ఆ తర్వాత ఎంతో మంది ఢిల్లీ సుల్తానులయ్యారు. అయితే, వీరికెవరికీ చెప్పుకోదగ్గ చరిత్ర లేదు. క్రీ.శ.1265లో ఢిల్లీ సుల్తాన్ అయిన బాల్బన్ శక్తివంతమైన రాజుగా ప్రసిద్ధి పొందాడు. అనంతరం ఢిల్లీ గద్దెపై ఖిల్జీ వంశీయులు పట్టు సాధించారు. ఈ పాలకుల్లో ప్రఖ్యాతి గాంచినవాడు అల్లాద్దీన్. 1296లో అల్లాద్దీన్ ఢిల్లీ సుల్తానయ్యాడు. గుజరాత్, మాళవరాజ్యాలతో పాటు రణతంబోర్, చితోడ్‌గడ్ కోటలను స్వాధీన పర్చుకుని రాజస్థాన్‌పై పూర్తి పట్టు సంపాదించుకోగలిగాడు. ఖిల్జీ వంశీయుడైన ఆఖరి సుల్తాన్ హత్యకు గురయ్యాడు. దీంతో ఖిల్జీ పాలన ముగిసి తుగ్లక్‌ల పాలన ఆరంభమైంది. తుగ్లక్ పాలకులు క్రీ.శ 1320 నుంచి క్రీ.శ 1399 వరకు పాలించారు. తుగ్లక్ ప్రభువుల్లో మహ్మద్‌బిన్ తుగ్లక్ ప్రసిద్ధుడు. మహ్మద్‌బిన్



కుతుబ్‌మినార్

తుగ్లక్ ఆదర్శవాది. సుమారు 25ఏళ్లపాటు ఉత్తర భారతాన్ని పాలించాడు. ఇతని హయాంలో భారతదేశంలో పర్యటించిన అరబ్ యాత్రికుడు ఇబ్న్ బతూతా తుగ్లక్ పాలన గురించి రచనలు చేశారు. తుగ్లక్ గణితశాస్త్రంలో అపార అనుభవమున్న ఒక శాస్త్రజ్ఞుడితోపాటు తర్క శాస్త్ర ప్రవీణుడిని సలహాదారులుగా నియమించుకున్నాడు. ఇతడి హయాంలోనే దక్షిణ భారతంలో రెండు రాజ్యాలు వెలిశాయి. అవి ఒకటి బహమనీ, రెండు విజయనగర సామ్రాజ్యం. క్రీ.శ. 1347లో మహ్మద్‌బిన్ తుగ్లక్ కింద అదికారిగా పనిచేసిన హసన్‌గంగు తిరుగుబాటు లేవదీసి బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. అలాగే 1336లో ఇప్పటి మైసూర్, నాటి హొయసల ప్రాంతాన్ని జయించిన హరిరరాయలు, బుక్కరాయలు అనే అన్నదమ్ములు విజయనగర సామ్రాజ్యాన్ని నెలకొల్పారు. మహ్మద్‌బిన్ తుగ్లక్ తర్వాత అధికారం చేపట్టిన వాడు ఫిరోజ్‌షా(1351-1388). తన రాజ్యంలోని ప్రాంతాలాభివృద్దికి నీటి పారుదలా సౌకర్యాలు కల్పించడంతోపాటు పిరోజ్‌పూర్, ఫిరోజాబాద్, హిస్సార్, ఫిరోజా, జాన్‌పూర్ తదితర నగరాల్ని నిర్మించాడు. విద్యా సంస్థలతో పాటు వైద్య సంస్థలను కూడా ఫిరోజ్‌షా నెలకొల్పాడు. భారతీయ ప్రాచీన సంస్కృతిపట్ల అమితమైన ఆసక్తిని ఫిరోజ్‌షా ప్రదర్శించాడు. ఎన్నో సంస్కృత గ్రంధాలను పర్షియన్, అరబిక్ భాషల్లోకి అనువదింప చేశాడు. అశోకుడు చెక్కించిన రెండు రాతి స్తంబాలను ఢిల్లీకి తెప్పించుకుని అందులో ఒకదానిని తన రాజప్రసాదం కప్పు కింద పెట్టించాడు. పిరోజ్‌షా మరణించడంతో తుగ్లక్‌ల పాలన అంతం కావడం ఆరంబమైంది. మద్య ఆసియా నుంచి వచ్చిన తుర్కీ జాతీయుడైన తైమూర్ లంగ్ 1398లో భారతదేశంపై దండెత్తి వచ్చాడు. గొప్ప రాజప్రసాదాలతోపాటు మసీదులు, అద్భుతమైన భవనాలను నిర్మించాడు. చివరకు క్రీ.శ 1413లో తుగ్లక్‌ల పాలన అంతమైంది. ఆ తర్వాత లోడీ వంశీయులు అధికారంలోకి వచ్చారు. క్రీ.శ 1526లో బాబర్ చేసిన దండయాత్రల్లో లోడీ వంశీయులు ఓడిపోవడంతో సుల్తానుల రాజ్యానికి తెరపడింది.



ఒక రాజ్యం మరో రాజ్యాన్ని జయించి అక్కడే స్థిరపడితే విజేత, పరాజిత

క్రీ.శ 1206 నుంచి క్రీ.శ. 1526 వరకు ఉత్తర భారతదేశాన్ని సుల్తానులు పాలించగా, ఢిల్లీని ఏలిన సుల్తానుల్లో వివిధ వంశీయులున్నారు. బానిస రాజులు, ఖిల్జీ వంశీయులు, తుగ్లక్, లోడీ వంశీయులు ఉత్తర భారతాన్ని పాలించిన వారిలో ముఖ్యులు. ఢిల్లీ సింహాసనం అధిష్టించిన మొదటి సుల్తానులు (మామ్లూక్‌లు) బానిస రాజులు. రాజుల్లో అధిక భాగం బానిసలలో, వారి సంతానమో కావడంతో చరిత్రలో వారికి బానిసరాజులుగా పేరు స్థిరమైంది. మహ్మద్ ఘోరీ వద్ద సైన్యాధికారిగా ఉన్న కుతుబుద్దీన్ ఐబక్ మొట్టమొదటి బానిస రాజుగా చరిత్రకెక్కి, ఘోరీ మరణించాక భారతదేశంలోనే స్థిరపడిపోయాడు.

కుతుబుద్దీన్ అల్లుడైన ఇల్టుట్‌మిష్ సుల్తాను అయిన తర్వాతే ఢిల్లీ సుల్తానుల రాజ్యం ఆరంభమైనట్లు చరిత్రలో పేర్కొనబడింది. అనంతరం అతని కుమార్తె రజియా సుల్తానా కొంతకాలం రాజ్యపాలన చేసింది. ఆ తర్వాత ఎంతో మంది ఢిల్లీ సుల్తానులయ్యారు. అయితే, వీరికెవరికీ చెప్పుకోదగ్గ చరిత్ర లేదు. క్రీ.శ.1265లో ఢిల్లీ సుల్తాన్ అయిన బాల్బన్ శక్తివంతమైన రాజుగా ప్రసిద్ధి పొందాడు. అనంతరం ఢిల్లీ గద్దెపై ఖిల్జీ వంశీయులు పట్టు సాధించారు. ఈ పాలకుల్లో ప్రఖ్యాతి గాంచినవాడు అల్లాద్దీన్. 1296లో అల్లాద్దీన్ ఢిల్లీ సుల్తానయ్యాడు. గుజరాత్, మాళవరాజ్యాలతోపాటు రణతంబోర్, చితోడ్‌గడ్ కోటలను స్వాధీన పర్చుకుని రాజస్థాన్‌పై పూర్తి పట్టు సంపాదించుకోగలిగాడు. ఖిల్జీ వంశీయుడైన ఆఖరి సుల్తాన్ హత్యకు గురయ్యాడు. దీంతో ఖిల్జీ పాలన ముగిసి తుగ్లక్‌ల పాలన ఆరంభమైంది. తుగ్లక్ పాలకులు క్రీ.శ 1320 నుంచి క్రీ.శ 1399 వరకు పాలించారు.

తుగ్లక్ ప్రభువుల్లో మహ్మద్‌బీన్ తుగ్లక్ ప్రసిద్ధుడు. మహ్మద్‌బీన్ తుగ్లక్ ఆదర్శవాది. సుమారు 25ఏళ్లపాటు ఉత్తరభారతాన్ని పాలించాడు. ఇతని హయాంలో భారతదేశంలో పర్యటించిన అరబ్ యాత్రికుడు ఇబ్న్ బతూతా తుగ్లక్ పాలన గురించి రచనలు చేశారు. తుగ్లక్ గణితశాస్త్రంలో అపార అనుభవమున్న ఒక శాస్త్రజ్ఞుడితోపాటు తర్క శాస్త్ర ప్రవీణుడిని సలహాదారులుగా నియమించుకున్నాడు.ఇతడి హయాంలోనే దక్షిణ భారతంలో రెండు రాజ్యాలు వెలిశాయి. అవి ఒకటి బహమనీ, రెండు విజయనగర సామ్రాజ్యం.క్రీ.శ. 1347లో మహ్మద్‌బీన్ తుగ్లక్ కింద అధికారిగా పనిచేసిన హసన్‌గంగు తిరుగుబాటు లేవదీసి బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. అలాగే 1336లో ఇప్పటి మైసూర్,నాటి హొయసల ప్రాంతాన్ని జయించిన హరిహరరాయలు,బుక్కరాయలు అనే అన్నదమ్ములు విజయనగర సామ్రాజ్యాన్ని నెలకొల్పారు. మహ్మద్‌బీన్ తుగ్లక్ తర్వాత అధికారం చేపట్టిన వాడు ఫిరోజ్‌షా(1351-1388). తన రాజ్యంలోని ప్రాంతాలాభివృద్ధికి నీటి పారుదలా సౌకర్యాలు కల్పించడంతోపాటు ఫిరోజ్‌పూర్, ఫిరోజాబాద్, హిస్సార్, ఫిరోజా, జాన్‌పూర్ తదితర నగరాల్ని నిర్మించాడు. విద్యా సంస్థలతోపాటు వైద్య సంస్థలను కూడా ఫిరోజ్‌షా నెలకొల్పాడు. భారతీయ ప్రాచీన సం స్కృతిపట్ల అమితమైన ఆసక్తిని ఫిరోజ్‌షా ప్రదర్శించాడు. ఎన్నో సంస్కృత గ్రంథాలను పర్షియన్, అరబిక్ భాషల్లోకి అనువదింప చేశాడు. అశోకుడు చెక్కించిన రెండు రాతి స్తంభాలను ఢిల్లీకి తెప్పించుకుని అందులో ఒకదానిని తన రాజప్రసాదం కప్పు కింద పెట్టించాడు. ఫిరోజ్‌షా మరణించడంతో తుగ్లక్‌ల పాలన అంతం కావడం ఆరంభమైంది. మధ్య ఆసియా నుంచి వచ్చిన తుర్కో జాతీయుడైన తైమూర్‌లంగ్ 1398లో భారతదేశంపై దండెత్తి వచ్చాడు. గొప్ప రాజప్రసాదాలతోపాటు మసీదులు,అద్భుతమైన భవనాలను నిర్మించాడు. చివరకు క్రీ.శ 1413లో తుగ్లక్‌ల పాలన అంతమైంది. ఆ తర్వాత లోడీ వంశీయులు అధికారంలోకి వచ్చారు. క్రీ.శ 1526లో బాబర్ చేసిన దండయాత్రల్లో లోడీ వంశీయులు ఓడిపోవడంతో సుల్తానుల రాజ్యానికి తెరపడింది.

ఒక రాజ్యం మరో రాజ్యాన్ని జయించి అక్కడే స్థిరపడితే విజేత, పరాజిత రాజ్యాల సంస్కృతి, సంప్రదాయాలు ఒకదానిపై మరొకటి పరస్పరం ప్రభావం చూపిస్తాయి. ఉత్తర భారత దేశంలో ఢిల్లీని ఏలిన సుల్తాన్లు ప్రధానంగా అఫ్ఘన్లు, టర్కులు కావడంతో వారి ఆచార వ్యవహారాలు, మతం తదితర రంగాల ప్రభావం భారతదేశంలోని హిందూ సంస్కృతిపై బలంగా పడింది. అలాగే హిందూ సంప్రదాయంలోని కొన్ని అంశాలు పరాయి దేశస్తుల సంస్కృతులను ప్రభావితం చేశాయి. వీరి ఆలోచలనలను, నడవడికను భారతీయుల జీవన విధానం ప్రభావితం చేయసాగింది. అఫ్ఘన్లు, టర్కుల రాకతో సరికొత్త జీవన రీతులకు ఆస్కారం ఏర్పడింది. వీరి కాలంలో భక్తి, సూఫీ ఉద్యమాలు బహుళ ప్రచారాన్ని పొందాయి. ప్రాంతీయ భాషలు, శిల్ప, చిత్ర, సంగీత రంగాల్లో నూతన ఒరవడులు మొదలయ్యాయి.

ప్రభువులు, పురోహితులు, పట్టణవాసులు, రైతులు అని నాలుగు తరగతులుగా ఢిల్లీ సుల్తానులు సమాజాన్ని విభజించారు. ప్రభు వర్గం కిందకు సుల్తానులు, సర్దార్లతోపాటు హిందూ రాజులు, పెద్ద పెద్ద భూస్వాములు వస్తారు. విలాసజీవితానికి ఆన

వాలుగా సుల్తానుల దర్బారులు వెలిగాయి. కొత్త సుల్తాను రాజ్యాధికారానికి వచ్చాడని తెలియడానికి గుర్తుగా సుల్తాను పేరిట మసీదుల్లో ప్రత్యేక ప్రార్థనలు జరిగేవి. అలాగే, కొత్త సుల్తాను పేరు ముద్రించిన నాణాలు కూడా చలామణిలో పెట్టేవారు. సమాజంలో రెండవ తరగతి కిందకు పురోహితులు, ఉలేమాలు వచ్చేవారు. హిందువుల్లో బ్రాహ్మణులు పురోహితులుగా ఉండేవారు. మత గురువులను ఉలేమాలు అంటారు. వీరికి చాలా పలుకుబడి ఉండేది. ప్రభువులకు వీరు ముఖ్య సలహాదారులుగా కూడా వ్యవహరించారు. పురోహితులు, ఉలేమాలు హిందూ, ఇస్లాం సంస్కృతుల వ్యాప్తికి విశేష కృషి చేశారు. సుల్తానులు పర మతానికి చెందిన పురోహితులపట్ల గౌరవాన్ని ప్రదర్శించే వారు. వారికి పెద్ద మొత్తంలో విరాళాలు ఇచ్చేవారు. భూదానాలు వాటిలో పేర్కొనదగినవి. ఇక మూడవ తరగతికి చెందిన వారు పట్టణవాసులు. వ్యాపారులు, వివిధ వృత్తి పనివారు పట్టణాల్లో నివసించేవారు. వర్తక, వాణిజ్య రంగాల వృద్ధి కొత్త నగరాల స్థాపనకు ఊపిరిపోసింది. ప్రభుత్వ అధికారులతోపాటు కొంతమంది ప్రభు వర్గీయులు పట్టణాల్లో జీవించేవారు. చాలా పట్టణాలు వర్తక కేంద్రాలుగా భాసిల్లాయి. ప్రసిద్ధ క్షేత్రాలుగా పేరుగాంచిన పట్టణాల్లో పురోహితులు, ఉలేమాలు జీవించేవారు. పట్టణాల్లో వివిధ రకాల వృత్తుల వారు నివసించేందుకు ఆయా వృత్తుల పేరిట వాడలు(కాలనీలు) వెలిశాయి. ఇప్పటికీ కొన్ని పట్టణాల్లో కమ్మరి,చాకలి తదితర వృత్తుల పేరిట ఉన్న వాడలను మనం గమనించవచ్చు. వ్యాపారాలు నిర్వహించేందుకు ప్రత్యేకించి ఒక వాడను (సంత) ఏర్పాటు చేశారు. వ్యాపారమే వృత్తిగా పెట్టుకున్న బనియాలు, ముల్తానీలు తదితరులు దేశంలోని నలుమూలలకు వెళ్ళి వ్యాపారాలు సాగించేవారు. దేశంలోని దాదాపు అన్ని ప్రాంతాల నుంచి ఢిల్లీకి సరుకులు వచ్చేవి. మహ్మద్‌బిన్ తుగ్లక్ పాలనలో భారతదేశాన్ని సందర్శించిన అరబ్ యాత్రికుడు ఇబ్న్ బతూత ఢిల్లీ లాంటి మహానగరాన్ని తాను చూడలేదని చెప్పుకున్నాడు. ఇదే సమయంలో చైనా, అరేబియా తూర్పు ఆఫ్రికా తదితర దేశాల నుంచి సరుకులు బెంగాలు రేవు ద్వారా భారత భూభాగంలోకి వచ్చి చేరేవి. వెండితో తయారు చేసిన నాణెం అప్పట్లో చలామణి అయ్యేది. దీన్ని ఇల్టుమిష్ సుల్తాన్ ప్రవేశపెట్టించాడు. ఇక నాలుగో తరగతికి చెందిన వారు రైతులు. టర్కులు, అఫ్ఘన్ల రాకతో దేశంలో సంభవించిన మార్పులు కేవలం సంపన్న వర్గాలకే పరిమితం కావడంతో రైతుల జీవన విధానంలో పెద్దగా మార్పులు చోటు చేసుకోలేదు. కానీ ఇస్లాం సంస్కృతి తన బలమైన ముద్రను ఈ వర్గాలపైనే వేసింది. ఇస్లాం మతాన్ని స్వీకరించిన హిందువులు తమ వెనకటి కుల వ్యవస్థను తొలగించుకోలేకపోయారు. ముస్లింలుగా మారిపోయిన హిందువులు పెళ్ళిళ్ళు తదితర సందర్భాల్లో తమ పాత (హిందూ) ఆచార వ్యవహారాలనే కొనసాగించేవారు. టర్కులు, అఫ్ఘన్లకు మధ్య, ఇస్లాం మతం స్వీకరించిన వారి మధ్య అంతర్వివాహాలు జరిగాయి. దీంతో సహజంగానే ఆచార వ్యవహారాలు పరస్పరం మార్పిడికి గురయ్యాయి.

ఇస్లాం మతం భారత దేశంలోకి అడుగుపెట్టడంతో చాలా మంచి ఫలితాలు కలిగాయి. భిన్నమతాలకు చెందిన హిందూ, ముస్లింలు పరస్పరం పర మత భావాలను తమ మతంలో ఇముడ్చుకున్నారు. తత్ఫలితంగా రెండు మత ఉద్యమాల సృష్టి జరిగింది. అవి ఒకటి సూఫీ ఉద్యమం కాగా మరొకటి భక్తి ఉద్యమం.

విజయనగర సామ్రాజ్యంలోని ఏకశిలా రథం



**సూఫీలు:** 11వ శతాబ్దంలో పర్షియాతోపాటు ఆసియాలోని ఇతర ప్రాంతాల నుంచి భారతదేశానికి వచ్చి స్థిరపడిన ముస్లింలలో సూఫీలనే భక్తులు కూడా ఉన్నారు. భగవంతుడిని చేరుకోవడానికి ప్రేమ, భక్తి అనేవి మార్గాలుగా సూఫీలు ప్రచారం చేశారు. సూఫీలు ఉలేమాల మాదిరి ఛాందస్సులు కారు. మనుష్యులందరూ సమానమనే మతం వీరిది. ఇతర మతస్తులపట్ల వీరు సహనంతో మెలిగే ☞

వారు. ఈ కారణంతో హిందువుల్లో అధికులు సూఫీలను భక్తితో చూసేవారు. సూఫీలు మతమార్పిడిని ప్రోత్సహించలేదు. సూఫీ యోగుల్లోకెల్లా ప్రఖ్యాతిగాంచిన వాడు మొయినుద్దీన్ చిష్టి. ఇతను అజ్మీర్‌లో ఉండేవాడు. 1236లో అక్కడే మరణించాడు. ఈయన భగవంతునికి చేరువకావడానికి సంగీతం మార్గమని బలంగా విశ్వసించేవాడు. మొయినుద్దీన్ తర్వాత ప్రసిద్ధుడైన సూఫీ యోగి బాబా పరీద్. వీరే కాక ప్రజలతోపాటు సుల్తానులు గౌరవించిన సూఫీ యోగిగా నిజాముద్దీన్ ఆలియాను పేర్కొనవచ్చు. ఢిల్లీలోనే భక్తి మందిరాన్ని ఏర్పాటు చేసుకుని అక్కడే నివసించాడు. తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా తెలియచేయడం నిజాముద్దీన్ ప్రత్యేకత. అవసరమైతే సుల్తానుతో సైతం నిర్భయంగా తన అభిప్రాయాన్ని తెలియచేసేవాడు. సూఫీలతోపాటు భక్తి ఉద్యమ ప్రబోధకులు చాలా మంది ఉన్నారు. వీరికి దేశంలో ఘన చరిత్ర ఉంది. కీర్తనలు, కదల ద్వారా భక్తిని ప్రబోధించే ఆచారాన్ని మొదటిసారి ప్రారంభించింది తమిళ భక్తి ఉద్యమకారులైన ఆళ్వార్లు, నయనార్లు.వీరి ధోరణిని భక్తి ఉద్యమం అవలంబించి సత్ఫలితాలను పొందింది. భగవంతునికి, మానవులకు మధ్య ఉండాల్సింది ప్రేమ మాత్రమేనని వీరు ప్రవచించారు.మనుషుల, మతాల మధ్య విద్వేషాలు ఉండరాదని వీరు బోధించారు. భక్తి ఉద్యమ గురువుల్లో అధిక శాతం బ్రాహ్మణేతర కులాల చెందిన వారు కావడం గమనార్హం.అలాగే బెంగాల్‌లో చైతన్యుడు అనే భక్తి ఉద్యమకారుడు కృష్ణుడిపై ఎన్నో కీర్తనలు రచించాడు.మహా రాష్ట్రకు చెందిన జ్ఞానేశ్వరుడనే భక్తి ఉద్యమకారుడు భగవద్గీతను మరాఠీలోకి తర్జుమా చేశాడు. దీంతో మహారాష్ట్రీయుల్లో సంస్కృతం తెలియని వారికి గీతాసారాన్ని అందించిన వాడయ్యాడు. ప్రజాదరణ పొందిన భక్తుల్లో ప్రముఖంగా నామదేవ్, తుకారాంలను పేర్కొనవచ్చు. అలాగే, ముస్లిం మతస్థుడైన నేత పనిచేసే కబీర్ 'భక్త కబీర్'గా ప్రసిద్ధి పొందాడు. ఈయన స్వయంగా రచించిన ద్విపదలు నేటికీ ప్రజాదరణ పొందుతూనే ఉన్నాయి. ఇస్లాం, హిందూ మతాల మధ్య సఖ్యత నెలకొల్పడానికి ఈయన కృషి చేశాడు. కబీర్ సూచించిన మార్గాన్ని అనుసరించే వారంతా ఒక ప్రత్యేక బృందంగా తయారై ఆయన బోధనలకు ప్రచారాన్ని కల్పించారు. కబీర్‌లాగే పంజాబ్ ప్రాంతంలో మరొక ప్రవక్త భక్తి ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళాడు. అతనే గురునానక్. నానక్ మరణించిన కొన్ని శతాబ్దాల తర్వాత ఆయనను మత గురువుగా స్వీకరించి సిక్కు మతాన్ని పంజాబులో ఆయన అనుయాయులు స్థాపించారు. మిగతా భక్తి ఉద్యమకారుల్లా కబీర్, నానక్‌లు మత వ్యాప్తికి పరిమితం కాకుండా సాంఘికంగా కూడా తమ ప్రభావాన్ని వేశారు. కులాలతో విడిపోయిన సమాజాన్ని నానక్, కబీర్‌లు నిరసించారు. పురుషులతోపాటు స్త్రీలను సమానంగా చూడాలని ఆ కాలంలోనే వారిద్దరు బోధించారు.

**భాషా సాహిత్యాలు**

సామాన్య జనాలకు అర్థమయ్యే విధంగా భక్తి ఉద్యమ ప్రచారమంతా ప్రాంతీయ భాషల్లోనే సాగింది. హిందీ రూపాలైన అవధి, వ్రజ భాషలు అప్పట్లో ఉండేవి. ఉత్తర భారతంలో పంజాబీ, పశ్చిమాన గుజరాతీ, తూర్పున బెంగాలి, పశ్చిమోత్తర దక్కన్‌లో మరాఠీ, మైసూరు ప్రాంతంలో కన్నడ, ఆం





## 1997 సం॥లో భారతదేశంలో క్రౌన్ టి.వీ.
## మొదటి 20 సి.టి.వీని రూ. 9995లకు ప్రవేశపెట్టింది.

# క్రౌన్ చరిత్రను తిరిగి రాస్తోంది

# PRESENTING THE




## సాటిలేని లక్షణాలు-విలక్షణమైన తీరు

# రూ. 8,995

INCLUSIVE OF ALL TAXES

## ఎక్ఛేంజ్ లేదు

★ 51 సెం.మీ.ల (20) బ్లాక్ టింటెడ్ సి.పి.టి. ★ ఎస్ బాండ్ మరియు హైపర్ బాండ్ ట్యూనర్‌తో 106 ఛానల్స్ పొందే సదుపాయం. ★ 90 ప్రోగ్రాముల మెమరి ★ ఆటోమెమరీతో ఆటో సెర్చ్ ★ స్లీప్ టైమర్ ★ అన్ని ఫంక్షన్లుగల రిమోట్ కంట్రోల్ ★ 30 వాట్ల పి.ఎమ్.పి.ఒ. సౌండ్ అవుట్‌పుట్ ★ వ్యక్తిగత ఇష్టానికి అనుసారంగ ★ ముందు స్పీకర్లతో ఆధునికంగా స్టయిలిష్‌గాగల కాబినెట్ ★ స్క్రీన్ డిస్‌ప్లేలో మల్టీ కలర్లు ★ ఆడియో వీడియో ఇన్‌పుట్/అవుట్‌పుట్ ★ వోల్టేజి సింథసైజర్ ట్యూనింగ్‌తో ఆటో షట్ ఆఫ్

# CROWN-TV

**QUALITY AND RELIABILITY BEYOND IMAGINATION**

TULIKA



అగ్రవర్ణాల సంస్కృత బంధనాల్లోంచి పూజా పునస్కారాలను విముక్తం చేసి జనంలోకి తీసుకెళ్లిన మహోద్యమమే భక్తి ఉద్యమం. కులమతాలను, యజ్ఞయాగాది క్రతువులను నిరసించిన ఈ ఉద్యమకారులు భక్తిమార్గం ద్వారా భగవంతుడిని చేరుకోవచ్చని ప్రబోధించారు. భక్తి ఉద్యమానికి ప్రజలు తండోపతండాలుగా ఆకర్షితులయ్యారు. సాంఘిక మార్పులకు ఈ ఉద్యమం దోహదం చేసింది. మధ్య యుగాల భారత చరిత్రలోని అతిపెద్ద సామాజిక విప్లవంపై బి. బాలసుబ్రమణ్యం నివేదిక...

# మధ్యయుగాల సాంఘిక విప్లవం



ఋగ్వేద కాలంలో దేవతలకు స్తోత్రాలున్నప్పటికీ, భక్తి భావం కంటే యజ్ఞయాగాల ప్రభావమే ఎక్కువగా వుండేది. ఇది కేవలం అగ్రవర్ణాల వారికి మాత్రమే పరిమితమై వుండేది. దీంతో అన్ని వర్ణాల వారికి, విద్యా విజ్ఞానాలతో సంబంధం లేకుండా అందరికీ అందుబాటులో వుండే మరో మార్గం అవసరమైంది. అదే భక్తిమార్గం. వైదిక కర్మకాండ, జ్ఞాన కాండ అంతా సంస్కృతంలో వుండటంతో హిందూ మతంలో ప్రధాన భాగమైన భక్తి ఉద్యమం ఒకనాటి బౌద్ధ, జైన్లలోలా దేశ భాషల ద్వారా ప్రచారితమైంది. ఎందరో భక్త కవులు తమ తమ ప్రాంతీయ భాషలో భజనలు, కీర్తనలు, కావ్యాలు రాసి భక్తి ఉద్యమాన్ని ప్రచారం చేశారు. అప్పటి వరకు రామానుజుడు మొదలైన నలుగురు విశిష్టాద్వైతమని, ద్వైతాద్వైతమని ప్రవచించినా మొత్తానికి వీరంతా ద్వైతులే. వీరి కోవకే చెందిన మరో మహాభక్తుడు శ్రీకృష్ణచైతన్యుడు. భక్తి ఉద్యమానికి ఇతనే నాంది పలికాడు. ఇతను వంగ దేశస్తుడు. వంగదేశం పరిసరాల్లో వైష్ణవ మత వ్యాప్తికి ప్రధాన కారకుడు. ఇప్పటికీ బెంగాల్, ఒరిస్సాలలో వైష్ణవమతం అంటే చైతన్యమతమే. ఇప్పుడీ సంప్రదాయం బ్రిటన్,అమెరికా వంటి దేశాలకు కూడా పాకింది. చైతన్యుడి తల్లిదండ్రులకు మొదట ఎనిమిది మంది సంతానం పుట్టడం, వెంట వెంటనే చనిపోవడం జరిగింది. తొమ్మిదో సంతానంగా విశ్వరూపుడు పుట్టాడు. తర్వాత చైతన్యుడు జన్మించాడు. తల్లిదండ్రులు ఇతనికి విశ్వంబరుడు అనే పేరు పెట్టారు. గౌరాంగుడని కూడా పిలిచేవారు. శ్రీకృష్ణ చైతన్యుడనే పేరు సన్యాసాశ్రమం స్వీకరించాక వచ్చింది. 23వ ఏట ఇతను ఒకసారి గయకు వెళ్లాడు. అక్కడ ఒక విష్ణాలయంలో పూజలు చేస్తుండగా, భగవంతుడిపై అపారమైన భక్తిభావం ఏర్పడింది. ఈ స్థితిలో అతడిని చూసిన ఈశ్వరపురి అనే సాధువు ఇతను మహాభక్తుడు కాగలడని తలంచి, కృష్ణమంత్రోపదేశం చేశాడు. అప్పట్నుంచి చైతన్యుడు నిరంతరం కృష్ణ ధ్యానంలో, సంకీర్తనంలో మునిగిపోయాడు. 25వ ఏట సన్యాస జీవితంలో అడుగుపెట్టాడు. 48వ ఏట జగన్నాథ దేవాలయంలో పూజ నిమిత్తం తలుపులు తెరచుకొని లోపలికి వెళ్లిన వాడు మళ్లీ తెరిగిరాలేదని అంటారు.

తర్వాత మహారాష్ట్రలో జ్ఞానేశ్వరుడు భక్తి ప్రబోధం చేశాడు. భగవద్గీతను మరాఠీ భాషలోకి అనువదించి సామాన్య ప్రజలకు కూడా గీతారహస్యాలను తెలుసుకొనే వీలును కల్పించాడు. వీరికంటే నామదేవ్, తుకారాంలు అమిత ప్రజాదరణ చూరగొన్నారు. పాండురంగ భక్తులలో అగ్రగణ్యుడు నామదేవుడు. ఇతడు దర్జీ కులానికి చెందిన వాడు. కుల వృత్తి ఇష్టం లేక భగవంతుడి కీర్తనంలో మునిగి తేలేవాడు. విగ్రహారాధనకు తీవ్ర వ్యతిరేకి. 'రాతి విగ్రహాన్ని పూజిస్తే వచ్చేదేమి లేదు. భగవంతుడు సర్వాంతర్యామి. నీ హృదయంలోనే భగవంతుడున్నాడు-' అన్నది ఇతని ప్రబోధం. అభంగం అనే ఛందస్సులో భక్తి గీతాలు రాయడమే కాకుండా పాటలు పాడి భక్తి ప్రచారం చేశాడు. ఇతని సమకాలికుడు జ్ఞానదేవుడు కూడా భక్తి తత్వాన్ని ప్రబోధించాడు.

భక్తులందరిలో అత్యంత ప్రేమాస్పదుడు తుకారాం. పూనా నగరానికి సమీపంలో గల దేహు గ్రామంలో 1607లో జన్మించి 1649లో పరమపదించాడు. ఇతను కూడా బ్రాహ్మణేతరుడు. ఇద్దరు భార్యలు. వ్యాపారం దెబ్బతినడంవల్ల ఎప్పుడూ దారిద్ర్యంలోనే వుండేవాడు. అయినా నిశ్చింతగా వుండేవాడు. తుకారాం కూడా అభంగచ్ఛందస్సులోనే కీర్తనలు రాసాడు. 'పవిత్ర నదిలో స్నానం చేస్తే ఏమైంది? నీ దేహం శుభ్రపడింది. కాని నీ అంతరంగం మాత్రం శుభ్రపడలేదు. పాండురంగని సేవించు. మతాచారాలను ఖండించు. దైవ ధ్యానం, పుణ్యకార్యాలు ముఖ్యమని భావించు'అని తుకారాం ప్రచారం చేశాడు. తుకారాం కంటే ముందు సంప్రదాయానికి ఎదురీది మత సంస్కరణకు పాటు పడిన వ్యక్తి కబీరు. ఇతని స్వస్థలం వారణాసి. ఒక బ్రాహ్మణ వితంతువుకు జన్మించాడని, ఒక ముస్లిం ఇస్లాం మత సంప్రదాయానుసారంగా పెంచి పెద్ద చేశాడని కొందరంటారు. ఒక దశలో రామానందుడనే భక్త యోగికి శిష్యుడై రామభక్తుడిగా మారిపోయాడు. అయితే, హిందూ ఇస్లాం మతాల్లో దేన్నీ పూర్తిగా అంగీకరించలేదు. రెండింటిలోని గొప్పదనాన్నే స్వీకరించాడు. అతని ఉపదేశాలకు 'కబీర్ పంథ్' అనే పేరు వచ్చింది.

కబీర్ తర్వాత అంతటి ప్రసిద్ధి పొందిన మత ప్రవక్త పంజాబులో ప్రభవించాడు. ఆ మత గురువే నానక్. ఇతను మత బోధన చేసిన కొన్ని శతాబ్దాల తర్వాత ఉత్తరభారతంలో ఇతని మతానుయాయులు మహాశక్తివంతంగా రూపొందారు. నానక్ సిక్కు మతాన్ని స్థాపించాడు. ఈయన సూక్తులు సిక్కుల మత గ్రంథమైన ఆది గ్రంధ్‌లో భాగమయ్యాయి. భగవంతున్ని ప్రేమించడం ఒక్కటే ఆయనకి దగ్గరయ్యే దారని ఆయన పేర్కొన్నాడు. 1699లో ఖల్సా స్థాపన జరిగింది. హిందీ సాహిత్యంలో అగ్రస్థానం పొందిన మహాకవి తులసీదాసు. 1543లో పుట్టి 1623లో కన్నుమూశాడు. ఇతనూ రామభక్తుడే. రామచరిత మానస్ అనే మహాకావ్యం రచించాడు. వీరితో పోల్చదగ్గ భక్తురాలు మీరాబాయి. ఈమె కీర్తనలలో మధుర భక్తి ఉట్టిపడుతుంది. సాహిత్యంలో వీటికి ప్రముఖ స్థానం వుంది. భక్త కవి లీలాశుకుడు, జయదేవుడు, విద్యాపతి, చండీదాసులు కూడా భక్తి తత్వాన్ని ప్రబోధించిన వారే. దక్షిణాదిన పురందరదాసు, తాళ్లపాక అన్నమాచార్య, క్షేత్రయ్య, భద్రాచల రామదాసు, త్యాగయ్యలు తమ గీతాలతో, గానంతో భక్తి సంగీతానికి ఎనలేని కృషి చేశారు. ■







# నూతన శతాబ్దికి అపూర్వ స్వాగతం




కీ॥శే॥ నందమూరి తారక రామారావు
మాజీ ముఖ్యమంత్రి


శ్రీ నారా చంద్రబాబు నాయుడు
రాష్ట్ర ముఖ్యమంత్రి


శ్రీ గట్టు భీముడు
గద్వాల ఎమ్మెల్యే


శ్రీ గట్టు తిమ్మప్ప
[illegible]




శ్రీ [illegible] గౌడ్
గౌడ సంఘం నాయకులు

స్వర్ణాంధ్ర రూపశిల్పి, డైనమిక్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు నాయకత్వం అడుగుజాడలో నూతన శతాబ్దికి స్వాగతం పలుకుతూ మేము మరింత ముందుకు సాగుతాము.పనిచేసే ముఖ్యమంత్రిగా రాష్ట్రాన్ని ప్రగతి పథంవైపు నడిపిస్తున్న హైటెక్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు ఆశయాలకు అనుగుణంగా గద్వాల నియోజకవర్గాన్ని అభివృద్ధి పథంలోకి నడపనున్న మా నాయకులు,బలహీన బడుగువర్గాల ఆశాజ్యోతి శ్రీ గట్టు భీముడుకు నిరంతరం వెన్నంటే మేము ఉంటూ ప్రగతి కోసం పాటు పడతాము. దశాబ్దాల చరిత్రను మార్చి వేసిన మా నాయకుడు గట్టు భీముడు రానున్న నూతన శతాబ్దిలో మరిన్ని ఉన్నత శిఖరాలను అందుకోవాలని ఆశిస్తూ... గద్వాల నియోజకవర్గంలోని గట్టు, అయిజ, మల్దకల్, గద్వాల, ధరూర్ మండలాల అభివృద్ధికి పాటుపడి జిల్లాలోనే కాకుండా రాష్ట్రవ్యాప్తంగా పేరు తీసుకురావాలని ఆకాంక్షిస్తూ ...



భక్తి ఉద్యమంలో భాగమే ప్రేమతత్వం. ప్రేమతో ఆరాధించడం ద్వారా భగవంతుడిని చేరుకోవచ్చనే అభిప్రాయమే ఈ ప్రేమతత్వానికి ప్రేరణ. ఈ భావుకుల ఆరాధ్య దైవం శ్రీకృష్ణుడు. వ్యాస భారతంలో లేని రాధ పాత్రను భక్తి ఉద్యమం సృష్టించింది. రాధా కృష్ణుల ప్రణయగాధ పారాయణం సమాజాన్ని ఉర్రూతలూగించింది. మీరా భజనలన్నీ రాధాకృష్ణుల ప్రేమతత్వంపై అల్లుకున్నవే. ప్రణయ గాధలకు ప్రతిరూపంగా నిలబడిపోయిన రాధాకృష్ణుల వృత్తాంతంపై యార్లగడ్డ రాఘవేంద్రరావు వ్యాఖ్యానం...

# ప్రణయరాగంలో భక్తిగానం

'నల్లనయ్యా. ఇది ఉన్మత్తత కాదు. ఉద్దీపన. మనసును ఉద్దీపింపచేసే మధుర భావన. ఉత్తేజాన్ని కలిగించే నీ మనోహర భావన. చైతన్యంలో లయించిపోయి కలకాలం నిలిచిపోయే చిత్ర స్పందన. దాన్ని మూర్తీభవించుకొని నువ్వూ నేనూ కాలగర్భంలో నిలిచిపోయినా మనది కాలానికతీతంగా నిలిచే జ్వలితోజ్వల ప్రణయం.'

'అంతరంగపు ప్రతిరూపంగా ప్రవర్ధమానమై బతుకు తృప్తిగా సాగడానికి నిత్య నూతనోత్తేజానికి, మానసికావసరమైన ప్రేమను నాకిచ్చి నానుంచి సంపూర్ణంగా తిరిగి పొందిన ఏకైక స్త్రీవి నువ్వు రాధీ'

ఆ ఇద్దరిదీ ఆత్మికానంద ప్రణయం! ఆ ఇద్దరూ రాధాకృష్ణులు!

వాంఛ అనేది ప్రాకృతిక ధర్మం. ప్రేమ అనేది మనిషికి ఒక మానసికావసరం. అదొక నిరుపమాన స్థితి. అనిర్వచనీయానుభూతి. అనుబంధం, అనురాగం ఆత్మికమైనప్పుడు స్థలకాలాలకు అతీతాలు.

రాధాకృష్ణులది గురుశిష్యుల సంబంధం. హృదయ, మేధోపరిణతి నిండిన బంధం. దైహికాన్ని మించిన ఆత్మిక సంపర్కం. ఐహికాన్ని దాటిన అభౌతిక ప్రణవరాగం ఆ ప్రణయం.

ప్రేమ అనేది అగ్నిపర్వతంలా జ్వలించే భావన. శరీర ధర్మమైన ప్రణయకేళి హృదయ గతమై, హృదయాంతర్భాగమైనపుడు తేజోమయమైన జీవచైతన్యానికి మూలమవుతుంది. నిరంతర శోధనాభరితమై తన ను తను తెలుసుకునే జీవన సాఫల్యానికి పథగామి అవుతుంది. రాధాకృష్ణుల ప్రణయ సృష్టిలోని ఆంతరిక రహస్యం అదే.

భౌతిక ధర్మాలను మించిన జీవచలన సూత్రం ప్రేమ. అది మనసుతో దూరకాలాల్ని కొలుచుకునే చర్య మనసులో ప్రేమ లేనప్పుడు మనిషి దేన్నీ తెలుసుకోలేడు. అర్థంచేసుకోలేడు.

వ్యాస భాగవంతలో కనుపించని పాత్ర రాధ. తర్వాత తర్వాత ఈ పాత్ర ఎవరు జొప్పించారో, అందుకు కారణమేమిటో స్పష్టంగా తెలని విషయం. దీనిపై శోధన, చర్చ సాగింది. చివరికి నిగ్గు తేలిన వాఖ్యానంగా మిగిలింది మాత్రం ఒక మధుర రస దృక్పథం.

కృష్ణుడి శృంగార క్రీడలు, గోపికలతో సాగించిన చిలిపి చేష్టలు ప్రణయ కలాపాలు భాగవతంలో మనోహరంగా చిత్రించాడు వ్యాస మహర్షి. కాని ఆ వర్ణనలో స్త్రీలోలత్వం కాని, చపలచిత్తం కాని ఎక్కడా దర్శనమివ్వదు- చిలిపి శృంగారం మినహా. తర్వాత ఎవరి ఘంటం నుంచి జాలువారిందో, మరి, ఈ రాధ పాత్ర గోపికల్లో మణిపూసై, రసరమ్య భరితమై ఇప్పటికీ ప్రణయోపాసనకు ప్రతీకగా నిలిచిపోయింది.

రాధాకృష్ణులది అమలిన శృంగారమంటారు. అమలినమంటే దైహికమైనది కాదని. కల్మషం, కపటత్వం, స్వార్థం, ఈర్ష్యాసూయలకు తావులేని హృదయానుగతమైన అనురాగబంధమని అంతరార్థం.

రాధాకృష్ణులు లేదా గోపికా కృష్ణుల ప్రణయ కలాపాల్లో శృంగారాన్ని కాక భక్తిరస తత్వాన్ని దర్శించారు ఆధ్యాత్మికులు, వేదాంతులు. దాన్ని- భక్తుడికి, భగవంతుడికీ మధ్యగల పవిత్రమైన అభౌతిక బంధంగా భావించారు. భక్తుడు భగవంతునితో తాదాత్మ్యం చెందే ఆత్మిక ప్రక్రియగా పరిగణించారు. పరమాత్మణ్ణి, జగత్ప్రాల కుణ్ణి, అసమాన శక్తి సంపన్నుణ్ణి పాంచభౌతిక శరీ రంతో అందుకోవడం మహాకష్టం. అతణ్ణి అందుకుని లయించి పోవాలంటే భక్తి ఒక్కటే సులభ మార్గం- మనిషయిన వాడికి. ఆ భగవంతుడు కూడా ప్రేమమూర్తి. అందుకే అతణ్ణి అందుకోవడానికి ప్రేమోపాసనే సరైనమార్గమని తలచి ఆ భక్తి బావన, సాధన పెంపొందించడం కోసమే రాధాకృష్ణుల అద్భుత ప్రణయ సృష్టి జరిగిందని వారి అబిప్రాయం.

మేధోపరిణతి ప్రజ్ఞ. ప్రజ్ఞ బుద్ధి వికాసం. బుద్ధి వికాసం ఆధ్యాత్మిక పరిణామం. ఆధ్యాత్మిక పరిణామం సృష్టి స్థితి లయలకు మూలమైన శక్తి ఆధిక్యతను గుర్తించడం. ఆ ఆధిక్యత మీద పెరిగే ఆరాధనా భావమే ప్రేమ. అది పరిపూర్ణత్వంతో నిశ్చలదృష్టితో ఏకాగ్రతతో నిలవడమే భక్తి. లౌకిక సంబంధాలకు అతీతంగా అశాశ్వతమైన మానుషత్వాన్ని మించిన శక్తిని ప్రేమించడమే మహోత్కృష్టమైన భక్తి. ఆ భక్తి సాధనతో భగవంతుడిలో విలీనంకావడమే ప్రేమతత్వంలోని సాఫల్యం. మనిషికి దివ్యత్వాన్ని, దైవత్వాన్ని ప్రసాదించేది ఆ భక్తే. భగవంతుణ్ణి భర్తగా స్వీకరించి కొలిచే ప్రేమారాధన భక్తి మార్గానికి పరాకాష్టగా చెబుతారు.

భక్తి ఉపాసనను ప్రతీకాత్మక ప్రేమోపాసనగా మలచి రసవత్తరంగా వర్ణిస్తే హృదయాలకు అందిస్తే గాఢంగా హత్తుకుని రంజింపచేస్తుందని, అంతర్నిహిత భావాన్ని అందుకోగలిగిన వారు భక్తి పారవశ్యంలో మునుగుతారనే ఆలోచనతోనే రాధా కృష్ణుల ప్రణయ సృష్టి జరిగిందని ఆధ్యాత్మికుల అభిప్రాయం.



ఇంద్రియాలన్నిటి నీ తెరుచుకునే కాక, పాంచ భౌతికాల్ని తనలో లయింపజేసుకొని, త్రికరణ శుద్ధిగా మనసులో ప్రతిష్ఠించుకుని, తనలోని రసభావనకు మూలమైన దానితో సమస్తంగా మమేకం కావడం పరిణతి చెందిన ప్రణయంగా, సమున్నత భక్తిగా పేర్కొన్నారు. ఫలితంగా రాధాకృష్ణుల ప్రేమ జీవ బ్రహ్మైక్య సంధాన మయిన వేదాంతమయింది. రాధాకృష్ణులు జీవాత్మ పరమాత్మ ప్రతిరూపాలయ్యారు. రాధ హృదయం ప్రాపంచిక తత్వం నుంచి బైటపడి సత్యం, శివం, సుందరమయిన పరమాత్ముడిలో చెందిన తాదాత్మ్య తత్వానికి మరు రూపమైంది. అయితే, మిగిలిన లోకానికి, రసజ్ఞులకు మాత్రం అది లౌకిక మాలిన్యాలేవి అంటక ఏకాగ్రతత, నిర్మల స్పందనలతో పెనవేసుకుపోయిన రెండు హృదయాలు మమేకం చెందిన ప్రేమగాధ మాత్రమే. అందుకే మానవజాతికి మానవీయమై సత్యం, చిదానందాలకు హృదయానుగలిక రూపమై ఇంకా ఇంకా వెలుగుతోంది.

రాధాకృష్ణులు ఆదర్శ ప్రేమమూర్తులుగా మిగిలిపోయారు. ■







హిందూ సమాజంలో దేవాలయాలు కేవలం ఆధ్యాత్మిక వ్యవహారాలకే పరిమితం కాలేదు. ముఖ్యంగా మధ్య యుగాల్లోని దక్షిణ భారతదేశంలో సామాజిక జీవనంలో సమష్టి వ్యవహారాలన్నిటికీ దేవాలయమే కేంద్ర స్థానంగా పనిచేసింది. కళలు విరిసిందక్కడే, చదువు నేర్చేదక్కడే, పండుగలు-పబ్బాలు కూడా అక్కడే. ఇంతటి గురుతర భూమిక నిర్వహించిన దేవాలయాల పుట్టుక-పరిణామాలపై బి.బాలసుబ్రహ్మణ్యం పరిశీలన...

# అడుగడుగున గుడి ఉంది

హిందువులకు దేవాలయాలు పరమ పవిత్ర ప్రదేశాలు. పండుగలు, పెళ్ళిళ్ళ, జన్మదినోత్సవాలు, ఇతర శుభకార్యాల సందర్భంగా దేవాలయానికి వెళ్లి రావడం సర్వసాధారణమైన విషయం. మన సంస్కృతిలో దేవాలయాలకు ప్రత్యేకమైన స్థానం వుంది. అయితే, ఈ దేవాలయాలు ఎలా అవతరించాయన్న ప్రశ్నకు మాత్రం కచ్చితమైన సమాధానం దొరకడం కష్టం. ప్రాచీన ఆర్యులకు గుళ్లు, గోపురాలు లేవు. వారు కేవలం ప్రకృతినే ఆరాధించారు. ఆర్యులు సంచార జీవులుగా వుండటంవల్ల వారి దేవుళ్లకు కూడా స్థిరమైన నివాసం ఏర్పడలేదు.

గాలిలోనూ, ప్రకృతిలోనూ దేవుడున్నాడని, భగవంతుడు సర్వాంతర్యామి అని నమ్మిన వారే తిరిగి గుడిని ఎందుకు నమ్మారు? ప్రత్యేకించి గుడిలోనే దేవుని విగ్రహం పెట్టి పూజించాల్సిన అవసరం ఎందుకు ఏర్పడింది? ఆ నిర్ణీత ప్రదేశంలోనే దేవుడుంటాడని ఎందుకు విశ్వసించారు?

రెండు రకాల నాగరికతలు వున్నప్పుడు ఒక నాగరికతను అనుసరించే ప్రజలు వేరే పద్ధతికి ప్రభావితం కావడం అత్యంత సహజం. మతాతీత విషయాలకే ఈ రకమైన మార్పు పరిమితం కాలేదు. మత సంబంధమైన విషయాల్లో కూడా ఇలాంటి మార్పు సంభవించింది. ఆరంభంలో రెండు పద్ధతులూ సమాన స్థాయిలో వున్నా రానురాను వాటిలో ఒకటి మరుగున పడటం, లేదా నిరుపయోగమవటం కనక జరిగితే, రెండోది బలపడుతూ వస్తుంది.

సెల్లాక్రామ్‌రిచ్ రాసిన 'హిందూ టెంపుల్' గ్రంథంలో 'సముద్రపు ఒడ్డున, కాలువల వద్ద, నదీ

వేములవాడ రాజరాజేశ్వర దేవాలయం



తీరంలో వుండే పుణ్యస్థలాల్ని తీర్థం అంటారు. ఎక్కడైతే తీర్థం వుందో అక్కడ దేవాలయాలను నిర్మించారు' అని పేర్కొన్నాడు. మన దేశంలో జీవనదులు అనేకం వున్నా, ఇందులో ప్రసిద్ధమైనవి పన్నెండు వున్నాయి. ఈ మహానదులకు పుష్కరాలు జరుగుతాయి. 'పోషయతీతి పుష్కరం'. మేషం ఇత్యాది పన్నెండు రాసులలో వరుసగా గురువు సంచరించే సమయమే నదులకు పుష్కర కాలం. ఈ కాలంలో హిందూ మతంలో వున్న ముక్కోటి దేవతలు ఆయా నదులకు సన్నిహితంగా వుంటారట. ఈ నదుల్లో స్నానం చేస్తే పవిత్రమే కాకుండా సమస్త రోగాలు హరించిపోతాయని విశ్వాసం. అందుకే ఇలాంటి తీర్థాల్లో పుణ్యక్షేత్రాలు వెలిసాయని ఒక వాదన.

కేవలం ఒక కాలువ కాని, నది కాని తీర్థం ఎందుకవుతుంది? వేరే ప్రదేశాలు ఎందువల్ల కావు అనే వాటికి 'పెద్దలు' ఇచ్చిన సమాధానం కూడా ఇది కావచ్చు. ఇ.బి.హావెల్ తన 'ది ఎనిషియెంట్ అండ్ మిడైవల్ ఆర్కిటెక్చర్ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో 'సిద్ధాంతాలు, ఉత్సవాలు, వేడుకలతో పాటు ప్రజల దైనందిన జీవితంలో నుంచి కూడా హిందూ మతం ఆవిర్భవించింది. గ్రామాల్లోని సాధారణమైన విగ్రహాల ద్వారా ఆలయాలుపుట్టుకొచ్చాయి' అని రాసాడు. ఆలయాల అవతరణకు సంబంధించి ఆయన చాలా ముఖ్యమైన సమాచారాన్ని అందించినప్పటికీ ఆ విగ్రహాలను కూడా గ్రామ వాసులు ఎక్కడ? ఎందుకు? ప్రతిష్టించారన్నది మాత్రం వివరంగా చెప్పలేకపోయాడు. ఇతను దేవాలయాలను పరిశీలించి, వాటినే ఆదారంగా తీసుకున్నాడు. కనుక ఊహలకు, అంచనాలకు మాత్రమే ఈ రచనలు పరిమితమయ్యాయి. అయితే 'సోషల్ ఆంత్రోపాలజీ' ఇలాంటి సందేహాలకు పరిష్కారాన్ని చూపగలిగింది. ఆర్యేతరులైన మన దేశపు వాసులు కొన్ని ఆత్మలు అడవుల్లో సంచరిస్తూ, చెట్లలో నివాసం ఏర్పరచుకుంటాయని విశ్వసించేవారు. వ్యవసాయానికి కాని, నివాసానికి కాని వారు కొంత మేరకు అడవుల్ని నరకాల్సి వచ్చింది. ఇటువంటి సమయంలో చెట్లపై వుండే ఆత్మలకు ఆగ్రహం కలుగుతుందనే భయంతో ఆ ఆత్మలకు శాంతి జరిపి, వాటికి వేరే నివాసం చూపించేవారు. అందువల్ల అడవిలో నిత్యం నీటి ప్రవాహం గల ప్రాంతం సమీపంలో వుండే చెట్లను నరక్కుండా వదిలివేసేవారు. మిగతా అడవిని నరకడమో, కాల్చివేయడమో చేసేవారు. మిగిలిన చెట్ల దగ్గర వేడుకలు జరిపితే, అడవిలో వుండే ఆత్మలు ఆకర్షణకు లోనై అక్కడికి వచ్చి శాశ్వతంగా స్థిర నివాసమేర్పరుచుకుంటాయని భావించేవారు. ఆ ప్రదేశానికి ఆత్మలే సంరక్షణ







# నూతన శతాబ్ది సుస్వాగతం





**శ్రీమతి సోనియాగాంధి**
ఎ.ఐ.సి.సి. అధ్యక్షురాలు



**డా॥ వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి**
పి.సి.సి . అధ్యక్షులు



**శ్రీ డి.కె. భరతసింహారెడ్డి**
గద్వాల మాజీ ఎమ్మెల్యే



**డి.కె. అరుణారెడ్డి**
కాంగ్రెస్ నాయకురాలు

సెక్యులర్ పార్టీగా శతాబ్దం పై చిలుకు
చరిత్ర కలిగి, ఎన్నో త్యాగాలు చేసిన
కాంగ్రెస్ పార్టీ రానున్న శతాబ్దిలో పేద,
బలహీన,బడుగు,మైనార్టీల అభ్యున్నతికై
అఖిలభారత స్థాయిలో పాటుపడాలని,
నూతన శతాబ్దిలోకి అడుగిడుతున్న
సందర్భంగా ... ఇవే మా హార్దిక శుభాకాంక్షలు...



**బి. కృష్ణమోహన్‌రెడ్డి**
కాంగ్రెస్ నాయకులు

సమగ్ర నాయకత్వంతో రాష్ట్ర శాసనసభలో ప్రతిపక్ష నాయకులుగా **శ్రీ వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి** రాణించాలని ఆయన నాయకత్వంలో పార్టీ పటిష్టం కావాలని కోరుతున్నాము. కార్యకర్తలకు నిరంతరం అండగా ఉంటూ గద్వాల నియోజకవర్గంలో క్యాడర్‌తో బాస్ అని అత్యంత ప్రేమతో ఆత్మీయతలను, అనురాగాన్ని అందుకుంటున్న మా నాయకులు **శ్రీ డి.కె. భరతసింహారెడ్డి శ్రీమతి అరుణారెడ్డి**లు రాజకీయంగా మరింత ఉన్నత స్థితికి రావాలని ఆకాంక్షిస్తూ నూతన శతాబ్దికి ఇవే మా స్వాగతాంజలులు ...

గద్వాల నియోజకవర్గం అభివృద్ధికై నిరంతరం పాటుపడిన మా నాయకుడు స్థానికంగా కాంగ్రెస్ పార్టీని బలోపేతం చేయాలని ఆశిస్తూ..

## గద్వాల నియోజకవర్గ కాంగ్రెస్ పార్టీ

అని నమ్మేవారు. వాటి సమ్మతి లేనిదే, వాటిని సంతృప్తి పరచనిదే ఏ కార్యమూ సాధించలేమని విశ్వసించేవారు. దీన్ని బట్టి ఒక ప్రత్యేక ప్రాంతాన్ని ఎంచుకొని తాము నమ్మిన మానవాతీత శక్తులకు నివాసం కల్పించారన్న విషయం స్పష్టమైంది. ఈ ఆచారం ఆర్యులకు పూర్వం వున్న ప్రజలంతా పాటించేవారు. రానురానూ వీరు కొండ ప్రాంతాలను కూడా ఎన్నుకున్నారు. హరప్పా, మొహంజాదారో కాలంలో విగ్రహాలు వుండేవని, విగ్రహారాధన జరిగేదని తెలిసింది. అయితే అప్పట్లో దేవాలయాలు వున్న దాఖలాలు మాత్రం లేవు. సింధు ప్రజలు లింగపూజ, దేవి పూజ, శివ విగ్రహారాధన చేసినట్టు కనబడుతుంది. ఆర్యులు వచ్చిన తర్వాతే వేదాలు పుట్టుకొచ్చాయి. వేదకాలంలో దేవాలయాలు లేవనీ, వీటి నిర్మాణం వేదకాలపు చివరి దశల్లో రామాయణ, మహాభారత కాలాల్లో ఆరంభమైందనీ, వేదకాలపు యాగశాలలే కాలక్రమంగా దేవాలయాలుగా రూపొందాయని కొంత మంది అభిప్రాయం.

దేవతా స్వరూపము, దేవతల వాహనములు, ప్రతిమావర్ణనము మొదలైన విషయాలకు సంబంధించిన వాక్యాలు వేదాల్లో కనిపిస్తాయి కాని, విగ్రహారాధనకు సంబంధించిన వాక్యాలు లేవు. విగ్రహారాధన ఆచరణలోకి వచ్చిన తర్వాత కాని, దేవాలయ నిర్మాణం జరగలేదు. బౌద్ధమతంలో మహాయాన భక్తి మార్గము ప్రబలిన తర్వాత బౌద్ధులు బుద్ధుని దేవునిగా పరిగణించి, బుద్ధ విగ్రహాన్ని ఆరాధించడం మొదలు పెట్టారు. బౌద్ధులను చూసి వైదిక ధర్మావలంబులు కూడా తమ దేవతలకు వేదములోగల వర్ణమును అనుసరించి విగ్రహాలను నిర్మించి, దేవాలయ నిర్మాణాన్ని సైతం ఆరంభించారు. తర్వాతి కాలంలో ఆర్యేతరుల గుళ్ళు, గోపురాలను కూడా ఆక్రమించారు. బౌద్ధం క్షీణిస్తున్న దశలో బౌద్ధ ఆరామాలను కూడా ఆక్రమించి హిందూ దేవాలయాలుగా మార్చిన సంఘటనలు కూడా కోకొల్లలు. దేవాలయాలను రెండు రకాలుగా వర్గీకరించుకోవచ్చు. 1.గ్రామదేవతాలయాలు, 2.శిష్టదేవతాలయాలు. మొదటి వర్గం గ్రామరక్షణ కోసం తరతరాలుగా గ్రామ సంస్కృతిలో నిలదొక్కుకున్న ఎల్లమ్మ, మారమ్మ, పోచమ్మ, మైసమ్మ మొదలైన దేవతల చిన్న చిన్న గుడులు. గ్రామ దేవతల్లో అధికం స్త్రీలే. ఒకవిధంగా వీరు శక్తి దేవతలు. వీళ్లను ఆరాధించేవారు సాధారణంగా బ్రాహ్మణేతరులు. ఈ దేవాలయాలకు వాస్తు శిల్పం వుండదు. మామూలుగా వుంటాయి. గతంలో ఇలాంటి దేవాలయాలను కూడా అగ్రవర్ణాలు తమ స్వాధీనంచేసుకొని శిష్ట దేవాలయాలుగా మార్చారు. శ్రీశైలం ఈ కోవకు చెందినదే. శిష్ట దేవాలయాలను వాస్తుశాస్త్రానుగుణంగా నిర్మిస్తారు. ఇలాంటి దేవాలయాలను నిర్మించేటప్పుడు 12 భాగాలను నిర్మిస్తారు. 1.గర్భాలయము, 2.అంతరాలయము, 3.ముఖ మండపము, 4.ఆలయ విమానము, 5.విమాన కలశము, 6.ధ్వజ స్తంభము, 7. ఆలయ ప్రాకారము, 8.గాలిగోపురము, 9.కళ్యాణ మండపము, 10.ఉత్సవ సమయమందు దేవున్ని ఊరేగించే వాహనము వుంచడానికి వాహనశాల, 11. యజ్ఞశాల, 12.ఆలయములోపల బావి.

ఇప్పటి వరకు చరిత్రకు అందిన ఆధారాలను బట్టి దేశంలోనే మొట్టమొదటి శిలా నిర్మిత దేవాలయం గుంటూరులోని చేజెర్లలోని కపోతేశ్వర ఆలయం అని చరిత్రకారుల అభిప్రాయం. ఇలాంటి దేవాలయాలు చాలా అపూర్వం. చిత్తూరు జిల్లా రేణిగుంటకు సమీపంలో వున్న గుడిమల్లం అనే గ్రామంలో జరిపిన తవ్వకాలలో పెద్ద శివలింగం బయల్పడింది. ఈ ఆలయం క్రీ.పూ.మూడో శతాబ్దానికి చెందినదని నిర్ణయించారు. లింగంపైన జుట్టును విరబోసుకున్న శివుని చిత్రాన్ని చెక్కారు. తర్వాతి కాలంలో ఈ శివలింగం చుట్టూ గుర్రపు నాడా ఆకారంలో ఇటుకలతో గోడలు నిర్మించినట్టు స్పష్టమవుతుంది. దేవాలయాలు దేవతారాధనకు సహాయపడే పుణ్యక్షేత్రాలే కాకుండా, ఆధ్యాత్మిక చింతనానికి, నిశ్చల భక్తికి సముచితమైన వాతావరణానికి ఆలవాలమై వుంటుంది. పూర్వకాలంలో విజ్ఞాన ప్రజ్ఞానాలకు నిలయాలుగా భాసిల్లాయి. ఇందులో గురుకులములు, విశ్వవిద్యాలయాలు వుండేవి. ధాన్యకటకములోని దేవాలయ పాఠశాలలో విద్యనార్జించడం కోసం చైనా, టిబెట్, జపాన్ మొదలైన దేశాల నుంచి విద్యార్థులు వచ్చేవారు. కంచి, చిదంబరాలలో వున్న దేవాలయాల ప్రాకారాలు పొడవులో విద్యార్థులు నివసించడానికి చిన్నచిన్న గదులను నిర్మించారు. విద్యార్థులకు ఉచితంగా భోజనం, విద్యలభించేది. యుద్ధకాలమందు, ఆపత్కాలమందు దేవాలయాలు సామాన్య ప్రజలకు రక్షణ స్థానములుగా వుండేవి. ఆలయాల చుట్టూ చిన్నచిన్న కుటీర పరిశ్రమలుండేవి. గ్రామ ప్రజల హస్త కౌశలం, కళా నైపుణ్యం ఉట్టి పడే వస్తువులను దూరప్రాంతాల నుంచి వచ్చే యాత్రికులకు అమ్మేవారు. వివాహాది పవిత్ర కార్యాలు దేవాలయాల్లో ఉచితంగా నిర్వహించేవారు. ప్రాచీన కాలం నుంచి లలితకళలకు దేవాలయాలు పట్టుకొమ్మలు. ఇలా ఆదరణ పొందిన కళల్లో నృత్యం కూడా ఒకటి. యజ్ఞం చేసే సమయంలో రుత్విజ్ఞులు, యువతులు నృత్యం చేసే ఆచారం వున్నట్లు రుగ్వేదాన్నిబట్టి తెలుస్తుంది. భగవంతున్ని ఆరాధించే సమయంలో కూడా నృత్యం చేయడం ప్రాచీన సంప్రదాయమే. దేవాలయాలు న్యాయస్థానాలుగా కూడా వ్యవహరించాయి. నేటికి పల్లెల్లో న్యాయవిచారణ గుళ్లలోనే జరుగుతుంది.

**తిరుమల-తిరుపతి** : ఆంధ్రప్రదేశ్‌లోని పవిత్ర వైష్ణవ దేవాలయాలలో తిరుపతి అత్యంత ప్రాచీనమైంది. చిత్తూరు జిల్లా రేణిగుంటకు 11 కి.మీ దూరంలో వుంది. తూర్పు కనుమల వరుసల

తిరుమల తిరుపతి

తో వున్న ఏడు కొండలు (శేషాద్రి కొండలు) దాటితే ఏడు కొండల స్వామి దర్శనం కలుగుతుంది. ఉత్తర భారతీయులు వేంకటేశ్వరస్వామిని బాలాజీ అని పిలుస్తారు. ఈ స్వామి శివ, విష్ణుమూర్తులు కలిసిన దేవత (శక్తిరూపం) అని వైష్ణవులూ, శైవులూ యాత్రికులుగా వచ్చి స్వామిని దర్శిస్తారు. దీని నిర్మాణం ఎప్పుడు జరిగిందో కచ్చితంగా తెలియదు. కానీ ఇది స్వయంభూస్థలం అనే విశ్వాసం వుంది. మరో అభిప్రాయం ప్రకారం పూర్వమెప్పుడో అది బాలా విగ్రహమని, భగవద్రామానుజులు ఆ విగ్రహాన్నే వేంకటేశ్వరునిగా మార్పించారని అంటారు. అందుకే ఉత్తరాది వారు బాలాజీ అంటూ వుంటారు. బాల అంటే బాలత్రిపుర సుందరీ దేవి.ఒకటో శతాబ్దంలో తొండమానుచక్రవర్తి ఈ ఆలయాన్ని నిర్మించినట్లుగా తెలిపే కథలున్నాయి. విజయనగర రాజుల కాలంలో ఉచ్ఛస్థితికి చేరుకుంది. 1933లో ఇది తిరుమల తిరుపతి దేవస్థానం ఆధీనంలోకి వచ్చింది. స్వామి వారి ఆదాయాన్ని విద్యా, సాంస్కృతిక, మత రంగాలకు సద్వినియోగం చేస్తున్నారు. అన్నమాచార్యులు, పురందరదాసు, త్యాగయ్య, తరిగొండ వెంకమాంబ మొదలైన మహాభక్తులు దర్శించిన క్షేత్రం ఇది. దిగువ తిరుపతిలో శ్రీపార్థసారది-గోవిందరాజస్వామి ఆలయం, శ్రీకోదండరామస్వామి ఆలయం వున్నాయి. తిరుపతి గ్రామాన్ని పూర్వం కొత్తూరు అని పిలిచేవారట. గోవింద రాజస్వామి వారి విగ్రహ ప్రతిష్ఠతో తిరుపతిగా మారింది.

**శ్రీశైలం** : భారతదేశంలోని ప్రాచీనమైన పుణ్యక్షేత్రాల్లో శ్రీశైలం ప్రసిద్ధమైంది. కర్నూలు జిల్లా నంది కొట్కూర్ తాలూకాలో మల్లికార్జున స్వామి నివాసమే శ్రీశైల క్షేత్రం. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన మల్లికార్జున లింగం స్వయంగా ఆవిర్భవించిందని విశ్వాసం. ఈ ప్రాంతంలో 'చెంచు' జాతుల వారు ఎక్కువ. ఆరంభంలో వీరు నిర్మించుకున్న ఆలయమేనని పేర్కొంటుంటారు. ఇప్పటికీ చెంచు తెగల వారు శివుడిని చెంచు మల్లయ్యగా వ్యవహరిస్తుంటారు. ఈ గుడిలో చెంచులు స్వేచ్ఛగా తిరిగే అవకాశముంది.

**భద్రాచలం** : ఖమ్మం జిల్లాలోని భద్రగిరి కొండపై వున్న రామాలయం దక్షిణ భారత ప్రసిద్ధ క్షేత్రాల్లో ఒకటి. గోదావరీ తీరంలో కుడి పక్కగా వున్న గట్టు మీద 40మెట్ల ఎత్తులో ఆలయాన్ని నిర్మించారు. ఇక్కడి ప్రతిమ సనాతనమైందనీ, రాముడు స్వయంభువు అని నమ్మకం. పోకాల దమ్మక్క అనే యువతికి రాముడు కలలో కన్పించి భద్రగిరి మీద సీతారామ లక్ష్మణుల విగ్రహాలున్నాయని చెప్పడం, ఆమె వెళ్లి చూస్తే నిజంగానే విగ్రహాలు దర్శనమివ్వడం జరిగిందట. వెంటనే ఆమె ఒక చిన్న మంటపం కట్టించింది. 17వ శతాబ్దంలో కంచర్ల గోపన్న (రామదాసు) ఆలయ పునరుద్ధరణ కోసం ఆరు లక్షలు ఖర్చు పెట్టాడు.

**శ్రీకాళహస్తి** : చిత్తూరు జిల్లాలో తిరుపతి క్షేత్రానికి 40 కి.మీ.దూరంలో స్వర్ణముఖి నదీతీరంలో వున్న ప్రసిద్ధ క్షేత్రం కాళహస్తి. శ్రీపురం, ముమ్మిడి చోళపురం కొండల మధ్య వున్న ఈ క్షేత్రం పూర్వ కాలంలో శేషశైల (మేరుపర్వతం) భాగంగా పేర్కొనబడిందట. పంచభూత క్షేత్రాలలో కాళహస్తి వాయు క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. కాళహస్తీశ్వర దేవాలయాన్ని పల్లవ రాజులు, తర్వాత తొండమాన్ చక్రవర్తి నిర్మించారు. చోళరాజులు దాన్ని పునరుద్ధరించి ప్రధాన దేవాలయాన్ని నిర్మించారు.

**రామేశ్వరం** : తమిళనాడులో వున్న ఈ దేవాలయానికి ఒకవిశిష్టత వుంది. కాశీకి వెళ్లినవారు, రామేశ్వరం దర్శిస్తే కానీ పుణ్యం దక్కదని ప్రతీతి. రాష్ట్రకూటులకు చెందిన మూడో కృష్ణరాజు, 12వ శతాబ్దానికి చెందిన విష్ణువర్ధనుడు దీని అభివృద్ధికి పాటుపడ్డారు. విష్ణులింగాలయంగా ప్రసిద్ధి పొందింది. ఇక్కడి శిల్పాలను శిల్పులు ఆకట్టుకొనే రీతిలో చెక్కారు.

**మధురై** : దక్షిణ భారత దేశంలో మధురై దేవాలయానికి ప్రత్యేక స్థానం వుంది. ఈ దేవాలయ సృష్టి వెనుక అనేక కథనాలున్నాయి. ఇక్కడ వెలసిన మీనాక్షి దేవిని దర్శనం చేసుకుంటే సర్వ పాపాలు తొలగిపోతాయని విశ్వాసం. పాండ్య రాజు కులశేఖరుడు ఈ ఆలయాన్ని నిర్మించాడు. 14వ శతాబ్దంలో మాలిక్‌కఫుర్ దేవాలయాన్ని పాక్షికంగా ధ్వంసం చేశాడు. తర్వాత మధురై దాదాపు 50ఏళ్ల పాటు ముస్లింపాలన కిందకివచ్చింది. ఆ దశలో ఆలయాన్ని మూసివేశారు. ముస్లిం పాలన అంతమైన తర్వాత ఆలయాన్ని తెరిచి చూస్తే ప్రారంభరోజు శివుడికి వేసిన దండ అలాగే తాజాగా వుండటం, అప్పుడు వెలిగించిన దీపాలు వెలుగుతూ వుండటం కనిపించింది.

**చిదంబరం** : నటరాజ స్వామి ఆలయానికి ఎంతో చరిత్ర వుంది. పంచభూత లింగాల్లో వాయు లింగం ఇక్కడుంది. చోళ రాజులైన సింహవర్మ, హిరణ్యవర్మలు ఈ దేవాలయాన్ని నిర్మించారు. శిల్ప శైలికి ఈ ఆలయం పెట్టింది పేరుగా నిలిచింది.

**శబరిమలై** : తిరుపతి దేవాలయం తర్వాత ఎక్కువ ఆదరణ వున్నది ఈ దేవాలయానికే. హరిహరసుతుడైన అయ్యప్పను కొలిస్తే పుణ్యం సిద్ధిస్తుందని ప్రజల విశ్వాసం. ప్రతియేట మకర సంక్రాంతి రోజు మకరజ్యోతిని తిలకించడానికి లక్షలాది భక్తులు విచ్చేస్తారు.

**హాలిబిడు** : కర్ణాటకలోని హాలిబిడుకు దేవాలయల పట్టణంగా పేరుంది. ఈ దేవాలయాల్లో హోయసలేశ్వర, కేదారేశ్వర దేవాలయాలతో పాటు మూడు జైన స్థూపాలు కూడా వున్నాయి. ఈ దేవాలయాన్ని 12వ శతాబ్దంలో కేతమల్ల నిర్మించాడు. అతను విష్ణువర్ధన రాజు వద్ద పని చేసేవాడు. ■



**భారతీయ శిల్పకళా ఉచ్ఛ దశకు సంకేతాలు ఖజురహో, కోణార్క్ దేవాలయాలు. బండ రాళ్లలో ప్రబంధ కావ్యాలను చదువుకున్న భావుకులు ఈ శిల్పులు. బుందేల్‌ఖండ్‌ను ఏలిన చందేల రాజపుత్ర వంశస్తులు సృష్టించిన బృహదాలయ సమాహారం ఖజురహో. పదమూడో శతాబ్దంలో వెలసిన మానవాద్భుతం కోణార్క్.**

**రెండు కళాఖండాలపై బి.వి.ఎల్. సావిత్రి స్థూల పరిచయం...**

ఖజురహో శిల్పకళా సంపద

మధ్యప్రదేశ్‌లో పన్నా ప్రాంతానికి 44 కిలోమీటర్ల దూరంలో బుందేల్ ఖండ్‌లో ఖజురహో శిల్ప కళా సంపద నిక్షిప్తమై ఉంది. ఇక్కడ ఎటు చూసినా దేవాలయాలే కనిపిస్తాయి. చందేల రాజులు నిర్మించిన ఈ దేవాలయాలు, శిల్పాలు చూపరులను విశేషంగా అలరిస్తాయి. 9, 11వ శతాబ్దాల్లో ఇక్కడ శిల్పకళ బాగా అభివృద్ధి చెందింది. అప్పటి రాజుల మత భావాలకి, కళాత్మకహృదయానికి దాసోహమనక తప్పదు ఆ శిల్పాలను చూస్తే క్రీస్తు శకం 950నుండి 1050 మధ్య కాలంలో అప్పటి రాజులు నిర్మించిన 85 దేవాలయాలలో చాలా మటుకు కాలగర్భంలో జీర్ణమైపోగా 20 దేవాలయాలు మాత్రం ఇప్పటికీ అదే సజీవ కళతో కళకళలాడుతున్నాయి. ఖజురహో శిల్పకళా సంపద కలిగిన ఈ దేవాలయాలు ఆర్యుల శిల్పకళా ప్రాభవానికి ఒక మచ్చుతునకగా భాసిల్లుతున్నాయి. ఈ శిల్పాలు విశాల ప్రాంగణంలో భవన ప్రాకారంపై చక్కని ఆకృతితో, జీవం ఉట్టిపడుతూంటాయి. దేవాలయం గోడలపై ఉండే ఈ బొమ్మలు చూపరులను ఆకట్టుకునే నిశ్శబ్ద చిత్రాలు. పెద్దపెద్ద స్తంభాల ఆధారంగా నిలబడే ఈ దేవాలయాల్లో శిల్ప కళ నయగారాలతో తీవి గొల్పుతూ ఉంటుంది. ఖజురహో ఆలయాల్లో ఎక్కువగా శైవ, వైష్ణవ, జైన మతాలకు చెందిన భావజాలం కనిపిస్తుంది. ఈ ఆలయ ప్రాకారం చుట్టూ వుండే బొమ్మల్లో ఋషులు, అందమైన నాట్యగత్తెలు, శృంగార ప్రధాన శిల్పాలు మనకి గోచరిస్తాయి. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ నెరపుతూ ఆర్తత్రాయ పరాయణుడుగా మనిషి జీవించాలన్నది ఈ శిల్పాల కథల వెనుకనున్న సిద్ధాంతం. మతపరమైన క్రతువులను, భక్తి శ్రద్ధలతో నిర్వహించే వారికి సంపద, దీర్ఘాయుష్షు, ఆధ్యాత్మిక ఆనందం దక్కుతుందనే శైవ సిద్ధాంతాన్ని ఈ ఖజురహో దేవాలయాలు ప్రతిబింబిస్తుంటాయి. ఖజురహోలోని దేవాలయాలన్నీ గ్రానైట్ రాయితో నిర్మితమైనవే. శృంగార ప్రధానమైన శిల్పాలు ఎందరో కవులకు, భావకులకు,శృంగార ప్రియులకు ఉత్తేజం కలిగిస్తాయి.

**కోణార్క్**

జగదేక పావనుడు, ప్రత్యక్ష దైవమూ అయిన సూర్య భగవానుని పవిత్ర దేవాలయమైన కోణార్క్ ఒరిస్సాలోని భువనేశ్వర్‌కు 66కిలోమీటర్ల దూరంలో ఉంది. 12వ శతాబ్దపు రాజు మొదటి నరసింహ దేవ (1238-1264) ఈ ఆలయాన్ని నిర్మించాడు. రథ ఆకృతిని పోలిన ఈ ఆలయానికి ఏడాదిలోని పన్నెండు నెలలను తలపిస్తూ 12 చక్రాలున్నాయి.

సూర్యదేవుని ఏడు కిరణాలను పోలిన సప్తాశ్వాలు ప్రచండ భానుని అఖండమైన శక్తికి నిదర్శనాలు. అత్యద్భుతమైన ఈ దేవాలయ నిర్మాణానికి యావత్ప్రపంచం దాసోహమనాల్సిందే! విశ్వకవి టాగూర్ మాటల్లో చెప్పాలంటే ఈ శిల్ప కళా ప్రభవాన్ని చూసిన వారు భాష మరచి చేష్టలుడిగి తన్మయత్వం చెందాల్సిందే!

చంద్రభాగ నదీ తీరాన నిర్మితమైన ఈ దేవాలయం దట్టమైన ఇసుక మేటల నడుమ ఉంది. శతాబ్దాలు గడిచినా నేటికీ అత్యద్భుత కళాఖండంగా విలసిల్లుతున్న ఈ ఆలయంనేటికీ కుంగిపోయినట్లు గానీ, వంగి , ఒరిగిపోయినట్లు గానీ కనిపించకపోవడం ఆ కాలం నాటి శిల్పులు, కట్టడ నిర్మాతల నైపుణ్యానికి నిదర్శనం. ■

కోణార్క్ దేవాలయం









తెలుగువారి సామ్రాజ్యలక్ష్మి కాకతీయ రాజ్యం. మూడువందల సంవత్సరాలపాటు పాలించిన కాకతీయుల హయాంలో తెలుగునేల సర్వతోముఖాభివృద్ధిని చవిచూసింది. వ్యవసాయరంగం అభివృద్ధి కోసం పెద్దపెద్ద చెరువులను తవ్వించారు. శిల్పం, చిత్రలేఖనం వంటి లలితకళలకు మంచి ప్రోత్సాహం లభించింది. కళాశాల విద్య ప్రారంభమైంది. వస్త్ర పరిశ్రమ ఖండాంతర ఖ్యాతిగాంచింది. శైవ-వైష్ణవ విద్వేశం చెలరేగినా, వాటి ప్రభావంవల్ల కుల వ్యవస్థపై నిరసన వ్యక్తమైంది. కాకతీయ వైభవంపై

బి.బాలసుబ్రహ్మణ్యం పరిచయం...

# తెలుగువారి తొలి సామ్రాజ్యం

రామప్ప దేవాలయం



కాకతీయ రాజులు ఆంధ్రదేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా క్రీశ 1000 నుంచి 1324 వరకు పాలించారు. వీరు రాష్ట్రకూట వంశ సంజాతులు. తూర్పు పశ్చిమ చాళుక్య రాజన్యుల సైన్యాధ్యక్షులుగా, మాండలికులుగా, సామంతులుగా వ్యవహరించారు. 'కాకతీయ మొదటి భేతరాజు పశ్చిమ చాళుక్య రాజుల సామంతునిగా వుండి వారి తరఫున చోళరాజులతో యుద్ధాలు చేశాడు. 'చోడక్ష్మాపాల చమూవార్ధి ప్రమథన సమార్జిత లక్ష్మి' అనే బిరుదును కూడా సంపాదించాడు. ఇతనికి 'కాకతిపురాధినాథ' అనే బిరుదు వుంది. విరియాల ఎర్రభూపతి, అతని భార్య కామసాని బేతరాజు శత్రువులను నిర్జించి అతనికి కొరవి మండలమున కాకతిపురమును ప్రతిష్ఠించారు. క్రీశ 1000 నుంచి 1050 వరకూ ఇతను పరిపాలన చేశాడు.

**మొదటి ప్రోలరాజు** : మొదటి భేతరాజు కుమారుడితను. కాకతి వల్లభుడు. చక్రకూటము జయించి, భద్రంగపురాధీశునోడించి, కొంకణముపై దండెత్తి, కొడవర్తి దుగ్గరాజు కుమారుని సంహరించి, పురూకదేశమును జయించి గొన్న రాజు రాజ్యాన్ని ఆక్రమించాడు. చాళుక్య త్రైలోక్యమల్ల సోమేశ్వరుని మెప్పించి, అతని నుంచి అనుమకొండ విషయాన్ని శాశ్వతముగా పొందాడు. ఇతని సైనికులు కాంచీపురాన్ని సైతం జయించారు. క్రీశ.1050-1080వరకు పాలించాడు.

**రెండో భేతరాజు** : మొదటి ప్రోలరాజు కుమారుడు. చాళుక్య చక్రవర్తి అయిన ఆరవ విక్రమాదిత్యుడ్ని ఓడించి సామంతునిగా చేసుకున్నాడు. ఇతని మంత్రి వైజన దండనాయకుడు శక్తి సమన్వితుడు. చాళుక్య చక్రవర్తిని మెప్పించి తన ప్రభువగు భేతరాజునకు సబ్బిసాయిర మండలమును వైజన దండనాయకుడికి ఇప్పించాడు. రెండో భేతరాజుకు విక్రమ చక్రి, భూలోక మల్లు అనే బిరుదులున్నాయి. 1080 నుంచి 1110 వరకు ఇతను పరిపాలన చేశాడు.

**రెండో ప్రోలరాజు** : కాకతి రెండవ భేతరాజు కుమారుడితను. కాకతి సామ్రాజ్యమును స్వతంత్ర రాజ్యముగా ప్రకటించాడు. పశ్చిమ చాళుక్య రాజుల బలహీనత, వెలనాటి రాజ్య క్షీణ పరిస్థితులు కాకతి రెండవ ప్రోలరాజు విజయాలకు అనుకూలించాయి. ఇతడు ఒకానొక యుద్ధమున చాళుక్య చక్రవర్తి తైలపును ఓడించి, బంధించి ప్రభువను గౌరవముతో విడిచి పెట్టాడు. ప్రోలరాజు నేలకొండపల్లి గోవిందరాజును, మంత్రకూడాధిపతియగు గుండని ఓడించాడు. ఇతని సేనాపతి రేచర్ల కామచమూపతి గుండని వధించాడు. పొలవాస జగద్దేవుడు, దొమ్మె ప్రోలరాజు వెలనాడును ఆక్రమించాలనే యత్నించాడు. కాని రెండో గొంకరాజు కుమారుడు రాజేంద్ర చోడుడు ప్రోలరాజును సంహరించాడు. ప్రోలరాజు 1120 నుంచి 1158 వరకు పరిపాలన కొనసాగించాడు.

**రుద్రదేవుడు** : రెండో ప్రోలరాజు జ్యేష్ఠ కుమా







రుడు. ఇతను అప్రతిమ ప్రతిబాశాలి. పరాక్రమవంతుడు. ఇతను భద్రాచలాన్ని పాలించే దొమ్మెరాజును జయించాడు. కందూరి ఉదయనచోడ, భీమదేవ చోడులను ఓడించాడు. భీమ దేవచోడుని సోదరి పద్మావతి దేవిని వివాహం చేసుకున్నాడు. ఇతను 1158 నుంచి 1195 వరకు పరిపాలించాడు.

**మహాదేవరాజు** : రుద్రదేవుని సోదరుడు మహాదేవరాజు. గద్దెనెక్కిన వెంటనే యాదవరాజ్యముపై దండెత్తాడు. ఈ యుద్ధములో మహాదేవరాజు మరణించాడు. ఇతని కుమారుడు గణపతి దేవుని యాదవులు బందించారు. మహాదేవుడు కేవలం మూడేళ్ల మాత్రమే రాజ్యపాలన చేశాడు.

**గణపతి దేవుడు** : గణపతి దేవుడు యాదవుల చెరసాలలో వున్నప్పుడు కాకతీయ రాజ్యంపై హోయసాలులు, చోళులు దండెత్తారు. మూడవ కుళోత్తుంగ చోళుడు 1208లో ఓరుగల్లుపై దండెత్తి ఆక్రమించాడు. గొంటూరు నాగ భూపాలుడు తీరాంధ్రమునాక్రమించాడు. కాకతీయ సేనానులు రేచర్ల రుద్రుడు, బప్పదేవుడు, దండయాత్రలను అరికట్టి, సామ్రాజ్య ప్రతిష్టను చేశారు. కాకతీ సేనానులు, మంత్రులు యాదవరాజుకు నచ్చచెప్పి గణపతి దేవుని చెరసాల నుంచి విడిపించారు. 1208లో సింహాసనాన్ని అధిష్టించాడు. గణపతి దేవుడు తన సోదరీమణులైన మేలాంబిక, కుందాంబికలను నతవాడి రుద్రునికిచ్చి వివాహం చేశాడు. కృష్ణా తీర ప్రాంతపు రాజు జాయపసేనాని సోదరీమణులను వివాహం చేసుకొని బావమరది జయపసేనానికి గణపాహిణి పదవినిచ్చాడు. తన కుమార్తెలలో గణపాలంబను కోటబేత రాజునకు, రుద్రమదేవిని చాళుక్య వీర భద్రేశ్వరునకు ఇచ్చి వివాహము జరిపాడు. ఈ సంబంద బాందవ్యాల వల్ల గణపతి మహారాజు, వెలనాడు, వేంగి ప్రాంతాలపై పట్టు సాధించాడు. 1224 నాటికి ఒంగోలు, అద్దంకి, పొదిలి, కొణిదెన, దర్శి, పొత్తపి ప్రాంతాలను జయించాడు. 1198 నుంచి 1260 వరకు ఇతను రాజ్యపాలన చేశాడు.





**రుద్రమదేవి** : గణపతిదేవుని తర్వాత ఇతని కూతురు రుద్రమదేవి 1260లో సింహాసనాన్ని అధిష్టించింది. ఆమె పదవిలోకి రాగానే సామంతులగు సిద్దయ చోడుడు, ఏరువమల్ల, కేశవదేవ, అల్లుగంగ, మల్లికార్జున, దామోదరులు తిరుగుబాటు చేశారు. కొప్పెరుంజింగడు దండయాత్ర చేశాడు. అయితే, కొలని రుద్రుడు, అంబదేవుడు, త్రిపురాంతకుడు మొదలైన సేనానుల సహాయంతో రుద్రమదేవి తిరుగుబాట్లను అణచివేసింది. ఓరుగల్లు శిలాప్రాకారములను ఛేదించి వశపరుచుకున్న యాదవరాజును, అతని అనుచరులను సైన్యమును రుద్రమదేవి అవలీలగా ఓడించింది. ఏకశిలా నగరాన్ని అభివృద్ధిపరిచింది. మట్టికోట, అగడ్త, బురుజులు నిర్మించింది. 1260 నుంచి 1296 వరకు రుద్రమదేవి పరిపాలన చేసింది.

**ప్రతాపరుద్రుడు** : రుద్రమదేవికి పురుష సంతానము లేకపోవడంతో ముమ్మడమ్మ అనే కుమార్తెకు జన్మించిన ప్రతాపరుద్రుని దత్తత తీసుకొని అతనికి సింహాసనాన్ని అప్పగించింది. రుద్రమదేవి రెండో కుమార్తె రుయ్యమ ఇందులూరి అన్నయామాత్యుని వివాహం చేసుకున్నాడు. రుద్రమదేవి కాలమందే ప్రతాపరుద్రుడు క్రీ.శ.1290 నుండి రాజ్యపాలనా వ్యవహారాలను నిర్వహించాడు. ఆమె మరణానంతరం క్రీ.శ.1296లో సింహాసనం అధిష్టించాడు.

ప్రతాపరుద్రుని కాలమందే అంబదేవుడు నెల్లూరి చోడులు తిరుగుబాటు చేశారు. ఆదిదమ్మ, సోమయ గుండయ, మాబా నాయకులు ఈ తిరుగుబాటును అణచివేశారు. 1311లో తురుష్కులతో యుద్ధాలు జరిగాయి. పాండ్యుల దాడిని ఎర్ర దాచనాయక, ఇందులూరి రుద్రమసేనానులు ఎదుర్కొని వారిని తరిమివేశారు. దాచానాయనికి పంచపాండ్యదళ విభాళ, కాండీకవాట చూర కార' అనే బిరుదులున్నాయి. రుద్రదేవుడు గండికోటపై దండెత్తి జయించి అన్నువెంక, విదెము రుద్రులను పాలకులుగా నియమించాడు. కంపిలును ఓడించిన పిదప 1314లో యుద్ధయాత్రలు ముగించుకొని దక్షిణ దేశ యాత్రలుసేవించి 1318లో ఓరుగల్లు చేరాడు. తురుష్కుల దండయాత్రల్లో ప్రతా పరుద్రుడు అపజయం పాలయ్యాడు. వారి చేతిలో బందీగా చిక్కాడు. రుద్రదేవుని బందీగా హస్తినాపురానికి తీసుకెళుతున్నప్పుడు మార్గ మధ్యంలో ఇతను మరణించాడు. ప్రతాపరుద్రుని మరణంతో కాకతీయ సామ్రాజ్యం అంతరించింది. 1290 నుంచి 1324 వరకు ప్రతాపరుద్రుడు పరిపాలన గావించాడు.

కాకతీయుల కాలంలో బౌద్ధమతం ఇంచుమించు పతానావస్థలో వుంది. అయితే, జైన మతం మాత్రం ప్రబలంగావుండేది. జైన, శైవ, వైష్ణవ మతాలు పరస్పరం ప్రాబల్యం కోసం పోరాటం సాగించేవి. ఆంధ్ర దేశంలో జైన మతాన్ని రూపుమాపింది శైవులే! అహింసా వాదులైన జైనులపై వీర శైవులు హింసను ప్రయోగించడానికి కూడా వెనుకాడలేదు. రాజులను వశపర్చుకొని వారికి వీర శైవ దీక్ష నిచ్చి, వారి గురువులై, మంత్రులై, దండనాయకులై రాజ్యములను వశీకరించుకున్నారు. జైన విగ్రహాలను తొలగించి వాటి స్థానంలో లింగాలను ప్రతిష్టించారు. నగ్న జైన విగ్రహాలను కొన్నింటిని వీరభద్రులుగా చేశారు. కొన్ని చోట్ల గుడి బయట జైన విగ్రహాలు వుండటాన్ని నేటికి గమనించవచ్చు. క్రీ.శ.1200 వరకు జైనమతం పూర్తిగా క్షీణించింది. ఇదే సమయంలో తెలుగుదేశంలోకి వైష్ణవము వ్యాప్తి చెందడం ప్రారంభించింది.




వీరశైవ, వీర వైష్ణవుల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేంత వైరం వుండేది. ఉభయ మత ప్రబోధకులు పరస్పర స్పర్థతో శూద్రాది జన సామాన్యమునకు మూఢభక్తిని వంట పట్టించి వారు మళ్లీ జారిపోకుండా వుండేందుకు శివలింగాలు కట్టి లేక వైష్ణవ ముద్రలు వేసి నామాలు పెట్టించేవారు. వీరు గుళ్లలోని విగ్రహాలను కూడా శక్తి గలిగినప్పుడు మార్చారు. తిరుపతి వెంకటేశ్వరుని విగ్రహం మొదట వీరభద్ర విగ్రహమని, దానిని వైష్ణవ విగ్రహంగా మార్చివేశారని కాకతీయ కాలంనాటి శ్రీపతి పండితులు తన శ్రీకర భాష్యములో పేర్కొన్నాడు. బలవంతంగా ఈ పరివర్తన చేసింది శ్రీమద్రామానుజాచార్యుల వారని కూడా ఆయన తెలిపాడు. ప్రాణం పోయినా సరే, జైన దేవాలయాలకు మాత్రం వెళ్లకూడదని శైవ, వైష్ణవులు భావించేవారు. అయితే, ఒకరి నొకరు మాత్రం అసభ్యంగా దూషించుకొనే వారు. మాదేవుడెక్కువంటే, మా దేవుడెక్కువంటూ యుద్ధాలకు దిగారు. ఈ జైన, శైవ, వైష్ణవ ద్వేషాలే కాకతీయ సామ్రాజ్య పతనానికి దారి తీసాయని చెప్పుకోవచ్చు.

శైవ, వైష్ణవ భేదాలు ఎలా వున్నా వారిరువురు కుల నిర్మూలనానికి తీవ్రంగా కృషి చేశారు. లింగము కట్టిన వారందరిదొకే లింగవంత కులమన్నారు. అలాగే సమాశ్రీ యాగమసుముద్రలు వేయించుకొని ఊర్ధ్వపుండ్రధారులైన వారంతా ఒకే కులం వారన్నారు.

కాకతీయుల కాలంలో జైన, బౌద్ధ మతాల వారే కాకుండా పాంచరాత్ర వ్రతులు, ఏకాత్మవాదులు, అబేదవాదులు, శూన్య వాదులు, కులవాదులు, కర్మ వాదులు, నాస్తికులు, చార్వాకులు, ప్రకృతి వాదులు, శబ్ద బ్రహ్మపరులు, పురుష్యత్రమైన వాదులు, లోకాయుతులు మొదలైన మతావలంబులున్నారు. కాకతీయ కాలంలో వీరశైవులు తమ మత ప్రచారార్థమైన గోళకీ మఠాలను ఏర్పాటుచేశారు. ఈ మఠాల పోషణ కోసం రాజులు గ్రామాలను, ధనికుల భూములను దానంచేసి శాసనాలు వేయించారు. తర్వాతి కాలంలో జంగాల మఠాలుగా రూపొందాయి. కాకతి గణపతిరాజు గోళకీ మఠానికి చెందిన విశ్వేశ్వర శివాచార్యుల వద్ద శివదీక్ష పొంది గోళకీమఠమును కృష్ణా తీరమందలి 'మందడ'గ్రామమున నెలకొల్పాడు. కాకతీయుల కాలంలోనే కొన్ని ప్రాంతాల్లో శైవ, వైష్ణవ సమన్వయం కోసం హరిహర మూర్తి పూజలు కూడా జరిగేవి. నెల్లూరులో ఇలాంటి విగ్రహంకూడా వుంది. తిక్కన సోమయాజి తన భారతములు మొదటి పద్యములో 'శ్రీయన గౌరినాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భద్రాయుత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి' అని వర్ణించాడు. గుత్త ప్రాంతానికి చెందిన నాచన సోమన తన ఉత్తర హరివంశమును 'హరిహరనాదుడు'కే అంకితమిచ్చాడు.

కాకతీయులకాలంలో ఏకవీర, మైలారు దేవుడు, భైరవుడు, చమదేశ్వరి, వీరభద్రుడు, మూసానమ్మ, కుమారస్వామి, పాండవులు, స్వయం భూదేవుడు, ముద్దరాలు ముసానమ్మ తదితర దేవతలను కూడా పూజించేవారు.

హిందుమతాన్ని సంస్కరించాలనే పట్టుదల శైవ, వైష్ణవ మతాల్లో స్పష్టంగా కనిపించేది. అనులోమ, ప్రతిలోమ వివాహాలు చాలా జరిగాయి. రుద్రమరాణి బ్రాహ్మణ మంత్రి ఇందులూరి అన్నయరుద్రమ రెండో కూతురు రుయ్యమ్మను వివాహం చేసుకున్నాడు.





# నవ సహస్రాబ్దిలో మీ ఊహలకు వాస్తవ రూపాన్నివ్వండి

## సహస్రాబ్దికి సదరన్ వారి మరో మహత్తర వెంచర్
## "సదరన్ పారడైజ్"

అడుగిడిన అన్ని రంగాలలోను అనూహ్య విజయాలను సాధించి మీ సుందర గృహస్వప్నాలను వాస్తవ రూపాన్నివ్వాలనే ఉద్దేశ్యంతో ప్రారంభించిన "సదరన్ కాంటినెంటల్ కాంట్రాక్టర్స్ లిమిటెడ్" రెండు వెంచర్లను విజయవంతంగా పూర్తిచేసుకొని విజయధరహాసంతో ప్రారంభించిన మా తృతీయ వెంచరే 'సదరన్ పారడైజ్'

*సదరన్ పారడైజ్ లోని సభ్యులకు మేమందిస్తున్న అపురూప సదుపాయాలు*

1. శంషాబాద్‌లో నిర్మితమయ్యే అంతర్జాతీయ విమానాశ్రయానికి అతిదగ్గరలో
2. కోఠి, సికింద్రాబాద్, మెహిదీపట్నం, అఫ్జల్ గంజ్‌ల నుండి ప్రతి పదినిమిషాలకొకసారి బస్సు సౌకర్యం.
3 శంషాబాద్ రైల్వేస్టేషన్ నుండి రెగ్యులర్ మరియు లోకల్ రైలు సౌకర్యం
4. నగర కాలుష్యానికి దూరంగా చక్కని ప్రశాంత వాతావరణంలో నిర్మితమైనది.
5. 100 % వాస్తుతో అందరికీ అనుకూలమైన విధంగా అందమైన ప్లాట్లు
6. చక్కని మంచినీటి వసతి
7. మీ కుటుంబం మొత్తానికి CDR Hospitals లో 5 సంవత్సరాలపాటు ఉచిత వైద్య సౌకర్యం
8. ఇవేకాక ప్రతినెలా మీరూహించని మహత్తర బహుమతులు




## సదరన్ కాంటినెంటల్ కాంట్రాక్టర్స్ లిమిటెడ్.,

రిజిష్టర్డ్ & హెడ్ ఆఫీస్ 3-2-870/3, 3వ అంతస్తు, వి.యన్.ఆర్. కాంప్లెక్స్, స్టేషన్ రోడ్, కాచిగూడ, హైదరాబాద్ - 500 027.
ఫోన్ : 4607217, 4743635, 4742800, 4745642, ఫ్యాక్స్ : 040-4607218.

వేయి స్తంభాల గుడి



పల్నాటి యుద్ధంలో చాపకూటి గురించి, బ్రహ్మనాయుడు బహుకులములతో బాంధవ్యము చేయడం తెలిసిందే. శైవమందు చాకలి, మంగలి, మాల, మాదిగ మున్నగు జాతుల వారు కలసి వున్నారనడానికి పాల్కురికి సోమనాథ బసవపురాణమే సాక్ష్యం.

వీరి కాలంలో ఉత్తమోత్తమ శిల్పాలు అవతరించాయి. ఓరుగంటి నగరాన్ని ఆంధ్రనగరమని పిలిచేవారు. ఈ నగరానికి ఏడుకోటలున్నాయనే వారు. లోపలి రాతి కోటలో చక్రవర్తి వుండేవాడు. కోటకు బయటి భాగమున చిన్నకులాల వారి మైల సంత వారానికోసారి జరిగేది. లోపలి భాగంలో మడ సంత జరిగేది. రాజవీధులు కొన్ని, సందులు వుండేవి. పరిఖ, ప్రాకారము, వంకనార, గవని వున్న కోటలో రథ, ఘోట, శకట, కరటియూధ సంభారముండేది. మధ్య భాగములో స్వయం భూదేవాలయం వుండేది. నాలుగు దిక్కుల హంస శిఖరములతో పెద్ద శిల్ప శిలా స్తంభాలతో కూడిన మహాద్వారాలుండేవి. నగరాన్ని పేటలుగా విభజించారు. కాకతీయులు జైనులుగా వున్నప్పుడు జైన దేవాలయాలను కట్టించారు. హనుమకొండ గట్టురాళ్లపైన కూడా పెద్ద జైన తీర్థంకరుల విగ్రహాలను చెక్కించారు. గుట్ట వద్ద గల చెరువులో అనేక జైన విగ్రహాలు నేటికి కూడా కుప్పలు తెప్పలుగా కనిపిస్తాయి. కాకతీయులు శైవులుగా మారిన తర్వాత హనుమకొండలో వేయిస్తంభాల గుడిని నిర్మించారు. ఓరుగంటికి 40 మైళ్లదూరంలో వున్న రామప్ప మందిరాన్ని క్రీ.శ. 1162లో రుద్రసేనాని అనే రెడ్డి సామంతుడు కట్టించాడు. నల్లగొండ జిల్లాలోని సూర్యాపేట సమీపంలో పిల్లలమర్రిలో అద్భుతమైన దేవాలయాలను కట్టించారు.

కాకతీయుల కాలంలో అనేక ప్రాంతాల్లో కళాశాలలుండేవి. ఇందులో మతబోధ, వేదములు, గీర్వాణ భాషలోని కావ్యములు, న్యాయమీమాంసాది శాస్త్రాలను బోధించేవారు. విద్యార్థులకు ఉచిత భోజన వసతులను కల్పించారు. రాజులు, భక్తులు, ధనికులు ఈ సంస్థలను పోషించేవారు. నూలు బట్టలకు ఎంతో ప్రసిద్ధి చెందింది. కాకతీయుల కాలంలో ఎన్ని రకాల వస్త్రాలు తయారయ్యేవో పాల్కురికి సోమనాదుడు తన బసవపురాణంలో వివరించాడు. దాదాపు 20 రకాల వస్త్రాలను ఆయన పేర్కొన్నాడు. మహారాణి రుద్రమదేవి కాలంలో విచ్చేసిన మార్కోపోలో 'వీటిని ధరించడానికి ఇష్టపడని రాజుకాని, రాణి కాని ప్రపంచంలో వుండరు' అని అన్నాడు. ప్రజల సాదారణమైన సౌకర్యాలకు రాజులు పెద్దపీట వేశారు. కాకతీయ రాజులు వెండి నాణేములను ప్రచారంలోకి తీసుకొచ్చారు. వరహాలు ఈ కాలంలోనే ఏర్పడ్డాయి. తోలుబొమ్మలాటలు ప్రసిద్ధి పొందాయి. బిల్లంగోవి, దండుగులి, చిర్రాగోనే, చిల్లగోడే పేర్లతో గిల్లిదండను ఆడేవారు. కోడి పందెములు కూడా జరిగేవి. చిత్రలేఖనం వెల్లివిరిసింది. చౌకట్లపై జంత్రపు పని వుండేది. బట్టలపై బొమ్మలను వేయించారు. కర్దమత్రనము, మహీరసము, హరి దశము, ధాతురాగము మొదలైన వర్ణములను గేయడానికి ఉపయోగించేవారు. ■

# హక్కులకు పునాది వేసిన 'మాగ్నా కార్టా'

రిచర్డ్-1 మరణానంతరం 1199లో ఇంగ్లాండ్ సింహాసనాన్ని అధిష్టించిన జాన్ అనతికాలంలోనే ప్రజా కంటకుడిగా మారాడు. అనేక అనవసర యుద్ధాలకు పాల్పడి తన రాజ్యానికి తీవ్ర నష్టాన్ని కలిగించడంతోపాటు అన్ని వర్గాలతోనూ ఘర్షణ వైఖరి అవలంబించాడు. చర్చి నియామకాలకు సంబంధించి చివరికి పోప్‌తో కూడా గొడవపడ్డాడు. ఇక సామాన్యుల సంగతి సరేసరి. జాన్ వడ్డించే పన్నులకు హద్దు వుండేది కాదు. చట్టపరమైన తీర్పులను నిస్సిగ్గుగా అమ్మకానికి పెట్టేవాడు. ఈ అరాచకాన్ని, వేధింపులను భరించలేని వ్యాపార వర్గం ముందుగా రాజుకు ఎదురుతిరిగింది. పర్యవసానంగా 1215 జూన్‌లో 'మాగ్నా కార్టా' (ది గ్రేట్ చార్టర్)పై జాన్ సంతకం చేయక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఆధునిక ప్రజాస్వామ్యానికి ఈ 'హక్కులపత్రం' బీజాలు వేసిందని చరిత్రకారులు పేర్కొంటారు. రాజు అధికారానికి ఈ ఒప్పందం అనేక పరిమితులు విధించింది. అంతిమంగా రాజు కూడా చట్టానికి జవాబుదారీగా వుండాలని నిర్ణయించింది. అమెరికా, ఫ్రెంచి విప్లవాలకు ఊపిరిలూదిన లాక్, రూసో వంటి ఆధునిక ప్రజాస్వామ్య సిద్ధాంతకర్తలు ఈ మాగ్నా కార్టా నుంచి ఎంతో ఉత్తేజాన్ని పొందారు. అనేక దేశాల రాజ్యాంగాల నిర్మాణంలో అది ప్రతిఫలించింది. 1948లో ఐరాస 'యూనివర్సల్ డిక్లరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్'ను ఆమోదించినప్పుడు ఎలీనార్ రూజ్‌వెల్ట్ ఆ ప్రకటనను 'సర్వమానవాళి మాగ్నా కార్టా'గా అభివర్ణించింది. ■



'మాగ్నా కార్టా'పై ఇంగ్లాండ్ రాజు జాన్‌తో బలవంతంగా సంతకాలు చేయిస్తున్న వ్యాపారులు



పదమూడో శతాబ్దినాటి ఆంధ్రదేశంలో మహాభారత యుద్ధం పునరావృతమైంది. ఇద్దరు సవతి తల్లికొడుకుల మధ్య జరిగిన ఈ యుద్ధంలో ఆనాడు ఆంధ్రదేశంలో ఉన్న చిన్నచిన్న రాజులు ఇరుపక్షాల తరపున యుద్ధంలో పాల్గొన్నారు. దీన్నే 'పల్నాటి యుద్ధం' అన్నారు. ఈ కథకు హీరో బ్రహ్మనాయుడు. కులవివక్షను నిరసించి సహపంక్తి భోజనాలను ప్రారంభించిన సమతావాది బ్రహ్మనాయుడు. రమేశ్‌చంద్ర పరిచయం...

# తెలుగు సీమలో భారత యుద్ధం



బ్రహ్మనాయుడు

ఆంధ్రదేశంలో జరిగిన రెండు భీకర యుద్ధాలకు కోళ్ళ పందాలే కారణమయ్యాయి. ఒకటి విజయనగర ప్రాంతంలో జరుగగా రెండవది పల్నాటి యుద్ధానికి దారితీసింది. పదమూడో శతాబ్దంలో పల్నాటి సీమలోని గురజాల అనే చిన్న రాజ్యాన్ని నలగామరాజు పరిపాలిస్తుండేవాడు. ఆయనకు, ఆయన సవతి తల్లి కొడుకులు మలిదేవ రాజుల మధ్య అధికారం కోసం విరోధాలు పెరిగాయి. నలగామ రాజుకు మంత్రి బ్రహ్మనాయుడు. ఈయన గొప్ప వీరుడే కాక ధార్మికుడు, కులమత రహిత సమతావాది అని పేరుగాంచాడు. బ్రహ్మనాయుడు వైష్ణవ మతాన్ని స్వీకరించగా, నలగామ రాజు శైవ మతస్థుడు. ఆ రోజుల్లో మతాల మధ్య తీవ్ర వైరుధ్యం వుండేది.

నలగామ రాజు సవతి తల్లి కొడుకులకు అన్యాయం జరిగిందని భావించిన బ్రహ్మనాయుడు రాజుపై వత్తిడి తెచ్చి వారికి మాచర్లను ఇప్పించాడు. ఆ తర్వాత మలిదేవరాజు మంత్రిగా బ్రహ్మనాయుడు మాచర్లకు వెళ్ళినాడు. బ్రహ్మదేవుడి అడుగు జాడుల్లో మలిదేవరాజు పరిపాలన సాగించేవాడు. నాగమ్మ అనే శైవమత అనుయాయి నలగామరాజుకు మంత్రి అయింది. దనికురాలైనప్పటికీ వితంతువైన నాగమ్మ నలగామరాజును మోహించిందని చరిత్రకారుల అభిప్రాయం. ఆమె నలగామ రాజుకు మంత్రిగా వుండి బ్రహ్మనాయుడు పైన కత్తికట్టింది. మాచర్లను దోచుకోవడానికి కొంతమందిని వుసిగొల్పింది. బ్రహ్మనాయుడికి విషం పెట్టి చంపటానికి కుట్ర చేసి, చివరకు యుద్ధ రంగంలో దొరకగా ఆమెను బ్రహ్మనాయుడు ముందు నిలబెట్టారు. అయినా, బ్రహ్మనాయుడు ఆమెను క్షమించి వదిలివేశాడు. బ్రహ్మనాయుడుపై పగ పెంచుకున్న నాగమ్మ కోడి పందేలకు పిలిచి ఓడించాలని పథకం వేసింది. పందెంలో ఓడిపోతే రాజ్యాన్ని అప్పగించి, ఏడేండ్లు అరణ్యవాసం చేయాలని, అరణ్యవాసం ముగించుకొని తిరిగి వచ్చినప్పుడు రాజ్యాన్ని తిరిగి అప్పగించాలని ఒప్పందం. ఈ పందేలకు బ్రహ్మనాయుడు అంగీకరించాడు. పందెంలో జరిగిన కుట్రవల్ల ఓడిపోయిన మలిదేవరాజు తన వర్గంతో కృష్ణానదిని దాటి ఒక అరణ్యంలో వీరమేడపి అనే గ్రామం ఏర్పరచుకొని ఏడేండ్లు వనవాసంలో గడిపారు. గడువు తీరిన తర్వాత మలిదేవరాజు తన రాజ్యాన్ని కోరుతూ రాయబారం పంపిస్తాడు. రాయబారిగా నలగామరాజు అల్లుడైన అనుసురాజును పంపగా, ఆయనను మార్గమధ్యంలోనే నాగమ్మ అంతమొందిస్తుంది. దీనిపై ఇరు వర్గాలు ఆవేశకావేశాలకు లోనవుతాయి. తుదకు యుద్ధం వల్లనే రాజ్యం తిరిగి వస్తుందని మలిదేవరాజు భావిస్తాడు. తమ రాజ్యాన్ని తిరిగి దక్కించుకోవడానికి మలిదేవరాజు యుద్ధాన్ని ప్రకటించాడు. కారంచేడు అనే ప్రాంతంలో యుద్ధం జరిగింది. ఆంధ్ర దేశమంతా అల్లకల్లోలమయింది. కృష్ణా, గుంటూరు, నెల్లూరు, రాయలసీమలలోని చిన్న రాజులంతా తమ సేనలతో యుద్ధంలో పాల్గొన్నారు. ఓరుగల్లు రాజు ప్రతాపరుద్రుడు రెండు వేల గుర్రపు దళాన్ని నలగామరాజుకు పంపించాడు. బ్రహ్మనాయుని యుద్ధ తంత్రం వల్ల ఈ యుద్ధంలో నలగామరాజు ఓడిపోయాడు. బ్రహ్మనాయుడుకు మద్దతుగా అశేష ప్రజానీకం నిలిచి పోరాడిందని పరిశీలకుల అభిప్రాయం. యుద్ధరంగంలో సహితం ఆయన కుల, మత విచక్షణను తిరస్కరించి మొత్తం సైన్యం, రాజులు, ప్రజలు కలిసి సమాన స్థాయిలో సహపంక్తి భోజనాలు చేశారు. దీని వల్లనే 'చాపకూడు' అనే మాట వచ్చింది. యుద్ధంలో తమ వర్గంలోని ప్రముఖులు, అనుచరులు, సన్నిహితులు మరణించడంతో గెలుపొందిన సంతోషాన్ని బ్రహ్మనాయుడు పొందలేకపోయాడు. దీనితో దుఃఖ భరితుడైన బ్రహ్మనాయుడు రాజ్యాన్ని త్యజించి తపస్సు చేయడానికి అరణ్యానికి వెళ్ళాడు. ఈ పల్నాటి వీరుల చరిత్ర ఆంధ్రుల మనస్సులలో శాశ్వతంగా నిలిచిపోతుంది. ■





# ఆదర్శ భాగ్యనగరానికి నాంది హుడా
# నవసహస్రాబ్దిలో వైభవోజ్వల నగరానికి
# పునాది హుడా

భవిష్యత్ రాష్ట్రంగా ప్రపంచమంతా ఆంధ్రప్రదేశ్ వైపు చూస్తుండగా-అభివృద్ధి అంటే నాణ్యమైన జీవన ప్రమాణాలనీ, పరిశుభ్ర పరిసరాలనీ, పచ్చని పర్యావరణం అనీ అక్కడ అభివృద్ధికి సరికొత్త భాష్యం చెబుతుండగా -

హైదరాబాద్ నగరాభివృద్ధి సంస్థ (హుడా) మాత్రం భాగ్యనగరాన్ని ఆదర్శ రాష్ట్ర రాజధానిగా మార్చడానికి శ్రమిస్తోంది. ఆరోగ్యవంతమైన, సౌభాగ్యవంత మైన భవిత కోసం ప్రకృతి, చరిత్ర, జీవితం ముప్పేటగా ఓ అవినాభావ సంబంధాన్ని కొనసాగిస్తుంటాయి. పురోగమిస్తుంటాయి. హుడా ఏ ప్రాజెక్టు చేపట్టినా చిత్తశుద్ధితో పూర్తిచేస్తుంది.

అది విలక్షణమైన శిలాకృతులు, సహజ సరస్సులు లేదా నాటి చరిత్రకు సాక్ష్యంగా నిలిచే భవనాలు, అపూర్వ కట్టడాల పరిరక్షణేగాని, ఈ ముత్యాల నగరానికి పచ్చని మాలవేసే లక్షలాది మొక్కల పెంపకమే కాని, రోడ్లు, ఫ్లైఓవర్లు, ట్రక్ టెర్మినల్స్, వాణిజ్య భవన సముదాయాలే కాని, నగర నడిబొడ్డున నందనవనం లేదా వ్యాహ్యాళి కేంద్రమే కాని హుడా ఏది చేపట్టినా భాగ్యనగరాన్ని ఓ సౌభాగ్యనగరంగా తీర్చిదిద్దడానికే, ఓ ఆదర్శ రాజధానిగా రూపొందించడానికే అవిరామంగా శ్రమిస్తోంది.



2000





**హైదరాబాద్ నగర అభివృద్ధి సంస్థ**

1-8-323, పైగా ప్యాలెస్, బేగంపేట్,
సికిందరాబాద్ - 500 003. ఆం.ప్ర.
ఫోన్ : 040-7840125/126/127,
ఫ్యాక్స్ : +91-40-7843185
E-mail: hudahyd@hd1.vsnl net.in,
Net: www.hudahyd.com



వెయ్యేళ్ల అంధకారాన్ని చీల్చుకుంటూ ఐరోపా ఖండంపై ప్రసరించిన వెలుగు కిరణాల విజ్ఞాన విన్యాసమే సాంస్కృతిక పునరుజ్జీవనం. ఈ ఉద్యమమే ఐరోపా నాగరికతకు పునర్జన్మను ప్రసాదించింది. మతఛాందసత్వం, ఆటవిక న్యాయం రాజ్యమేలుతున్న యూరప్ ఖండానికి క్రూసేడుల ఫలితంగా అరబ్బుల విజ్ఞానంతో పరిచయం ఏర్పడింది. అచ్చు యంత్రం సాయంతో పరిచయమైన ప్రాచీన గ్రీకు వారసత్వం అబ్బురపరిచింది. ఇక మానవ మేధస్సు ఇంద్రధనుసు రంగులతో మిలమిలమెరిసింది. సాంస్కృతిక పునరుజ్జీవన క్రమంపై **గోవర్ధనం కిరణ్‌కుమార్** కథనం...

# ఇంద్రధనుసైన మానవ మేధస్సు

ఐరోపాలో 15, 16 శతాబ్దాలలో ఉద్భవించిన సాంస్కృతిక పరిణామమే సాంస్కృతిక పునరుజ్జీవనం (Renaissance). రినైసాన్స్ అంటే రీబర్త్. తిరిగి ఉద్భవించినది అని అర్థం. ప్రాచీన గ్రీకు, రోమన్ సామ్రాజ్యాల కాలంలో ఐరోపాలో వెలుగొందిన నాగరికత మధ్యయుగంలో క్రైస్తవ ప్రభావంతో మరుగునపడింది. తిరిగి ఉద్భవించిన ఈ నాగరికత కారణంగానే నూతన ఆలోచనలు, నూతన ప్రపంచం, పరిశోధనల ఆవిష్కరణ జరిగింది. ప్రస్తుతం ఉన్న ఆధునిక నాగరికతకు బీజం అప్పుడుపడిందే. అప్పుడు మధ్యయుగంలో మత గురువుల కారణంగా అలుముకున్న మూఢవిశ్వాసాలలో మునిగిన ఐరోపా నెమ్మదిగా అందునుంచి బయటపడి ఆత్మవిశ్వాసంతో నూతనత్వంవైపు అడుగులేసింది. మొదట ఇటలీలో ప్రారంభమైన సాంస్కృతిక పునరుజ్జీవనం తదుపరి యూరప్‌లోని అన్నిదేశాలకు పాకింది. ఇది ఏ ఒక్క రంగానికో పరిమితంకాకుండా అన్నిరంగాలలో జరిగింది. ఈ పునరుజ్జీవన ఉద్యమం ప్రారంభం కావడానికి కూడా పలుకారణాలు దోహదం చేశాయి. క్రూసేడు యుద్ధాల కారణంగా మహ్మదీయ రాజ్యాలతో సంబంధం ఏర్పడడం, ఆ సమయంలోనే పోప్ దివ్యత్వంపై ప్రజలలో అనుమాలు తలెత్తడమే కాక, రాజన్-బాకర్‌వంటి పండితుల రచనలు, రోమ్, నేపిల్స్, ఆక్స్‌ఫర్డ్, పారిస్‌లలో విశ్వవిద్యాలయాల స్థాపనకూడా దీనికి దోహదం చేసింది. 1453లో కాన్‌స్టాంట్ నోపుల్‌ను ముస్లింలు ఆక్రమించినందున అనేకమంది క్రైస్తవ పండితులు ఐరోపాకు తరలివెళ్లారు. వీరు తమవెంట తెచ్చిన అమూల్య గ్రంథాలను ప్రజలకు బోధించడంవలన వారిలో పఠనాసక్తి పెరిగింది. సాహిత్యంలో చోటుచేసుకున్న నూతన భావనలు 1450లో గుటెన్‌బర్గ్ అచ్చుయంత్రాన్ని కనుగొనడంతో పుస్తకాల ద్వారా ప్రజలకు విరివిగా అందుబాటులోకి వచ్చాయి. ప్రాచీన గ్రీకు గ్రంథాలను చదివిని మిగిలిన సామాన్య ఐరోపా ప్రజలు వారి ప్రకృతి, భౌతిక, లౌకిక జ్ఞానసంపదలకు ఆశ్చర్యపోయారు. గ్రీకులు గొప్ప తార్కికులు, ప్రశ్నించకుండా వారు దేనిని అంగీకరించరు. ప్రజల సుఖ సంతోష మార్గాల కోసం గ్రీకు తత్వవేత్తలు ఎల్లప్పుడూ అన్వేషించేవారు. వారి స్వతంత్ర భావాలకు తాము జీవించే మతపర జీవితానికి ఎంతో భేదం ఉందని గ్రహించారు. తమ పూర్వీకుల జీవితాల గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస మిగిలిన ఐరోపావారికి కూడా కలిగింది. ఈ కోరికే వారి సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడింది.



మైఖేలాంజిలో శిల్పకళా చాతుర్యం

మైఖేలాంజిలో

మొట్టమొదట రినైసాన్స్ సాహిత్య రంగంలో ప్రారంభమైంది. ప్రజలలో పఠనాసక్తి పెరగడంతో నూతన సాహిత్యం అభివృద్ధిచెందింది. దీంతో ప్రజలలో రెండురకాలైన భావాలు వ్యాప్తిచేందాయి. ప్రాచీన గ్రంథాలపై ప్రజలకు ఏర్పడిన భక్తిభావమనే క్లాసిజం కాగా మధ్యయుగంలో మానవుడు పోగొట్టుకున్న స్వేచ్ఛను గుర్తించి మానవుని క్షేమమే అన్ని సంస్థల లక్ష్యమని ప్రతిపాదిస్తున్న హ్యూమనిజం (మానవతావాదం) రెండవది. 15వ శతాబ్దం వరకు గ్రీకు, లాటిన్ భాషలను చదివినవారినే పండితులని పిలిచారు. కానీ సాంస్కృతిక పునరుజ్జీవనం ప్రారంభం కావడంతో జాతీయభాషలకు ప్రాముఖ్యం

పెరిగింది. మాకియావెల్లి ఇటలీ భాషలోరాసిన ప్రిన్స్, పోర్చుకీసు బాషలో కామోయిన్స్‌రాసిన వాస్కోడిగామా యాత్రావిశేషాల పుస్తకం లూసియాడ్, సర్వాంటస్ స్పెయిన్‌బాషలో రాసిన డాన్ క్విగ్జోట్ మొదలైన గ్రంథాలలో వెలువడిన విషయాలు సామాన్యజనం సహితం సులభంగా అర్ధం చేసుకుని కొత్త కొత్త విషయాలను తెలుసుకున్నారు.

సాంస్కృతిక పునరుజ్జీవనం వలన చిత్ర, శిల్పకళలలో నూతన పంథాలు ప్రారంభమయ్యాయి. ఈ మార్పును రోమ్‌లోని సెయింట్ పీటర్స్ చర్చివంటి కట్టడాలలో చూడవచ్చు. మైకలాంజిలో రాఫెల్, డినాటిల్లో, లూకాడెల్లా మొదలైన ప్రఖ్యాతశిల్పులు ఈ మార్పుల కోసం విశేషంగా కృషిచేశారు. అయితే ఈ కాలంలో వాస్తు శిల్పాలకంటే చిత్రకళకు ప్రాధాన్యం పెరిగింది. ఫ్లోరెన్స్ ప్రాంతంలో గియాట్ ప్రప్రధమ చిత్రకళా పాఠశాలను స్థాపించాడు. లియోనార్డ్ డావెన్సీ, మైకెలాంజిల్, రాఫెల్, టి.షన్‌లు ప్రముఖ చిత్రకారులు. లియోనార్డో గీసిన ది లాస్ట్ సప్పర్, మోనాలిసా, ది వర్జిన్ ఆఫ్ ది రాక్స్ అతనికి చాలా పేరు తెచ్చాయి. లియోనార్డో మిలాన్ నగరం చుట్టూ నిర్మించిన కోటగోడ నిర్మాణానికి ఇంజనీరుగా పనిచేశాడు కూడా. మైకెలాంజిల్ శృంగార చిత్రాలలో, రాఫెల్ ప్రేమ సంబంధిత చిత్రాలు చిత్రించాడు. వీరి కుంచె నుంచి జాలువారిన చిత్రాలలో 'ది లాస్ట్ జడ్జిమెంట్', 'ఉమెన్ ఎట్ హర్‌టాయిలెట్' మొదలైనవి ప్రముఖమైనవి. ఆదునిక పద్దతులకు అనుగుణంగా నాటి సంగీతం కూడా అభివృద్ధిచెందింది. గాబ్రియల్, హెలిస్ట్రింజ్, గియోటనీలు ఆనాటి ప్రముఖ హార్మోని విద్యాంసులు.

పునరుజ్జీవనం అనేది కేవలం కళారంగానికే పరిమితంకాకుండా పరిశోధనలు, విజ్ఞానం, వైజ్ఞానిక రంగాలలోకూడా కొనసాగింది. మతవిద్యలపట్ల కలిగిన నిరసన నూతన పరిశోధనలకు సహాయపడింది. అరబ్బుల పరిచయం దీనికి మరింత దోహదం చేసింది. భూమి సూర్యుని చుట్టు తిరుగుతుందని కోపర్నికస్ ప్రతిపాదించగా గెలీలియో దూరదర్శిని సహాయంతో ఇది యదార్ధమని రుజువుచేశాడు. భౌతిక, రసాయనిక, గణితశాస్త్రాలలో గొప్ప మార్పులు సంభవించాయి. అనేక నూతన విషయాలను కనుగొన్నారు. సాంస్కృతిక పునరుజ్జీవనం ఐరోపాపై చాలాప్రభావాన్ని చూపింది. మతసంస్కరణలకు దోహదంచేసి మధ్యయుగ వ్యవస్థలను చిన్నాభిన్నంచేసి నూతన పంథాలను, మార్పులను తీసుకువచ్చింది. సాంస్కృతిక విప్లవంవల్ల ప్రజలలో తార్కిక దృష్టిపెరిగింది, సాహిత్యం, భాషల అబివృద్ధి, మానవతావాదం, విద్యావిధానం, కళలలో మార్పు, జాతీయవాదం, భావనా స్వేచ్ఛ, శాస్త్రీయ పరిశోధనలు, మతసంస్కరణోద్యమాల వంటి ఫలితాలు జరిగి ఆధునిక మానవుడి జీవనస్థాయిని పెంచింది. ఇక్కడ గుర్తుంచుకోవాల్సిన విషయమేమంటే రినైజాన్స్ అనేది కాథలిక్ మతానికిగానీ, చర్చికిగానీ వ్యతిరేకం కాదు. పునరుజ్జీవనం కారణంగానే మత సంస్కరణలు బయల్దేరినప్పటికీ వాటి లక్ష్యాలు వేరు. రినైజాన్స్ సాహిత్య, కళా, విజ్ఞాన రంగాలను సంస్కరించగా, సంస్కరణోద్యమం మతాన్ని సంస్కరించడానికి జరిగింది. సాంస్కృతిక పునరుజ్జీవనం ఇటలీలో ప్రారంభం కాగా, మత సంస్కరణోద్యమం జర్మనీలో ప్రారంభమైంది. అందుకే దానిని ట్యుటానిక్ రినైజాన్స్ అని కూడా పేర్కొంటారు. ■

దావిన్సి కుంచె విన్యాసం-మోనాలిసా



కాకతీయ వైభవం అస్తమించిన అనంతరం తెలుగునేల ముక్కచెక్కలైంది. ఈ సంధియుగంలో తీరాంధ్ర ప్రాంతం మొత్తంపై రెడ్డిరాజులు ఆధిపత్యం వహించగలిగారు. నూటా ఐదేళ్లపాటు రెడ్డిరాజ్యం వర్ధిల్లింది. సంగీత సాహిత్యాలకు ఇది వసంతకాలం. ఆంధ్ర మహాభారత రచనను నిశ్శేషంగావించిన ఎర్రాప్రగడ వీరి ఆస్థానకవే. కవిసార్వభౌముడు శ్రీనాథుడు వీరి విద్యాధికారే. ఈ కాలంలోనే గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణాన్ని రచించారు. కుమారగిరిరెడ్డి నాట్యశాస్త్ర గ్రంథాన్ని రాశారు. సుప్రసిద్ధ నర్తకి లకుమాదేవి ఆయన ఆస్థాన నర్తకే. అయితే, జనంమీద పన్నుల భారం అధికం కావడంతో రాజులు ప్రజారంజకులు కాలేకపోయారు. భిన్నూరి దీప్తి కథనం...

# సాహిత్య వసంతం-రెడ్డి రాజ్యం

కాకతీయ సామ్రాజ్యము అంతరించిన తర్వాత దీనిని ఆశ్రయించి వున్న సామంత రాజులు, సేనానులు స్వతంత్ర రాజ్యాలను స్థాపించారు. ఇందులో రెడ్డి, వెలమ రాజ్యాలు ముఖ్యమైనవి. రెడ్డి రాజులు అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరం, కందుకూరు ప్రాంతాలలో క్రీ.శ.1324 నుంచి 1434 వరకు రాజ్యపాలన చేశారు.

కాకతీయ రాజ్యం అస్తమించిన తర్వాత ఓరుగల్లు ముస్లిం పాలనలోకి వచ్చింది. నగరాన్ని సుల్తాన్ పూర్‌గా మార్చారు. ముసల్మానులు రాజమహేంద్రవరాన్ని కూడా వశం చేసుకున్నారు. ముసల్మానుల పాలనలో ఆంధ్రదేశం తల్లడిల్లింది. దేవాలయాలను వారు ధ్వంసం చేశారు. అగ్రహారాలను స్వాధీనం చేసుకున్నారు. రైతులపై పన్నుల భారాన్ని మోపారు. పన్నుల వసూళ్లలో కూడా దుర్మార్గాలు చోటు చేసుకున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో ఆంధ్రదేశంలో ముస్లిం పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు ఉద్యమాలు చెలరేగాయి. ఈ తిరుగుబాట్ల కారణంగానే ఆంధ్రదేశంలో స్వతంత్ర రాజ్యాలు ఏర్పడ్డాయి. తురుష్కుల దుష్టపాలనను వ్యతిరేకించిన వారిలో ముఖ్యుడు ప్రతాపరుద్రుని సేనాని రేచర్ల సింగమనాయకుడు. దక్షిణ తెలంగాణలో ఇతను పద్మనాయక రాజ్యాన్ని స్థాపించాడు. ముసునూరి కుటుంబానికి చెందిన ప్రోలయ నాయకుడు ఉత్తర తెలంగాణలో స్వతంత్ర రాజ్యం ఏర్పాటు చేశాడు. రేకపల్లి రాజధానిగా పరిపాలన చేశారు. ప్రోలయనాయకుని విజయం తర్వాత మిగతా ప్రాంతాల్లో కూడా స్వాతంత్రాపేక్ష హెచ్చింది. ప్రోలయనాయకుని మరణం తర్వాత కాపయనాయకుడు రాజయ్యాడు. ఇదే తరుణంలో ఓరుగల్లు, ద్వార సముద్రం. కంపిలి మొదలైన ప్రాంతాల్లో తిరుగుబాట్లు వచ్చాయి. తిరుగుబాట్లను అణచివేయడానికి సుల్తాన్ ఓరుగల్లు వరకు వచ్చాడు. అయితే, ఇతని సైన్యం ప్లేగు వ్యాధికి గురికావడం వల్ల గత్యంతరం లేని పరిస్థితుల్లో వెనుదిరిగి వెళ్లాడు. పరిస్థితులన్నీ గమనించిన కాపయనాయకుడు ఓరుగల్లుపై దండెత్తి విజయం సాధించాడు. ఆనెగొందిలో హరిహరుడు స్వతంత్రరాజయ్యాడు. తీరాంధ్రలో ప్రోలయ వేమారెడ్డి రాజ్యవిస్తరణ గావించాడు. తురుష్కుల భయం తొలగిపోగానే తెలుగురాజుల మధ్య విభేదాలు పెరిగాయి. కాపయనాయకుడి కుమారుడు వినాయక దేవుడు అరబ్బుల గుర్రాలను అటకాయించడంలో కన్నుమూశాడు. కొడుకు మరణంతో కాపయ మానసికంగా కుంగిపోయాడు. బహమనీ సుల్తాన్‌ను ఒంటరిగా ఓడించడం కష్టమని భావించి ఢిల్లీ సుల్తాన్ ఫిరోజ్‌షా సహాయం కోరాడు. ఇది తెలుసుకున్న బహమనీ సుల్తాన్ మహ్మద్‌షా పెద్ద సైన్యంతో దాడి చేసి కాపయను ఓడించాడు. గత్యంతరం లేక గోల్కొండ కోటతో సహా పెద్ద మొత్తంలో ధనాన్ని, సైనిక బలాన్ని సమర్పించి సంధి చేసుకున్నాడు. తదనంతరం కాపయ రాజ్యంలో తిరుగుబాటు చెలరేగింది. తెలంగాణాలో రేచర్ల సింగన తన రాజ్యాన్ని విస్తరించాడు. సింగన మరణంతో అనవోలు నాయుడు రాజ్యానికి వచ్చి రాజధానిని అమనగల్లు నుంచి రాజకొండకు మార్చాడు. తర్వాత కాపయపై దండెత్తి ఓడించి సంహరించాడు. దీంతో ముసునూరు వంశం అంతరించింది. ఇలాంటి తరుణంలో సింహాచలం నుంచి విక్రమసింహపురి మధ్య గల తీరాంధ్ర ప్రాంతాన్ని రెడ్డి రాజులు వందేళ్లకు పైగా పరిపాలించారు. వీరు ఒడ్డెలను, వెలమలను, కన్నడులను, రాచలలను ఎదిరించి యుద్ధాలు చేశారు. రెడ్డి రాజవంశానికి కోమటి ప్రోలారెడ్డి మూలపురుషుడు. వీరి వంశంలో కోమటి, వేమ అనే పేర్లు కన్పిస్తాయి. ప్రోలారెడ్డి కుమారుడు ప్రోలయ వేమారెడ్డి రాజ్యాన్ని స్థాపించాడు. ప్రోలయ వేముడు వైదిక మతాభిమాని. ఓరుగల్లును ఆక్రమించిన తురుష్కులతో వీరోచితంగా పోరాడి వారిని దక్షిణ దేశం నుంచి తరిమి కొట్టాడు. క్రీ.శ.1325 నుంచి స్వతంత్ర పాలన చేసిన ప్రోలయ వేమారెడ్డి పద్మనాయకులతో ఘర్షణకు దిగాడు. రాజ్య పటిష్టత కోసం కొండవీడు, బెల్లంకొండ, ధరణికోట, వినుకొండ, కొండపల్లి దుర్గాలను నిర్మించాడు. కొండవీడును దుర్భేద్యంగా నిర్మించాడు. ఇతనికి 'నిస్సీమ భూదాన పరశురామ' బిరుదు కూడా లభించింది. ఇతని కొలువులోనే కవిత్రయంలోని ఎర్రాప్రెగడ వున్నాడు.



శ్రీనాథ కవిరాజుపై బాపూ 'స్కెచ్'

వేమారెడ్డి మరణానంతరం ఇతని పెద్ద కొడుకు అనవోతారెడ్డి 1353 - 1364 వరకు రాజ్యపాలన చేశాడు. తండ్రి కాలంలోనే అనేక యుద్ధాలలో పాల్గొని 'వీరన్న వోతుగా' ప్రసిద్ధి పొందాడు. ఇతను రాజ్యవిస్తరణగావిస్తాడేమో అన్న భయంతో కృష్ణ, గోదావరి మండలంలోని క్షత్రియులు ఒక్కటై సూర వరం దగ్గర ఇతన్ని ఓడించారు. ఇది జరిగిన కొద్ది కాలానికే అనవోతారెడ్డి వెలమలతో పోరాడవలసి వచ్చింది. ధాన్యకటకం వద్ద జరిగిన భీకరపోరులో అనవోతారెడ్డి ప్రథమంగా విజయం సాధించినా, చివ రకు ఓటమి చెందాడు. ఇదే సమయంలో బహమనీ సుల్తాన్ ధాన్యకటకంలోని అమరేశ్వర దేవాలయాన్ని కొల్లకొట్టాడు. ఈ దాడిని అనవోతారెడ్డి తిప్పికొట్టి అమ రేశ్వరున్ని పునఃప్రతిష్ఠించాడు. పరిస్థితులన్ని గమ నించిన విజయనగర రాజు బుక్కరాయలు రెడ్డి రాజ్యంపై దండెత్తాడు. విజయనగర రాజుల పురోగ మన కాలంలోనే అనవోతారెడ్డి మరణించాడు. అనవో తారెడ్డి కన్నుమూసేనాటికి ఇతని కుమారుడు కుమార గిరి పసివాడు. అందుకే సోదరుడు అనవేమారెడ్డి రాజ్యాధికారం చేపట్టాడు. ఇతని కాలమంతా యుద్ధా లతో , దండయాత్రలతో నిండిపోయింది. మొట్టమొ దట వేముడు వేంగిపై దృష్టి సారించాడు. వేంగి రాజు భక్తి రాజు మరణించగా కుమారుల మధ్య వారసత్వ యుద్ధం ప్రారంభమైంది. అన్నదేవ చోడుడు తన అన్న చోడభీముని ఓడించి తరిమి వేశాడు. దీన్ని అవ కాశంగా తీసుకొని అనవేముడు కళింగ దండయాత్ర చేసి దీవి దుర్గాన్ని వశం చేసుకున్నాడు. కళింగ దండ యాత్ర తర్వాత అనవేముడు రాజకొండ, విజయ నగర రాజ్యాలపై దండయాత్రలు చేశాడు. కొండవీ డును సొంతం చేసుకున్నాడు. రెడ్డి రాజ్య ప్రతిష్టను పునరుద్ధరించాడు. ఇతను చురికా సహాయ, ప్రజాప రిచిత చతుర్విధోపాయ వంటి బిరుదులు పొందాడు. సింహాచలంలో అనవేమాపురి, శ్రీశైలంలో వీరశిలా మండపాలను నిర్మించాడు. ప్రతి ఏడాది కవులనూ, కళాకారులనూ రప్పించి వసంతోత్సవాలను ఘనంగా నిర్వహించేవాడు. అందుకే వసంతరాయలనే కీర్తిని గడించాడు. అనవేముని తర్వాత కుమారగిరి రెడ్డి 1386 నుంచి 1402 వరకు రాజ్య పాలన చేశాడు. విజయనగర రాజు రెండో హరిహరుడిని ఓడించాడు. కుమారగిరి సాహిత్య, కళాపోషణకు కూడా ఎక్కువ సమయాన్నే కేటాయించాడు. ఇతని కొలువులో 'లకుమ' అనే ప్రసిద్ధ నర్తకి వుండేది. ఇతను కూడా వసంతోత్సవాలను ఘనంగా జరిపి కర్పూర వసం తరాయలనే బిరుదు పొందాడు. ఇలాంటి ప్రశాంత వాతావరణంలో కుమారరెడ్డికి ఊహించని విపత్తు ఎదురైంది. ఏకైక పుత్రుడు అకాల మరణానికి గురి కావడంతో కుమారగిరి కుంగిపోయాడు. కాటయ వేముడిని రాజమహేంద్రవరం ప్రతినిధిగా నియమిం చడం పెద కోమటి వేముడికి నచ్చలేదు. 1402లో పెద కోమటి వేముడు కుమారగిరిని తొలగించి రాజ్యా ధికారం స్వీకరించాడు. దాంతో కుమారగిరి రాజ మహేంద్రవరం చేరి కాటయ వేముని ఆశ్రయించాడు. కొండవీటి ఆక్రమణ కోసం వీరు చేసిన ప్రయత్నాలన్నీ విఫలం చెందాయి. పెద కోమటి వేమారెడ్డి 1402 నుంచి 1420 వరకు రాజ్యపాలన చేశాడు. హరి హరరాయలు మరణించడంతో కొడుకులు సింహాస నం కోసం పోటీ పడ్డారు. ఇదే అదనుగా భావించిన వేమారెడ్డి అంతకు ముందు కోల్పోయిన కొండవీటి భాగాలను తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. తర్వాత రాజమహేంద్రవరంపై దాడి చేశాడు. ఈ పోరాటం అన్న దేవుడికి మేలు చేసింది. వేంగిలో తాను కోల్పో యిన రాజ్యాన్ని అన్నదేవుడు తిరిగి సంపాదించుకు న్నాడు. 1421లో పెదకోమటి వేముడు, అన్నదేవ చోడులు రాజమహేంద్రవరంపై దండెత్తడంతో కాట యవేముడు మరణించాడు. ఇతని కుమారుడు పసి బాలుడైనందువల్ల అల్లాడరెడ్డి పేరుకు అతనిని రాజు చేసి, తాను అధికారం స్వీకరించి అన్నదేవచోడుని వధించాడు. అల్లాడరెడ్డికి విజయనగర రాజుల అండ దండలు లభించడంతో పెద కోమటి వేముడు బహ మనీ సుల్తానుల స్నేహాన్ని కోరాడు. బహమనీ సుల్తాను రాజమహేంద్రవరాన్ని ముట్టడించారు. అక్కడ జరిగిన యుద్ధంలో అల్లారెడ్డి విజయం సాధిం చాడు. ఇదే సమయంలో కొండవీటిపై దేవరాయలు దాడి చేశాడు. మోటుపల్లితో సహా రెడ్డి రాజ్యంలోని దక్షిణ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నాడు. మరోవైపు రెడ్డి, పద్మనాయక రాజ్యాల మధ్య వైరం తీవ్ర రూపం దాల్చింది. దేవరకొండ రాజు కుమార వేదగిరి కోమటి వేముని సోదరుడ్ని చంపగా, కోమటి వేముడు దేవర కొండపై దాడి చేసి కుమారగిరిని చంపాడు. దాంతో ఆగ్రహం చెందిన వేదగిరి సోదరుడు కొండవీడుపై దాడిచేశాడు. ఈయుద్ధంలో పెదకోమటి వేముడు మర ణించాడు. పెదకోమటి వేముడు గొప్ప పండితుడు. కవి పోషకుడు. ఇతని ఆస్థానంలో వేమన భట్టబా ణుడు వుండేవాడు. సర్వజ్ఞ చక్రవర్తిగా ఘనత చెం దాడు. శ్రీనాథ కవిసార్వభౌముడు ఇతని ఆస్థానంలో విద్యాధికారిగా వున్నాడు. పెదకోమటి వేమారెడ్డి తర్వాత ఇతని కుమారుడు రాచ వేమారెడ్డి రాజ్యానికి వచ్చాడు. అయితే ఇతను సమర్థుడు కాడు. పురుటి పన్ను విధించి ప్రజాదరణ కోల్పోయాడు. ఇతన్ని బలి జనాయకుడు సవరం ఎల్లయ్య వధించాడు. దీంతో కొండవీటి రెడ్డి రాజ్యం అంతరించింది.

వీరి కాలంలో బ్రాహ్మణులను సామజిక వ్యవస్థలో ఉన్నతులుగా పరిగణించడం జరిగింది. క్షత్రియులు కూడా వేదధర్మాన్ని పాటిస్తూ బ్రాహ్మణులతో సఖ్యంగా వుండేవారు. వైశ్యులు వర్తక వ్యాపారాలను నిర్వహిం చేవారు. కొన్ని దేవాలయాల్లో పంచములకు కూడా ప్రవేశాన్ని కల్పించారు. రెడ్డి రాజుల కాలంలో దేశ మును సీమలుగా, నాడులుగా విభజించారు. పరిపా లన సౌకర్యం కోసం తమ రాజ్యమును కొండవీడు, వినుకొండ, బెల్లము కొండ, అద్దంకి, ఉదయగిరి, కోట, నెల్లూరు, మారెళ్ళ, కందుకూరు, పొదిలి, అమ్మ నబ్రోలు, చుండి, దూపాడు, నాగార్జునకొండ భాగా లుగా చేశారు. గ్రామపాలనను రెడ్డి, కరణం, తలారి మొదలైన వారు నిర్వహించేవారు. వీరిని 'వన్నిద్దరా యగాండ్రు' అని పిలిచేవారు. కరణం గ్రామ సం బంధ లావాదేవీలు, లెక్కలు చూసేవాడు. రాజప్రతిని ధిగా వ్యవహరించేవాడు. ధర్మాసనాలు న్యాయ విచారణ జరిపేవి. శిక్షలు కఠినంగా వుండేవి. రెడ్డి రాజుల పాలనలో పన్నుల భారం అధికంగా వుండేది. భూమి శిస్తు ముఖ్య ఆదాయం. మెట్ట, మాగాణి, తోట లకు పన్నుల్లో భేదముండేది. పన్నులు చెల్లించకపోతే కఠినశిక్ష వేసేవారు. పన్నులలో అధికభాగం సైన్య పోషణకే ఖర్చు అయ్యేది.

రెడ్డి రాజుల కాలంలో సముద్ర వ్యాపారం జోరుగా సాగేది. బర్మా, మలయా, ఇండోనేషియా, చీనా, సింహళ ద్వీపాలతో విశేషంగా వ్యాపారం చేశారు. అంతే కాకుండా పర్షియా, అరేబియా దేశాల నుంచి కూడా వివిధ రకాల సరకులు వచ్చేవి. పెద్ద పెద్ద గ్రామాల్లో వారానికోసారి సంత జరిగేది. కొన్ని సంతలలో ప్రత్యేక వస్తువులను మాత్రమే అమ్మే వారు. నూలు బట్టలే కాకుండా పట్టు బట్టలను కూడా నేసేవారు. వసంతోత్సవం కోసం జావా, సుమిత్రాది తూర్పు ద్వీపాల నుంచి సుగంధ ద్రవ్యాలను తెప్పించే వాడు. కమ్మరి వారే ఆయుధాలు చేసేవారు. ఆయుధా లతో కత్తి, ఛురిక, బల్లెము, ఈటి, బాణము మొదలై నవి వున్నాయి. పంచలోహములతో జయస్తంభము లను చేసేవారు. రెడ్డి రాజులు కళలకు పెద్ద పీటనే వేశారు. భూలోక ధన్వంతరిగా పేరు పొందిన భాస్క రార్యునికి పెదకోమటి వేముడు అగ్రహారములను దానమిచ్చాడని తెలుస్తుంది. సంస్కృతాంధ్ర పండి తులు అనేక మంది వుండేవారు. రాజులలో అత్యా ధికులు పండితులే. పురాణ, ఇతిహాసాలతో పాటు అలంకార శాస్త్రాలను కూడా అధ్యయనం చేశారు. మన దురదృష్టం కొద్దీ శ్రీనాదుని బహుకృతులు, శం భుదాసుని రామాయణం, కుమారగిరి వసంతరాజీ యంలాంటివి జాడలేకుండా పోయాయి. బాలసర స్వతి అనే కవి అనపోతరెడ్డి ఆస్థాన కవి అని, త్రిలోచ నాచార్యుడు అనవేముని ఆస్థాన కవి అని మాత్రమే మనకు తెలిసింది. పెదకోమటి సాహిత్య చింతామ ణిని రాశాడు. కుమారగిరి వసంతరాజీయం అనే నాట్య శాస్త్రాన్ని, కాటయ వేమారెడ్డి కాళిదాసు నాటకా నికి కుమారగిరి రాజీయం అనే వ్యాఖ్యానాన్ని రచిం చాడు. రెడ్డి కవులలో ఆదరణ పొందిన కవుల్లో ఎర్రా ప్రగడ ముఖ్యుడు. ఆంధ్రమహాభారతంలోని అరణ్య పర్వాన్ని పూర్తి చేయడమే కాకుండా, నృసింహపురా ణం, హరివంశం లాంటి గ్రంధాలను రచించాడు. ప్రోలయ వేమారెడ్డి కొలువులో వున్న శ్రీగిరి కవి 'నవ నాథ చరిత్ర'ను పద్యకావ్యంగా రచించాడు. నాటి కవు లందరిలో శ్రీనాథుడు అగ్రగణ్యుడు. భాషలో, శైలిలో ఇతను నూతన సంప్రదాయాలను నెలకొల్పాడు. శ్రీనా థుడు విజయనగరానికి వెళ్లి డిండిమ భట్టును ఓడిం చి కనకాభిషేకం చేయించుకొని కవిసార్వభౌమ బిరుదు పొందాడు. రెడ్డి, వెలమ రాజ్యాల మధ్య స్నేహం కుదర్చడానికి రాజుకొండ వెళ్లి సత్కారాలు పొందాడు. హరవిలాసం రచించి కాంచీపురంలో తిప్పయకు అంకితమిచ్చాడు. ఇదే కాలంలో ద్విపదల రచన కూడా జరిగింది. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం, నవనాథ చరిత్రలు ద్విపదలో రాశారు. గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం అతి ప్రసిద్ధమైంది. ■





రెండు శతాబ్దాల మొఘల్ పరిపాలనా కాలాన్ని స్వర్ణయుగంగా కొనియాడుతారు. శతాబ్దాలుగా కొనసాగుతున్న రాజకీయ అస్థిరతకు తెరలుదించి దేశమంతటా విస్తరించిన సువిశాల సామ్రాజ్యాన్ని అక్బర్ పాదుషా ఆవిష్కరించడంతో ఆర్థిక పరిస్థితి మెరుగైంది. అక్బర్ చక్రవర్తి వ్యవసాయరంగంపై ప్రత్యేక శ్రద్ధవహించి రెవిన్యూ విధానాన్ని సంస్కరించాడు. చేతివృత్తులు-వస్త్ర పరిశ్రమ అభివృద్ధి చెందాయి. వర్తక వ్యాపారాలు లాభసాటిగా సాగాయి. అక్బర్ నాటిన విత్తనాల ఫలితంగా షాజహాన్ కాలంనాటికి భారత ఖండం సిరులు పొంగిన జీవగడ్డగా మారింది. అప్పటి భారతీయ ఆర్థిక ఔన్నత్యానికి నిదర్శనంగా వెలిసిన తాజ్‌మహల్ సౌందర్యం నిఖిలజగతిని నివ్వెరపరిచింది. షాజహాన్ చక్రవర్తి సువర్ణ మయూర సింహాసనాన్ని అనంతర కాలంలో పర్షియా చక్రవర్తి ఎత్తుకెళ్లాడు. ఈ సుసంపన్న దేశంతో వర్తకం కోసం ఐరోపా వర్తకులు షాజహాన్ కొలువులో కాళ్లావేళ్లాపడ్డారు. మొఘల్ పరిపాలనపై వైద్యం ఆనందవర్ధన్ సంక్షిప్త పరిచయం...

# సిరులు పొంగిన జీవగడ్డ

క్రీ.శ 16వ శతాబ్దం నుంచి 19వ శతాబ్దం మధ్య కాలం వరకు మొఘల్ రాజులు భారతదేశాన్ని పరిపాలించారు. భారతదేశంలో మొఘల్ సామ్రాజ్య స్థాపకుడు బాబర్ (1526-1530). అతని తర్వాత హుమాయున్ (1531-1539), అక్బర్(1556-1605), జహంగీర్(1605-1627), షాజహాన్(1628-1657), ఔరంగజేబు(1658-1707)లు మొఘల్ చక్రవర్తుల్లో ప్రసిద్ధులు. మొఘల్ ప్రభువులు లలిత కళలు, సాహిత్యంపట్ల అత్యంత శ్రద్ధాసక్తులు కలిగి ఆయా రంగాల అభివృద్ధికి విశేష కృషి చేశారు. అంతేగాక స్వయంగా ప్రభువులు సైతం మంచి కవులు, రచయితలు కావడం విశేషం. ఒక్క ఔరంగజేబును మినహాయిస్తే మొఘలుల పాలనలో మతసామరస్యం వెల్లివిరిసింది. పరమత సహనం వీరి పాలనలో గమనించదగ్గది. 17వ శతాబ్దాన్ని మహోజ్వల యుగంగా చరిత్రకారులు పేర్కొంటారు. మొఘల్ దర్బారులో హిందూస్థానీ సంగీతానికి మంచి ఆదరణ ఉండేది. 'ఖయాల్' వంటి నూతన గాన ధోరణులు మొఘల్ దర్బార్‌లోనే ప్రాణం పోసుకున్నాయి. సుఖమయ జీవితానికి నమూనాగా మొఘల్ దర్బార్‌ను చరిత్రకారులు చిత్రీకరించారు.

16వ శతాబ్దం ఆరంభమయ్యేనాటికి ఢిల్లీ సుల్తానుల రాజ్యం క్షీణదశకు చేరుకుంది. ఢిల్లీ సుల్తానుల్లో చివరి సుల్తానులైన లోడీ వంశీయుల చేతిలో రాజ్యం ఉండేది. ఒకపక్క లోడీ సుల్తానులపట్ల జాగిర్దార్లు తీవ్ర అసంతృప్తితో ఉండగా మరోపక్క రాజపుత్రులకు కూడా లోడీ సుల్తాన్లపట్ల వ్యతిరేకత అధికమవుతూ వచ్చింది. ఈ నేపథ్యంలోనే జాగిర్దార్లు, రాజపుత్రులు కాబూల్‌ను ఆక్రమించుకున్న బాబర్‌ను కలిసి లోడీ సుల్తాన్లను ఓడించాలని మొరపెట్టుకున్నారు. క్రీ.శ. 1526లో మొదటి పానిపట్టు యుద్ధంలో బాబర్ లోడీ సుల్తానులను ☞





ఓడించడం ద్వారా భారతదేశంలో అడుగుపెట్టాడు. ఈ యుద్ధంలో బాబర్ అతి సునాయసంగా గెలుపొందాడు. మధ్య ఆసియా నుంచి తెచ్చుకున్న ఫిరంగులు బాబర్‌కు యుద్ధంలో ఎంతో ఉపయోగపడాయి. వీటి సహాయంతో బాబర్ కొన్ని గంటల్లోనే లోడీ సుల్తానులను మట్టి కరిపించాడు. బాబర్ స్వయంగా గొప్ప సేనాని, యుద్ధ వ్యూహ రచనలో ఆరితేరినవాడు. సైనిక బలాన్ని ఎలా ఉపయోగించుకోవాలో క్షుణ్ణంగా తెలిసిన వాడు కూడా. అంతేగాక మంచి కవి, రచయిత. తుర్కీ బాషలో ఎన్నో అద్భుత రచనలు చేశాడు. తన స్వీయచరిత్ర (తుజక్ ఇ బాబరీ)ని రాసుకున్నాడు. ప్రకృతి ఆరాధకుడైన బాబర్ మంచి బావకుడు. తాను గడిపిన ప్రతిచోట ఉద్యానవనాలు నాటించాడు.

పానిపటు యుద్ధానంతరం తనకవసరమైన సంపదను తీసుకుని కాబూల్ వెళ్ళిపోతాడనుకున్న



ఫతేపూర్ సిక్రి

బాబర్ బారతదేశంలోనే స్థిరపడిపోవడానికి నిర్ణయించుకున్నాడు. ఈ నిర్ణయం సర్దార్లు, రాజపుత్రులకు మింగుడుపడలేదు. దీంతో వారు బాబర్‌తో యుద్ధానికి దిగారు. వారిని కూడా ఓడించి బాబర్ బారతదేశంలో మొఘల్ సామ్రాజ్యానికి అంకురార్పణ చేశాడు. కాబూల్ కాందాహార్ నుంచి బీహార్ వరకు, హిమాలయాల నుంచి గ్వాలియర్ ఛందేరి వరకు విస్తరించిన విశాల మొఘల్ సామ్రాజ్యం, 1530లో బాబర్ మరణించడంతో బీటలు వారడం మొదలైంది.1531లో మొఘల్ సింహాసనాన్ని అధిష్టించిన హుమయూన్ తండ్రి సంపాదించిన సామ్రాజ్యాన్ని రక్షించలేక షేర్‌షా చేతిలో రెండుమార్లు ఘోర యుద్ధాలు చేసి రెండింటిలో ఓటమి చెంది పలాయనం చిత్తగించాడు. ఢిల్లీ సింహాసనం షేర్‌షా చేజిక్కింది. దీంతో మొఘల్ సామ్రాజ్యం భారతదేశంలో అంతరించిపోయింది. ప్రస్తుతం మన దేశంలో చలామణిలో ఉన్న రూపాయిని షేర్‌షానే ప్రవేశపెట్టాడు. రాజ్యాన్ని పోగొట్టుకున్న హుమయూన్ రాజస్థాన్, సింధ్ రాష్ట్రాల్లో తలదాచుకున్నాడు. ఆ సమయంలో అమర్‌కోటలో హుమయూన్‌కు మగ సంతానం కలిగింది. ఆ సంతానమే ఆ తర్వాత సువిశాల భారతదేశాన్ని ఏలిన అక్బర్ చక్రవర్తి. 1556లో అక్బర్ హయాంలో జరిగిన రెండవ పానిపట్టు యుద్ధంతో బారతదేశంలో మళ్ళీ మొఘల్ సామ్రాజ్య స్థాపన జరిగింది. మొత్తం మొఘల్ రాజుల్లోకెల్లా అక్బర్‌కు విశిష్ట స్థానం ఉంది. పరిపాలన సంస్కరణలు, పరమత సహనం, లలిత కళలు, సాహిత్యం, ప్రజారంజక పాలన అక్బర్ హయాంలో ప్రజలు చవిచూశారు. అక్బర్ మరణించే నాటికి మొఘల్ సామ్రాజ్యం కాబూల్ నుంచి బెంగాల్ వరకు, హిమాలయాల నుంచి గోదావరి వరకు విస్తరించింది. అక్బర్ తర్వాత అతని కుమారుడు జహంగీర్ పరిపాలన బాధ్యతలు చేపట్టాడు. ఇతని భార్య నూర్జహాన్, ఆమె అపురూప సౌందర్యవతేగాక అత్యంత తెలివైనది కూడా. రాజ్యపాలనలో జహంగీర్‌కు సలహాలు కూడా ఇస్తూ ఉండేది. జహంగీర్ అస్వస్థతకు గురైనప్పుడు నూర్జహాన్ స్వయంగా రాజకీయ వ్యవహారాలను చక్కబెట్టి సామ్రాజ్య పాలన సాగించింది. మొఘల్ రాజ్యంలో ఆమె ప్రభావం ఎంతగా పెరిగిందంటే నాణాలపై జహంగీర్‌తోపాటు ఆమె పేరు కూడా ముద్రించడం జరిగింది. జహంగీర్ బాగా చదువుకున్నవాడు. పారశీక బాషలో అద్భుతమైన శైలీతో ఆయన రచనలు చేశాడు. లతని స్వీయ చరిత్ర (తజుక్ – జహంగీర్) చదివిన వారికి జహంగీర్ శైలీ ఎలాంటిదో అవగతమవుతుంది. అక్బర్‌లాగే జహంగీర్ కూడా రాజపుత్రులతో సన్నిహిత సంబంధాలు పెంచుకున్నాడు.

ఇద్దరు రాజపుత్ర కన్యల్ని (జోధబాయి,మన్‌బాయి) వివాహం చేసుకున్నాడు. ఇతని హయాంలో ఆప్ఘనిస్తాన్‌లోని కాందహార్‌ను పర్షియన్లు స్వాధీనం చేసుకున్నారు. ఇది మొఘల్ సామ్రాజ్యానికి తీవ్ర నష్టాన్ని కల్గించింది. జహంగీర్ అనంతరం అతని కుమారుడైన షాజహాన్ అధికారంలోకి వచ్చాడు. షాజహాన్ భార్య ముంతాజ్ బేగంపట్ల అత్యంత ప్రేమ కల్గిన వాడు. ఆమె మరణానంతరం ముంతాజ్‌బేగం స్మృతి చిహ్నంగా నిర్మించిన అరుదైన కట్టడం తాజ్‌మహల్ ప్రపంచ వింతల్లో ఒకటిగా నిలిచిపోయింది. అలాగే షాజహాన్ వద్ద ఒక నెమలి సింహాసనం ఉండేది. అది మొత్తం బంగారంతో తయారైనది. మొఘల్ సామ్రాజ్యం పతనదశకు చేరుకున్న సమయంలో పర్షియా ప్రభువైన నాదర్‌షా ఆగ్రాపై దాడి చేసి ఆ బంగారు నెమలి సింహాసనాన్ని ఇరాన్‌కు తరలించుకుపోయాడు. షాజహాన్ హయాంలో దక్కన్, బుందేల్ ఖండ్ తిరుగుబాట్లతోపాటు మరాఠాలు కూడా మొఘల్ అధికారాన్ని ధిక్కరించడం మొదలుపెట్టారు. బుందేల్‌ఖండ్ తిరుగుబాటును సునాయాసంగా అణిచేసిన షాజహాన్‌కు దక్కన్ తిరుగుబాటు అత్యంత ప్రమాదకారిగా నిలిచింది. 1657లో షాజహాన్‌ను అతని కొడుకు ఔరంగజేబు బందించి తన సోదరులందరినీ ఓడించి సింహాసనాన్ని వశపర్చుకున్నాడు. ఔరంగజేబు పరిపాలన ఆద్యంతం తిరుగుబాట్లు, వాటిని అణిచివేయడంతోనే సరిపోయింది. సుమారు 50ఏళ్ల పాటు ఔరంగజేబు పాలన సాగించాడు. ఇతను మతవాదిగా చరిత్రలో నిలిచిపోయాడు. ఇతని పాలన ప్రత్యేకించి హిందువులకు ప్రాణసంకటంగా మారింది. వినూత్న పన్నులు విధించడం ఇతని ప్రత్యేకత,జిజియా పన్ను తదితర పన్నులు ఔరంగజేబు విధించినవే.ఔరంగజేబు హయాంలోనే మహారాష్ట్రులు తమ సామ్రాజ్యాన్ని చిన్నచిన్నగా విస్తరింప చేసి బలమైన శక్తిగా ఎదిగారు. మహారాష్ట్ర నాయకుల్లో బలవంతుడు శివాజీ. ఇతను ఆ తర్వాత ఛత్రపతి శివాజీగా ప్రకటించుకుని పట్టాభిషేకం చేసుకున్నాడు. రాజపుత్రులతో, సిక్కులతోలతోపాటు రైతాంగ తిరుగుబాట్లు, జాట్ల తిరుగుబాటు ఔరంగజేబును సతమతం చేశాయి. ఔరంగజేబు బతికున్నంత కాలం మహారాష్ట్రులను ఎదుర్కొన్నాడు. ఆయన మరణానంతరం మహారాష్ట్రులు విజృంభించారు. ఔరంగజేబు తర్వాత చాలామంది పరిపాలించినప్పటికీ వారికి చరిత్రలో ప్రత్యేకించి స్థానం దక్కలేదు. రెండు శతాబ్దాల పాటు బారత్‌ను పాలించిన మొఘలుల ప్రభావం దేశంలోని అన్ని రంగాలపైపడింది. మొఘల్ సంస్కృతి ఇప్పటికీ ఊపిరి తీసుకుంటూనే ఉంది. ■





**MOURYA - a Pioneer Institute producing cotton seeds under the Expertise of dedicated Scientists with revolutionary Agro - Tech innovations**






## మౌర్య రిసర్చ్ హైబ్రిడ్ ప్రత్తిరకములు

- ★ మౌర్య - 303
- ★ మౌర్య - 501 (అశోక)
- ★ ఆదిత్య
- ★ చంద్రగుప్త
- ★ నలంద
- ★ గౌతమ్






**MOURYA AGRI-TECH**

1-1-564/2, Flat No. 304, Vintage Mini Towers,
Gandhi Nagar, Hyderabad - 500 020. Ph: 7603703



అశోక చక్రవర్తి తర్వాత సుమారు 1800 ఏళ్ల కాలానికి సువిశాల భారతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించిన షహెన్‌షా అక్బర్ పాదుషా. అశోకుని తర్వాత అంతటి ఘనత వహించిన చక్రవర్తి కూడా అక్బర్ చక్రవర్తే. పదమూడేళ్ల పసిప్రాయంలోనే తండ్రిని కోల్పోయిన అక్బర్ చదువుకున్నది అంతంతమాత్రమే. అయినా, అసాధారణ ప్రజ్ఞాశాలి. ఇంతటి విశాల దేశాన్ని జయించడం ఒక ఎత్తయితే, దాన్ని స్థిరపరచడం మరో ఎత్తు. దేశంలో వ్యవసాయానికి అనువైన భూమినంతా సర్వే చేయించాడు. రైతుకు భారం కాకుండా పన్నులు వేశాడు. పరిపాలనను వికేంద్రీక రించాడు. ఆయన రాజ్యంలో ఎక్కువ శాతం ఉన్నతాధికారులు హిందువులే. మానవత్వమే మతం కావాలని పరితపించి 'దిన్-ఇ-ఇలాహి' అనే కొత్త మార్గాన్ని ప్రతిపాదించినవాడు అక్బర్. క్రూర మృగాలను వెంటాడి వేటాడడంలో దిట్ట. తాన్సేన్ గానామృతానికి నిలువెల్లా కరిగిన సంగీత ప్రియుడు. యమునా నది అలల సంగీతానికీ పరవశించేవాడు. బీర్బల్ చతురోక్తులకు కడుపుబ్బా నవ్వేవాడు. ఫైజికవిత్వమంటే చెవి కోసుకున్నవాడు. శిల్పులను, చిత్రకారులను నజరానాలతో ముంచెత్తినవాడు అక్బర్. అన్నింటినీ మించి ప్రజల కష్టసుఖాలు వినడంకోసం ప్రతిరోజూ కొంత సమయాన్ని 'ప్రజలతో ముఖాముఖి' కోసం కేటాయించిన ప్రజారంజకునిపై **వైద్యం ఆనందవర్ధన్** స్థూల పరిశీలన...

# అక్బర్ ది గ్రేట్



పదమూడు సంవత్సరాల లేత ప్రాయంలో మొఘల్ సింహాసనాన్ని అధిష్టించిన అక్బర్ మొఘల్ వంశీయుల్లోనే కాక భారతదేశ చరిత్రలో విశిష్ట స్థానాన్ని ఆక్రమిస్తాడు. భారతదేశంలో బాబర్ స్థాపించిన మొఘల్ సామ్రాజ్యాన్ని అతని కుమారుడు,అక్బర్ తండ్రి అయిన హుమయూన్ కాపాడుకోలేకపోవడంతో మొఘల్ సామ్రాజ్యం తాత్కాలికంగా దేశంలో అంతరించింది. హుమయూన్ మరణించే నాటికి అక్బర్‌కు కేవలం 13 సంవత్సరాలు మాత్రమే. భైరాంఖాన్ సంరక్షణలో అక్బర్ మొఘల్ సామ్రాజ్యానికి రాజయ్యాడు. అక్బర్ చదువుకోలేదు. కానీ అక్బర్‌కు అపారమైన జ్ఞాపకశక్తి ఉంది. ఎవరైనా చదువుతుంటే విని విషయాన్ని ఆకళింపు చేసుకునే వాడు. అనర్గళంగా సందర్భానుసారం పద్యాలను ఉటంకించేవాడు. కవిత్వమంటే ప్రత్యేక అభిరుచి కల్గిన అక్బర్ పలు భాషా పండితులతో, తత్వవేత్తలతో చర్చలు చేసేవాడు. అక్బర్ అత్యంత ధైర్యసాహసాలు కల్గిన వాడు. క్రూరమృగాలను మచ్చిక చేసుకోవడంతో పాటు ఉధృతంగా ప్రవహించే నదులను ఆవలీలగా ఈదడమంటే అక్బర్‌కు చాలా ఇష్టం. మత ఛాందసులను అత్యంత ధైర్యంతో ప్రతిఘటించగలిగాడు. అక్బర్‌కు యుక్త వయస్సు వచ్చే వరకు పరిపాలనా భారాన్ని భైరాం ఖాన్ స్వీకరించాడు. ఉత్తర భారతదేశాన్ని మళ్ళీ జయించాలన్న ఆశ నెరవేరకుండానే హుమయూన్ మరణించడంతో ఆ కర్తవ్యాన్ని అక్బర్ నిర్వర్తించాడు.

బీహార్‌ను పాలించే ఆదిల్‌షా సూర్‌కు ప్రధాన మంత్రిగా ఉన్న హేమూ,భైరాంఖాన్‌ల మధ్య మరోసారి పానిపట్టు యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో హేము ఓడిపోయి బందీగా మొఘలు సైన్యానికి చిక్కి ప్రాణాలొదిలాడు. మొఘలులు కోల్పోయిన ఢిల్లీ, ఆగ్రాలను అక్బర్ తిరిగి ఆక్రమించుకోవడంతో ఉత్తర భారతంలో మొఘలు సామ్రాజ్యం మళ్ళీ స్థాపించబడింది.అక్బర్‌కు యుక్త వయస్సు రాగానే భైరంఖాన్‌ను ప్రాతినిధ్యాన్ని తొలగించి రాజ్యాధికారాన్ని చేపట్టి సామ్రాజ్య విస్తరణకు యుద్ధాలు చేయడం మొదలు పెట్టాడు. ఈ క్రమంలో అక్బర్ గ్వాలియర్,అజ్మీర్,జాన్‌పూర్ లాంటి ప్రసిద్ధ పట్టణాలను కోటలను జయించి తన ☞

సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. మాళవరాజ్యాన్ని స్వాధీనం చేసుకోవడంతో ఒక్కసారిగా అక్బర్ రాజపుత్రుల రాజ్యాల దరిదాపులకు చేరుకున్నాడు. రాజపుత్రులతో కయ్యానికి దిగకుండా, వియ్యానికే అక్బర్ ఆసక్తి చూపించాడు. ఈ నేపథ్యంలోనే ఆయన పలువురు రాజపుత్ర కన్యలను వివాహం చేసుకోవడంతో పాటు రాజపుత్రులకు మొఘలులకు వైవాహిక సంబంధాలు నెలకొల్పాడు. దీంతో రాజపుత్రులతో మంచి మైత్రీ సంబంధాలు నెలకొన్నాయి. తన పరిపాలనా యంత్రాంగంలో రాజపుత్రులకు పలు అవకాశాలు కల్పించాడు. కానీ రాణాప్రతాప్ లాంటి వారితో అక్బర్ యుద్ధాలు చేయకతప్పలేదు. రాజస్థాన్‌లో బలమైన దుర్గాలైన రణతంబోర్, చితోడ్ కోటలను మొఘలులు స్వాధీనం చేసుకున్నారు. భారతదేశం మొత్తం తన ఏలుబడికిందకి తేవాలన్న లక్ష్యంతో అక్బర్ దాడులు చేయడం ప్రారంభించాడు. ఈ క్రమంలో గుజరాత్, బెంగాల్‌లు అతనికి పట్టుబడ్డాయి. సముద్రాంతర వ్యాపార, వాణిజ్యాల వల్ల కలిగే లాభాలు, సస్యశ్యామలమైన భూముల మీద వచ్చే ఆదాయం అక్బర్‌కు కలిసొచ్చింది. క్రీ.శ 1595 నాటికి కాశ్మీర్, సింధ్, ఒరిస్సా, మధ్య భారతం, కాందహార్‌లను అక్బర్ జయించాడు. దీంతో ఉత్తర భారతదేశం మొత్తం మొఘలుల వశమైంది. దక్కన్ ప్రాంతాన్ని జయిస్తే తప్ప సువిశాల భారతంపై పట్టు చిక్కదని భావించిన అక్బర్ దక్కన్‌పై దండయాత్రలు సాగించాడు. మొఘల్ దాడులను దక్కన్ రాజులు గట్టిగా ఎదుర్కొన్నారు. ఫలితంగా 8ఏళ్ల పాటు యుద్ధం కొనసాగింది. చివరకు మొఘలులు ఖాందేష్, బీరార్‌లతో పాటు అహ్మద్ రాజ్యంలో కొంత భాగాన్ని తమ రాజ్యంలో కలుపుకున్నారు. దీంతో గోదావరి తీరం దాక మొఘలు సామ్రాజ్యం విస్తరించింది.

**పరిపాలనలో సంస్కరణలు:** పరిపాలనలో అక్బర్ పలు సంస్కరణలకు వీలు కల్పించాడు. స్థానిక అధికారులు అధిక భాగం హిందువులే. మొఘల్ పరిపాలనా రంగంలో చేపట్టిన సంస్కరణలో ప్రముఖమైనది మునసబ్‌దారీ విధానం. మునసబ్ హోదాను చక్రవర్తి మాత్రమే కల్పించే అధికారాన్ని ఏర్పాటు చేయడంతో అక్బర్ అధికారులను నియంత్రించగలిగాడు. మునసబ్ ఆధీనంలో ఉండే సైనిక బలగాన్ని చక్రవర్తి వీలును బట్టి ఉపయోగించుకునేవాడు. అక్బర్ తన ప్రత్యక్షాధికారం కింద అధికార మండలితోపాటు ఫిరంగి దళాన్ని ఉంచుకోవడంతో మునసబ్‌దారుల సైన్యం చక్రవర్తికి వ్యతిరేకంగా పనిచేయడానికి వీల్లేకుండాపోయింది. అక్బర్ పరిపాలనలో పలు రకాల అధికారులు ఉండేవారు. వారిలో వజీర్, బక్షీ అనే అధికారులు అతి ముఖ్యులు. వజీర్ రెవెన్యూ శాఖను, బక్షీ సైనిక శాఖను నిర్వహించేవారు. అతి ముఖ్యమైన శాఖలను నిర్వర్తిస్తున్నప్పటికీ వారికి ఆయా శాఖలపై సంపూర్ణాధికారం లేకుండా అక్బర్ కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశాడు. విదేశీ రాయబారులను, ఉన్నతోద్యోగులను "దివాన్-ఇ-ఖాస్" ప్రత్యేక మందిరంలో కలుసుకునేవాడు. ప్రజలకు "దివాన్-ఇ-ఆమ్" భవనంలో దర్శనం ఇచ్చేవాడు. అంతేగాక ఆగ్రా కోటలోని "ఝుకోట" అనే బాల్కనీలో ప్రతిరోజు ప్రజలకు దర్శనమిచ్చేవాడు. మొఘల్ సామ్రాజ్యాన్ని అక్బర్ 15 రాష్ట్రాలుగా విభజించాడు. వీటిని సుబాలుగా పేర్కొనేవారు. ఒక్కొక్క సుబా చూసుకునే అధికారిని సుబేదార్ అనేవారు. రాష్ట్రంలో కీలకమైన వ్యక్తి సుబేదారే. ప్రతి సుబాను సర్కార్లుగా, ప్రతి సర్కారును పరగణాలుగా అక్బర్ విభజించాడు. కొన్ని గ్రామాల సముదాయాన్ని పరగణ అనే వారు. శాంతిభద్రతల పరిరక్షణకు కొత్వాలు అనే అధికారిని నియమించాడు. ఈ పేరు ఇప్పటికే గ్రామాల్లో వినపడుతూనే ఉంటుంది. ఏ అధికారిని ఒకే ప్రాంతంలో ఎక్కువ కాలం పనిచేయనీయకుండా బదిలీ చేసేవాడు. దీనివల్ల అధికారులు తమ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించడానికి వీలు లేకుండా పోయింది. ఆదాయ మార్గాలపట్ల అవగాహన పెంచుకునేందుకు, వృద్ధి చేసుకునేందుకు వీలుగా తన రాజ్యంలోని భూమిని, అందునుంచి వచ్చే పంటల లాభాలపై సమగ్ర నివేదిక తయారు చేయించే బాధ్యతను అక్బర్ రాజా తోడర్‌మల్‌ని నియమించాడు. రికార్డుల రూపంలో నివేదికలను తయారు చేయించి వాటిలో ఎప్పటి కప్పుడు మార్పులు చేర్పులు పొందుపరిచే ఏర్పాట్లు కూడా చేశాడు. దీంతో రైతులకు లాభం చేకూరింది.

**సాహిత్యం, లలిత కళలు**

అక్బర్ స్వతహాగా చదువుకోకపోయినా ఇతరులతో చదివించుకుని అపారమైన జ్ఞానాన్ని సంపాదించుకున్నాడు. ఆయనకు అత్యంత సన్నిహిత మిత్రులుగా ఇద్దరు సోదరులుండేవారు. వారిలో ఒకరు అబుల్ ఫజల్, రెండవ వ్యక్తి ఫైజీ. అబుల్ ఫజల్ "అక్బర్-నామా" పేరిట అక్బర్ జీవిత చరిత్ర రాశాడు. కాగా ఫైజీ మంచి కవి. పారశీలోనే ఆయన కవిత్వం రాశాడు. నాడు పారశీ అధికార భాషగా ఉండింది. విలువైన సంస్కృత కావ్యాలను అక్బర్ పారశీలోకి తర్జుమా చేయించాడు. ప్రఖ్యాత సంగీత కారుడు తాన్‌సేన్‌ను కూడా అక్బర్ అమితంగా అభిమానించేవాడు. నవ్యరాగాలను సృష్టించడం ద్వారా తాన్‌సేన్ హిందూస్థానీ సంగీతాన్ని సుసంపన్నం చేశాడు. అక్బర్ కోసమే తాన్‌సేన్ 'దర్బారీ' అనే రాగాన్ని స్వరబద్ధం చేశాడని ప్రతీతి. ఇవేగాక చిత్రకళలపట్ల కూడా అక్బర్ అత్యంత ఆసక్తిని కనబర్చాడు.

**వాస్తు శిల్పం**

అక్బర్ దర్బార్ ఢిల్లీ, ఆగ్రా రెండింటిలోను వెలుగొందింది. అయినప్పటికీ మరొక నూతన రాజధానిని నిర్మించాలని ఆయనకు అనిపించింది. సూఫీయోగి సలీం చిష్టీపట్ల అక్బర్‌కు ఉన్న గౌరవాభిమానాలకు గుర్తుగా ఆగ్రా సమీపంలోని ఫతేపూర్ సిక్రీ నిర్మాణం. భారతదేశంతోపాటు పారశీక, మధ్యాసియా కళావిన్యాసాల అపూర్వ సమ్మేళనంతో ఫతేపూర్ సిక్రీ వాస్తుశిల్పం అలరారుతోంది. ఫతేపూర్ సిక్రీలో 'ఇబాదత్‌ఖానా' అనే భవనంలో వివిధ మతాల వారితో అక్బర్ తాత్విక చర్చలు జరిపాడు. సర్వమతసారం దేవుడినే చేరుకోవడమేనని గుర్తించిన అక్బర్ సరికొత్త మతాన్ని ఒకదాన్ని రూపొందించాడు. అదే 'దీన్-ఇల్లాహీ'. దీని వ్యాప్తికి అక్బర్ బాగా శ్రమించాడు. తాను సూచించిన మార్గాన్ని అవలంబిస్తే సమాజంలో శాంతి స్థాపన జరుగుతుందని బలంగా విశ్వసించాడు. నేరస్తులను శిక్షించడానికి అప్పటికి అమలులో ఉన్న క్రూరమైన శిక్షలను ఆయన వ్యతిరేకించాడు. తప్పును తెలుసుకుని సరిదిద్దుకునే విధంగా శిక్షలుండాలని అభిప్రాయపడ్డాడు. అలాగే స్త్రీ సహగమనంచేసే విధానాన్నికూడా ఆయన బలంగా వ్యతిరేకించాడు. తాను ప్రతిపాదించిన మతంలో సూర్యుడు, అగ్నిని, వెలుగుని ఆరాధించే సంప్రదాయాన్ని కూడా ప్రవేశపెట్టాడు. చివరకు 1605లో ఆగ్రా సమీపంలోని సికింద్రాలో ఆయన తన కోసం ప్రత్యేకంగా నిర్మించుకుంటున్న సమాధిలోనే ఆయన భౌతికకాయాన్ని భూస్థాపితం చేశారు. భారతదేశ చరిత్రలో అక్బర్ చక్రవర్తిది ఓ విశిష్టమైన స్థానం.

# నూతన సహస్రాబ్దికి స్వాగతం

## ప్రగతిపథంలో ప్రశాంత్‌నగర్ గ్రామం సిద్దిపేట మం. మెదక్



**శ్రీ నారా చంద్రబాబునాయుడు**
ముఖ్యమంత్రి



**శ్రీ కె.చంద్రశేఖర్‌రావు**
డిప్యూటీ స్పీకర్



**ఎం.డి.తక్సీర్** (ముర్షద్)
**పర్సన్ ఇన్‌చార్జి ప్రశాంత్‌నగర్**



**బి.విజయ**
**జెడ్.పి.టి.సి., సిద్దిపేట.**



సిద్దిపేటకు హరితహారం కార్యక్రమంలో పాల్గొన్న ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడుతో ప్రశాంత్‌నగర్ పర్సన్-ఇన్-చార్జ్ ఎం.డి. తక్సీర్ (ముర్షద్)



**జి.సతీష్**
**ఎం.పి.టి.సి., సిద్దిపేట.**



**వి.జనార్దన్**
ఎం.పి.టి.సి., సిద్దిపేట.

ఎన్నో ఎన్నెన్నో కొంగ్రొత్త ఆశలు, ఆశయాలతో నూతన సహస్రాబ్దిలోకి అడుగిడుతున్న సందర్భంగా ప్రశాంత్‌నగర్ ప్రజలకు శుభాకాంక్షలు. మా ప్రియతమ నాయకులు, శాసనసభ ఉపసభాపతి మాన్యశ్రీ కె.చంద్రశేఖర్‌రావు గారి సహాయ సహకారాలతో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు.

- గ్రామ పంచాయతీపరిధిలోని ఇందిరానగర్, శ్రీనగర్‌కాలనీ, నల్లపోచమ్మనగర్, కాళ్ళకుంటకాలనీ, సుభాష్‌నగర్ కాలనీలలో 26 లక్షలతో మంచినీటి ట్యాంకుల నిర్మాణం.
- సుభాష్‌నగర్, శ్రీనగర్‌కాలనీ, నల్లపోచమ్మనగర్, హన్మాన్‌నగర్, రాఘవేంద్రనగర్ కాలనీలలో 17 వేల మీటర్ల పైప్‌లైన్ ఐదున్నర లక్షల ఖర్చుతో నిర్మించాము.
- జె.ఆర్.వై. నిధులు సుమారు మూడు లక్షలతో గ్రామపంచాయతీ భవనం మరమ్మతు, స్కూల్ బిల్డింగ్ మరమ్మతు, వడ్డెరవాడ కమిటీహాలు, ఇందిరానగర్‌లో మురికికాలువ, కరీంనగర్‌రోడ్‌లోని మురికికాలువల నిర్మాణం చేపట్టాము.
- పద్మశాలి కమ్యునిటీహాలు 12 లక్షలతో నిర్మించాము.
- ఎం.ఎల్.ఎ.ఫండ్‌నుండి 5 లక్షలతో బ్రాహ్మణపరిషత్ భవన నిర్మాణం.
- జన్మభూమి నిధులతో 70% కింద కాళ్ళకుంటకాలనీ కొత్త రోడ్డు నిర్మాణం, 3,500 మీటర్ల పైప్‌లైన్ నిర్మాణం, పాఠశాలభవనాల నిర్మాణం, సుభాష్‌నగర్‌లో రోడ్ల నిర్మాణం చేసాము. 2.5 కోట్లతో మురికికాలువలు, రోడ్ల నిర్మాణం, రోడ్ల మెటలింగ్ కార్యక్రమాలు చేపట్టాము.
- మెయిన్‌రోడ్‌కు ఎస్.వి.లైట్లు 30, కొత్త ట్యూబ్‌లైట్లు 50 వేసాము. పదవ ఆర్థిక కమీషన్ నిధులతో 50వేలతో బోర్లు, బీడీవర్కర్స్ కాలనీలో రోడ్ నిర్మాణం చేయడం జరిగింది.
- బీడీవర్కర్స్ కాలనీలో 150 ఇళ్ళమంజూరు.
- సి.ఎం.ఇ.వై.కింద పది గ్రూపులను ఎంపికచేయడం జరిగింది.
- డి.పి.ఇ.పి. కింద 18 పాఠశాల భవనాలు మంజూరుజరిగి వివిధ దశలలో నిర్మాణాలు కొనసాగుతున్నవి.

సదా మీ సేవలో... **ఎం.డి.తక్సీర్** (ముర్షద్)

**ఇంటిపన్నులు చెల్లించండి - అభివృద్ధికి సహకరించండి**

**ప్రశాంత్‌నగర్ గ్రామపంచాయతీ కార్యాలయ సిబ్బంది**

సిరిసంపదలతో మహారాజుగా వెలిగిన వ్యక్తికి మరణించిన అనంతరం కనీసం ఆరడుగుల నేల కూడా లభించకపోవడం ఎంత దురదృష్టం.

బహదూర్‌షా జఫర్ మంచి పరిపాలకుడుగా పేరు పొందలేకపోవడానికి కారణం అతనిలో దాగివున్న భావుకత్వమే. సున్నిత మనస్కుడు కావడంతో ఇతని పరాక్రమం కొరగాకుండా పోయింది. ఆత్మగౌరవం, మానాభిమానాలు కలవాడు కాబట్టే బ్రిటిష్ వారిని ఏనాడు క్షమాభిక్ష కోరలేదు. చక్రవర్తిగా భాసిల్లిన ఇతను చివరి దశల్లో ఆరగుడుల భూమి కోసం విలవిలలాడిపోయాడు. కన్న భూమి ఒడిలోనే కన్నుమూయాలని తపించిపోయాడు. అక్కడే భూస్థాపితం కావాలని ఆశించాడు. ఈ చిన్న కోరికను

# తలవంచని మొఘల్...

# తలపుల్లో గజల్

బ్రిటిష్ కర్కశ పాలకులు నిర్దయగా కాలరాచారు. కాలం కొన్ని గాయాలను చేస్తుంది. అవి అంత సులభంగా మానవు. గేయం చేసే గాయాలు కూడా అంతే. బహదూర్‌షా జఫర్ గేయాలు కూడా మానని గాయాలై జీవితాంతం సలిపివేశాయి. కన్నతల్లి భారతి ఒడి దక్కదని గ్రహించిన జఫర్ భారమైన హృదయంతో 'న కిసీకా అంఖ్‌కా నూర్ హూఁ' అంటూ విలపించాడు. తనంతటి దురదృష్టవంతుడు ప్రపంచంలోనే వుండడని కంటనీరు పెట్టుకున్నాడు. 'నేను మణులు, మాణిక్యాలు అడగడం లేదు. కేవలం..కేవలం ఆరడుగుల నేలభిక్షాదానం కోరుకుంటున్నాను' అని ఆక్రోశించాడు. బ్రిటిష్ పాలకుల బందీగా బర్మాలో వున్నప్పుడు జఫర్ కలం నుంచి జాలువారిన గేయాలెన్నో. ఆయన గజల్స్ నేటికి మన హృదయాలకు గుచ్చుకుంటూనే వుంటున్నాయి. కొన్ని చలన చిత్రాలకు ఇవే ప్రాణమయ్యాయి. 'కారే రాజులు రాజ్యములు గలగవే...సిరి మూటకట్టుకొని పోవంజాలరే' అన్న పోతన పద్యం ఇతని జీవితానికి అద్దం పడుతుంది.

*"గజియోమె బు రహేగి జబ్ తలక్ ఇమాన్ కీ.. తబ్‌తో లండన్ తక్ చలేగి తేజ్ హిందుస్తాన్‌కీ" (భారతీయుల మదిలోని ఆత్మగౌరవం ఒకరోజు లండన్‌ను గడగడలాడిస్తుంది)* అని బ్రిటిష్ పాలకులను హెచ్చరించిన రెండో బహదూర్‌షా జఫర్ మొఘల్ సామ్రాజ్యానికి చిట్ట చివరి రాజు. ఇతనితోనే సామ్రాజ్య వైభవం అంతరించిపోయింది. బహదూర్ షా బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా సిపాయిల తిరుగుబాటుకు నాయకత్వం వహించి భారతీయుల్లో స్వాతంత్ర్య వాంఛను రగిలించాడు. మొఘల్ సామ్రాజ్యాధీశుల్లో 18వ వాడైన బహుదూర్ షాతో 331 సంవత్సరాల సుదీర్ఘ మొఘల్ పాలనకు తెరపడింది. తండ్రి అక్బర్ షా-2 మరణానంతరం 1837 సెప్టెంబరు 28న 63 సంవత్సరాల వయస్సులో ఢిల్లీ సామ్రాజ్య పాలనను బహదూర్ షా చేపట్టాడు. ఒక్కొక్కటిగా భరత ఖండంలోని రాజ్యాలను కబళిస్తున్న బ్రిటిష్ పాలకుల దృష్టి మొఘల్ సామ్రాజంపై కూడా పడింది. ఈ పరిస్థితిలో బ్రిటిష్ దురాక్రమణను నిరసిస్తూ 1857 మే 10న బహదూర్ షా నేతృత్వంలో సిపాయిల తిరుగబాటు ప్రారంభమైంది. ఇది క్రమంగా ఢిల్లీకి విస్తరించింది. సిపాయిల తిరుగుబాటులో మొట్టమొదటి కల్నల్ పన్నిస్‌ను భారత సేనలు అంతం చేశాయి. అదే సంవత్సరం మే 17న భారత సామ్రాజ్యానికి మొఘల్ చక్రవర్తిగా బహదూర్ షా తనకు తాను స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు. ఆ తర్వాత ఆయన లెఫ్టినెంట్ డబ్ల్యు.ఎస్.ఆర్. హడ్సన్ ముందు సెప్టెంబరు 21న లొంగిపోయాడు.

బ్రిటిష్‌కు వ్యతిరేకంగా సిపాయిల తిరుగుబాటుకు నాంది పలికిన బహదూర్ షాను అపరాధిగా ప్రకటించి ఆయనపై బ్రిటిష్ ప్రభుత్వం విచారణను ప్రారంభించింది. 1859 జనవరి 7న ప్రారంభమైన విచారణ మార్చి 29కి పూర్తయింది. విచారణ సమయంలో బ్రిటీష్ ప్రభుత్వాన్ని క్షమాభిక్ష కోరమని పలువురు సూచించినా ఆయన అందుకు తిరస్కరించాడు. ఈ విచారణలో ఆయన సిపాయిల తిరుగుబాటుకు పాల్పడినట్టు రుజువు కావడంతో బహదూర్ షాకు దేశ బహిష్కరణ శిక్షను విధించి డిసెంబరులో బర్మాలోని రంగూన్ జైలుకు తరలించారు. జైలులో గడిపిన కాలంలో ఆయన పలు గేయాలను, రచనలను చేశారు. ఆయన రచించిన గజల్స్ ఇప్పటికీ భారతీయ ప్రజల మదిని వీడలేదు. కాగా, 1862 నవంబరు 7న ఎనభైఏడు సంవత్సరాల వయస్సులో బహదూర్ షా జఫర్ జైలులోనే మరణించాడు. ■

- కె. శ్రావణ్‌కుమార్



**భారతదేశంలో స్వతంత్ర పోరాటానికి వైతాళికులు రసపుత్ర వీరులు గజనీ, ఘోరీల దగ్గర్నుంచి మొగలాయీల వరకు దండెత్తి వచ్చిన ప్రతి విదేశీ రాజును రాజపుత్ర కరవాలం ప్రతిఘటించింది. స్వరాజ్య సమరజ్వాలను రాజేసిన అగ్నికణం పృథ్విరాజ్ చౌహాన్. అక్బర్ చక్రవర్తి హుకుం నామాను సైతం ధిక్కరించిన వీర బెబ్బులి రాణాప్రతాప్.**

**రసపుత్రుల శౌర్యంపై భానుమూర్తి పరిచయం...**



రాణాప్రతాప్

# ధిక్కార ఖడ్గాలు



పృథ్విరాజ్ చౌహాన్

మన దేశం మీదికి విదేశీయులు దండెత్తి వచ్చినప్పుడు వాళ్లను ప్రతిఘటించిన వీరులు రాజపుత్రులు. తొమ్మిదవ, పదవ శతాబ్దాల కాలంలో మన దేశ చరిత్రలో రాజపుత్రులు రాజకీయంగా ప్రాధాన్యతను సంపాదించుకొన్నారు. వీరికి పురోహితులు క్షత్రియ హోదాను కల్పించారు. పురాణాలన్నీ రాజపుత్రులను చంద్రవంశానికి చెందిన వారిగానో,సూర్యవంశానికి చెందిన వారిగానో పరిగణించాయి. ప్రతిహారులు, చాళుక్యులు, పవార్లు, చౌహాన్లు అనే నాలుగు రాజపుత్ర వంశాలు ముఖ్యమైనవి. రాజస్థాన్‌లోని అబూపర్వతం సమీపంలోని అగ్నిగుండం నుంచి వీరి పూర్వీకులు జన్మించారనే కథ ఒకటి ప్రచారంలో ఉంది. అందుకే కాబోలు ఈ నాలుగు రాజపుత్ర వంశాలను అగ్నికుల రాజపుత్ర వంశాలని అంటారు. హూణులు మనదేశంపై దండెత్తడానికి ముందు రాజస్థాన్‌లో చిన్నచిన్న రాజ్యాలుండేవని గుప్తరాజుల కాలంనాటి శాసనాలవల్ల తెలుస్తున్నది. తొలిరోజుల్లో 4 అగ్నికుల వంశాల రాజుల అధికారం అప్రతిహతంగా కొనసాగింది. పూర్వ రాజ్యాల శిథిలాలపై ఈ వంశాల రాజులు నూతన రాజ్యాల్ని నెలకొల్పారు. దక్షిణ రాజస్థాన్‌లో ప్రతిహారులు తమ రాజ్యాన్ని స్థాపించారు. ఢిల్లీ ఈశాన్య ప్రాంతంతోపాటు రాజస్థాన్‌లోని తూర్పుప్రాంతం చౌహాన్ల ఏలుబడిలో ఉండేది. కథియవార్ ప్రాంతం పై చాళుక్యులు తమ అధికారాన్ని ఎక్కువగా కేంద్రీకరించినప్పటికీ మల్వా, ఛేది, పాట్నా ప్రాంతాల్లో ఈ వంశపు రాజులు తమ రాజ్యాల్ని నెలకొల్పారు. పవార్లు ఇండోర్ సమీపంలోని ధార్ రాజధానిగా మల్వా రాజ్యాన్ని పాలించారు. మొదట ఈ వంశపు రాజులు రాష్ట్రకూటులకు సామంతరాజులుగా ఉండేవారు. కానీ పదో శతాబ్దంలో వీరు రాష్ట్రకూటుల పై తిరుగుబాటు జరిపి స్వతంత్రులయ్యారు. రాజపుత్రులలో అగ్నికుల వంశాలకు చెందిన రాజులే కాకుండా సూర్య, చంద్ర వంశాలకు చెందిన రాజులు కూడా ఉన్నారు. పశ్చిమ, మధ్య భారతదేశంలో చంద్ర, సూర్యవంశాల రాజులు రాజ్యాల్ని నెలకొల్పారు. అలా రాజ్యాల్ని స్థాపించిన వారిలో చందేల రాజులు ముఖ్యులు. వీరు పదో శతాబ్దంలో ఖజురహో ప్రాంతంలో రాజ్యాన్ని నెలకొల్పారు. మేవార్ రాజపుత్రులతోపాటు చౌహాన్ వంశపు రాజులు అరబ్బుల దండయాత్రలను సాహసవంతంగా ఎదుర్కొన్నారు. మొఘల్ రాజులతో మేవార్ రాజపుత్రులు వీరోచితంగా పోరాడారు. మేవార్ రాజైన రాణా ప్రతాపసింహుడు తాను జీవించినంతకాలమూ మొగల్ చక్రవర్తి అక్బర్‌ను ఎదుర్కొన్నాడు. అక్బర్‌కు సింహస్వప్నమయ్యాడు. రాజా ఉదయసింహుడు చిత్తోడ్‌ను రాజధానిగా చేసుకొని మేవార్‌ను పాలించేవాడు. జైపూర్, జైసల్మేర్, బికనీర్ రాజులు అక్బర్‌కు లొంగిపోయి తమ కుమార్తెలను ఆయనకిచ్చి వివాహం చేశారు. కానీ, ఉదయసింహుడు మాత్రం అక్బర్‌ను తీవ్రంగా ప్రతిఘటించాడు. ఉదయసింహుని మరణానంతరం ఆయన కుమారుడైన రాణా ప్రతాపసింహుడు పోరాటాన్ని కొనసాగించాడు. 1576లో హల్దీఘాటి వద్ద మొఘల్ సైన్యంతో పోరాడినప్పటికీ గొగూండ, కుమిల్ దుర్గాలను కోల్పోయాడు. నిరాశచెందకుండా పోరాటం కొనసాగించి 1597లో రాణాప్రతాప్ తాను కోల్పోయిన దుర్గాల్ని తిరిగి స్వాధీనం చేసుకొన్నాడు. రాణాప్రతాపసింహుడే కాదు ఆయన కుమారుడైన అమరసింహుడు కూడా మొఘల్ రాజులకు తల వంచలేదు. గజనీ, మహ్మద్ ఘోరీ మన దేశంపై దండయాత్రలు జరిపి అపారమైన నష్టాన్ని కలిగించారు. మహ్మద్ ఘోరీని మూడో పృథ్విరాజ్ చౌహాన్ ఎదిరించి పోరాడాడు.

కనోజ్ రాజైన జయచంద్రునికి పృథ్విరాజ్ అంటే పడేదికాదు. కానీ, జయచంద్రుని కుమార్తె అయిన సంయుక్త పృథ్విరాజ్‌ను గాఢంగా ప్రేమించింది. జయచంద్రుడు తన కుమార్తె స్వయం వరాన్ని ప్రకటించి పృథ్విరాజ్‌కుతప్ప తక్కిన రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు.

అంతటితో ఆగకుండా పృథ్విరాజ్ విగ్రహాన్ని ద్వారపాలకుని స్థానంలో ఉంచాడు. సంయుక్త వరమాలను పృథ్విరాజ్ విగ్రహం మెడలో వేసింది. దాపునే దాగి ఉన్న పృథ్విరాజ్ గుర్రంపై ఆమెను తీసుకుపోయి పెళ్లిచేసుకొంటాడు. ఇతర రాజపుత్రుల సహాయ సహకారాలతో 1911లో ఘోరిని పృథ్విరాజ్ చిత్తుగా ఓడించాడు. కానీ, 1912లో ఘోరీతో రెండోసారి జరిగిన యుద్ధంలో వీరోచితంగా పోరాడి అసువులు బాసాడు. ఎడారిప్రాంతమైనా, కొండప్రాంతమైనా మాతృభూమి మాతృభూమే అనే అకళంక దేశభక్తితో ప్రాణాలను సైతం అర్పించిన త్యాగధనులు రాజపుత్రులు. ■







# Revolutionising Horticulture for the New Millennium



**A multi-pronged action plan is all set to transform Horticulture in AP into a multi-million rupee industry with global competitiveness in facilities and economies**

Andhra Pradesh - a land blessed with the bounties of nature's horticultural produce. Some of them world famous. Like the Banganapalli Mangoes and Thompson Seedless Grapes. India's No 1 producer of oil palm, chillies and turmeric. The country's second largest producer of fruits, vegetables and flowers.

**SWARNA ANDHRA PRADESH - VISION 2020**
**Relating to Horticultural Development :**

According to a comprehensive blueprint for horticultural development in AP, drawn up by the AP Government "By 2020, AP will have a thriving horticulture sector

Broadly the action plan for horticultural development envisages:

i) Extending coverage of area under traditional crops. ii) Introduction of non-traditional, hi-demand crops. iii) Massive thrust on induction of new technologies iv) Globalising horticulture by encouraging growth of export oriented food - based industries.

**[illegible]**

A quick glimpse of the various initiatives launched on the horticultural front in AP

**HARNESSING BIO-TECHNOLOGY FOR FASTER GROWTH :**

The Department of Horticulture, is establishing a Biotechnology Centre at Hyderabad by entering into an agreement with National Chemical Laboratory of Pune. The Centre will be a 850 MT modern facility with 75% central air conditioning.



BIOTECHNOLOGY CENTRE

**INTEGRATED TRAINING PROGRAMMES:**

Integrated Training Programmes on pre/post harvest management for the improvement of quality of Grapes and Mango for export has been taken up by the Department along with APEDA and NIAM - Jaipur.

**INCENTIVES FOR COLD STORAGE UNITS:**

- 25% of Capital Investment subsidy limited to Rs. 50 lakhs.
- 25% Rebate in Electricity Charges for a period of 3 years limited to Rs. 30 lakhs.

**INDIA'S MOST MODERN COLD STORAGE FACILITIES AT HYDERABAD AIRPORT :**

A one-of-its-kind Perishable cargo centre with a capacity of 50 M.T. is being put up at Hyderabad International Airport jointly by APEDA and Airport Authority of India. The fresh fruits/vegetables can be stored in the cold storage for export directly from Hyderabad Airport.



COLD STORAGE AT HYD AIRPORT

**PACKING IN EXTRA FRESHNESS :** In an effort to develop packaging the expertise of the Indian Institute of Packaging, Mumbai has been sought by the Government with the project costing Rs. 7.92 lakhs.

**TAPPING THE EXPORT POTENTIAL :** The export potential & demand for fruits, vegetables and flowers is very high in markets like EEC, Singapore, Malaysia, Japan and Middle East Countries.

During 1998 season about 315 tones of Grapes (87 tones of Anab-e-shahi, 228 tones of Thompson seedless variety) were exported to the U.K. by sea.

Already about 20 floriculture units have registered with the Department. Out of which 4 units are already in production and exporting cutflowers of Roses to Netherlands.

**INSPIRING INCENTIVES FOR ESTABLISHMENT OF FLORI / TISSUE CULTURE AND MUSHROOM UNITS.**

- 20% Investment Subsidy limited to Rs. 20 lakhs.
- Sales Tax Exemption for a period of 7 years limited to a ceiling of 135% of fixed capital investment.
- 25% Rebate in Electricity Charges for a period of 3 years.
- Declared Floriculture as Agriculture
- 20% Investment Subsidy for Captive Power Plants
- Exemption from Urban Land Ceiling & Pollution Control Certificate
- Exemption from payment of conversion charges

**ENCOURAGING EXCELLENCE IN HORTICULTURE :**

In order to popularise the horticultural revolution and bring it closer to the common man, the Department conducts 3 highly acclaimed events in Hyderabad every year.

**3-DAY ALL INDIA HORTICULTURAL SHOW**

India's only and largest show of its kind, organised from 26th to 28th January every year. Features the latest in horticultural technology, highlights trends and emerging opportunities for business.

**5-DAY NURSERY MELA**

An exclusive window to the world of plant materials of all kinds. Held every year in August from 15th to 19th, co-insiding with India's Independence day.



**3-DAY FLOWER SHOW**

The fascinating world of flowers comes alive from Nov. 1st to 3rd every year. Potential and possibilities for floriculture are explored. Prizes, trophies and shields instituted by leading organisations are given to the best exhibits in various categories.



**DEPT. OF HORTICULTURE**
Govt. of Andhra Pradesh
Public Gardens, Hyderabad-4.
Ph : 3234091,3243130;
Fax:+91-040-3212792,
E-mail : dirhort@ap gov.in
www.aphorti.com





గెరిల్లా యుద్ధ తంత్రంతో మొఘల్ చక్రవర్తి ఔరంగజేబును చికాకుపరిచిన మరాఠా స్వాతంత్ర్య యోధుడు ఛత్రపతి శివాజీ. మరాఠా రాజ్యాధినేతగా పట్టాభిషిక్తుడై దేశంలో స్వాతంత్ర్య జ్వాలను రగిలించాడు. దేశభక్తికీ, హిందూ మతాభిమానానికి ప్రతీకగా చరిత్రలో నిలిచిపోయిన శివాజీ పోరాటంపై 'ఉమ' సంక్షిప్త రచన...

# అగ్గిబరాటాలైన మరాఠా వీరులు

ఏ కత్తీ ఎదురులేనిది కాదు; ఏ ప్రభువూ తిరుగులేని వాడుకాదు. ప్రజల సవాళ్లను, తిరుగుబాట్లను ఎదుర్కోని రాజ్యం చరిత్రంతా వెదికినా దొరకదు. మొఘల్ సామ్రాజ్యం అప్రతిహతంగా సాగిందే; 17వ శతాబ్దం దాని వైభవ ప్రాభవాలను శిఖరాయమానంగా నిలిపిన కాలమే. అయినా ఆ సమయంలోనే ప్రతిఘటనకూడా ఎదురైంది. మొఘల్ వైభవోన్నతిని విదేశీయులు కూడా ప్రశంసిస్తున్న సమయంలోనే తిరుగుబాట్లూ తల లెత్తాయి. తిరుగుబాట్లు లేవదీసిన రాజుల కారణాలు, ఏవైనా కావచ్చు; కానీ వాటివెనక ప్రజల అసహనం, నిరసన వున్నాయి. రాజకీయ ఉద్యమాలే కాదు, మత ఉద్యమాలలో కూడా రాజ్యం మీద తిరుగుబాటు ధోరణివుంది. శిక్కులు తిరుగుబాటులో రాజకీయ కారణాలతోపాటు మతభావాలూ వున్నాయి. అలాగే మహారాష్ట్రులూ!

17వ శతాబ్దంలో తలెత్తిన వుద్యమాలన్నిట్లోనూ బలమైందీ పెద్దదీ మరాఠీ తిరుగుబాటు. గ్రామీణ వ్యవస్థనుంచి ఒక శక్తివంతమైన వర్గంగా మరాఠీలు ఎదిగివస్తున్న కాలం అది. సమాజంలోని వివిధ వర్గాల మధ్య జరుగుతున్న ఘర్షణల్లో మరాఠీలు చిన్న చిన్న భూస్వాములుగా జాగీర్దార్లుగా రూపొందుతూ, పెత్తనం చేజిక్కించుకొంటున్నారు. వారు భూమిమీద అధికారం పొందే క్రమంలోనే తమ సమాజంమీద కూడా ఆధిపత్యం పొందుతూ వచ్చారు. దాంతోపాటు సైనిక బలాన్ని కూడా సమీకరించుకొని చిన్న చిన్న తిరుగుబాట్లు లేవదీశారు. ఔరంగజేబు (1658-1707) అనుసరించిన విధానాలు తిరుగుబాట్లకు మరింత దోహదం చేశాయి. 1679లో ఆయన ముస్లిమేతరుల మీద విధించిన జిజియా పన్ను మరాఠా, రాజపుత్ర, జాట్ వర్గాల్లో నిరసనకు దారితీసింది. మరాఠాలు ఒక 'జాతి'గా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం సాగించిన ఈ పోరాటాన్ని జాతీయోద్యమంలో అంత ర్భాగంగా తక్కువ చేయడానికి లేదు. దాన్ని జాతీయ చైతన్యంతో దేశ స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటంగా కాకపోయినా, ఒకవర్గ ప్రజలు



హిందూ మతావేశంతో మాతృదేశం కోసం జరిపిన ప్రతిఘటనగా చరిత్రలో దానికి స్థానం వుంది. ఈ పోరాటాల్లోంచి పైకిలేచిన మరాఠీ వీరుడు శివాజీ. రామదాస్ (1608-1681)లాంటి భక్తకవుల బోధలు శివాజీ దేశభక్తిని, హిందూ మతాభిమానాన్ని ప్రభావితం చేశాయి. ఆయన తండ్రి షాజీ సైనిక సహాయంతో బీజాపూర్‌లో జాగీర్దార్‌గా రాజకీయ ప్రాబల్యం పెంచుకోవడం శివాజీకి ఉత్తేజాన్నిచ్చింది. దాంతో శివాజీ చిన్నచిన్న మరాఠా కోటలమీద దాడి చేసి బలం విస్తరించుకొన్నాడు. క్రమక్రమంగా బల పడుతున్న శివాజీ తమకొక సవాలుగా ఎదుగుతున్నాడని గ్రహించిన రాజులు ఆయన్ను అణచడానికి చేసిన ప్రయత్నం ఆయనకొక కీర్తి కిరీటంగా మారింది. 1658లో బీజాపూర్ సుల్తాన్ అఫ్జల్‌ఖాన్ నేతృత్వంలో సైన్యం పెద్దఎత్తున మరాఠాలమీద దండెత్తడం, అందులో శివాజీ నేర్పుగా అఫ్జల్ ఖాన్‌ను హతమార్చడం మరాఠీల ధైర్య సాహసాలకు నిదర్శనంగా చరిత్రలో స్థానం పొందింది. కొండమీద తన స్థావరానికి శివాజీని ఆహ్వానించిన అఫ్జల్‌ఖాన్ తన దుస్తుల్లో దాచుకొన్న కత్తితో పొడిచి చంపడానికి పన్నిన కుట్రను శివాజీ చాకచక్యంగా ఎదుర్కొని, అఫ్జల్‌ఖాన్‌ను కౌగిలించుకొంటూ ఇనుప గోళ్లతో హతమార్చాడు. ఈ సంఘటనతో శివాజీ ప్రఖ్యాతి ఆకాశమంత ఎత్తుకు ఎదిగి, ఔరంగజేబుకు కంటకప్రాయమైంది. మరాఠాలను ద్వేషంతో 'చిట్టెలుక'ని ఈసడించే ఔరంగజేబు వారి అంతం చూడ్డానికి పట్టుబట్టి, షియస్తఖాన్ నాయకత్వంలో మళ్లీ దాడి చేయించాడు. ఐతే శివాజీ ధాటికి తట్టుకోలేని షియస్తఖాన్ యుద్ధరంగం నుంచి పరారై ప్రాణాలు దక్కించుకొన్నాడు. తర్వాత 1664లో శివాజీ సూరత్‌మీద దండెత్తినప్పుడు అక్కడ స్థావరం ఏర్పరచుకొనివున్న ఇంగ్లీషు వాళ్లు తమ గోదాముల్లో దాక్కొని బతికి బయటపడగలిగారు. చివరికి 1665లో ఔరంగజేబు తన రాజపుత్ర సైనికాధికారి జయసింగ్‌ను శివాజీమీదికి ప్రయోగించి లొంగదీసుకోగలిగాడు. ఔరంగజేబుతో రాజీ అనే మిషతో శివాజీని జయసింగ్ ఆగ్రా తీసుకపోగా, అక్కడ ఆయన్నూ, ఆయన కుమారుణ్ణి ఖైదు చేశారు. అయితే వాళ్లిద్దరూ సైనికుల కళ్లుగప్పి చాకచక్యంగా తప్పించుకొని పూనా చేరుకోగలిగారు. ఈ సంఘటనతో శివాజీ మరింత బలపడ్డాడు. తర్వాత బీజాపూర్, బీదర్, ఖందేశ్, గుజరాత్‌లమీద దాడులుచేసి, సంపన్నులను కొల్లగొట్టాడు. మెరుపు దాడులు చెయ్యడంలో ఆయన సైన్యం ప్రసిద్ధి చెందింది. శివాజీ ఎప్పుడూ రైతుల మీదికి దండెత్తలేదు. సామాన్య ప్రజల్ని బాధించలేదు. ఆయన సైన్యం దోచుకొచ్చిన ధనమంతా కోశాగారానికి చేర్చగా, తర్వాత దాన్ని అందరికీ పంచిపెట్టేవారు. 1674లో శివాజీ మరాఠా రాజ్యాధిపతిగా పూనాలో పట్టాభిషక్తుడయ్యాడు. ఈ పట్టాభిషేకం మరాఠాల్లో స్వాతంత్ర్యేచ్ఛకు, జాతీయ చైతన్యానికి పునాది అయింది. శివాజీ తన మహారాష్ట్ర రాజ్యంలో ప్రజలనుంచి చాలా తక్కువగా పన్నులు వసూలు చేసేవాడు. ఆదాయం లోటును సామంతులనుంచి రాబట్టేవాడు. శివాజీ ఏ దాడి, ఏ యుద్ధం చేసినా, దోచుకోవడం ఆయన లక్ష్యం కాదు. ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్ష, హిందూ మత స్వేచ్ఛ కోసమే ఆయన పోరాటాలు సాగించాడు. 1680లో మరణించిన శివాజీకి ఈనాటికీ మహారాష్ట్రుల హృదయాల్లో స్థానం.వుందంటే అది ఆనాడునాటిన భావ బీజఫలమే. ■







'కత్తులును, ఘంటములు కదను దొక్కినవిచట, అంగళ్ల రతనాలు అమ్మినారట ఇచట...' నిజమే, శ్రీకృష్ణదేవరాయల కరవాలం కళింగదేశం దాకా కంపనాలు పుట్టిస్తుంటే, విజయనగరంలో ఆంధ్ర సాహిత్యం గండపెండేరం తొడుక్కుని పల్లకీ ఎక్కి ఊరేగింది. కళలకూ, సాహిత్యానికీ విజయనగర శకం స్వర్ణయుగమే. కానీ, ఆ సమయానికే నీతినియమాలు, ధర్మాధర్మాలు కట్టు తప్పాయని, ధనార్జన కోసం దగా చేయడం ప్రారంభమైందనీ, ధనికవర్గాల్లో భోగలాలసత పెరిగిందనీ, ఉంపుడుగత్తె హోదాకు చిహ్నంగా మారిందని 'బి. బాలసుబ్రమణ్యం వాదన...

# ఆంధ్రుల స్వర్ణయుగం

కాకతీయుల పరిపాలన అంతరించిన అనంతరం ఒకవైపు రెడ్డి రాజ్యం, మరో వైపు వెలమ రాజ్యం ఏర్పాడ్డాయి. ఇదే కాలంలో మరో పక్క విజయనగర సామ్రాజ్యము ఆరంభమైంది. కాకతీయుల తర్వాత కృష్ణా నదికి దక్షిణంగా వున్న దేశాన్ని సమైక్యం చేసి, దాదాపు 250 సంవత్సరాలు విజయనగర రాజులు పరిపాలన చేశారు. చరిత్రకారులు విజయనగర సామ్రాజ్య స్థాపనము క్రీ.శ.1336లో జరిగిందన్నారు. రాజ్య స్థాపకులైన హరిహర బుక్కరాయులు కురుబ తెగకు చెందిన వారని, ప్రతాపరుద్రుని కొలువులో కోశాగార ఉద్యోగులుగా వున్నారని సూయల్ పేర్కొనగా, వారు సంగముని కుమారులని, ద్వారసముద్ర రాజు మూడో బల్లలుని కొలువులో వున్నారని శ్రీకృష్ణస్వామి అయ్యంగారు పి.బి. దేశాయ్ మొదలైన వారు వాదించారు. క్రీ.శ.1355లో మధుర సుల్తాన్‌గా జలాలుద్దీన్ సామ్రాజ్యాన్ని ప్రకటించుకున్నాడు. ఇతనిని శిక్షించే ప్రయత్నంలో మహ్మద్ బిన్ తుగ్లక్ వరంగల్ వరకు వచ్చాడు. అయితే ఉత్తర భారతంలో తిరుగుబాట్లు చెలరేగడం, సైన్యంలో ప్లేగు వ్యాధి వ్యాపించడంతో వెనుదిరిగి వెళ్లాడు. ఈ నేపథ్యంలో అప్పటి వరకు సుల్తాన్ విధేయుడుగా ప్రకటించుకొని కప్పం చెల్లిస్తున్న హోయసాల మూడో బల్లలుడు తిరుగుబాటు చేశాడు. ఈ తిరుగుబాటును అవకాశంగా తీసుకొని కంపిలిని పాలిస్తున్న మాలిక్ నవాబ్ మహ్మద్ రాష్ట్రంలోని ప్రజలు తిరుగుబాటు చేశారు. ఈ తిరుగుబాటును అణచడం తనకు కష్టమైన పని అని, తమ దుర్గానికి ఆహార పదార్థాలు కూడా చేరనివ్వకుండా ప్రజలు అడ్డుపడుతున్నారని సుల్తాన్‌తో మొరపెట్టుకున్నాడు. ప్రజల్లో అసంతృప్తిని రూపుమాపి, తిరుగుబాటును అణచడానికి తగిన పథకాలు వేశాడు. కంపిలి రాజ్యంలోని అనెగొందిని వశం చేసుకున్నప్పుడు అక్కడి రాజోద్యోగులైన హరిహర, బుక్కరాయలు తమ వద్ద బందీలుగా ఢిల్లీలో వున్నారని, వారిని ఈ తిరుగుబాటును అణచడానికి పంపాలని నిర్ణయించుకున్నాడు. వెంటనే ఈ సోదరులిద్దరిని విడుదల చేసి ఇస్లాం మతంలోకి మార్చి, తిరుగుబాటు అణచివేతకు కంపిలి పంపాడు. వీరిద్దరు ప్రజలను సమాధానపరచి శాంతి భద్రతలను నెలకొల్పారు. వారు గుత్తి నుంచి ప్రారంభించి కంపిలి వరకు రాజ్యాన్ని ఆక్రమించుకున్నారు. ఇదే సమయంలో కాపయ నాయకుని స్వాతంత్రోద్యమం బలపడింది. విద్యారణ్య స్వామి ప్రోద్బలంతో హరిహర, బుక్కరాయలు ఇస్లాం మతాన్ని వదిలి మళ్లీ హిందు మతంలో చేరి, హిందు మత సముద్ధరణ పేరుతో 1336లో స్వతంత్రం ప్రకటించారు. విద్యారణ్య స్వామి ప్రోత్సాహంతో తుంగభద్రా నదీ తీరంలో విద్యానగరము అనే కొత్త నగరాన్ని నిర్మించారు. ఇదే విజయనగర సామ్రాజ్య స్థాపనైంది. 1336, ఏప్రిల్ 18న హరిహరరాయలు వైదికధర్మ సంప్రదాయ బద్ధంగా పట్టాభిషిక్తుడయ్యాడు. తండ్రి పేరిట ఈ వంశం సంగమ వంశమైంది.

హంపి



**సంగమవంశం (1336-1485)**

మొదటి హరిహరరాయలు 1336 నుంచి 1356 వరకు పరిపాలనగావించాడు. ఇతనికి 'పూర్వ పశ్చిమ సముద్రాధిపతి' అనే బిరుదు కూడా వుంది. చిన్న సంస్థానమైన విజయనగరాన్ని విశాల సామ్రాజ్యంగా రూపొందించాడు. చక్కటి పరిపాలన వ్యవస్థను ఏర్పాటు చేశాడు. ఈ కాలంలోనే ఎన్నో చెరువులను తవ్వించారు. వ్యవసాయం బాగా అభివృద్ధి చెందింది. హరిహరరాయలకు సంతానం లేకపోవడంతో రెండో తమ్ముడు బుక్కరాయలు అధికారంలోకి వచ్చాడు. ఇతను 1356 నుంచి 1377 వరకు రాజ్య పాలన చేశాడు. బుక్కరాయల కాలంలో కూడా యుద్ధాలతోనే గడించింది. విజయనగర, బహమనీ రాజ్యాల మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. బుక్క రాయని పాలనా కాలంలో కొంత సుస్థిరత ఏర్పడింది. విజయనగరం దక్షిణ వైపు విస్తరించింది. బుక్క రాయలకు 'వైదిక మార్గ ప్రవర్తన' అనే బిరుదు వుంది. ఇతని తర్వాత రెండో హరిహర రాయలు క్రీ.శ.1377 నుంచి 1404 వరకు రాజ్యపాలన చేశాడు. ఇతని కాలంలో విజయనగర సామ్రాజ్యం కీర్తి ప్రతిష్టలను ఆర్జించింది.1386 వరకు రెండో హరిహర రాయలకు విద్యారణ్యులు మంత్రిగా వున్నారు. 1404లో రెండో హరిహరుడు రాగానే వారసత్వ యుద్ధం జరిగింది. యువరాజైన బుక్క రాయల్ని తొలగించి రాజ్యానికి వచ్చిన విరూపాక్షుణ్ణి బుక్కరాయలు తొలగించాడు. అయితే బుక్కరాయల్ని తొలగించి 1406లో దేవరాయలు రాజయ్యాడు. మొదటి దేవరాయలు 1406-1423 వరకు రాజ్యపాలన చేశాడు. సింహాసనానికి రాగానే బహమనీ సుల్తాన్ ఫిరోజ్‌షా విజయనగరంపై దండెత్తాడు. ఈ యుద్ధంలో విజయనగరరాజు పరాజయం పాలయ్యాడు. ఫలితంగా రాయచూరుకు వాయువ్యంగా వున్న కొన్ని దుర్గాలను, ధనాన్ని బహమనీలకు లభించాయి. ఇదిలావుంటే రాజమహేంద్రవరంలోని కాటయవేమునితో దేవరాయలు స్నేహ సంబంధాలు పెంచుకొని ఫిరోజ్‌షాను ఎదురించాడు. అయినా మరోసారి ఓటమే ఎదురైంది. రాజమహేంద్రవరం, విజయనగరాల మధ్య వున్న స్నేహాన్ని విడగొట్టడానికి ఫిరోజ్‌షా పానగల్లును ముట్టడించాడు. పద్మనాయకులు విజయనగరం పక్షం వహించారు. వెలమల సాయంతో విజయ☞





విజయనగర సామ్రాజ్యంలో శిధిలమైన వంతెన

నగర సైన్యం విజయం సాధించి పాన, గల్లు, నల్లగొండలను వశపరుచుకుంది. మొదటి బుక్కరాయల కాలంలో ఇక్కడికి విచ్చేసిన ఇటలీదేశస్తుడు నికొలకంటీ రాజ్య వైభవాన్ని శ్లాఘించాడు. మొదటి దేవరాయల తర్వాత రాజ్యానికి వచ్చిన అతని కుమారుడు రామచంద్ర రాయలను తొలగించి తమ్ముడు విజయరాయలు అధికారాన్ని చేపట్టాడు. అయితే రెండో కొడుకు రెండో దేవరాయలు విజయ రాయలను తొలగించి అధికారాన్ని హస్త గతం చేసుకున్నాడు. రెండో దేవరాయలు 1426 నుంచి 46 వరకు రాజ్యపాలన చేశాడు. తన పూర్వీకులలాగే బహమనీ సుల్తానులతో యుద్ధం చేయాల్సి వచ్చింది. రెండో దేవరాయల వారసులు సమర్థులు కాకపోవడంతో విజయనగర రాజ్యానికే ప్రమాదం ఏర్పడింది. బహమనీ సుల్తానులు, గజపతులు విజృంభించారు. వెలములు వారికి సహాయం చేశారు. వ్యసనాలకు లోనైన విరూపాక్ష దేవరాయలు కన్నకొడుకు చేతిలోనే హతుడయ్యాడు. సింహాసనాన్ని తమ్ముడు ప్రౌఢరాయలకు అందచేశాడు. ఇతను అన్నను చంపి విలాసాలలో మునిగితేలసాగాడు. ఇలాగే కొనసాగితే విజయనగర రాజ్యం పతనం కావడం తథ్యమని సామంతులు, సాళువ నరసింహరాయలకు రాజ్యాన్ని అప్పగించారు. దీంతో సంగవ వంశం అంతరించింది.

### సాళువ వంశం (1485-1505)

సాళువ వంశస్తుల జన్మస్థానం విషయంపై వాదోపవాదాలున్నాయి. విజయనగర ఉద్యోగులుగా వీరు కర్నూలు, చంద్రగిరి ప్రాంతాలను పాలించినట్టు ఆధారాలున్నాయి. చంద్రగిరి ప్రభువుగా సంగములకు విధేయుడిగా నరసింహరాయలు పనిచేశాడు. అయితే, చివరి సంగవ రాజుల దుష్పరిపాలన భరించలేక వారిని తరిమికొట్టి తాను అధికారంలోకి వచ్చాడు. నరసింహరాయలు రాజనీజ్ఞుడు. పతనమవుతున్న రాజ్యాన్ని కాపాడాడు. నరసింహరాయలు మరణించేనాటికి అతని కుమారులు చిన్నపిల్లలు. అతన కుమారులలో అర్హులైన వారికి పట్టం కట్టే వరకు రాజ్యభారాన్ని మోయమని సర్వసేనాధిపతి తులువ నరసి నాయకున్ని కోరాడు. అతని ఆజ్ఞ మేరకు పెద్ద కొడుకు తిమ్మరాయలను రాజుగా ప్రకటించాడు. అయితే ఇతను అకాల మరణం చెందడంతో ఇతని తమ్ముడు రెండో నరసింహరాయలిని రాజుగా ప్రకటించాడు. యుక్త వయసు వచ్చిన తర్వాత స్వయంగా పాలన చేయాలని నరసింహరాయలు ప్రయత్నించాడు. ఇది గమనించిన నరస నాయకుడు ఇతన్ని బంధించాడు. ఇదే సమయంలో గజపతులు, బీజాపూర్ పాలకులు నరసనాయకుడిపై దాడిచేశారు. 1503లో నరస నాయకుడు కన్ను మూయగా, అతని పెద్ద కుమారుడు ఇమ్మడి నరస నాయకుడు బందీగా వున్న నరసింహుని చంపి వీర నరసింహరాయలనే పేరుతో అధికారాన్ని చేపట్టాడు. దీంతో సాళువ వంశం అంతరించి తులువ వంశ పాలన ప్రారంభమైంది.

### తులువ వంశం (1506-1579)

మైసూరులోని తుళు రాష్ట్రం వీరి జన్మస్థలం. 1324లో హరిహరుడు తుళునాడు జయించడంతో ఈ వంశస్తులు విజయనగర ఆస్థానంలో ఉద్యోగులుగా చేరారు.ఈ వంశానికి మూలు పురుషుడు తిమ్మరాజు. తిమ్మరాజు కుమారుడు ఈశ్వర నాయకుడు. ఇతని కొడుకే నరసానాయకుడు. ఇతని ముగ్గురు భార్యలలో తిప్పాంబకు వీరనరసింహుడు, నాగలాంబకు శ్రీకృష్ణదేవరాయలు జన్మించారు. మూడో భార్య బచాంబికకు రంగరాజు, అచ్యుత రాయలు జన్మించారు. వీరనరసింహుడు 1506లో రాజ్యానికి వచ్చాడు. శ్రీరంగపట్నాలపై దండ యాత్రకు వెళ్లినపుడు అక్కడ కన్నుమూశాడు. ఇతని మరణం తర్వాత శ్రీకృష్ణదేవరాయలు రాజ్యాధినేత అయ్యాడు. శ్రీకృష్ణదేవరాయలు 1509 నుంచి 1529 వరకు రాజ్యపాలన చేశాడు. తిమ్మరుసు మంత్రి సాయంతో 1509, ఆగస్టు 8న సింహాసనాన్ని అధిష్టించి, రాజ్య వైభవాన్ని అత్యున్నత స్థాయికి తీసుకెళ్లాడు. పశ్చిమ తీరంలో పోర్చుగీస్ అధికారం పెరిగింది. కొత్తగా పోర్చుగీస్ గవర్నర్ అయిన అల్బుక్విక్ గోవా ఆక్రమణ కోసం అదిల్‌ఖాన్‌తో యుద్ధం చేయదలచి రాయల సాయం కోరాడు. రాయల సాయంతో 1509లో పోర్చుగీస్ వారు గోవాను ఆక్రమించారు. రాయలు బహమనీ సుల్తాన్‌లను ముప్పుతిప్పలు పెట్టాడు. బీజాపూర్‌పై దండయాత్ర చేసి రాయచూర్ కోటను ఆక్రమించాడు. బీదర్ దుర్గాన్ని వశం చేసుకున్నాడు. 1515లో కొండవీడును జయించాడు. ప్రతాపరుద్ర గజపతి తన కుమార్తెను రాయలకిచ్చి పెళ్లి జరిపి సంధి చేసుకున్నాడు. దీంతో కళింగ దండయాత్ర కూడా విజయవంతమైనట్లయింది. శ్రీకృష్ణదేవ రాయల చివరి రోజులు విషాదభరితమయ్యాయి. వారసత్వ పోరులో అల్లుడు అలియ రామరాయలు, సోదరుడు అచ్యుత రాయలు పోటీపడ్డారు. కుమారుడు తిరుమలుడు చిన్న వయసులోనే మరణించాడు. ఇతన్ని హత్య చేశారని, ఇందులో తిమ్మరుసు హస్తం వుందని రాయలు భావించి అతని కనుగుడ్లు పీకించాడని కథనం. ఈ గడ్డు రోజుల్లోనే రాయచూర్ అదిల్‌షా వశమైంది. ఈ సంఘటనలతో కుంగిపోయిన కృష్ణ దేవరాయలు 1529లో మరణించాడు. ఇతని తర్వాత అచ్యుతరాయలు 12 సంవత్సరాలు పాలించాడు. అంతఃకలహాలు కొనసాగడంతో అలియ రామ రాజుతో రాజ్యాధికార విభజనకు అంగీకరించాడు. దీనికి అంగీకరించని సాళువ నరసింహరాయలు ఉమ్మత్తూరు తదితర దుర్గాధిపతులతో కూడి తిరుగుబాటు చేశాడు. 1536లో అచ్యుతరాయలిని బందీ చేసి రామరాయలు పట్టాభిషిక్తుడయ్యాడు. రామ రాయలు దక్షిణదేశ దండయాత్రకు వెళ్లగా, రాజధానిలోని ఉద్యోగులు అచ్యుతరాయల్ని చెర నుంచి విడిపించారు. 1542లో అచ్యుతరాయలు మరణించడంతో రామరాయలు, తిరుమల మధ్య అధికార పోరాటం తీవ్రమైంది. అచ్యుతిని కొడుకు వెంకటపతిని సింహాసనమెక్కించి తిరుమల రాజ్యాధికారం తీసుకున్నాడు. తర్వాత తిరుమలను రామరాయలు వధించి సదాశివరాయలను రాజుగా చేశాడు. విడివిడిగా విజయనగరాన్ని ఓడించలేమని ☞

తెలుసుకున్న దక్కన్ సుల్తాన్‌లు కూటమిగా ఏర్పడి 1564 డిసెంబర్ 25న విజయనగరంపై దాడి చేశాడు. రాక్షస తంగడి వద్ద జరిగిన ఈ యుద్ధాన్ని తళ్లికోట యుద్ధమని కూడా పిలుస్తారు. రామ రాయలు వీరోచితంగా పోరాడి యుద్ధంలో మరణిం చాడు. రాజు మరణంతో సైన్యాన్ని సుల్తానుల సైన్యం చుట్టుముట్టి సంహరించింది. సుల్తాను సైన్యం నగరాన్ని ధ్వంసం చేసింది. ఎంతో వైభవంగా వున్న నగరాన్ని వీరు సర్వనాశనం చేశారు. విజయనగర సామ్రాజ్య కాంతిపుంజం ఆరిపోయింది.

విజయనగర చక్రవర్తులు, ఉన్నత రాజోద్యోగులు విలాసవంతంగా జీవించేవారు. వారిలో శృంగార ప్రియత్వం, భోగలాలసత్వం ఎక్కువైంది. సామాజిక దురాచారాలు ప్రబలిపోయాయి. బహుభార్యత్వం సర్వ సామాన్యం. ఉంపుడు గత్తె వుం డటం హోదాకు చిహ్నమైంది. నాటి సాహిత్యాన్ని పరిశీలిస్తే వేశ్యల మోసాలు, కోమట్ల మోసపు తాకట్టు వ్యాపారాలు, అక్రమ ధనార్జన పద్ధ తులు కనిపిస్తాయి. సతీ సహగ మనం అక్కడక్కడ కనిపిస్తుంది. వేషధారణలో తురుష్కులు, పాశ్చాత్య పద్ధతులు కొంత వరకూ వచ్చాయి. సనాతన ధర్మ పునరుద్ధ రణే లక్ష్యంగా పెట్టుకున్నారు విజయనగర రాజులు. ఈ కారణంగా వర్ణవ్యవస్థ బలపడింది. వర్ణ వ్యత్యా సాలు, వైషమ్యాలు పెరిగాయి. బ్రాహ్మణులు పూజారులుగానే కాకుండా మంత్రులు, భూస్వాములు, ఉద్యోగులుగా వున్నారు. వైశ్యులు ఎక్కువగా దేశీయ వ్యాపారం చేసే వారు. వ్యాపారంలో నీతి నియ మాలు తగ్గాయి. రెడ్లు, వెలమల రాజకీయ ప్రాముఖ్యం తగ్గి పోయింది. బ్రాహ్మణులు తక్కువ వృత్తులు చేపట్టి విద్యావిహీనులై గౌరవం కోల్పోయారు. విజయనగర సామ్రాజ్యాన్ని హిందు మత పునరుద్ధ రణ కోసం స్థాపించినా, పాలకులకు మాత్రం మత మౌఢ్యం లేదు. వీరి పాలనలో శైవ, వైష్ణవాలతో పాటు హిందుమత శాఖలన్నీ అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతాలు కూడా ప్రచారం పొందాయి. అంతే కాదు ఇస్లామ్‌ను కూడా ఆదరించారు. సంగమ రాజులు శైవ సంప్రదాయాన్ని గౌరవించారు. వీరు కూడా తుళువ, అరవీటి వంశాలు వైష్ణవాన్ని ఆదరించాయి.

వీరి కాలంలోనే తిరుపతి, అహోబిలం లాంటి వైష్ణవ క్షేత్రాలతోపాటు శ్రీశైలం, కాళహస్తి వంటి శైవ క్షేత్రాలు కూడా అభివృద్ధి చెందాయి. అలియ రామ రాయలు ముసల్మానులకు మసీదును కూడా కట్టిం చాడు. సామాన్య జనాల్లో గ్రామ దేవతారాధన వుండేది. మూఢనమ్మకాలు విపరీతంగా వుండేవి. స్త్రీలకు ఎలాంటి హక్కులు లేవు. రాజులు ప్రజల విద్యాభివృద్ధికి ఎలాంటి శ్రద్ధ కనబర్చలేదు. పాఠశాలలు కాని, గ్రంథాలయాలు కాని లేవు. అగ్రహారాల్లో, మఠాల్లో, దేవాలయాల్లో మాత్రమే విద్యాబోధన జరిగేది. వేదాలు, తర్క వ్యాకరణం, జ్యోతిష్యం, ఆయుర్వేదం, రాజనీతి, గణిత శాస్త్రా లను బోధన చేసేవారు. రాజసభల్లో వాగ్వాదాలు, పరీక్షలు జరిగేవి. డిండిమ భట్టు, శ్రీనాధుడు జరిపిన సాహిత్య పోరు తెలిసిందే.

అయితే, వీరి కాలంలో సాహిత్యం కొత్త పుంతలు తొక్కింది. అపూర్వమైన సాహిత్య సృష్టి జరిగింది. కావ్యాలు, మత గ్రంధాలు, సంగీతం, నాట్యంలాంటి శాస్త్ర గ్రంధాలు ఎన్నో వెలువడ్డాయి. దక్షిణ బారత దేశంలో ఏ యుగంలో కూడా ఇంత సాహిత్య పరిశ్రమ జరగలేదు. ఒక్క తెలుగులోనే కాకుండా కన్నడం, సంస్కృత భాషల్లో కూడా కావ్యాలు, నాట కాలు వెలువడ్డాయి. విద్యారణ్యులు, మాధవా చార్యులు, శాయగాచార్యులు ఎన్నో మత గ్రంధాలను రచించారు. రెండో దేవరాయలు 'మహానాటక సుధా నిధి'ని రచించాడు.

గంగాంబ 'మధురా విజయం' అనే ప్రసిద్ధ కావ్యాన్ని విరచించింది. ప్రౌఢ దేవరాయల కాలంలో డిండిమభట్టు గొప్ప పండితుడు. ఇతను సాళువాభ్యు దయం అనే కావ్యాన్ని రచించాడు. రాజనాదుడు అచ్యుత రాయాభ్యుదయాన్ని విరచించాడు. శ్రీనాథుడు ఆంధ్ర భాష విజయాన్ని చాటిచెప్పాడు. పంచతంత్రం వచ్చింది కూడా వీరి కాలంలోనే. శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో ప్రబంధ యుగం పరాకాష్టనందుకుంది. నాచన సోమునితో ఈ యుగ ఆంధ్రభాష చరిత్ర ప్రారంభమైంది. ఉత్తర హరి వంశాన్ని రచించి హరిహరదేవునికి అంకితమిచ్చాడు. సాళువ నరసింహుని కాలంలో పిల్లలమర్రి పినవీర భద్రుడు జైమినీ భారతాన్ని తెలుగులో అనువదిం చాడు. నరసింహరాయల కాలంలో తాళ్లపాక అన్నమయ్య తిరుపతి చేరి పదరచన మొదలు పెట్టాడు. శ్రీకృష్ణదేవ రాయలు ఆంధ్రభోజుడిగా పేరు పొందాడు. ఇతను కూడా మంచి కవి. ఆముక్త మాల్యద అనే ప్రబంధాన్ని రచించాడు. అష్టదిగ్గజాలు అతని ఆస్థానంలోనే కొలువు తీరారు. అల్లసాని పెద్దన మనుచరిత్ర, నంది తిమ్మన పారిజాతా పహరణం అనే కావ్యాలను రచించి రాయలకు అంకితమిచ్చారు. పెద్దన ఆస్థాన కవి. ప్రబంధ యుగకర్తగా, ఆంధ్ర కవితా పితా మహునిగా బిరుదులు పొందాడు. వీరు కాకుండా మాదయగారి మల్లన, ధూర్జటి, అయ్యలరాజు రామ భద్రుడు, తెనాలి రామ కృష్ణుడు, పింగళి సూరన, భట్టు మూర్తి సాహిత్యానికి గొప్ప సేవలం దించారు. మల్లన రాజశేఖర చరిత్ర రాసి కొండవీటి ప్రభువుకు అంకిత మిచ్చాడు. ధూర్జటి కాళహస్తీశ్వర శతకాన్ని తన ఇష్టదైవానికి అంకి తమివ్వగా, పింగళిసూరన రామవ పాండవీయం, కళాపూర్ణోదయం గ్రందాలు రచించగా, రామకృష్ణుడు పాండురంగ మహత్మ్యంతో గణతికె క్కాడు. భట్టుమూర్తి రామరాజ భూషణుడనే పేరుతో వసుచరిత్ర రాసాడు. తెలుగుభాష ఇతిహాసంలో ఈ కావ్యాలన్ని అపూరూపమైనవి. మొదటి దేవరాయలు శ్రీనాధునికి కనకాభిషేకం చేయగా అల్లసాని పెద్దనకు కృష్ణదేవరాయలు గండ పెండేరం తొడిగి, పల్లకి మోసినట్టు కదనం. సంగీతం, నాట్యం, చిత్ర లేఖనం, వాస్తు శిల్పాలకు సంబం ధించిన గ్రంధాలు కూడా వచ్చాయి. విద్యా రణ్యుని సంగీతసారము, రామయామాత్యుని స్వరమేళ కళా నిధి వీటికి ఉదాహరణలు.

కన్నడ బాషలో భాస్కర, కోటీశ్వర, బాహుబలి, బొమ్మరస మొదలైన జైన రచయితలు, జక్కనార్య, గురుబసవ, విరూపాక్ష మొదలైన శైవ పండితులు ఎన్నో రచనలు చేశారు. వాగ్గేయకారుడు పురందర దాసు ఈ కాలం వాడే.

అహోబిలం, తిరుపతి, శ్రీశైలం, కాళహస్తి, సింహాచలం మొదలైన దేవాలయాలకు గోపురాలు, మండపాలు కట్టించారు. పుష్పగిరి, తాడిపత్రి, లేపాక్షి, చంద్రగిరి, పెనుగొండల్లో విజయనగర ఆలయాలను నిర్మించారు. ■

ప్రపంచాన్ని ఆధునిక యుగంలోకి నెట్టిన అద్భుత పరిణామం పారిశ్రామిక విప్లవం. దీని ఫలితంగా మానవ సమాజం రూపు మార్చుకుంది. కొత్త భావాలు, ఆలోచనలు పుట్టుకొచ్చాయి. కొత్త రాజకీయ వ్యవస్థలు ఏర్పడ్డాయి. విజ్ఞాన శాస్త్రం పరుగులు తీయడం నేర్చుకుంది. చరిత్రలో జరిగిన అతిగొప్ప ఘటనలపై 'టి.ఎ' విశ్లేషణ...



# కూతపెట్టిన మిల్లు సైరన్

ప్రాచీన మానవుడు కనుగొన్న నిప్పు, లోహం, చక్రం వంటివి అతని జీవితాన్ని, సమాజాన్నీ ఎంతగా మార్చివేసాయి! వాస్తవానికి ఈ మూడింటినీ మనిషి ఒకే మారు కనుగొనలేదు. ఒక్కొక్క దానికి మధ్య వేలాది సంవత్సరాల వ్యవధి ఉంది. అయినప్పటికీ అవి ఒక్కొక్కటే అతని జీవితంలో విప్లవం తెచ్చాయి. అటువంటిది కేవలం కొన్ని దశాబ్దాల వ్యవధిలో ఇంతే మహత్వపూర్ణమైన అనేక పరికరాలను, వైజ్ఞానిక పద్ధతులను కనుగొంటే జరిగేదేమిటి? యావత్ మానవ సమాజమూ, దానితోపాటు అఖిల చరాచర ప్రపంచమే ఆ ప్రభావంతో సమూలంగా మారిపోతుంది. ఇంగ్లాండులో 18వ శతాబ్దిలో సంభవించిన 'పారిశ్రామిక విప్లవం' సరిగా అటువంటిదే.

ఏ పరిణామానికైనా కొన్ని పరిస్థితులు దారి తీస్తాయి. ఆ విధంగా పారిశ్రామిక విప్లవానికి ముందు కాలంలో ఇంగ్లాండుతో సహా పశ్చిమ ఐరోపా అంతటా పాడిపంటలు బాగా అభివృద్ధి చెందటంతో జనాభా విపరీతంగా పెరిగింది. కానీ ఆ కాలంలో వస్త్రాల నుంచి మొదలుకొని మేకుల వరకు నిత్య జీవితావసర వస్తువుల ఉత్పత్తి కుటీర పరిశ్రమలలో సాగుతున్నందున ఉత్పత్తి తగినంత లేక కొరతలు ఎదురయ్యాయి. ఈ విధమైన కొరతలు అప్పటి మనిషిని కొత్త మార్గాల అన్వేషణకు పురికొల్పాయి. దాని పర్యవసానమే పారిశ్రామిక విప్లవం. మొదట వస్తువుల అధికోత్పత్తి కోసం ఇనుము, ఉక్కు విరివిగా వినియోగంలోకి వచ్చి, వాటిని ఆ విధంగా వినియోగంలోకి తేగలిగేందుకు బొగ్గు, విద్యుచ్ఛక్తి, పెట్రోలియం ఉత్పత్తులను వాడి, ఫ్యాక్టరీలను నెలకొల్పిన మనిషి, వైజ్ఞానిక పరిశోధనలను సాగించి స్పిన్నింగ్ జెన్నీని, మరమగ్గాన్ని కూడా కనుగొన్నాడు. ఆ విధంగా పారిశ్రామిక విప్లవానికి పునాది పడింది. దానిని ఆధారం చేసుకుని చూస్తుండగానే ఒక పెద్ద భవనమే లేచింది. ఒక పరిశోధన మరొక పరిశోధనకు, ఒక ఉత్పత్తి మరొక ఉత్పత్తికి దారితీసాయి. ఉత్పత్తి అధికం కావడమంటే ఆ సరకుల రవాణాకు కొత్త సదుపాయాలు కావాలేగాని ఆ పని ఎడ్లబండిపైనో, తలమూటలుగానో జరగదు. కనుక ఆ అవసరంతో మనిషి ఆవిరితో నడిచే రైలింజను, పెట్రోలుతో నడిచే మోటారు వాహనం కనుగొన్నాడు. మార్కెట్‌ను విస్తరించాడు. దీనంతటికి సంబంధించిన సమాచారం చేరవేతకు టెలిగ్రాఫ్ పద్ధతిని ఆవిష్కరించాడు. త్వరితగతిన మనుషులు, సరకుల రవాణాకు విమానాన్ని కనుగొన్నాడు. సరకుల వ్యాపారం ఇంగ్లాండ్ సరిహద్దులను దాటి అంతర్జాతీయమై, మరింత అధికోత్పత్తికి దారి తీసింది. ఈ క్రమంలో కొత్త సమాజానికి కొత్తరకం వస్తువులు అవసరమై, అధికోత్పత్తి మరింత అధికం కావటం అవసరమై, అందుకోసం వైజ్ఞానిక పరిశోధనలు మరింత నిరంతరమయ్యాయి. లెక్కలేనన్ని కొత్త రకం ఉత్పత్తులు వాడకంలోకి వచ్చాయి. వీటికోసం ప్రకృతి వనరులను లోగడకన్న అనేక రెట్లు వినియోగంలోకి తేవటం మొదలైంది. సంపదలు పెరిగిపోయాయి.

ఉత్పత్తి రంగం, దాని ప్రభావంవల్ల ఆర్థిక రంగం, మరొక వైపు వైజ్ఞానిక పరిశోధనలు ఈ విధంగా పెను విప్లవానికి లోనవుతుండగా మానవ సమాజం మారకుండా ఉండగలదా? సమాజం యావత్తూ వినిమయ-వాణిజ్య-వైజ్ఞానిక విప్లంలో భాగమైపోయింది. కార్మికులు, యజమానులు, పరిశోధకులు, వ్యాపారుల సంఖ్య పెద్ద పెట్టున పెరిగిపోయింది. వీరందరి అవసరాల కోసం వైద్యం, వినోదం, పౌరసౌకర్యాలు, సర్వీసు రంగాలు కొత్త రూపాలు తీసుకోవటంతో పాటు విస్తరించాయి. ఒకవైపు పోటీలు, మరొక వైపు లాభాపేక్షలతో అక్రమాలు, అవినీతి కూడా తలెత్తాయి. ఈ ప్రభావాలు సామాన్యులపైనా పడ్డాయి. మొత్తంమీద సామాజిక జీవన విధానం, సంస్కృతి, ఆలోచనా ధోరణులు, మానవసంబంధాలు అన్నీ అపూర్వమైన మార్పులకు లోనయ్యాయి. వీటి ఫలితంగా రాజకీయ వ్యవస్థ కొత్తరూపం సంతరించుకుంది. ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవం సాగుతున్న కాలంలోనే ఫ్రాన్స్‌లో సంభవించిన రాజకీయ, సామాజిక విప్లవం(1789) బ్రిటిష్ రాజకీయాలను, సమాజాన్ని మరింతగా ప్రభావితం చేసింది. ప్రజాస్వామిక ధోరణులు విస్తృతమయ్యాయి. ఫ్యూడలిజం, రాచరికం బలహీనపడ్డాయి. సంప్రదాయిక మతధోరణులు బలహీనపడ్డాయి. ఉదారవాదం తలెత్తింది. సంపదలు పెరగటంతో అందరి జీవన ప్రమాణాలు మెరుగుపడుతూ కూడా ఉత్పత్తిదారులు, వ్యాపారులకు, కార్మికులకు మధ్య అంతరాలు పెరగటంతో వర్గరాజకీయాలకు అంకురార్పణ జరిగింది. ఇంగ్లాండ్‌లో ఈ విధంగా సంభవించిన పారిశ్రామిక విప్లవమూ, దాని ప్రభావాలూ ఆ ఒక్క దేశానికే పరిమితం కాలేదు. పారిశ్రామిక విప్లవం క్రమంగా బెల్జియం, ఫ్రాన్స్, అమెరికా, జర్మనీవంటి ఇతర పాశ్చాత్య దేశాలతో ఆరంభించి, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత తక్కిన ఖండాలకు వ్యాపించింది. అందుకు అనుగుణమైన రీతిలో అక్కడి సమాజాలూ మారసాగాయి. పారిశ్రామిక విప్లవ ఫలితాలలోని అతి ముఖ్యమైన అంశాలలో వలసవాదం ఒకటి. నిజానికి వలసలు అంతకు 200ఏళ్ల క్రితమే పోర్చుగల్, హాలండ్‌ల పక్షాన సంప్రదాయక వ్యాపారాలకోసం స్వల్పస్థాయిలో మొదలయ్యాయి. పారిశ్రామిక విప్లవం సంభవించడంతో అందుకు అవసరమైన ముడిసరుకుల సంపాదనకు, ఉత్పత్తుల విక్రయానికి సిసలైన వలసవాదం తలెత్తింది. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 50దేశాలు వలసలుగా మారి బ్రిటిష్ సామ్రాజ్యం విస్తరించింది ఆ విధంగానే. మొత్తంమీద పారిశ్రామిక విప్లవం ప్రపంచ తీరును పూర్తిగా మార్చివేసింది. ■



బంగారు రుచులతో బంగారు బంధాలను సృష్టించుకుంది ఆమె. జీవితాన్ని బంగారు క్షణాలమయం చేసేసుకుంది. శ్రీవారికి జీవన జ్యోతి. చక్కటి విద్యాబుద్ధులతో పిల్లలను చక్కగా తీర్చిదిద్దగల చల్లని మాతృమూర్తి. అందరి సంక్షేమం



అంతఃకలహాలతో కుప్పకూలిన బహమనీ రాజ్యం శిథిలాల్లో గోల్కొండ రాజ్యం పుట్టింది. 170 యేళ్ల పాటు తెలుగుగడ్డపై కుతుబ్‌షాహీలు చక్రం తిప్పారు. మహ్మదీయ పాలకులైనా మత సహనానికి మారుపేరుగా నిలిచారు. తెలుగు సంస్కృతిని, కళలను, సాహిత్యాన్ని సమాదరించారు. ఇబ్రహీం కులీ స్వయంగా తెలుగు పండితుడు. 'మల్కిబరాముని'గా ప్రసిద్ధిగాంచాడు. భద్రాచల రామాలయ నిర్మాణం కుతుబ్‌షాహీల కాలంలో జరిగిందే. ఒక సాధారణ హిందూ యువతి ప్రేమ కోసం పరితపించిన మహ్మద్ కులీ ఆమె పేరుతో నిర్మించిన మహానగరం నేటికీ తెలుగువారి రాజధానిగా విరాజిల్లుతూనే వుంది. 'కోహినూర్ వజ్రం'లాంటి గోల్కొండ రాజ్యంపై బి. కార్తిక్ రచన...

# 'కోహినూర్ వజ్రం' గోల్కొండ రాజ్యం



క్రీ.శ.1347లో గుల్బర్గా పట్టణము రాజధానిగా అల్లావుద్దీన్ హసన్ గంగూ బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. ఈ వంశీయుల ప్రాబల్యం కారణంగా ముసునూరి, పద్మనాయక, రెడ్డి, విజయనగర రాజ్యాలు క్షీణింపసాగాయి. 1500 ప్రాంతంలో బహమనీ రాజ్యము అహ్మద్‌నగర్, బీజాపూర్, బీరార్, బీదర్, గోలకొండ రాజ్యాలుగా చీలిపోయింది. గోలకొండ పట్టణాన్ని రాజధానిగా క్రీ.శ.1518 నుంచి 1687 వరకు అవిచ్ఛిన్నంగా స్వర్ణాంధ్ర భూభాగాలను, ముఖ్యంగా తెలంగాణా, తీరాంధ్రములను కుతుబ్‌షా వంశీయులు పాలించారు. గోలకొండ సామ్రాజ్య స్థాపకుడు సుల్తాన్ కులీకుతుబుల్ ముల్క్ టర్కిస్థాన్ నివాసి. ఖరాకునీల్ వంశీయుడు. ఈ వంశీయులు టర్కిస్థాన్ భాగాన్ని పాలిస్తూ, ఇరాన్ పశ్చిమ భూభాగాలను ఆక్రమించి విశాల సామ్రాజ్య నిర్మాణాన్ని గావించారు. కీర్తి ప్రతిష్టలను ఆర్జించిన ఖరాయూసిఫ్, రెండో సికందర్, జహన్‌షా వంటి యోధులు ఈ వంశము వారే.

సుల్తాన్ కులీ కొన్నాళ్లు ఢిల్లీలో వున్నాడు. అయితే, అక్కడి వాతావరణం అనుకూలించకపోవడంతో బహమనీ రాజ్యానికిచేరాడు. బహమనీ సుల్తాన్ మహ్మద్‌షా సుల్తాన్‌కులీని, అతని పినతండ్రి పీర్ కులీని ఆహ్వానించి గౌరవించాడు. సుల్తాన్ కులీ వీరుడు, గణితశాస్త్ర పారంగతుడు కావడం వల్ల మహ్మద్‌షా ఇతనికి రాజప్రసాద గణాంకాధికారిగా నియమించాడు. అంతే కాకుండా సైన్యాధికారిగా ఉన్నత పదవిని కట్టబెట్టాడు. 1463 ప్రాంతంలో దక్కన్‌లోని తెలంగాణాలో అల్లర్లు చెలరేగడంతో బహమనీ సుల్తాన్ కలత చెంది, వాటిని అణచి వేసేందుకు సుల్తాన్ కులీని పంపించాడు. సుల్తాన్ కులీ తన రాజకీయ పరిణతిని ప్రదర్శించి విజ్ఞతతో పరిస్థితుల్ని చక్కదిద్దాడు. ఈ పరిణామాలపట్ల హర్షించి 1495లో గోలకొండ ముఖ్య పట్టణంగా తెలంగాణా ప్రాంతానికి అతన్ని సుబేదారుని చేశాడు. 16వ శతాబ్దపు ఆరంభంలో బహమనీ సుల్తాన్ మహ్మద్‌షా మరణించడంతో ఆ సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. 1518లో గోలకొండకు స్వాతంత్ర్యాన్ని సుల్తాన్‌కులీ ప్రకటించాడు. అలా ఆరంభమైన కుతుబ్‌షాహీల పరిపాలన 171 సంవత్సరాల పాటు కొనసాగింది. సుల్తాన్ కులీ చిన్నచిన్న రాజ్యాలను జయిస్తూ బందరు రేవు వరకూ తన సామ్రాజ్యాన్ని విస్తరింపచేశాడు. గోలుకొండ కోటను దుర్భేద్యంగా రూపొందించాడు. హిందూ, ముస్లిం విచక్షణలేకుండా ఇరువురి భాషా, సంస్కృతి, కళలను సమాదరించాడు. ఈనాటికి అద్భుతాలుగా నిలిచే సువిశాల భవంతులను, నీటిపారుదల వనరులను నిర్మించాడు. ఇంతటి గొప్ప రాజ్యనిర్మాత మాత్రం అతి దుఃఖదాయకమైన పరిస్థితుల్లో మరణించడం విషాదం. తన 99వ ఏట కన్న కొడుకు చేతిలోనే హతుడయ్యాడు. సుల్తాన్ కులీకి హైదర్ కులీ, కుతుబుద్దీన్ కులీ, యార్ కులీ (జంషీద్ కులీ), అబ్దుల్ కరీం, దౌలత్ కులీ, ఇబ్రహీం కులీ అనే ఆరుగురు కుమారులున్నారు. షాదుషాని హతమార్చి రాజ్యాధికార పీఠాన్ని దక్కించుకున్నవాడు యార్ కులీ. తండ్రి దేహాన్ని సమాధిగా మార్చడమే కాకుండా తన పదవికి ముప్పు తెచ్చే అన్ని శక్తులను, సత్యాలను సమాధి చేయాలని సంకల్పించాడు. తన పేరును జంషీద్ కుతుబ్‌షాగా మార్చుకొని సోదరుడైన కుతుబుద్దీన్‌ను శాశ్వతంగా అంధుణ్ణి చేశాడు. సుల్తాన్ కులీని తన ఆదేశాల మేరకు సంహరించిన తన ప్రియమిత్రుడు మీర్ మహ్మద్ హందానిని కూడా జంషీద్ చంపివేశాడు. తమ్ముడైన ఇబ్రహీంను కూడా మట్టుబెట్టాలనే పథకాలు చేశాడు. ఇది తెలుసుకున్న ఇబ్రహీం తన తండ్రికి సన్నిహితులైన రాజులు, నమ్మకస్థులైన అనుచరులతో విజయనగర ప్రభువు రామరాయలను ఆశ్రయించాడు. గోలకొండలో అస్థిరత, అరాజకత్వం హెచ్చరిల్లిపోయాయి. సమస్యల సుడిగుండంలో జంషీద్ చిక్కి శల్యమైపోయాడు. ఏడేళ్లపాటు ఎదురు లేకుండా పాలించిన జంషీద్ 1550లో క్షయ వ్యాధితో కన్నుమూశాడు. జంషేద్ మరణానంతరం అతని తనయుడు సుభాన్ కులీని ఆధిష్టింపచేయాలని అంతరంగికులు తలపోశారు. అప్పటికే సుభాన్ వయసు కేవలం ఏడేళ్లు. అధికారం మరొకరికి దక్కకూడదని గోలకొండ రాణులు ☞

# We aren't the only ones who think an ACCP is way ahead of others.

"The skills and commitment of the Aptech students are truly remarkable and perfectly matches with the kind of profiles we were looking for."

***Ravi Munukutia,***
***Deputy Manager-Systems,***
***MBL Research & Consultancy Group (P) Ltd***

" We are extremely satisfied with the quality of students recruited from Aptech. We are looking forward to your enthusiastic and reliable response to meet our requirements.

***N.V. Rama Raju***
***Director-Marketing***
***Baron Infotech***

**Elbee, Baron Infotech, Satyam and MBL think so too.**

" We have been availing the services of Aptech Placements and we are pleased with the quality of students included into Satyam Enterprise Solutions."

***Satyam Enterprise Solutions.***

" We are very pleased to put on record the high calibre of trainees recruited from Aptech for our office at Hyderabad."

***G.P. Nagaraj,***
***Manager- MSD/ Personnel,***
***Elbee Express Services***




Over 70,000 students placed in blue-chip companies like Seagull, IBM Global, Bajaj, Black & Decker, GE Capital, Tata Honeywell..... Students trained in industry - relevant technologies, Personality Development and Management modules. 10 Placement cells across India. Get Aptech certified. Now!

**Microsoft**
Aptech is Microsoft's Internet Solution Partner

* ACCP stands for Aptech Certified Computer Professional All brand names are registered trademarks of respective companies

*Think quick*
*Think Aptech*
















**Contact your nearest Aptech Centres in Andhra Pradesh.**

* Conditions apply

బిల్ఖైస్ జమాన్, ఖతీజా దేరానులు ఆ బాలుడినే గద్దెనెక్కించారు. సుభాన్‌కు యుక్త వయసు వచ్చే వరకు అహ్మద్‌నగర్‌లో వున్న సయిఫ్ ఖాన్ ఐనుల్ముల్కుకు బాధ్యతలప్పగించారు. ముక్కుపచ్చలారని పసి బాలుడు సువిశాల సామ్రాజ్యానికి రాజైతే ఎన్ని అనర్థాలు జరగాలో అన్నీ జరిగాయి. గోలకొండ సేనాని జగదేవరావు, జగపతిరావు, బహిరీఖాన్‌వంటి ప్రముఖులకు సుభాన్ గద్దెనెక్కడం ఇష్టంలేదు. జగదేవరావు భువనగిరి దుర్గమందు బందీగా వున్న దౌలత్ కులీ పక్షం వహించాడు. తన అనుచరులతో వెళ్లి దౌలత్‌ను చెర నుంచి విడిపించాడు. ఇది తెలుసుకున్న సయిఫ్ జగదేవరావు, దౌలత్‌ను బందించి చెరలో పెట్టాడు. సయిఫ్ పాలనలో ప్రజల్లో అసంతృప్తి పెరిగిపోయింది. తమను రక్షించే ప్రభువు కోసం నిరీక్షించడం మొదలుపెట్టారు. మంత్రుల కోరికపై విజయనగరంలో వున్న ఇబ్రహీం గోలుకొండకు విచ్చేశాడు. ప్రజల జయజయధ్వానాల మధ్య ఇబ్రహీం మళ్లీ తన సామ్రాజ్యంలో అడుగుపెట్టాడు. చరిత్రలో ఇదో చిరస్మరణీయ ఘట్టం. 1550లో గోలకొండ రాజ్య పీఠమలంకరించిన ఇబ్రహీం ఉత్కృష్టమైన పాలనను అందించాడు. దుర్గాన్ని మరింత పటిష్టం చేశాడు. హుస్సేన్‌సాగర్ జలాశయాన్ని తవ్వించి ప్రజల దాహార్తిని తీర్చాడు. కళలకు పెద్ద పీట వేసి ఎందరో కవులకు ఆశ్రయం కల్పించాడు. తెలుగులో పాండిత్యం కలవాడు కాబట్టి ఆస్థాన కవిగా అద్దంకి గంగాధర కవిని నియమించి 'మల్కిభరాము'డన్న బిరుదు పొందాడు. ఇతని కాలంలోనే మరింగంటి వారి తొలి యక్షగానం రూపుదిద్దుకుంది. తళ్లికోట యుద్ధం తర్వాత ఇబ్రహీంకు మహ్మద్ కులీ జన్మించాడు. కుతుబ్‌షా వంశంలో ఐదవవాడైన మహ్మద్ బాల్యం నుంచే తన ప్రతిభా పాటవాలను ప్రపంచానికి చాటిచెప్పాడు. రాజ తేజస్సుతో శోభిల్లేవాడు. అందుకే ఇబ్రహీంకు మహ్మద్ అంటే వల్లమాలిన ప్రేమ. మహ్మద్ ఒక సామన్య యువతి ప్రేమ కోసం పరితపించాడు. హైదరాబాద్ నగర నిర్మాణం వెనుకగల ఈ కథానాయికే భాగమతి. చచ్లాంలో నివసించే హిందూ యువతి బాగమతి. ఈ ప్రేమలో పడిన మహ్మద్ తన ప్రాణాలకు తెగించి వరదతో పరవళ్లు తొక్కుతున్న మూసీ నదిని దాటాడు. కుమారుని క్షేమాన్ని తలచే ఇబ్రహీం వెంటనే మూసీపై వంతెన నిర్మించాడు. రెండు హృదయాలను ఏకంచేసింది కాబట్టే ఈవంతెన 'ప్రణయవారధి'గా పేరుపొందింది. ఇప్పటికీ పురానాపూల్ పేరుతో ప్రేమగుర్తుగా వుంది. కోరుకున్న యువతిని పెళ్లిచేసుకొని హిందూ, ముస్లిం మతాల మధ్య చక్కటి సంబంధాన్ని నెలకొల్పాడు. ఇబ్రహీం కాలంలో టర్కీ, ఆరేబియా, పర్షియా రాజ్యాలతో వర్తక వ్యాపారాలు సాగించడంతో గోలకొండ రెండో ఈజిప్ట్‌గా ఘనత వహించింది. మొదట్లో తనకు ఆశ్రయమిచ్చిన విజయనగర పాలకులతో స్నేహంగానే వున్నాడు. కాని కొన్ని కారణాల వల్ల ఈ స్నేహం శత్రుత్వంగా మారింది. ఇబ్రహీం రాజమండ్రి, కొండవీడు దుర్గాలను జయించి, ఉదయగిరి, వినుకొండలపై దాడిచేశాడు. ఇబ్రహీం1580లో మరణించాడు. ఇతను భాగీరథి దేవి అనే హిందూ స్త్రీని ప్రేమించి పెళ్లాడి గోలకొండను ఆమె పేర భాగీరథి నగరమని వ్యవహరించాడని ఒక కథనం.

ఇబ్రహీం ఆరుగురు కొడుకుల్లో మూడో వాడైన మహ్మద్ కులీకుతుబ్‌షా 1580-1612 వరకు రాజ్య పాలనచేశాడు. 14వ ఏటే సుల్తానయ్యాడు. ఇతని కాలాన్ని కుతుబ్‌షాల స్వర్ణయుగంగా చెబుతారు. ఇతని కాలంలో నంద్యాల, కర్నూలు, కడప, గండికోట ప్రాంతాలు గోల్కొండ రాజ్యంలో చేరింది. ఈ మహస్వాప్నికుడి సంకల్ప ఫలితంగానే ఈనాటి భాగ్యనగరం అవతరించింది. 1591లో మొహరం రోజున సింహలగ్నంలో మూసీనది దక్షిణ తీరంలో హైదరాబాద్‌కు శంకుస్థాపన చేశారు. నగరం మధ్యలో అద్వితీయ కట్టడమైన చార్మినార్‌ను నిర్మించారు. పైభాగాన పడమటి దిశలో ఒక మసీదును ఏర్పరచాడు కుతుబ్‌షా. 1594లో చార్‌కమాన్‌ను నిర్మించాడు. ఇది పూర్తయిన ఏడాదిలోనే దారుల్‌షిఫా కట్టించాడు. ఆసియా ఖండపు తొలి వైద్యశాల ఇదే.

మహ్మద్ కులీకి పురుష సంతానం లేనందువల్ల తన కుమార్తెకు సోదరుని కుమారునితో వివాహం జరిపి, అతనినే వారసుడుగా ప్రకటించాడు. మహ్మద్ కుతుబ్‌షా పేరుతో గోల్కొండ నవాబయ్యాడు. ఇతని ఆస్థానంలో పారశీక, దక్కనీ భాషలకు ఆదరణ లభించింది. మీర్ మహ్మద్ ముమీన్ తూనికలు, కొలతల మీద 'రిసాల మిక్దరీయ' అనే గ్రంథం, హకీంతకీయుద్దీన్ వైద్యశాస్త్రం మీద 'మిజానుత్ తబాయి కుతుబ్ షాహీ' అనే గ్రంథం రచించారు. మక్కా మసీదుకు పునాదులు పడ్డాయి. సుల్తాన్ కుతుబ్‌షా కుమారుడు అబ్దుల్లా కుతుబ్‌షా సింహాసనమెక్కేనాటికి ఇతను బాలుడైనందువల్ల తల్లి సంరక్షురాలుగా పరిపాలన సాగింది. అబ్దుల్లా 1626-1672 వరకు పరిపాలన సాగించాడు. రాజ్య వ్యవహారాలపై నిర్లక్ష్యం వహించాడు. ఇంతలో షాజహాను మొగలు సామ్రాజ్యాధినేత అయ్యాడు. షియా రాజ్యమైన గోల్కొండను ద్వేషించాడు. అసమర్థుడైన అబ్దుల్లా షాజహాన్‌తో సంధి చేసుకొని, అమూల్యమైన కానుకలు సమర్పించాడు. అయినా మొగలు సైన్యాలు కళింకోట, మన్సూర్‌లపై దాడి చేసి విధ్వంసం సృష్టించాయి. 1636లో అబ్దుల్లా మొగలు సామంతునిగా మారి ప్రతి సంవత్సరం రెండున్నర లక్షలు కప్పం చెల్లించడమే కాక, ప్రార్థనలలో మొగలు పాదుషా పేరును చేర్చాడు. 1672లో అబ్దుల్లా మరణించేనాటికి గోల్కొండ మొగల్ సామంత రాజ్యంగా మారింది. అబ్దుల్లా కాలంలో దర్శనమిచ్చిన ఒకేఒక్క కాంతిపుంజం కోహినూర్ వజ్రం. అబ్దుల్లా అనంతరం ఇతని మూడో అల్లుడు అబుల్ హసన్ సుల్తానయ్యాడు. 1672-1687 వరకు పరిపాలించిన అబ్దుల్లా తానాషా అనే పేరుతో ప్రసిద్ధుడయ్యాడు. గోలకొండ సామ్రాజ్యానికి ఒక తెలుగువాడ్ని ప్రధాన మంత్రిగా నియమించిన ఘనత తానాషాదే. మాదన్నకు ప్రధానమంత్రి పదవిని ఇచ్చి తన సర్వమత సహనాన్ని చాటుకున్నాడు.

1685లో బీజాపూర్‌పై సమరశంఖం పూరించిన ఔరంగజేబు గోల్కొండ రాజులపై యుద్ధం ప్రకటించాడు. తానాషా సర్వ శక్తులు ఒడ్డి పోరాడిన ఫలితం లేకుండా పోయింది. ఆత్మాభిమానం చంపుకొని చక్రవర్తితో సంధి చేసుకున్నాడు. కుట్రదారుల కుయుక్తుల వల్ల అక్కన్న, మాదన్న కన్నుమూశారు. ఈ పరిస్థితుల్లో తానాషాను నిలువరించడం తేలికైన పనేనని భావించిన ఔరంగజేబు నాల్గోసారి గోల్కొండను ముట్టడించాడు. 1687లో కుతుబ్‌షాహీల సామ్రాజ్య భానుడు అస్తమించాడు. గోల్కొండ కోట ద్వారాలు తెరుచుకున్నాయి. కనిపించిన ప్రతీ సైనికుణ్నీ మొగలులు నరికివేశారు. తానాషాను బంధించారు. 13 ఏళ్లపాటు కారావాసంలోవుండి కన్నుమూశాడు. ■







బడుగుజీవులు పిడికిళ్లు బిగించిన సన్నివేశం. సామాన్యుడు శిరమెత్తి కళ్లెర్రజేసిన అరుదైన సంఘటన. ఆధునిక సామాజిక విప్లవాలకు ఆదిగురువు ఫ్రెంచి విప్లవం. స్వేచ్ఛా, సమతల ధ్వజస్తంభాన్ని భూమండలంపై నాటిక ఘనత ఫ్రెంచి విప్లవానిది. ఆ మహోజ్వల పరిణామంపై 'కెబిఆర్' వర్ణన...



# రాజును గెలిచిన పేద



ఎన్నో కష్టనష్టాలు, సామాజిక అసమానతలు, దోపిడీలను చవిచూస్తూ జీవితాల్ని వెళ్లదీసే అసంఖ్యాక సామాన్య మానవుల ఓరిమికి ఒక హద్దుంటుంది. ఆ హద్దు దాటిన మరుక్షణాన వారి హృదంతరాళాల్లోని అసహనం, అసంతృప్తి ప్రచండ ప్రభంజనమై విరుచుకుపడతాయి. ఎదుటనున్న సమస్త పీడనా కారకుల్ని, దాష్టీకపు ప్రోత్సాహకుల్ని తుడిచిపెట్టేస్తాయి. సామాజిక జీవిత చక్రంలో నవ శకానికి తెర తీస్తాయి. ఆధిపత్య, పాలక వర్గాలు జడుసుకు చచ్చే ఆ 'విలయమే' విప్లవం. అలాంటి విప్లవం తొలిసారి 1789లో ఫ్రాన్స్‌లో రెక్క విప్పింది. 'ఫ్రెంచి విప్లవం'గా చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖితమైన ఈ తొలి సామాజిక విప్లవం ఫ్రాన్స్ రాచరికపు, ఆధిపత్య వర్గాలను కూకటివేళ్లతో పెకలించి వేయడమే కాదు, యావత్ ప్రపంచంలోని పీడిత, తాడిత వర్గాలు శృంఖలాల్ని తెంచుకోవడానికి కూడా కొత్త పథ నిర్దేశం చేసింది. నిజమైన ఆధునిక సమాజానికి 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం' పట్టుకొమ్మలని చాటిచెప్పిన ఆ మహావిప్లవం అనంతరకాలంలో ప్రపంచవ్యాప్తంగా అనేక గొప్ప సామాజిక మార్పులకు దోహదం చేసింది. 'మధ్య యుగాల సామాజిక న్యాయం'లో మగ్గిపోతున్న ఎన్నో దేశాల చరిత్రగతిని మలుపు తిప్పింది. ఆ మహోజ్వల విప్లవ ఘట్టాలను ఒక్కసారి అవలోకిస్తే ఇప్పటికీ 'ఆధునిక ప్రపంచాన్ని' కుళ్లబొడుస్తున్న రుగ్మతలు అప్పట్లో ఎలా ఉన్నాయో కనిపిస్తాయి.

1750–1850 మధ్యకాలం ఆధునిక చరిత్రలో విప్లవాల శకంగా నమోదైంది. యూరప్‌లోని అగ్ర రాజ్యాలు, వాటి అజమాయిషీలో ఉన్న వలస రాజ్యాలలో నెలకొన్న సామాజిక అసమానతలు అనూహ్యరీతిలో మార్పులకు దారితీశాయి. అప్పటికి వందేళ్లుగా ఫ్రాన్స్ రాజులు యూరప్‌లో కెల్లా 'రాజభోగం' అనుభవించిన పాలకులుగా ప్రసిద్ధిపొందారు. లూయీ–14 పెట్టిపోయిన సంపూర్ణ రాచరిక ప్రమాణాలు తదుపరి పాలకులకు వేదాలయ్యాయి. తర్వాత వచ్చిన లూయీ–15 (1715–74) రాజతేజానికేం లోటు రాకపోయినా రచ్చ గెలవలేక కూలబడ్డాడు. యూరప్‌లోనూ, యూరోపియన్ వలసల్లోనూ చెలరేగిన 'ఆస్ట్రియా వారసత్వ పోరాటం', 'ఏడేళ్లయుద్ధా'లలో లూయీ–15 పరాజయం పాలైన ఫలితంగా ఇండియా, ఉత్తర అమెరికాల్లో ఫ్రాన్స్ సామ్రాజ్యానికి తెర దిగింది. పారిశ్రామిక విప్లవ నేపథ్యంలో వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో బ్రిటన్‌కన్నా ఫ్రాన్స్ ఎంతో వెనుకబడి ఉంది. 1690–1780 మధ్య కాలంలో ఫ్రాన్స్‌లో జనాభా 28శాతం పెరగటంతో కొత్తసమస్యలు తలెత్తాయి. వీటికి, అనేక వలస రాజ్యాలను కోల్పోవడమనే నష్టం, అధికార యంత్రాంగం భారీ అవినీతి తోడయ్యాయి. 1774లో లూయీ–16 రాజ్యాధికారానికొచ్చేనాటికి పరిస్థితి దారుణంగా ఉంది. ఖజానా చిల్లిగవ్వ లేక వెక్కిరిస్తోంది. ఈ గడ్డు స్థితి నుంచి గట్టెక్కడానికి లూయీ–16 మంత్రులు, నిపుణులు, సలహాదారులను సమావేశపర్చాడు. పన్నులను పెంచడం లేదా ఖర్చు తగ్గించడం వినా గత్యంతరంలేదని తేల్చారు. ఖర్చు తగ్గింపు దుర్లభం కనుక లూయీ–16 ప్రజలపై తీవ్ర పన్నులభారాన్ని మోపాడు. ఇంత చేసినా లోటు పూడకపోయేసరికి అప్పటివరకు పన్నుల నుంచి మినహాయింపు నిచ్చిన సంపన్నులు, అధికార యంత్రాంగం, మతాధికారులను కూడా కొంతమటుకు పన్నుభారం వహించమని రాజు కోరాడు. వాళ్లు పన్నులు చెల్లించడానికి తిర స్కరిస్తారని తేలిపోవడంతో లూయీ–16 ప్రతినిధుల సభ–"స్టేట్స్ జనరల్‌"ని సమావేశపర్చాలని నిశ్చయించాడు. ఈ నిర్ణయంతో సంపన్నులు, మతాధికారులు, సామాన్యులు(థర్డ్ ఎస్టేట్) ప్రతినిధులుగా ఉన్న వెర్సయిల్స్‌లోని 'స్టేట్స్ జనరల్' రెండొందల ఏళ్లలో తొలిసారి 1789 మే 5న సమావేశమైంది. సామాజిక అసమానతలు, పీడనలు, కరువు కాటకాల్ని చవిచూసి దయనీయస్థితిలో కొట్టుమిట్టాడుతున్న 'థర్డ్ ఎస్టేట్', ఈ సమావేశం తమకు ప్రభుత్వంలో భాగస్వామ్యం వహించడానికి సమానత్వాన్ని,స్వాతంత్ర్యాన్ని ఇవ్వగలదనే ఆశతో ఉంది. అయితే ఆ ఆశ అడియాసే అయ్యింది. అంతవరకు ఓర్పు వహించిన 'థర్డ్‌ఎస్టేట్' ఇక అమీతుమీకి సిద్ధమైంది. జూన్ 17న 'స్టేట్స్ జనరల్' నుంచి విడివడి, ఫ్రెంచి ప్రజానీకంలో మెజారిటీకి ప్రాతినిధ్యం వహించే నిజమైన 'జాతీయఅసెంబ్లీ' ఏర్పాటుచేసుకుంది. పరిస్థితి చేయిదాటిపోతోందని భావించిన లూయీ–16 'థర్డ్ ఎస్టేట్' ప్రతినిధుల సమావేశ భవనానికి తాళాలు వేయించాడు. అరచేతిని అడ్డుపెడితే ప్రజా ఉద్యమం ఆగుతుందా? 'థర్డ్ ఎస్టేట్' ప్రతినిధులకు దగ్గర్లోని ఇన్‌డోర్ టెన్నిస్ కోర్టుని సమావేశసలిగా మార్చుకున్నారు. జూన్ 20న అక్కడ సమావేశమై ప్రాథమిక హక్కులైన 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాల' పునాదులపై రాజ్యాంగం నిర్మితమయ్యేవరకు సమష్టిపోరు సాగిద్దామని ముక్తకంఠంతో ప్రతినబూనారు. సామాన్యుడు అసామాన్యుడిగా అవతరించిన మహత్తర క్షణాలవి.'థర్డ్‌ఎస్టేట్' త్వరలో విజయం సాధిస్తోందని పసిగట్టిన సంపన్నులు, మతాధి ☞

కారులు కొద్దిరోజుల్లోనే ప్లేటు ఫిరాయించేశారు. 'దర్డ్ ఎస్టేట్' డిమాండ్లకు ఒప్పుకోవడానికి రాజు నిరాకరించాడు. పైపెచ్చు డిమాండ్లకు అనుకూలంగా ఉన్నట్టు కనిపించిన కొందరు కీలక మంత్రులను, అధికారులపై వేటువేసి ఆ పదవులను సంపన్నులకు కట్టబెట్టాడు. ఒకవైపు పనిదొరక్క, మరోవైపు పొట్టనింపుకునే రొట్టెముక్కల ధరలు ఆకాశాన్నంటుతున్న తరుణంలో తమ డిమాండ్లకు తలొగ్గకపోగా రాజు పోతున్న పెడధోరణులను చూసిన సామాన్య జనానికి ఒళ్లు మండుకొచ్చింది. శాంతియుత ఉద్యమంతో లాభంలేదని గ్రహించిన జనం పారిస్ వీధుల్లోకి ఉరికారు. ఆయుధాల కోసం బాస్టిల్ జైలుపై విరుచుకుపడ్డారు. జైలు అధికారి నిర్దాక్షిణ్యంగా తుపాకులతో నిప్పులు వర్షించడంతో ఎందరో తూటాలకు బలయ్యారు. వార్త దావానలంలా పారిస్ అంతటా వ్యాపించింది. ఆగ్రహించిన జనసంద్రం బాస్టిల్‌పైకి వెల్లువెత్తింది. ఎప్పుడూ పాలకులను వరించే విజయం ఈసారి దర్డ్ ఎస్టేట్‌ని వరించింది. ఫ్రాన్స్ చరిత్రలోనే కాక యావత్ ప్రపంచ చరిత్రలోనే అది మహోత్కృష్ట ఘట్టం. జనాన్ని పీడించుకుతిన్న రాజు ఓడిపోయాడు. రాజ్యం కూలింది. పారిస్ నగరం జనం విజయవేడుకకు వేదికయ్యింది. రాచరికానికి చరమగీతం పాడుతూ కొత్త రాజ్యాంగానికి ప్రాణప్రతిష్ట జరిగింది. మానవ హక్కుల ప్రకటన వెలువడింది. మానవజాతి చరిత్రలోనే ప్రప్రథమంగా సామాన్యులు స్వప్నించిన హక్కులు ఎట్టకేలకు వారికి ప్రాప్తించాయి. విప్లవానంతరం కొత్త ప్రతినిధులు లూయీ–16ని, అతడి అర్ధాంగిని, ఇతర మంత్రులు, అధికారులను విచారించి 1793లో మరణశిక్షను అమలుచేశారు.



టెన్నిస్ కోర్టు సమావేశం

ఫ్రెంచి విప్లవంలో సామాజిక అసమానతలు, పాలకవర్గపు పీడన వహించిన పాత్రకు మేధావివర్గం సల్పిన అవిశ్రాంత కృషి ఏమాత్రం తీసిపోదు. పీడిత ప్రజల తరఫున పోరాడిన వోల్టెయిర్, రూసో, మాంటెస్క్యూల అక్షరపోరాటమే ఫ్రెంచి విప్లవానికి సైద్ధాంతిక భూమికను సిద్ధం చేసింది. వీరిలో కూడా వోల్టెయిర్‌ది అందరికన్నా పెద్ద పాత్ర. ఎప్పటికప్పుడు పాలకులను ఎండగడుతూ వారు పెట్టిన యాతనలు, ఇబ్బందులను తట్టుకుని నిలబడిన వోల్టెయిర్ ఏదో ఒకనాడు రాచరికం అంతమవుతుందని ప్రగాఢంగా నమ్మాడు. అది ఉరికేపోలేదు. వోల్టెయిర్ మరణించిన 11 ఏళ్లకు విప్లవం పెల్లుబికి ఆ ఆకాంక్షను నిజంచేసింది. విప్లవకారులు అతడి పాత్రను విస్మరించలేదు. ఖననం చేసిన వోల్టెయిర్ దేహాన్ని వెలికితీసి, పారిస్‌కు తీసుకొచ్చి, అశేష జనవాహినితో ఊరేగింపుగా తీసుకెళ్లి ఘనంగా అంతిమసంస్కారాలు చేశారు. అతడి సమాధిపై 'హీ టాట్ అజ్ హౌ టు బికమ్ ఫ్రీ' (స్వేచ్ఛాజీవులు కావడానికి ఎలా పోరాడాలో అతడు మాకు నేర్పాడు) అనే వాక్యాన్ని చెక్కారు. నిజంగానే, ఫ్రెంచివాసులకు వోల్టెయిర్ పోరాటం నేర్పాడు. వారికేకాదు, యావత్ ప్రపంచ పీడిత ప్రజానీకానికి కూడా. ఫ్రెంచి విప్లవం లేకపోతే ఆ తర్వాత వందేళ్ల కాలంలో ప్రపంచదేశాల చరిత్రలను సమూలంగా మార్చివేసిన అనేక విప్లవాలు అసలు జరిగేవే కాదు. ఆ విప్లవం స్ఫూర్తిప్రదాతగా నిలిచివుండకపోతే బ్రిటిష్ రచయిత థామస్ పైన్ 1791లో 'ది రైట్స్ ఆఫ్ మ్యాన్' (మానవహక్కులు) ప్రకటించి వుండేవాడే కాదు. అది లేకపోతే మేధోప్రపంచం కొత్త దారిలో నడిచేదే కాదు.



బాస్టిల్ జైలు ముట్టడి

ఇవన్నీ ఒక ఎత్తయితే, అప్పటికే బాగా పాతుకు పోయివున్న ఆధునిక పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద వ్యవస్థలు నానాటికీ దృఢతరమై, ఎన్నటికీ చెక్కుచెదరని స్థాయికి చేరివుండేవి. ఆ వ్యవస్థల్లో మనుషుల విలువలు, హక్కులు మంటగలిసి ఆధిపత్య ధోరణులు రాజ్యమేలుతుండేవి. పాలకవర్గ మదపుటేనుగులు నిర్దాక్షిణ్యంగా సామాన్యుల శరీరాలపై నుంచి రీవిగా నడుస్తూ పోతుండేవి. ఫ్రెంచివిప్లవం ఫలితంగా ఆ విపత్తు ప్రపంచ ప్రజానీకానికి తప్పిపోయింది. మొత్తమ్మీద, పారిశ్రామిక విప్లవం ఫలితంగా విస్తరిల్లిన సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధానాలను–'విప్లవాల యుగం మనది, విప్లవిస్తే జయం మనది' అంటూ ఎందరో మహానాయకులు నడిపిన విప్లవోద్యమాలు కట్టడిచేస్తూ వస్తున్న ఫలితంగానే ప్రపంచంలో ఒక సమతూకస్థితి కొనసాగుతోంది. ■

పట్టుదలతో విజయాలు సాధించి ఉన్నత స్థానానికి ఎగబాకినవాడు నెపోలియన్.
ఫ్రెంచి ప్రజాస్వామ్యాన్ని కూలదోసి తననే చక్రవర్తిగా ప్రకటించుకున్నాడు.
కొన్ని తొలి విజయాలను సాధించుకున్నప్పటికీ, జగద్విజేత కావాలన్న
అతని దురాశకే అతను బలయ్యాడు. నెపోలియన్ జీవితంపై
గోవర్ధనం కిరణ్‌కుమార్ రచన...





# రాజ్యకాంక్షకు బలైన విజేత

నెపోలియన్, ప్రపంచ నలుగురు విజేతల్లో ఒకడు. నిరుపేద కుటుంబం నుంచి మహోన్నత చక్రవర్తిత్వాన్ని సాధించిన మహావీరుడు. యోధుడు, పరిపాలనా దక్షుడు. ఐరోపాలో సామ్రాజ్యాన్ని స్థాపించాడు. తన పరిపాలాన్ని కాలాన్ని నెపోలియన్ యుగంగా చరిత్రకారులచే కొనియాడించుకున్న ఘనుడు. ఫ్రెంచ్ విప్లవం జరిగిన కొంతకాలానికి అధికారానికి వచ్చాడు. అందుకే 'విప్లవాన్ని నేనే, విప్లవ వారసుడిని నేనే' అని ప్రకటించుకున్నాడు. మాకియావెల్లి కుటిల రాజనీతిని అనుసరించాడు. 'సంగీతకారుడు ఫిడేలును అభిమానించినట్లు, తాను అధికారాన్ని ప్రేమిస్తాను' అని స్వయంగా చెప్పుకున్నాడు. 1769, ఆగస్ట్ 15వ తేదీన ఇటలీలోని కార్మికా ద్వీపంలో సామాన్య ప్రభువుల కుటుంబంలో జన్మించాడు. ఇటలీ ఈ దీపాన్ని ఫ్రాన్స్‌కు అమ్మడంతో నెపోలియన్ ఫ్రెంచ్ పౌరుడయ్యాడు. 17వ ఏట సైనిక విద్య పూర్తిచేసిన ఇతడు ఫిరంగి దళంలో ఉప లెఫ్టినెంట్‌గా చేరాడు. కొద్దిరోజులు ఉద్యోగం వదిలివేసిన నెపోలియన్ డాంటన్ నాయకత్వంలోని నేషనల్ కన్వెన్షన్ అధికారంలోకి రాగానే సైన్యంలో చేరాడు. 1795లో జాతీయ కన్వెన్షన్‌పై దాడిచేసిన పారిస్‌గుంపు నుంచి కన్వెన్షన్‌ను కాపాడి వారి అభిమానాన్ని పొందాడు. దీంతో 1796లో ఇతనిని సైన్యాధ్యక్షుడిగా నియమించారు. డైరెక్టరీ ఆజ్ఞల మేరకు ఇటలీ, ఆస్ట్రియాలపై యుద్ధానికి వెళ్లిన నెపోలియన్ తన శక్తిసామర్ధ్యాలను చాటుకున్నాడు. అందుకు ఇతనిని 'లిటిల్ కార్పోరల్' అని ముద్దుగా పిలిచారు. త్వరితకాలంలోనే ఇంగ్లాండ్ మినహా దాదాపు యూరప్ అంతా నెపోలియన్ ఆధీనంలోకి వచ్చింది. నెపోలియన్‌కు జైత్రయాత్రలతో లభించిన కీర్తి ప్రతిష్టలను చూసి డైరెక్టర్లు కూడా భయపడి ఇతన్ని అప్రతిష్టపాలు చేయడానికి ఇంగ్లాండ్‌పైకి యుద్ధానికి పంపారు. ఇంగ్లాండ్‌ను ఓడించాలంటే తూర్పుదేశాలతో వారివ్యాపార సంబంధాలను దెబ్బతీసియాలని భావించి ఆ మార్గంలోని ఈజిప్ట్, సిరియాలను ఆక్రమించు కోవాలనుకున్నాడు. ఈజిప్ట్‌తో విజయం సాధించినప్పటికీ, నైలూ నదివద్ద జరిగిన యుద్ధంలో ఓడిపోయాడు. సిరియా వద్దకూడా ఓడి అతికష్టం మీద ఫ్రాన్స్‌కు చేరాడు.

డైరెక్టరీ సహాయం పంపకపోవడమే తన ఓటమికి కారణమని ప్రచారంచేసి వారిని అప్రతిష్టపాలు చేశాడు. డైరెక్టరీని లొంగదీసు కుని దానిని రద్దుచేశాడు. నూతన రాజ్యాంగాన్ని స్థాపించి ఎన్నికలలో విజయం సాధించి మొదటి కాన్సుల్‌గా పదవి స్వీకరించాడు. 1802లో జీవితకాలం కాన్సుల్‌గా ప్రకటించుకున్నాడు. 1804 డిసెంబర్ 2న పోప్ సమక్షంలో చక్రవర్తిగా పట్టాభిషేకం చేసుకున్నాడు.

1804 నుంచి 1810 వరకు నెపోలియన్ చేసిన యుద్ధాలలో విజయం సాధించి తిరుగులేని సార్వభౌమాధికారాన్ని సాధించాడు. నెపోలియన్ విజయవార్తలను విన్న నాటి ఇంగ్లాండ్ ప్రధాని ఫిట్ "ఐరోపా పటాన్ని చుట్టివేయండి. 10ఏళ్ల వరకు దానితో పని ఉండదు" అని వాపోయాడంటే నెపోలియన్ విజయంపరంపర ఏ విధంగా కొనసాగిందో ఊహించుకోవచ్చు. ఇంగ్లాండును లొంగదీసుకునేందుకు చివరి రోజుల్లో తాను ప్రవేశపెట్టిన భూ అఖండ విధానం కారణంగా కేవలం నాలుగు సంవత్సరాలలోనే (1810-1814) సాధించిన విజయాలన్ని తలకిందులయ్యాయి. పరాజయాలకు ముందరే నెపోలియన్ మరణించినట్లయితే ప్రపంచ మహావిజేతగా నిలిచేవాడు. తన చర్యల కారణంగానే ఆ దుస్థితిని తెచ్చుకున్నాడు. అందుకే నాకునేనే గొప్ప శత్రువుని, నా విధికి నేనే కారకుణ్ణి అని చివరి రోజుల్లో వాపోయాడు. 1821, మే5న న నెపోలియన్ సెయింట్ హెలీనా దీవిలో ప్రవాసంలో మరణించాడు. ■

అమెరికా విప్లవంతోనే ఆధునిక ప్రజాస్వామ్యానికి అంకురార్పణ జరిగిందని చెప్పవచ్చు. వ్యక్తి స్వేచ్ఛావాదంపై జాన్‌లాక్ చేసిన రచనలు అమెరికా విప్లవకారులను ప్రభావితం చేశాయి. అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో మానవహక్కులకు పెద్దపీట వేశారు. రాష్ట్రాలకుండే ప్రత్యేక హక్కులను గౌరవిస్తూ ఫెడరల్ రాజ్యాంగాలకు కూడా అమెరికా రాజ్యాంగం స్ఫూర్తినిచ్చింది. ఎం. నాంచారయ్య విహంగ వీక్షణం...



# మానవ [illegible] క్రమం



పుట్టుకతో మనుషులందరూ సమానులేననీ, వారి నుంచి లాగేసుకోవడానికి వీలులేని ప్రాథమిక హక్కులు కొన్ని ఉంటాయని నేటి ఆధునిక రాజ్యాలు కనీసం మాట మాత్రంగానైనా అంగీకరిస్తున్నాయి. అయితే, 1776 జులై 4కు ముందు అటువంటి విలువల పునాదిగా గల ప్రభుత్వమేదీ ప్రపంచంలో ఎక్కడా ఉనికిలో లేదు. 'అమెరికా సంయుక్త రాష్ట్రాల (యుఎస్ఎ) స్వాతంత్ర్య ప్రకటనతోనే ఈ విలువలు పుట్టాయి. ఈ చరిత్రాత్మక ప్రకటన రూపశిల్పి, ఆనాటి యువ నేత థామస్ జెఫర్సన్. ఏడాది యుద్ధం అనంతరం వలస పాలకులతో తెగతెంపులు చేసుకునే ప్రకటన ఇది. బ్రిటిష్ పాలకులు తమపై సాగించిన దమనకాండను ఈ ప్రకటన తీవ్ర పదజాలంతో ఎండగట్టింది. మూడోకింగ్‌జార్జ్ తప్పిదాల జాబితాను ఎత్తిచూపింది. తొలుత యుఎస్ఎగా ఏర్పడిన 13 రాష్ట్రాలు ఈ ప్రకటనను ఏకగ్రీవంగా ఆమోదించి నూతన శకానికి నాంది పలికాయి. నూతన రాజ్యాంగాన్ని రూపొందించుకున్నాయి. ప్రపంచ గమనానికి జెఫర్సన్ రూపొందించిన ప్రకటన కొత్త ఒరవడిని దిద్దింది. ఐరోపా దేశాలు ఉత్తర అమెరికా ఖండంలో సామ్రాజ్యాల స్థాపనకు చేసిన ప్రయత్నాలే చివరికి అమెరికా సంయుక్త రాష్ట్రాలు అనే కొత్త దేశం పుట్టుకకు దారి తీశాయి. స్థానికులైన ఇండియన్ల (రెడ్ ఇండియన్లు) నుంచి భూములను లాగేసుకుని, వారిని తరిమివేశారు. ఆఖరుకు ఇండియన్ల భూమి ఇతర ఖండాల ప్రజల సొంతం అయింది. మొదటి స్పెయిన్ దేశస్థులు 1513లో ఫ్లోరిడాకు, 1504లో న్యూ మెక్సికోకు చేరుకున్నారు. ఫ్రెంచ్ వారు 1673లో మిసిసిపీ లోయలో ప్రవేశించారు. రష్యన్లు 1741లో అలాస్కా చేరుకున్నారు. వలసవాదులందరిలోనూ బ్రిటిష్ వారినే విజయం వరించింది. ఆధిపత్య పోరులో ఫ్రెంచ్ వారిని 1763 లోనే ఇంగ్లీష్ సేనలు ఉత్తర అమెరికా నుంచి సాగనంపాయి. బ్రిటిష్ వారు చక్కెర చట్టం, స్టాంపుల చట్టం, టౌన్‌షెడ్ సుంకాలు వంటి చర్యల ద్వారా అమెరికా ప్రజలపై పన్ను బారం పెంచారు. అలాగే అపలేషియన్ పర్వత ప్రాంతాల్లో జనావాసాలను నిషేధించడమే గాక, బ్రిటన్‌లు ఆర్థిక సంక్షోభాన్ని నివారించడానికి అమెరికా వలస ప్రాంతాల్లో పన్నులు రెట్టింపు చేశారు. ఆదాయం పెంచుకోవడానికి, అధిక లాభాలు రావడానికి బ్రిటిష్ వలస పాలకులు చేపట్టిన దోపిడీ విధానాలతో స్థానికులు ఆగ్రహించారు. దానిని అణచివేయడానికి బ్రిటన్ తన సేనలను పెంచింది. ఇందుకైన ఖర్చులను సైతం అమెరికన్ల నుంచే పన్నులరూపంలో వసూలు చేయడంతో 1775లో యుద్ధం జరిగింది. బ్రిటన్ పాలనలోని మొదటి 13 వలస ప్రాంతాలు (రాష్ట్రాలు) తరఫున ఏర్పడిన సెకండ్ కాంటినెంటల్ కాంగ్రెస్ 1776 జులై 4న బ్రిటన్‌పాలన నుంచి స్వాతంత్ర్యం ప్రకటించుకుంది.

కొత్తగా ఏర్పడిన అమెరికా సంయుక్త రాష్ట్రాలను పాలించడానికి ఆర్టికల్స్ ఆఫ్ కాన్ఫెడరేషన్ (రాజ్యాంగం) రూపొందించింది. ఎట్టకేలకు బ్రిటిష్ సేనలపై 1783లో విజయం సాధించారు. పారిస్ ఒప్పందం ఫలితంగా అమెరికాకు సరిహద్దులు ఏర్పడ్డాయి. ఆర్టికల్స్ ఆఫ్ కాన్ఫెడరేషన్ ప్రకారం బలహీనమైన కేంద్ర ప్రభుత్వం ఏర్పడింది. వర్ధమాన దేశమైన అమెరికాను సమర్థవంతంగా పాలించడానికిది అనువుగా లేదని తేలింది. 1787లో కొత్త రాజ్యాంగాన్ని రూపొందించారు. 1788లో దాన్ని అన్ని ప్రాంతాల వారు ఆమోదించారు. 1789 నుంచి ఈ రాజ్యాంగం అమలులోకి వచ్చింది. జార్జి వాషింగ్టన్ సంయుక్త రాష్ట్రాలకు అధ్యక్షుడయ్యాడు. అలాగే స్వాతంత్ర్య ప్రకటన రూపొందించిన థామస్ జెఫర్సన్ తొలి విదేశాంగ మంత్రి అయ్యారు (మూడో అధ్యక్షునిగా కూడా పని చేశారు-1801-09). కొత్త రాజ్యాంగం ప్రకారం వెంటనే దేశం వైశాల్యం విస్తరించడం మొదలైంది. 1803లో లూజియానా కొనుగోలు చేసి కలుపుకున్నారు. ఆ తర్వాత మరో నాలుగు రాష్ట్రాలను చేర్చుకున్నారు. విస్తరణ పశ్చిమ దిశగా వేగం పుంజుకోగానే కొత్త సమస్య తలెత్తింది. పారిశ్రామికంగా వేగంగా ముందుకు సాగే దక్షిణాది ప్రాంతంలో నల్లజాతి వారిని బానిసలుగా చూడడం అనేది వివాదంగా మారింది. రాష్ట్రాలకు మరిన్ని హక్కులు వుండాలని దక్షిణాది రాష్ట్రాలు డిమాండ్ చేశాయి. ఫెడరల్ (కేంద్ర) చట్టాలను అమలు చేయకుండా రద్దు చేసే హక్కు తమకుందని, 1798లో కెంటకీ, వర్జీనియాలు ప్రకటించాయి. సౌత్ కరోలినా రాష్ట్రం కూడా ఇదే దారిలో పయనించడంతో 1832లో సమస్య తీవ్రమైంది. ఫెడరల్ చట్టాలు అమలు చేయని రాష్ట్రాలపై బల ప్రయోగం తప్పదని దేశాధ్యక్షుడు ఆండ్రూ జాక్సన్ బెదిరించేదాక వెళ్లింది. నీగ్రోల బానిసత్వం సమస్యపై అనేక రాజీ ఒప్పందాలు కుదిరిన ఫలితంగా సంయుక్త రాష్ట్రాలు అర్థ శతాబ్దానికి పైగా కలిసి వుండడం సాధ్యమైంది. 1880లో దేశాధ్యక్షునిగా అబ్రహాం లింకన్ ఎన్నికయ్యారు. బానిసత్వాన్ని నిషేధిస్తామని పాలకపక్షమైన రిపబ్లికన్ పార్టీ ప్రకటించింది. ఫలితంగా సౌత్ కరోలినా నేతృత్వంలో ప్రముఖ పది దక్షిణాది రాష్ట్రాలు విడిపోయాయి. అయితే, విడిపోయే హక్కు ఈ రాష్ట్రాలకు లేదని లింకన్ స్పష్టం చేశాడు. ఇది అమెరికాలో అంతర్యుద్ధానికి దారి తీసినప్పటికీ, చివరికి సమాఖ్య బలపడింది. బానిసత్వ వ్యవస్థ రద్దయింది. బానిసలందరికీ పౌరసత్వం లభించింది. పురుషులందరికీ వయోజన ఓటింగ్ హక్కు లభించింది. తనకు ఎదురు తిరిగి యుద్ధంలో ఓటమి పాలైన దక్షిణాది రాష్ట్రాలపై కక్ష సాధింపు చర్యలు చేపట్టకపోయినా లింకన్‌ను శత్రువులు హత్య చేశారు. అప్పుడు కాంగ్రెస్‌లో మెజారిటీ కలిగిన రిపబ్లికన్లు తమ విధానాల అమలుకు దూకుడుగానే వ్యవహరించారు. దక్షిణాది రాష్ట్రాల్లో నల్లజాతి వారి పౌర హక్కులు కాపాడడానికి గట్టి చర్యలే తీసుకున్నారు. 1877లో కేంద్ర (ఉత్తరాది) దళాలను దక్షిణాది రాష్ట్రాలనుంచి ఉపసంహరించారు. సాధారణ పరిస్థితులు ఏర్పడడానికి వందేళ్లు పట్టింది. తర్వాత పారిశ్రామికీకరణ పుంజుకుంది. దేశదేశాల నుంచి వలసవచ్చి స్థిరపడే వారి సంఖ్య పెరిగింది. ■



ప్లాసీ యుద్ధ విజయంతో ప్రారంభమైన బ్రిటీష్ ఆధిపత్యం భారత్‌పై సుమారు 200 సంవత్సరాలపాటు కొనసాగింది. భారతీయ నవనాడుల్ని బ్రిటిష్ వాళ్ళు పీల్చి పిప్పిచేశారు. స్థానిక చేతివృత్తుల్ని ధ్వంసం చేశారు. వ్యవసాయరంగం చతికిలబడింది. బ్రిటీష్ వలస పాలకుల దోపిడీపై 'ఎం. కోదండరామ్' వివరణ ...

# దేశాన్ని డొల్ల చేసిన తెల్లపాలన

పదిహేడువందల యాభైఏడులో జరిగిన ప్లాసీ యుద్ధంలో బెంగాల్ నవాబు సిరాజుద్దౌలాను ఓడించి ఈస్టిండియా కంపెనీ అధికారాన్ని హస్తగతం చేసుకోవడంతో భారతదేశంలో బ్రిటిష్‌పాలన ప్రారంభమైంది. దేశ చరిత్రలో ఒక నూతన శకం మొదలైంది. బ్రిటిష్ వాళ్ల రాక పూర్వం కూడా భారతదేశంపై ఎన్నోసార్లు విదేశీయులు దండయాత్రలు చేశారు. అయితే వాళ్లకు, బ్రిటిష్‌వాళ్లకు తేడా ఉంది. గతంలో దాడి చేసిన వాళ్లలో కొందరు ఊళ్లను దోచుకొని వెనుదిరిగి వెళ్లిపోయారు. మరికొందరు ఇక్కడే స్థిర నివాసం ఏర్పర్చుకొని, ఈ దేశంలో భాగమయ్యారు. దాదాపు 200 సంవత్సరాలపాటు ఈ దేశాన్ని పాలించినా, బ్రిటిష్ వాళ్లు అంతకుముందు దేశంలోకి వచ్చిన విదేశీయులవలె ఇక్కడ స్థిరనివాసం ఏర్పర్చుకోలేదు. సమాజంలో భాగంకాలేదు. తమకు దొరికిన అధికారంతో బ్రిటిష్ పాలకులు ఇక్కడి ఆర్థిక సంపదను తరలించి తమ దేశాన్ని అభివృద్ధి చేసుకున్నారు. బ్రిటిష్ వాళ్లు కేవలం సంపద కొరకే ఈ దేశాన్ని పరిపాలించారు. లాభాపేక్ష ఒక్కటే బ్రిటిష్ ప్రభుత్వాన్ని నడిపించింది. సామాజిక- ఆర్థిక రంగాల్లో వాళ్లు చేపట్టిన చర్యలు ఇందుకు సాక్ష్యం.

వ్యవసాయ రంగంలో బ్రిటిష్ పాలకులు అంతవరకూ ఉన్న భూశిస్తు విధానాలకు స్వస్తి పలికారు. రెవిన్యూను పెంచుకోవడానికి భూమిపై యాజమాన్యపు హక్కును చట్టబద్ధం చేశారు. బ్రిటిష్ చట్ట ప్రకారం ప్రభుత్వ రికార్డుల్లో ఏ భూమికి యజమానిగా నమోదైతే రైతుకు ఆ భూమిపై మాత్రమే హక్కు సంక్రమిస్తుంది. బ్రిటిష్ పద్ధతిలో హక్కును నిలబెట్టుకోవాలంటే శిస్తు చెల్లించాలి. శిస్తు చెల్లించని రైతుల భూమిని ప్రభుత్వం జప్తు చేసేది. బ్రిటిష్ వారికి పూర్వం శిస్తు చెల్లించకపోయినా సమాజం గుర్తించినంత కాలం యాజమాన్యపు ☞

హక్కు కొనసాగేది.

బ్రిటిష్‌వారి కాలంలో శిస్తు చాలా ఎక్కువగా ఉండేది. శిస్తు చెల్లించలేక చాలామంది రైతులు భూమిని వదులుకొన్నారు. మరికొందరు శిస్తు చెల్లించడానికి భూమిని తాకట్టుపెట్టి అప్పులు తెచ్చుకొన్నారు. అప్పులు చెల్లించలేక భూమిని వదులుకొన్నారు. ఈ విధంగా పేద రైతులు భూమిని కోల్పోగా వడ్డీ వ్యాపారంలో డబ్బు సంపాదించిన వాళ్ల, ఇతోధికంగా పెట్టుబడి కలవాళ్ల చేతుల్లో భూమి కేంద్రీకృతమైంది.

బ్రిటిష్ వాళ్ల పాలనా ఫలితంగా భారత దేశంలో చాలా వేగంగా వ్యాపారీకరణ పెరిగి పోయిం ది. ప్రతీది అంగట్లో సరుకుగా మారిపోయింది. అయితే అందువలన స్థానిక వస్తువులకు గిరాకీ రాలేదు. అలా జరిగితే దేశ ప్రజలకు లాభం జరిగేది. బ్రిటిష్ పాలకులు ఉద్దేశపూర్వకంగా స్థానిక ఉత్పత్తి వ్యవస్థను నాశనం చేశారు. తమ దేశంలో తయారైన వస్తువులను బారతదేశంలో ప్రవేశ పెట్టారు. అంటే వ్యాపారీకరణ వల్ల కూడా బ్రిటిష్ వారికే లాభం జరిగింది.

చేతివృత్తుల వారు తయారుచేసిన వస్తువులను ఎగుమతిచేసి ఖ్యాతి గడించిన భారతదేశం ముడి సరుకులు, ఆహారధాన్యాలు ఎగుమతి చేసే దేశంగా మారిపోయింది. ఆహారధాన్యాల ఎగుమతి వలన రైతులకు కలిగిన లాభం తక్కువ. కొంతమంది ధనిక రైతులు తిండిగింజలతో పాటు విదేశీ మార్కెట్లలో గిరాకీగల వాణిజ్య పంటలు పండించారు. అయితే వారు సంపాదించింది కూడా శిస్తురూపంలో ప్రభుత్వమే తన్నుకుపోయింది. కనుక వ్యాపారీకరణ వలన స్థానిక వ్యాపారస్తులకు, విదేశీ కంపెనీలకు మాత్రమే లాభం కలిగింది.

బ్రిటిష్ పాలన ఫలితంగా దేశంలో వస్తూత్పత్తి కుంటుపడింది. చేతివృత్తులు దెబ్బతిన్నాయి. ఈ వర్గం బలపడి ఉంటే పారిశ్రామికీకరణకు కృషి చేసేది.


కలకత్తాలో బ్రిటిష్ గవర్నర్ జనరల్ కోసం నిర్మించిన భవనం

చేతివృత్తులు దెబ్బతినడంతో బారత దేశంలో పరిశ్రమలు ఏర్పడలేదు. వలస పాలనా కాలంలో బ్రిటిష్ వాళ్లు మాత్రమే కంపెనీలను నెలకొల్పారు. అవి కూడా జనపనార, జౌళి రంగాలకు చెందినవే. స్థానిక వనరులతో చవకగా వస్తువులను తయారు చేయడానికి మాత్రమే బ్రిటిష్ పాలకులు కంపెనీలను ఏర్పర్చారు.

వనరులపై గుత్తాధిపత్యాన్ని నిలుపుకోవటానికి బ్రిటిష్ పాలకులు నిరంకుశ పాలనా వ్యవస్థను ఏర్పర్చారు. పరిపాలనలో స్థానికులకు బాగస్వామ్యం కల్పించలేదు. చదువు, జ్ఞానం లేని భారతీయులకు ప్రజాస్వామ్యం పనికి రాదన్నారు. హక్కులు అనవసరమన్నారు. ఒకవేళ జాతీయోద్యమానికి తలవంచి స్థానికులకు పరిపాలనలో బాగస్వామ్యం కల్పించినా ఆర్థిక వ్యవహారాలను తమ చేతుల్లోనే ఉంచు కొన్నారు. ఈ దోపిడీ వల్లనే బారతదేశంలో బీదరికం పెరిగింది. భూములు కోల్పోయి, చేతివృత్తులు దెబ్బతిని చాలామంది కూలీలుగా మారిపోయారు. బ్రిటిష్ దోపిడీ వలన రైతులు, చేతివృత్తుల వారు, ఆదివాసులు ఎక్కువగా నష్టపోయారు.

అయితే బ్రిటిష్‌వారి పాలన వల్ల ఒక లాభం కూడా కలిగింది. బ్రిటిష్ పాలన కారణంగా పాశ్చాత్య దేశాలలో ఆవిర్భవించిన ఉదారవాద, సోషలిస్టు బావాలు భారతదేశంలోకి ప్రవేశించాయి. వాటిని జీర్ణించుకున్న మధ్యతరగతి జాతీయోద్యమాలలోనే కాదు విబిన్న సామాజిక ఉద్యమాలకు కూడా నాయకత్వం వహించింది. ఈ వర్గం వల్లనే పెంపొందిన జాతీయోద్యమం విదేశీ దోపిడీని అంతం చేసింది.

బ్రిటిష్ పాలకులను పారదోలితే దేశం బాగుపడుతుందని బావించిన జాతీయోద్యమ నాయకులు 1930కల్లా తమ అవగాహనను మార్చుకొన్నారు. వలస పాలనాక్రమంలో తలెత్తిన అసమానతలను రూపుమాపకుండా విదేశీ దోపిడీని అంతం చేయ లేమన్న విషయాన్ని గ్రహించారు. అందుకే విదేశీ యులను పారదోలి, సామాజిక-ఆర్థిక అసమానతలను నిర్మూలించి, ప్రజాస్వామిక వ్యవస్థలను నిర్మించవలసిన కర్తవ్యం జాతీయోద్యమంలో బాగమైంది. ■



ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విషాదాంతమైనా, అనంతరం జరిగిన పోరాటాలకు అది ఉత్తేజాన్నిచ్చింది. మీరట్‌లో సిపాయిల తిరుగుబాటుగా ప్రారంభమై అనతికాలంలో ఉత్తర భారతమంతటా విస్తరించి ప్రజాపోరాటం రూపును తీసుకుంది. ఈ పోరాటానికి దోహదం చేసిన కారణాలు, పోరాట ఫలితాలపై ఎం. కోదండరామ్ విశ్లేషణ?...

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం

పద్దెనిమిది వందల యాభైఏడు స్వాతంత్ర్య సంగ్రామం మొదట ఒక సైనిక తిరుగుబాటుగానే ప్రారంభమైంది. 1857 మే నెల 10నాడు మీరట్‌లో సైనికులు బ్రిటిష్ అధికారులపై దాడి చేసి తిరుగుబాటు బావుటా ఎగురవేయడంతో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రా మం మొదలైంది. మరుసటి రోజు ఉదయంకల్లా తిరుగుబాటుదార్లు ఢిల్లీ నగరం చేరుకొని బహదూర్‌షాను తమ నాయకుడిగా ఉండమని విజ్ఞప్తి చేశారు. అప్పటి కింకా బహదూర్ షా నామమాత్రంగానే చక్రవర్తి. వాస్తవంగా అధికారం బ్రిటిష్ వారి చేతుల్లోకి వెళ్ళిపోయింది. చక్రవర్తి కూడా బ్రిటిష్ వారిచ్చే రాజభరణాలతో జీవించ వలసిన దుస్థితి ఏర్పడింది. బహదూర్‌షా ఊగిసలాడిన తర్వాత చివరికి తిరుగు బాటుదార్లకు నాయకత్వం వహించడానికి అంగీ కరించాడు. బహదూర్‌షాను చక్రవర్తిగా ప్రకటించి తిరుగుబాటు దార్లు బ్రిటిష్ వారి కార్యాలయాలపై దాడి చేసి బ్రిటీష్ ఏజెంటును, మరికొందరు అధికారులను హత్యగావించి అధికారాన్ని హస్తగతం చేసుకొన్నారు. బహదూర్‌షాకు ప్రజల్లో చక్రవర్తిగా ఉన్న గుర్తింపువలన, ఆయన నాయకత్వం కింద బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా తిరుగుబాటులో పాల్గొనడానికి ఉత్తర భారతదేశంలో ప్రజలు ముందు కొచ్చారు. అందుకనే ఢిల్లీని ఆక్రమించుకొన్న నెల రోజుల్లోనే కాన్పూర్, లక్నో, బెనారస్, అలహాబాద్, బరేలీ, జగదీష్‌పూర్, ఝాన్సీ ప్రాంతాలకు తిరుగుబాటు విస్తరించింది. హైదరాబాద్, బెంగాల్ ☞

కంటోన్మెంటుల్లో కూడా సైనికులు తిరుగుబాటు చేసారు. దేశం మొత్తం మీద 2,32,224మంది గల బ్రిటిష్ సైన్యంలో సగం మం దికి పైగా తిరుగుబాటులో పాల్గొ న్నారు. అయితే దక్షిణ భారతదేశం లోనూ, పంజాబ్, బెంగాల్ ప్రాంతా ల్లోనూ తిరుగుబాటుదార్లకు ప్రజల నుంచి ఆదరణ లభించలేదు. మిగి లిన ప్రాంతాల్లో స్థానిక జమీం దార్లు, రాజులు తిరుగుబాటుదార్లకు నాయకత్వం వహించడానికి సిద్ధ పడారు. తాంతియాతోపే, ఝాన్సీ లక్ష్మీబాయి, నానాసాహెబ్, బేగమ్ హజ్రత్ మహల్, ఖాన్ బహదూర్, కువర్‌సింగ్‌వంటి రాజులు, జమీం దార్లు నాయకులయ్యారు. అయితే, తిరుగుబాటు సైనికులకు, జమీం దార్లకు, రాజులకు మాత్రమే పరి మితం కాలేదు. అన్నిచోట్ల ప్రజలు కూడా పెద్దఎత్తున పాల్గొన్నారు. అందుకే సైనిక తిరుగుబాటుగా ప్రారంభమైన 1857 తిరుగుబాటు స్వాతంత్ర్య సంగ్రామ స్వభావాన్ని సంతరించుకొన్నది. ఈ కారణం వల్లనే 1857 తిరుగుబాటును ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమని అంటున్నాం.

ఖూబ్ లఢీ నారీ-ఝాన్సీ కీ రాణి





బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఇంత పెద్దఎత్తున ప్రజలు తిరగబడటానికి బలమైన కారణాలున్నాయి. బ్రిటిష్ వారు ప్రదర్శించిన శ్వేతజాతి దురహంకారా నికి, వారు అనుసరించిన దోపిడీ ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగానే ప్రజలు విజృంభించారు. బ్రిటిష్ పాల కులు స్థానిక ప్రజల మతాచారాలను, సంప్రదా యా లను గౌరవించలేదు. కంటోన్మెంటుల్లో భారతీయ సిపాయిలను చిన్నచూపు చూసేవారు. వారికి ప్రమో షన్లు ఇచ్చేవారు కాదు. అంతేకాదు, భారతీయుల మతాచారాలను బహిరంగంగా విమర్శించే వారు. అప్పట్లో కొత్తగా ప్రవేశపెట్టిన ఎన్‌ఫీల్డ్ తుపాకీ తూటాలపై పంది, ఆవు కొవ్వుతో చేసిన పొర ఉం డేది. వాటిని నోటితో తీయవలసి వచ్చేది. తమ మతాచారాలను దెబ్బతీయడానికే ఈ తూటాలను ప్రవేశపెట్టారని సైనికులు భావించారు. ఇన్ని అవమా నాలు భరించినా వచ్చిన జీతం సరిపోయేది కాదు. తిండికి, బట్టలకు పోను ఇంటికి పంపించడానికి డబ్బులు మిగిలేవి కావు.

మరోవైపు గ్రామాల్లో బ్రిటిష్ పాలకులు భూమిశిస్తు విధానంలో మార్పులు తెచ్చి రైతులపై పన్నులను రెట్టింపు చేసారు. రైతులు పన్నుల భారాన్ని మోయ లేకపోయారు. అయినా అధికారులు బలవంతంగా పన్నులు వసూలు చేశారు. ఒక్క రోహిలాఖండ్‌లోనే 1848-56 మధ్య కాలంలో 2,37,388 మంది నుండి బలవంతంగా పన్నులు వసూలు చేసారని చరిత్రకారుల పరిశీలనలో తేలింది. రైతు కుటుంబాల నుండి వచ్చిన సిపాయిలు కూడా బ్రిటిష్ విధానాలను వ్యతిరేకించారు. బ్రిటిష్ ప్రభుత్వం శిస్తు పెంచడమే కాక జమీందార్ల, తాలూకుదార్ల ఎస్టేట్లను స్వాధీనం చేసుకొన్నది. అందువలన ఆ వర్గాలు అధికారాన్ని, ఆదాయాన్ని కోల్పోయాయి. రైతులు, జమీందార్లు చితికిపోవడంతో వారిపై ఆధారపడిన చేతివృత్తుల వారి ఉపాధి అవకాశాలు దెబ్బతిన్నాయి.



తాంతియా తోపే

ఈ విధంగా బ్రిటిష్‌వారి ఆర్థిక, సామాజిక విధానా లతో దెబ్బతిన్న రైతులు, సైనికులు, చేతివృత్తుల వారు తిరుగుబాట్లలో పాల్గొన్నారు. అయితే తిరుగు బాటు చేసిన ప్రజల్లో నుండి కొత్త నాయకులు పుట్టు కొని రాలేదు. వారంతా బ్రిటిష్ విధానాల వలన నష్ట పోయిన జమీందార్లు, రాజులపైనే ఆధారపడ్డారు.

తిరుగుబాటుదార్లు, బ్రిటీష్ వాళ్ల రాకపూర్వమున్న సామాజిక, ఆర్థిక వ్యవస్థలు పునరుద్ధరించితే చాలునను కొన్నారు. కానీ ప్రత్యామ్నాయం గురించి ఆలోచించలేదు. అందుకే నెహ్రూ 1857 సంగ్రామం గురించి రాస్తూ "Essentially it was a feudal outburst, headed by feudal chiefs and their followers and aided by the wide spread anti-foreign sentiment" అని అన్నారు.

1857 సంగ్రామం రెండు సంవ త్సరాలపాటు కొనసాగింది. సరైన ఆయుధ సంపత్తి లేకపోవడం వలన, సిపాయిలు బ్రిటిష్ వారిని ఓడించ లేకపోయారు. దానికి తోడు తిరుగు బాటుదార్లకు పటిష్టమైన నాయకత్వం లేదు. ఝాన్సీ లక్ష్మీబాయి, కువర్ సింగ్, మౌల్వీ అహమదుల్లా వంటి కొందరిని మినహాయిస్తే మిగిలిన వారు అవకాశం దొరికితే బ్రిటిష్ వారితో రాజీపడటానికి సిద్ధపడ్డారు.

ఆఖరుకు బహదూర్‌షాకు కూడా సైని కుల శక్తియుక్తులపై విశ్వాసంలేదు. అప్పటికింకా జాతీయవాద భావాలు బల పడలేదు. అందుకే దేశ ప్రజలు కూడా కలిసికట్టుగా నిలబడలేకపోయారు. పై కారణాల వలన బ్రిటిష్ వారు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని అణచివేయ గలిగారు. కోల్పోయిన అధికారాన్ని తిరిగి పొందడా నికి బ్రిటిష్ పాలకులు విచ్చలవిడిగా హింసను ప్రయోగించారు. వేల సంఖ్యలో ప్రజలను ఊచకోత కోసారు. 1857 సంగ్రామంలో భారతీయులు విజయం సాధిస్తే చరిత్ర మరో విధంగా వుండేది. ఈ సంగ్రామం సాధించి పెట్టిన ఘన విజయాలు కూడా ఎన్నో ఉన్నాయి.

ఈ తిరుగుబాటులో కులాలకు, మతాలకు అతీతంగా ప్రజలంతా కలిసికట్టుగా నిలబడ్డారు. ఆ మతం, ఈ మతం అని లేకుండా అన్ని మతాల ప్రజలు బహదూర్‌షాను మనస్పూర్తిగా తమ నాయకుడిగా అంగీకరించారు. హిందు, ముస్లిం ల మధ్య నెలకొన్న ఐక్యతా భావాన్ని చూసి బెదిరిన బ్రిటిష్ పాలకులు వీరి ఐక్యతను దెబ్బతీయడానికి తర్వాత కాలంలో తీవ్ర ప్రయత్నం చేసారు. ఆ తర్వాత దేశంలో చెలరేగిన జాతీయోద్య మానికి 1857 స్వాతంత్ర్య సంగ్రామమే బీజాలు నాటింది. ఇంతటి ప్రాము ఖ్యత వుండబట్టే '1857' దేశ చరిత్రనే ఒక మలుపు తిప్పింది. ■



ప్లాసీ యుద్ధంలో సిరాజుద్దౌలాను ఓడించిన ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో తమ ప్రాబల్య విస్తరణ ఇక నల్లేరుపై నడకేనని భావించింది. కానీ, వారి సామ్రాజ్య విస్తరణకాంక్షను రెండు మైసూర్ ఖడ్గాలు సుదీర్ఘకాలం నిలువరించాయి. ఆ వీర ఖడ్గాలే హైదరాలి. అతని కుమారుడు టిప్పుసుల్తాన్. దాదాపు మూడున్నర దశాబ్దాలపాటు బ్రిటీష్ దాడులను ప్రతిఘటించిన మైసూరు చివరకు టిప్పుసుల్తాన్ వీరమరణంతో లొంగిపోయింది.

'ఎం. నాంచారయ్య' కథనం ..

# తిరుగుబాటు సంకేతం-టిప్పు కరవాలం

పద్దెనిమిదో శతాబ్దంలో భారతదేశంలోని అనేక రాజ్యాలు ఒక దాని తర్వాత ఒకటి బ్రిటీష్ వారికి తలవంచుతున్న రోజులవి. ఈస్టిండియా కంపెనీ కొన్ని రాజ్యాలను మోసంతోనూ, మరికొన్నింటిని బలప్రయోగంతోనూ జయించి, బ్రిటీష్ సామ్రాజ్యాన్ని విస్తరిస్తోంది. ఈ పరిస్థితుల్లో, బ్రిటీష్ వారి దూకుడుకు కళ్ళెం వేసిన భారత వీరుడు టిప్పు సుల్తాన్. దక్షిణాదిలో బ్రిటీష్ వారి సామ్రాజ్య విస్తరణ ప్రయత్నాలకు అడ్డంకిగా నిలిచిన టిప్పు సుల్తాన్ మైసూరు పాలకుడు. ఎన్నో ఏళ్ల పాటు ఇంగ్లీష్ సేనలను దక్షిణాదిలో ముందుకు కదలకుండా ఆపిన టిప్పు చివరకు వారితో పోరాడుతూనే మరణించినా, బ్రిటీష్ వారితో రాజీపడని దేశభక్తునిగా చరిత్రలో నిలిచిపోయాడు.

బ్రిటీష్ సేనలతో పోరాటం టిప్పు తండ్రి హైదర్ అలీ హయాంలోనే ప్రారంభమైంది. చదువు రాకపోయినా కష్టపడి పై కొచ్చిన వాడు హైదర్ అలీ. సైన్యంలో అశ్వకునిగా జీవితం ప్రారంభించి రాజకీయ సలహాదారు స్థాయికి ఎదిగాడు. అంతటితో ఆగక తన శక్తి యుక్తులతో దక్షిణాదిలో విశాల భూభాగానికి పాలకుడయ్యాడు. దక్షిణాదికి చెందిన నిజాం నసీర్ జంగ్‌ను హత్యచేసి, ఆయన సంపదను దోచుకున్న కొందరు తిరుగుబాటు దారుల బృందాన్ని హైదర్ అలీ పట్టుకొని ఓడించి, వారి దగ్గరున్న ఆస్తిని స్వాధీనం చేసుకున్నాడు. దాంతో 1750లో హైదర్ ఆస్తిపాస్తులు ఒక్కసారిగా అనేక రెట్లు పెరిగాయి. అంతేకాక, మరికొన్ని ఇతర రాజులను యుద్ధాల్లో ఓడించాడు. ఇందుకోసం కిరాయి సైనికులను ఉపయోగించినప్పటికీ హైదరాలీ ఆదాయం పెరుగుతూనే వుంది. మైసూర్ రాజు నుంచి సైతం ఆయన స్వర్ణ సింహాసనాన్ని స్వాధీనం చేసుకున్నాడు. అయితే, మొత్తం భారత ఉపఖండమంతా బ్రిటీష్ సామ్రాజ్యాన్ని విస్తరించాలనే లక్ష్యంతో వున్న ఇంగ్లీష్ వారికి దక్షిణాదిలో కాలుమోపాలంటే హైదరాలీతో తలపడకతప్పలేదు. దీంతో 1767-1769 సంవత్సరాల మధ్య బ్రిటీష్ సేనలకూ, హైదరాలీ సేనలకు మధ్య మొదటి మైసూరు యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ఓడిన బ్రిటీష్ వారు ఓటమిని అంగీకరించారు. ఈ మేరకు 1769 ఏప్రిల్ నెలలో మద్రాసులో హైదరలీతో వారు ఒక ఒప్పందంపై సంతకాలు చేశారు.



1780లో మలబార్ ప్రాంతంలోని మేహెలో వున్న ఫ్రెంచి ఆయుధాల ఫ్యాక్టరీపై బ్రిటీష్ సేనలు దాడి చేయడంతో పదకొండేళ్ల తర్వాత రెండో మైసూరు యుద్ధం మొదలైంది. ఈ ప్రాంతం హైదరాలీ పాలనలో వుండటంతో వెంటనే సేనలను పంపి, అక్కడి నుంచి ఇంగ్లీష్ సైన్యాన్ని విజయవంతంగా తరిమివేశాడు. ఇంకా అనేక సందర్భాల్లో బ్రిటీష్ సేనలను ఓడించాడు. అయితే, మరో రెండేళ్ల తర్వాత హైదర్ అలీ మరణించగా, యుద్ధాన్ని విజయవంతంగా పూర్తి చేయాల్సిన బాధ్యత అతని కొడుకు 'టైగర్' టిప్పుపై పడింది. చివరికి బ్రిటీష్ సేనలను ఓడించిన టిప్పు 1784లో మంగళూరులో బ్రిటీష్ వారితో ఒప్పందం చేసుకున్నారు. ఈ యుద్ధం జరుగుతున్న కాలంలోనే కొంతమంది బ్రిటీష్ సైనికాధికారులను బందీలుగా పట్టుకున్నాడు. వారిని తన రాజధాని అయిన శ్రీరంగపట్నంలోని కోటలో వున్న కారాగారంలో బంధించగా, వారిలో సగంమంది ఈ జైలులోనే మరణించారు. వారి మరణం బ్రిటీష్ వారిని కలవరపరచింది. ఈ బ్రిటీష్ సైనికాధికారుల మృతికి సంతాపం ప్రకటిస్తూ చాలా ఏళ్ల తర్వాత ప్రఖ్యాత బ్రిటీష్ కవి సర్ హెన్రీ న్యూబోల్ట్ రాసిన కవిత కన్నీళ్లు తెప్పిస్తుంది. ఈ కోట జైలులో మరణించిన వారిలో ప్రముఖుడు బ్రిటీష్ సేనాని జనరల్ బెయిలీ. చాన్నాళ్ల తర్వాత ఆయన అన్న కొడుకు బెయిలీ స్మృత్యర్థం ఒక స్మారక చిహ్నాన్ని శ్రీరంగపట్నంలోనే నిర్మించాడు.

మిగతా భారత ముస్లిం పాలకులకు భిన్నమైన వ్యక్తిత్వంగల టిప్పు సుల్తాన్ ఆధునిక దృష్టితో పాటు ముందు చూపు వున్నవాడు. అందుకే ఆయన ఫ్రెంచి వారితో పొత్తుకు ప్రయత్నించి విజయం సాధించాడు. దీంతో దక్షిణాదిన టిప్పును అడ్డుతొలగించుకోకుండా ముందుకు సాగడం కష్టమని ఈస్ట్ ఇండియా కంపెనీ తీర్మానించుకుంది. అందుకే టిప్పును తమ ప్రధాన శత్రువుగా ప్రకటించింది. లాభదాయకమైన షరతులతో వాణిజ్యం కొనసాగించడానికి దక్షిణాదిపై పట్టు సంపాదించడం తప్పనిసరి అని కంపెనీ వర్గాలు భావించాయి. ఎంతో మంది భారతదేశ రాజులు బ్రిటీష్ వారి ముందు లొంగిపోతున్నా, ఇంగ్లీష్ వారిని లక్ష్యపెట్టని టిప్పు పని పట్టాలని వారు భావించారు. 1790లో టిప్పు సుల్తాన్ తిరువాన్కూర్ రాజుపై దాడిచేయగా మూడో మైసూరు యుద్ధం ప్రారంభమైంది. తొలుత టిప్పు సేనలకు విజయాలే ఎదురైనా, చివరికి బ్రిటీష్ సేనాని లార్డ్ కార్న్‌వాలీస్ స్వయంగా తన సేనలను యుద్ధంలో ముందుకు నడిపించడంతో ఓటమి పాలయ్యాయి. ఫలితంగా, 1792లో టిప్పు తన కొడుకులిద్దరినీ బ్రిటీష్ వారి చేతిలో బందీలుగా వదిలి వేయాల్సి వచ్చింది. ఎట్టకేలకు యుద్ధంలో ఓటమికి పరిహారంగా బ్రిటీష్ వారు వేసిన జరిమానాలను కట్టి కొడుకులను విడుదల చేయించుకున్నాడు టిప్పు.

చివరి (నాలుగో) మైసూరు యుద్ధం చాలా కొద్ది కాలానికే ముగిసింది. బ్రిటీష్ సేనలను ఓడించడానికి దేశం వెలుపల నుంచి ఫ్రెంచి సైనిక సాయాన్ని ఆశిస్తున్న టిప్పు సుల్తాన్‌పై వెల్లింగ్టన్ డ్యూక్ యుద్ధం ప్రకటించాడు. 1799లో ముగిసిన ఈ యుద్ధంలో చివరికి బ్రిటీష్ సేనలు శ్రీరంగపట్నంలోకి ప్రవేశించాయి. టిప్పు సైనికుల్లో ఒకరు చేసిన ద్రోహం ఫలితంగా ఇంగ్లీష్ సైనికులు కోటలోకి చొరబడ్డారు. 1799 మే 4న కోటలో జరిగిన పోరులో టిప్పును కాల్చి చంపారు. కొద్దిరోజుల తర్వాత శవాల గుట్టల కింద పడివున్న టిప్పు భౌతిక కాయాన్ని గుర్తించారు. టిప్పు శవం దొరికిన చోట ప్రస్తుతం శిలాఫలకం వుంచారు. యుద్ధానికి ముందు బ్రిటీష్‌వారి దౌత్య ప్రయత్నాలకు టిప్పు లొంగలేదు. టిప్పు మరణానంతరం బ్రిటీష్ సేనలు టిప్పు కుమారులిద్దరిని బందీలుగా తీసుకొని తమిళనాడులోని వేలూరు కోటలో బందీలుగా వుంచారు. కొన్నాళ్లకు అక్కడ తిరుగుబాటు జరగ్గా, వారిని కలకత్తా జైలుకు తరలించారు. అలాగే బ్రిటీష్ వారి విస్తరణకు టిప్పు అడ్డు తొలగిపోగానే, అతని రాజ్యంలో సగభాగాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీ స్వాధీనం చేసుకుంది. మిగతా సగభాగాన్ని అంతకు ముందు రాజ్యం కోల్పోయిన మైసూరు రాజ కుటుంబానికి అప్పగించింది. బ్రిటీష్ సేనలను గడగడలాడించిన టిప్పును, అతని తండ్రి హైదరాలీలను భారత వీరులుగా పరిగణిస్తారు. దాదాపు అర్ధ శతాబ్దంపాటు బ్రిటీష్ వారిని దక్షిణాదిలో అడుగు పెట్టనీయకుండా పోరాడిన వీరులుగా వారు చరిత్రలో స్థానం సంపాదించారు.

# రైతన్నలకు నూతన సహస్రాబ్ది శుభాకాంక్షలు

## వ్యవసాయ మార్కెట్ కమిటీ : సిద్దిపేట, జి.మెదక్

**శ్రీ నారా చంద్రబాబు నాయుడు**
ముఖ్యమంత్రి

**శ్రీ కె. చంద్రశేఖర్‌రావు**
డిప్యూటీ స్పీకర్, సిద్దిపేట

**శ్రీ వీరారెడ్డి**
మార్కెటింగ్‌శాఖ మంత్రి, సిద్దిపేట

**శ్రీ ఎం. శ్రీనివాస్ రెడ్డి**
మార్కెట్‌కమిటీ చైర్మన్

**శ్రీ మురంశెట్టి రాములు**
మార్కెట్‌కమిటి వైస్ చైర్మన్

[illegible]

( [illegible] )

★ రైతు శిక్షణా శిబిరాలు నిర్వహించి ఆధునిక వ్యవసాయంపై వారికి అవగాహన కల్పించడం ★ 25 లక్షల రూపాయల ఖర్చుతో లింకు రోడ్ల నిర్మాణం ★ రైతులను నిజామాబాద్ జిల్లా అంకాపూర్ మాడల్ విలేజ్‌కు విజ్ఞాన యాత్రలకు తీసుకెళ్ళడం. ★ మార్కెట్ యార్డ్‌లో విత్తనాలు, ఎరువుల విక్రయ కేంద్రం ప్రారంభించడం ★ రైతుల సౌకర్యార్థం భూసార పరీక్షా కేంద్రాన్ని ప్రారంభించడం. ★ ఇజ్రాయెల్ టెక్నాలజీ డ్రిప్ ఇరిగేషన్ వ్యవసాయం చేయడానికి రైతులను ప్రోత్సహించడం కుప్పం నియోజక వర్గంలోని చల్దిగానిపల్లెకు విజ్ఞాన యాత్రకు రైతులను తీసుకెళ్ళడానికి నిర్ణయం ★ రైతులు ధాన్యం అమ్మిన డబ్బులు అదే రోజు చెల్లించేలా చర్యలు తీసుకోవడానికి నిర్ణయం ★ సాయంత్రం 6 గంటల వరకే యార్డ్‌లో ధాన్యం తరలింపునకు చర్యలు ★ టెండర్ పద్ధతిలో ధాన్యం అమ్మకాలు చేపట్టడానికి నిర్ణయం ★ యార్డ్ స్థలం సరిపోనందున స్థలం పెంపునకు నిర్ణయం

**ఇలా ఎన్నో రైతు సంక్షేమ కార్యక్రమాలు చేపడుతూ ముందుకు సాగుతున్న మా పాలక వర్గానికి రైతన్నలు తమ సహాయ సహకారాలు ఎల్లవేళలా అందించాలని కోరుతూ...**

[illegible]

**బి. రమేష్**
చైర్‌పర్సన్, సిద్దిపేట మున్సిపాలిటీ

**గట్టు శ్రీనివాస్**
డైరెక్టర్

**చొక్కా రెడ్డి**
డైరెక్టర్

**గొట్టిపర్తి విశ్వనాథం**
డైరెక్టర్

**మండల యాదగిరి**
డైరెక్టర్

**మిడిదొడ్డి దుర్గయ్య**
డైరెక్టర్

**విమ్మ రాజిరెడ్డి**
డైరెక్టర్

**ఎం.డి. కమాల్ షరీఫ్**
డైరెక్టర్

**పాముగంటి మాణిక్యరావు**
డైరెక్టర్

**సింగిరెడ్డి నారాయణరెడ్డి**
డైరెక్టర్

[illegible]



అసఫ్‌జాహీ వంశానికి చెందిన ఏడుగురు నవాబులు హైదరాబాదు రాజ్యాన్ని రెండువందల సంవత్సరాలకుపైగా పరిపాలించారు. ఈ రాజ్యంలో తెలంగాణా పెద్ద ప్రాంతం. మహారాష్ట్ర, కర్ణాటకల్లోని కొన్ని ప్రాంతాలు కూడా హైదరాబాదు రాష్ట్రంలో కలిసివుండేవి. ఈ మూడు ప్రాంతాల ప్రజలు తీవ్రమైన ఆర్థిక-సాంఘిక-సాంస్కృతిక దోపిడీకి గురయ్యారు. ప్రజల నుంచి పన్నులు గుంజటంతప్ప విద్య, వైద్యం, రక్షణవంటి కనీస సౌకర్యాలను కూడా పాలకులు కల్పించలేకపోయారు. తీవ్రమైన భూస్వామ్య దోపిడీపై తెలంగాణా ప్రాంతంలోని రైతులు తిరగబడ్డారు. అదే చారిత్రాత్మకమైన తెలంగాణా సాయుధ పోరాటంగా మారింది. ఈ పోరాటం నైజాం ప్రభుత్వ పునాదులను కదిలించింది. అనంతరం కేంద్రంలో ఏర్పడిన స్వతంత్ర భారత ప్రభుత్వం జరిపిన పోలీస్ యాక్షన్‌లో నైజాం లొంగిపోయి, హైదరాబాద్ భారత యూనియన్‌లో కలిసింది. నైజామ్ జమానాపై 'ఎస్. రామచంద్రాచార్య' రిపోర్ట్...

# నైజాముల జమానా...దోపిడీల ఫర్మానా

కుతుబ్‌షాహి పాలకులు ప్రాభవ వైభవానికి చిహ్నం హైదరాబాద్ నగరం. ఈ నగరం కేంద్రంగా బాసిల్లిన హైదరాబాద్ స్టేట్‌ను కుతుబ్‌షాహీల అనంతరం నిజాం పాలకులు పరిపాలించారు. సుందర మూసీ కెరటాల నదీ తీరంలో నిర్మించిన ఈ రాజదానిని కేంద్రంగా చేసుకొని నిజాం పాలకులు ఏడు తరాలపాటు లజేయంగా, అవిచ్ఛిన్నంగా, అప్రతిహతంగా, శతృబయంకరంగా పరిపాలించారు. నాలుగు వందల సంవత్సరాల నగర చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు నిజాం పాలకులు. గోలకొండ కుతుబ్‌షాహీల పాలకుడైన అబుల్ హసన్ తానాషాను ఔరంగజేబు ఓడించడంతో నిజాం పాలకుల పాలన హైదరాబాద్‌లో ప్రారంభమైంది. 1713 లో ఖమ్రుద్దీన్ మొగలు పాలకుల గవర్నర్‌గా హైదరాబాద్ నగరానికి విచ్చేశాడు. ఆయనకు అదే సంవత్సరం మొగల్ పాలకులు నిజాం ఉల్ ముల్క్ బిరుదునిచ్చారు. ఆ తర్వాత 1724లో ఖమ్రుద్దీన్‌కు ఢిల్లీ పాలకుల నుండి అసప్ జాహీ బిరుదు కూడా లబించింది. ఈ రెండు బిరుదులతో హైదరాబాద్ స్టేట్‌లో పాలక వంశం, నిజాం లేక అసప్ జాహీ పాలకులుగా చరిత్రలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు. 1713 నుంచి 1948 వరకు అవిచ్ఛిన్నంగా పాలన సాగించిన నిజాం ప్రభువులు, ఈ ప్రాంతాన్ని పాలించిన హిందూ రాజుల, మహ్మదీయ పాలకుల సంప్రదాయలను కొనసాగించడంతో పాటు పాలితుల సంస్కృతికి, ఆచారాలకు, కళలకు, వ్యవసాయ విదానానికి మంచి గౌరవాన్ని ఇచ్చారని చెప్పుకుంటారు. ఈ పాలకులు, 1857లో మొదటిసారి, 1947లో రెండవసారి ఒక విచిత్రమైన పాత్రను పోషించారు. ఆరవ నిజాం నవాబు మీర్ మహ్మద్ లలీఖాన్ ఆలోచనలను ప్రజలు అంగీకరిస్తే ఏడవ నిజాం ఉస్మాన్ ఆలీఖాన్ ఎత్తుగడలను ప్రజలు తిరస్కరించారు. గోలుకొండ రాజ్యానికి అదికారిగా వచ్చిన ఖమ్రుద్దీన్ 1724-1748 వరకు పరిపాలించాడు. మీర్ అహ్మద్ ఖాన్, నసీర్ జంగ్‌లు ముజఫర్ జంగ్‌లు పాలించిన కాలానికి, సలాబత్‌జంగ్ పాలించిన కాలానికి చరిత్రకారులు ఏ కారణాలవల్లలో అంతగా ప్రాదాన్యం ఇవ్వలేదు. మీర్ అహ్మద్‌ఖాన్, నసీర్ జంగ్. ముజపర్ జంగల్‌లు 1748-1751 వరకు పరిపాలించారు. సలాబత్ జంగ్ 1751-1761 పాలించాడు. ముజపర్ జంగ్‌ను, కర్నూలు, కడప పఠానులు హత్య చేసినట్లు చరిత్రకారుల అబిప్రాయం. సలాబత్‌జంగ్ తర్వాత నిజాం అలీఖాన్ 1762-1803 వరకు పరిపాలించగా, సికిందర్ జా 1803-1829 వరకు, నసీర్-ఉద్-దౌలా 1829-1853 వరకు, అఫ్జల్-ఉర్-దౌలా 1857-1869 వరకు, మీర్ లహ్మద్ అలీఖాన్ 1869 నుంచి 1911 వరకు, మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1911-1948 వరకు ఈ రాజ్యాన్ని పాలించారు. కుతుబ్‌షాహీల పాలకులలో ఐదవ రాజైన మహ్మద్‌కులీ హైదరాబాద్ నగరాన్ని స్థాపించాడు. 1590-91లో నిర్మించిన ఈ నగరాన్ని రాజదాని కేంద్రంగా అసప్‌జాహీ పాలకులు కుతుబ్ షాహీల నుంచి సంక్రమించిన అన్ని లక్షణాలను అలవరుచుకున్నారు. కుతుబ్‌షాహీల రాజ్య విస్తరణను లనుసరించారు. ఈ కారణంగానే మొత్తం బారత ఖండంలోని సంస్థానాలలోని అతి పెద్ద సంస్థానంగా నిజాం సంస్థానం పేరు గడించింది. నేటి ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలలోకి విస్తరించిన నిజాం రాజ్యాలలో ప్రాంతీయ బాషలు, సంస్కృతులు, ఆచారాలు, కట్టుబాట్లు, పాలకులకు పూర్తిగా భిన్నమైనవి. అదికారంలో కొనసాగిన పాలక ప్రబువులు, పాలక ప్రచార సంస్కృతులకు దర్పణాలైన కవులను, నాట్య విద్వాంసులను, శిల్పకళలను, హస్తకళలను గౌరవించడం, ప్రోత్సహించారు. ఇందుకు ఒక ప్రత్యేక కారణం కూడా వుంది. 1750 నుంచి నిజాం పాలకులలో కొత్త ఆలోచనలు స్ఫురించాయి. ఈ కాలంలోనే రాజా రఘునాద దాస్ అనే పడింతుడికి నిజాం పాలకులు ప్రదాన మంత్రి పదవి ఇచ్చి గౌరవించారు. మొగలాయిల కాలంలో ఈ ప్రాంతాలలో ఘోషిల్లిన హిందూ శిల్ప కళ, హిందూ దేవాలయాలు ఈ కాలంలో కొంచెం మిణుకు మిణుకుమన్నాయి. ఈ వరుసలోనే వివిద వర్గాలకు చెందిన 16 మంది ప్రదానులు పరిపాలన కొనసాగించారు. రాజా రఘునాద ప్రసాద్, ఆ తర్వాత వచ్చిన సాలార్‌జంగ్‌లు చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు. యుద్ధ తంత్రంలోనూ, గూడచార విబాగంలోనూ, ప్రజలను అణచివేసే రక్షక బట విబాగంలోనూ నిజాం పాలకులు చాలా శ్రద్ధ తీసుకున్నారు. అణచివేత దృక్పదానికి నిదర్శనంగా రెవిన్యూ విధానాన్ని రూపొందించి పన్నులు వసూలు చేసే విధానాల్లో చాలా మార్పులు చేసుకున్నారు. 1869-1911 వరకు అధికారంలో వున్న ఆరవ నిజాం నవాబు మీర్ మన్సూర్ అలీఖాన్ పాలితులపట్ల కొంత ఉదారంగా వున్నట్లు చరిత్రకారులు చెబుతున్నారు. ఈయన కాలంలోనే 1901-1912 కాలంలో మహారాజ సర్ కిషన్ ప్రసాద్ ప్రధానమంత్రిగా బాద్యతలు నిర్వహించి పాలనారంగాల్లో అనేక సంస్కరణలు చేపట్టాడు. గ్రామీణ జీవన విదానాన్ని క్రమబద్దీకరించి జాగీర్దారీ విదానాన్ని పటిష్టం చేశారు. ఈయన తర్వాత అదికారంలోకి వచ్చిన ఏడవ నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ తండ్రి నుంచి ఆదునిక దృక్పదాన్ని అవలంబించుకున్నాడు. కాని చారిత్రకంగా చేసిన కొన్ని తప్పిదాలతో అపఖ్యాతి పాలయ్యాడు. ప్రజాస్వామిక ఉద్యమాలు వేళ్లూనుకోవడంతో ఏడవ నిజాం నవాబు యూనియన్ ప్రభుత్వం ముందు తలవగ్గక తప్పలేదు. ఇదిలావుంటే నిజాం పాలన ఏడు తరాలు మాత్రమే విలసిల్లడానికి ఒక కధ కూడా వుంది. నిజాం పాల ☞

తలవంచిన నిజాం రాజు



మంలో మొదటివాడైన ఖమ్రుద్దీన్ హైదరాబాద్ రాజ్యాధికారాన్ని స్వీకరించేముందు తను భక్తి ప్రపత్తులతో పూజించే ఒక మహ్మదీయ గురువు దగ్గరికి ఆశీర్వాదం కోసం వెళ్లాడట. ఆ సమయంలో ఆ గురువు రొట్టెలు భోంచేస్తున్నాడట. గురువు ఆహ్వానం మేరకు ఖమ్రుద్దీన్ ఏడు రొట్టెలను భుజించాడట. ఆ గురువు నీ పాలన ఏడు తరాల పాటు వుంటుందని ఆశీర్వదించాడట. ఆ క్రమంలోనే 7వ నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ అపఖ్యాతిపాలై రాజ్యాన్ని కోల్పోయాడని చరిత్రకారుల వాదన.

1911-1948 వరకు పరిపాలించిన ఉస్మాన్ అలీఖాన్ నవాబు దూరదృష్టి నిజానికి కొనియాడదగినది. స్వదేశాలలో, విదేశాలలో వచ్చిన అనేకానేక శాస్త్రీయ పద్ధతులను ఆయన అవగాహన చేసుకున్నాడు. ఆయన పాలనలోనే నిజాం సంస్థానం భారత దేశంలోని సంపదవంతమైన రాజ్యాలలో ముందు వరుసలో నిలిచింది. బ్రిటిష్ పాలకులతో సంయమనంతో వ్యవహరిస్తూ తన స్థానాన్ని పదిల పరుచుకునే వ్యూహంతో బ్రిటిష్ పాలకులకు ఆర్థిక, సైనిక సాయాన్ని అందించాడు. కాని సరిహద్దు రాష్ట్రాలలో జాతీయోద్యమాలు పెల్లుబికిన కాలమది. ఈ ఉద్యమాల ప్రభావం నిజాం పాలకులపైన ప్రసరించింది. ప్రజాస్వామిక పాలనలోకి తేవాలని ప్రజలలో ఆలోచనలు రగులుకున్నాయి.



### తెలంగాణా సాయుధ పోరాటం

నిజాం పాలకుల కాలంలో ఏనాడు కూడా ప్రజల బాషకు గౌరవం లభించలేదు. మీర్ ఉస్మాన్ అలీఖాన్ కొంత నూతన దృక్పదంతో ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఉస్మానియా ఆస్పత్రి వంటి నిర్మాణాలు చేపట్టినప్పటికీ దూరదృష్టితో హైదరాబాద్‌లో రెండు పెద్ద చెరువులు నిర్మించినప్పటికీ ప్రజల దృష్టిలో నియంతగానే మిగిలిపోయాడు. మెజార్టీ ప్రజలు తెలుగు బాషను మాట్లాడుకోలేని స్థితి. ఉర్దూ రాజబాష కావడంతో ఆ బాషకే ఎక్కువ గౌరవం వుండేది. మెజార్టీ ప్రజలు తమ బాషను గౌరవించుకోవాలనే ఉద్దేశంతో గ్రందాల యోద్యమాన్ని ప్రారంబించారు. ఈ ఉద్యమం తెలంగాణా రైతు కూలీల మహోద్యమ చైతన్యంతో తెలంగాణా సాయుధ విప్లవ పోరాటంగా చరిత్రలో ఒక వినూత్న స్థానాన్ని పదిలం చేసుకుంది. వెట్టి చాకిరీ అణచివేతలకు వ్యతిరేకంగా జాగీర్దార్లను, జమీందార్లను రక్షించే నిజాం పాలన భూస్వామ్య విదానానికి వ్యతిరేకంగా మీర్ ఉస్మాన్ అలీఖాన్ కుయుక్తులను తుత్తునియలు చేస్తూ వీరోచితంగా సాగింది. ఈకాలంలోనే దాశరది, వట్టికోట ఆళ్వారు స్వామి, యాదగిరి, సుద్దాల హనుమంతు, తిరునగరి రామాంజనేయులు, నాజర్, సుంకర, మిక్కిలినేని వంటి ఎందరో కళాకారులు ఉద్యమించారు. దొడ్డి కొమరయ్య అమరత్వం, బందగీవీర మరణం, కొమురం బీం ఉదంతం ప్రజలను కోపోద్రిక్తలను చేశాయి. మీర్ ఉస్మాన్ అలీఖాన్ తలొగ్గడంతో 1946 నుంచి 49 వరకు జరిగిన పోరాటం విజయబేరిని మోగించింది. ఈ కాలంలోనే నిజాం స్టేట్‌లో బూర్గుల రామకృష్ణారావు నేతృత్వంలో తొలి ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడింది. కాలక్రమంలో బాషా ప్రయుక్త రాష్ట్రాల విభజనలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఈ విదంగా వందలాది సంవత్సరాలుగా హైదరాబాద్ రాజదానిగా బాసిల్లుతూ వస్తున్నది. ■




ONS SOCIETY (Regd.)
Minority Institution)
hone : 080 - 6630855 Fax : 080 - 6548658















The Oxford College of science
(M. C. A. and B. Sc. in Microbiology,
Computer Science, Electronics).

The Oxford College of Physiotherapy.

The Oxford Computer Academy.

## MIC EXCELLENCE

The Oxford College of Nursing.
The Oxford School of Nursing.

The Oxford College of Pharmacy.
The Oxford Institute of Pharmacy.

The Oxford College of Hotel Management.
The Oxford College of Business Management
(M.B.A. and B.B.M.)



S. Narasa Raju
Chairman



"గెలిచిన తిరుగుబాట్లన్నీ విప్లవాలు. ఓడిపోయినవి రాజద్రోహాలు" 'సమాజం ఎలా ఉంటే మనకేమిటిలెమ్మ'ని తమ పనేదో తాము చూసుకుందామనుకునే వాళ్లతో పాలకులకు ఎప్పుడూ పేచీ ఉండదు. "ఇది సరిగా లేదు. దీన్ని మార్చాలి" అనుకునే వారితోనే, పోరాడేవారితోనే సమస్యంతా. బ్రిటిష్ వలసపాలకులు ఈ దేశాన్ని గుప్పిట బంధించినప్పటినుంచీ అనేక తిరుగుబాట్లు వచ్చాయి. అవి సక్రమమైన దృక్పథం, వ్యూహ, ప్రతివ్యూహాలు, ఇతర తిరుగుబాట్లతో సమన్వయం లేక విఫలమయ్యాయిగానీ, బ్రిటిష్ వారి అణచివేతలకు భయపడి మాత్రం కాదు. లిఖిత సంప్రదాయం, ముఖ్యంగా చరిత్రను రికార్డుచేసే స్వభావం లేకపోవడంతో వీటిల్లో చాలా పోరాటాలు వెలుగులోకి రానేలేదు. కొన్ని బ్రిటిష్ వారి రికార్డుల్లో వేరే రకంగా, అంటే దోపిడీలుగా రికార్డయ్యాయి. చెరసాలలకూ, ఉరికొయ్యలకూ, తుపాకి గుళ్లకూ, తప్పడు ప్రచారాలకూ బలైపోయిన ఈ తిరుగుబాట్లను ఒక్కసారిచూద్దాం. *'టి. వేణుగోపాల్'* పరిశీలన...

# సిరంగులనెదిరించిన కొడవళ్లు

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామానికి దాదాపు వందేళ్ల ముందు అంటే 1770లో కరువు వాతబడిన బెంగాల్, బీహార్లలో ఈస్టిండియా కంపెనీపై రైతులు తిరుగుబాటు చేశారు. ఇది చరిత్రలో 'సన్యాసి తిరుగుబాటు'గా ప్రసిద్ధికెక్కింది. అప్పట్లో ఊరూరాతిరిగి, తృణమో పణమో జనం ఇస్తే, వాటిపై బతికేసే సన్యాసుల్ని, ఫకీరుల్ని అనేక విధమైన వసూళ్లతో ఈస్టిండియా కంపెనీ వాళ్లు పీల్చి పిప్పిచేశారు. రైతులు పండించిన పంటంతా శిస్తుల రూపంలో దోచేశారు. ఈ దోపిడీ ఫలితంగా ఆ యేడాది తిండిగింజల కరువొచ్చి వేలాదిమంది ఆకలి మంటలతో, అంటువ్యాధులతో మరణించారు. ఇదే సమయంలో ఆగ్రహంతో ఊగిపోతున్న సన్యాసులు నిప్పురవ్వల్లా అన్ని ఊళ్లకీ వెళ్లి ఈ ఉత్పాతానికి బ్రిటిష్ వాళ్లే కారణమని ప్రచారం చేశారు. ఎండుటాకుల్లాంటి రైతులపై ఈ 'నిప్పురవ్వలు' పడటంతో సహజంగానే తిరుగుబాటు మంటలు భగ్గుమనలేచాయి. దీన్లో ఒక్క రైతాంగం మాత్రమే కాదు ఈస్టిండియా కంపెనీ రాకవల్ల తల్లకిందులైన ఆర్థిక వ్యవస్థతో మొగలాయిల దగ్గర కొలువు పోయిన వేలాది మంది సైనికులు, చేతివృత్తుల వాళ్లూ కూడా పాల్గొన్నారు. దాదాపు 30 యేళ్ల వరకూ సాగిన ఆ తిరుగుబాటు సామాన్యమైనదేమీ కాదు. బీహార్, బెంగాల్‌లోని అనేకచోట్ల ఈస్టిండియా కంపెనీ కార్యాలయాలపై వాళ్లు దాడులు చేశారు. కంటకులైన భూస్వాముల్ని, వడ్డీ వ్యాపారస్తుల్ని బ్రిటిష్ సైనికాధికారుల్ని చంపారు. సాధారణ యుద్ధ విధానాలనే కాక, గెరిల్లా యుద్ధ తంత్రాన్ని కూడా అనుసరించడం ఈ 'సన్యాసుల తిరుగుబాటు' లోని ముఖ్య విశేషం. వీరంతా సంప్రదాయమైన విల్లు, బాణాలు, బడితెలు, బల్లేలతో బ్రిటిష్ వారి తుపాకీ గుళ్లను ఎదుర్కొన్నారు. బ్రిటిష్ కంపెనీ సైన్యంతో పోరాడినప్పుడు భయపడి పారిపోయినట్టు నటించి, వారిని వెనకాలే రప్పించుకొని, అనువైనచోట మాటుకాయడం చేసేవారు. వాళ్ల తుపాకి గుళ్లు అయిపోయే వరకూ కవ్వించి, ఆ తర్వాత ఒక్కసారిగా మిడతల దండులా విరుచుకుపడేవారు. ఈ తిరుగుబాటు బంకించంద్ర ఛటర్జీతో 'ఆనంద మఠాన్ని' రాయించింది. వందేమాతరం గేయం దానిలోనిదే. దారుణ అణచివేతకు పూనుకొని, తిరుగుబాటు రావడానికి కారణమైన వారన్ హేస్టింగ్స్ కూడా వీరిని 'భారత ప్రజల్లో అత్యంత ధైర్యసాహసాలు గలవారు' అని రాశాడు.

అధికార చరిత్రకారులు దోపిడీ దారులుగా చిత్రీకరించిన థగ్గులూ, పిండారుల్లో ఎక్కువమంది బ్రిటిష్


అల్లూరి సీతారామరాజు

వాళ్ల విధానాలవల్ల భూములు పోగొట్టుకున్న రైతులేనని కొందరుచరిత్రకారుల అభిప్రాయం. టిప్పుసుల్తానుకు, మరాఠాలకు వ్యతిరేకంగా ఎంత సైన్యాన్ని మోహరించారో, లంతకంటే పెద్దసైన్యంతో తప్ప వీళ్లని అణచడం బ్రిటిష్ వాళ్లకు సాధ్యం కాలేదు.

దక్షిణాదిన 1800-1801లో ఈస్టిండియా కంపెనీపై పోరాడి, దాన్ని ముప్పుతిప్పలు పెట్టిన వాళ్లలో కట్టబ్రహ్మన్, మరుదపాండ్యన్, మాలప్పన్ తదితరులు ముఖ్యులు. వీరు అనేక గ్రామాల్లో కంపెనీ సైన్యాలతో పోరాడి, అధికారాన్ని ప్రజాకమిటీలకు అప్పగించారు. దుర్గమారణ్యాలలో,కొండల్లో మాటుగాసి కేవలం సంప్రదాయ పరమైన ఆయుధాలతో కంపెనీ సైన్యాలను వీళ్లు ముప్పుతిప్పలు పెట్టారు. అన్నివైపులనుంచీ ఒక్కసారి దాడిచేస్తే, శత్రువు బలం అన్నివైపులా విభజనకు గురవుతుందని, దాంతో నీరసపడతాడని వీళ్ల వ్యూహం. వారనుకున్నట్టే బ్రిటిష్ వారికి ఈ తిరుగుబాటును అణచడం అసాధ్యమైంది. సిలోన్, మలయా, ఇంగ్లాండ్‌ల నుంచి పటాలాలను తెచ్చుకోవాల్సి వచ్చింది.

బీహార్‌లోని ఛోటానాగపూర్ ప్రాంతంలోని 'హో' ఆదిమజాతి రైతాంగం కూడా బ్రిటిష్ వారిపై 1820లో తిరగబడింది. ఇది ఒక్క ఈస్టిండియా కంపెనీపైనే కాదు. వాళ్లను వడ్డీల పేరుతో పీల్చి పిప్పిచేస్తున్న హిందూ, ముస్లిం, సిక్కు వర్తకులపై కూడా వారి పోరాటం నడిచింది. ఈ వర్తకులంతా కంపెనీని అడ్డుపెట్టుకుని 'హో' జాతి వారి భూములన్నింటినీ ఆక్రమించుకుని, వారి సాంఘిక, ఆర్థిక జీవనాన్ని చిన్నాభిన్నం చేశారు. ఆ తిరుగుబాటును బ్రిటిష్ వాళ్లు వెనువెంటనే అణచివేసినా మరుసటి యేడాదికి అది మరింతగా విజృంభించింది. ఈసారి వాళ్లు బినేపూర్ కోటనే స్వాధీనంలోకి తెచ్చుకున్నారు. కొల్హాన్ వారి వశమైంది. కానీ అక్కడి రాజు, జమీందార్లు, వర్తకులు బ్రిటిష్ పాలకుల సాయంతో దాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేశారు.

ఈ ఛోటానాగపూర్ ప్రాంతంలోనే ఒరాన్లు అనే మరో ఆదిమజాతి తెగ తిరుగుబాటు చేసింది. 1820, 1832, 1890ల్లో ఈ తిరుగుబాట్లు జరిగాయి. 1831-32లో కోల్ ఆదిమజాతి రైతాంగం కూడా బ్రిటిష్ వాళ్లపై తిరగబడింది. ఈ తిరుగుబాట్లను అణచేందుకు కలకత్తానుంచీ, బెనారస్ నుంచీ, దీనాపూర్ నుంచీ సైన్యాలను తరలించారంటే అది ఏ స్థాయిలో జరిగిందో సులభంగానే అంచనా వేసుకోవచ్చు. ఈ తిరుగుబాట్లలో కూడా ప్రధాన పాత్ర రైతాంగానిదే. కోల్ తిరుగుబాటుని

లణచడానికి నియమితులైన జాయింట్ కమిషనర్లు విల్కిన్సన్, డెంట్‌లు ఈ రైతాంగం దుస్థితి గురించి సవివరంగానే రాశారు. మహాజన్లు వీరిని వడ్డీల పేరు తో పీల్చి పిప్పిచేశారని, ఈ రైతులు తమ సంపాదనం తప్పనీ బాకీదార్ల పరంచేసి కట్టుబానిసలుగా మారార ని వాళ్లు పేర్కొన్నారు.

ఇదేకాలంలో బెంగాల్ ప్రాంతంలో సాగిన మరో ముఖ్యమైన తిరుగుబాటు వహాబీ తిరుగుబాటు. ఇది మత సంస్కరణోద్యమంగా మొదలై ముల్లాల మీదా, ఫ్యూడల్ ప్రభువుల మీదా, బ్రిటిష్ సేనలమీదా సాయుధతిరుగుబాటుగా మారింది. టిటూమీర్ అనే లతని నాయకత్వాన జరిగిన ఈ పోరాటం ఆ ప్రాంతా న్నంతా దావానలంలా చుట్టేసింది. దక్షిణ 24 పరగ ణాలలోనూ, నాడియా, జెస్సూర్లలో నూ జమీందార్లనుంచి పన్నులు వసూలుచేసే అధికారాన్ని గుంజుకు న్నారు. ఈ వహాబీ నాయకుల్లో కొం దరు దాదాపు 80 వేల మంది ప్రజ ల్ని తమ వెంట తిప్పుకోగల్గారని బ్రిటిష్ వాళ్లు రాశారు. ఆయా ప్రాం తాల్లో ఈ నాయకులు దాదాపు విముక్తి ప్రాంతాలను నెలకొల్పారు. "వీళ్ల మత విశ్వాసాల్లో అసమ్మతి వాదులు. రాజకీయాల్లో కమ్యూనిస్టు లు. ఎర్ర రిపబ్లికన్స్‌లాంటి వాళ్లు" అని ఈ తిరుగుబాటును అధ్యయనం చేసిన డబ్ల్యు.డబ్ల్యు.హంటర్ వ్యాఖ్యానించాడు.

1855-57 మధ్య సంతాల్ తెగ రైతాంగం సాగించిన పోరాటం ఉత్తే జకరమైనది. ఉత్తరాన బీహార్‌లోని భగల్పూరు, దక్షిణాన ఒరిస్సా, హజ రీబాగ్‌నుంచి బెంగాల్ సరిహద్దుదాకా విస్తరించిన రాజ్‌మహల్ కొండల్లో, అరణ్యాల్లో ఈ తిరుగుబాటు జరిగిం ది. సంవత్సరాల తరబడి బెంగాలీ వర్తకులు వడ్డీల పేరుమీద సంతాల్ గిరిజన రైతాంగంనుంచి పంటను, నాగలి కర్రును, ఎడ్లను కూడా గుంజుకొని, చివరికి భూములకు కూడా ఎసరుపెడితే, వారంతా కట్టుబా నిసల్లా మారారు. కోర్టులు కూడా వర్తకులకే వంతపా డుతున్నాయని గ్రహించాక సిదూ, కానూ అనే ఇద్దరు సోదరుల నాయకత్వంకింద తిరుగుబాటు మొదలైం ది. దీనిలో కంటకులైన భూస్వాముల్ని, వర్తకుల్ని, మహాజన్‌లనూ సంతాల్‌లు ఏరిపారి చంపేశారు. ఈ భూస్వాముల, వర్తకుల ప్రయోజనాలను రక్షించడా నికి బ్రిటిష్‌వాళ్లు 'సైనికపాలన' విధించారు. కానీ తిరగబడిన సంతాల్ ముందు అది ఎందుకూ పనికి రాలేదు. మందుగుండుతో వచ్చిన సైన్యాన్ని రైతాంగం సంప్రదాయ ఆయుధాలతోనే చివరిదాకా ఎదిరించారు. ఆ తిరుగుబాటులో 10వేల మంది బలి దానంచేశారు. ఈ ఉద్యమాన్ని అణిచిన బ్రిటిష్ సైన్యా ధికారి ఒక ముఖ్యమైన వ్యాఖ్యచేశాడు. "సంతాల్‌ల ఆయుధ సామగ్రిలో తెల్లజెండాలేదు. లొంగుబాటు అంటే ఏమిటో వాళ్లకు తెలియను కూడా తెలీదు".

1858లో తూర్పుగోదావరి ఏజెన్సీ ప్రాంతంలో బ్రిటిష్ వాళ్లపై తిరగబడ్డ మన్యం వీరుడు వెంకటరె డ్డి. గిరిజనులను సమీకరించి పోరాడిన ఆ యోధుణ్ని బ్రిటిష్ సైనికులు ఒక చిక్కంలో నిలువునా నిలబెట్టి మూతి బిగించి, రాజమండ్రిలోని కోటగుమ్మం దగ్గర ఒక చెట్టుకి వేలాడదీసి ఆకలితో అలమటించి చనిపో యేలా చేశారు. అతని శరీరం కాకులు, గద్దలకు ఆహారమైందని చరిత్రలో రికార్డయింది. బ్రిటిష్‌వాళ్ల ని ఎదిరిస్తే ఇదే గతి పడుతుందని హెచ్చరించడానికే ఇంతటి కసాయి శిక్ష విధించారు. ఆయన అస్థి పం జరంతో ఉన్న చిక్కాన్ని చాలాకాలం రాజమండ్రి మ్యూ జియంలో వేలాడదీశారు. దానిని వెంకటరెడ్డి సంచీ అనేవారట.

1922లో అల్లూరి సీతారామరాజు నాయకత్వాన మన్యంలో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా తిరుగుబా టు లేచింది. గిరిజనుల్ని దోచుకుతింటున్న షావుకార్లకూ, భూస్వాములకు వ్యతిరేకంగా ప్రారంభ మైన ఆ పోరాటం కూలీరేట్ల పెంపుదల కోసం, అట వీ సంపద దోపిడీని అరికట్టడం కోసం కూడా సాగిం ది. రెండు సంవత్సరాలపాటు ఆ తిరుగుబాటు బ్రిటి ష్ సేనల్ని గడగడలాడించింది. గిరిజనుల్లోని కొండ రెడ్లు, వాల్మీకులు, కోదులు, కొరజలు, కొండదొరలు లాంటి వాళ్లందర్నీ అల్లూరి సీతారామరాజు ఏకం చేయగలిగాడు. వింటి బద్దల్ని, ఎందుపుడకల్ని, కారపు పొడిని ఆయుధాలుగా చేసుకుని ఏజెన్సీలో రెండేళ్లు 'పరపాలన' లేకుండా చేశాడు. తాడువాయి లోయలోకి బ్రిటిష్ సైన్యాన్ని రప్పించి, రప్పించి, నాగులకొండమీదినుంచి వాళ్లపై గెరిల్లా దాడి చేసిన వీరుడు అల్లూరి. చివరకు ప్రభుత్వం అల్లూరిని ఎన్‌కౌంటర్ పేరిట మట్టుబెట్టి ఆ తిరుగుబాటును అణిచేసింది. అంతకు చాలాకాలం క్రితమే 1879లో తమ్మన్నదొర అనే వ్యక్తి నేతృత్వంలో అనేకమంది కౌలుదార్లు పోరాడారు. రాజా రంపరాంభూపతికి జాగీరుగా ఉన్న భూములపై అతని మరణం తర్వాత హక్కు సంపాదించడానికి చేసిన ఈ పోరాటంలో పోలీస్‌స్టేషన్లను సైతం ఆక్రమించుకున్నారు. అదేకా లంలో మహారాష్ట్రలో బ్రిటిష్ వారిపై తిరగబడి, తన ను తాను 'రెండో శివాజీ'గా ప్రకటిం చుకున్న బలవంత్ ఫడ్కే, తిరుగుబా టు ఓడిపోయాక తప్పించుకొని మన కర్నూలుదాకా వచ్చాడు. ఇక్కడ తమ్మన్నదొర నాయకత్వాన జరుగు తున్న బ్రిటిష్ వ్యతిరేక పోరాటంతో చేతులు కలపాలనుకున్నాడు. ఎందుకనో అది జరిగినట్టు లేదు.

1925 ప్రాంతంలో ఆదిలాబాద్ గిరిజన రైతాంగాన్ని సమీకరించి పోరాడినవాడు కొమరం భీం. అటవీ అధికార్లతో, షావుకార్లతో ఇబ్బందుల పాలవుతున్న గిరిజనుల్ని కూడగట్టి బాబెఝురి కేంద్రంగా పన్నెండు గ్రామాల పరిధిలో ఉన్న వందల ఎకరాల అడవిని నరికించాడు. గుడిసెల్ని కాల్చి, పంటల్ని నాశనం చేసి, కేసులు పెట్టే అణచాలని చూసి న ప్రభుత్వం చివరకు దిగివచ్చి సబ్ కలెక్టర్‌ని అతనితో చర్చలకు పంపిం ది. ఆ 12 గ్రామాలకు పట్టాలివ్వడ మేకాక, కేసుల్ని మాఫీ చేస్తామని సబ్ కలెక్టర్ చెప్తే ఆ 12 గ్రామాలమీ ద రాజ్యాధికారం ఇవ్వమని భీం డిమాండ్‌చేశాడు. చివరికి భీం సైన్యంపైకి నైజాం సర్కారు మూడు వందల మంది సైన్యాన్ని పంపింది. ఏడు నెలలపాటు రెండు సైన్యా ల మధ్య పోరాటం సాగింది. మందుగుండు ముందు చివరికి సంప్రదాయ ఆయుధాలు తలవంచక తప్పలే దు. అల్లూరి సీతారామరాజు ఆచూకీని తెల్సుకున్న ట్టుగానే భీంని కూడా గుర్తించి పోలీసులు కాల్చి చం పారు. కొమురం భీం పదిహేనేళ్ల వయస్సులోనే భూమిని గుంజుకోవడానికి వచ్చిన తురక పటేదారు బుర్ర బద్దలుకొట్టి కేసుల భయంతో అస్సాం పారిపో యాడు. ఆ అస్సాంలో అల్లూరి నాయకత్వాన జరుగు తున్న ఏజెన్సీ పోరాటం, రాజకీయాల గురించీ తెలుసుకున్నాడట. సమాచార సాధనాలు అంతంత మాత్రంగా ఉన్న ఆ సమయంలో తిరుగుబాటు సమా చారాలు ఇంత వేగంగా చేరడం నిజంగా వింతే.





**పారిశ్రామిక విప్లవ ఫలితంగా ప్రభవించిన నూతన సామాజిక-ఆర్థిక వ్యవస్థలకు పాత కాలపు రాచరిక పద్ధతులను తొలగించుకోవలసిన అవసరం ఏర్పడింది. అసలు ప్రభుత్వమంటే ఏమిటి? దాని అధికార పరిధి ఎంత వరకు వుండాలన్న విషయంపై విస్తృతమైన చర్చ జరిగింది. దీన్నే 'రాజనీతి తత్వధార' అన్నారు. మాకియవెలీ రచనల్లోంచి ఓ నెపోలియన్, ఒక ముస్సోలిని, పుట్టుకొస్తే జాన్‌లాక్ ప్రభావంతో అమెరికా హక్కుల ప్రకటన వెలువడింది. స్విట్జర్లాండ్ ప్రత్యక్ష ప్రజాస్వామ్యంపై రూసో ముద్ర కనపడుతోంది. మార్క్సిద్ధాంతాలు కోట్లాది మందిని ఉత్తేజితుల్ని చేశాయి. ఆధునిక రాజనీతి సిద్ధాంతాలపై 'గటిక విజయకుమార్' వ్యాసం...**

# నూరుపువ్వుల పరిమళం

మానవుడు సంఘజీవి. వ్యక్తిగా ప్రారంభమైన మానవజీవనం క్రమంగా కుటుంబంగా రూపుదిద్దుకుంది. కుటుంబాల సమూహామే సమాజం. మానవ సమూహాల జీవనాన్ని క్రమబద్ధం చేయడానికి రాజ్యం అవతరించింది. రాజ్యం సజావుగా సాగడానికి వివిద సిద్ధాంతాలు ఉద్భవించాయి. అసలు రాజ్యం అంటే ఏమిటనే విషయంపై కూడా అనేక వాదాలు, రాజనీతి సిద్ధాంతాలు వచ్చాయి. సమాజంలో మనుషులందరూ సహజీవనం గడపడానికి అనేక తత్వాలు బయటేరాయి. ఎంతో మంది తత్వవేతలు రాజ్యం, దాని నడవడిక, పాలకులు అవలంబించాల్సిన పద్ధతుల గూర్చి వివిద ప్రతిపాదనలు చేశారు. ఈ తత్వాలు, సిద్ధాంతాలు ఆయా తత్వవేత్తల సమకాలీన పరిస్థితులను ప్రతిబింబించడమే కాక, ప్రజల జీవనవిదానాన్ని, పరిపాలనా వ్యవహారాలను విశేషంగా ప్రబావితం చేశాయి.

**ఆధునిక రాజనీతి తత్వం**

ఆదునిక రాజనీతి తత్వానికి మాకియవెల్లి(1469-



1527) పితామహుడు. నీతి-రాజకీయాలను, మతం-రాజనీతిని వేరుచేసి ఆదునిక లౌకిక జాతి రాజ్య బావనను వ్యాప్తిచేసిన మొదటి తత్వవేత్త. ఇటలీలో జన్మించిన మాకియవెల్లి తన ప్రిన్స్, డిస్‌కోర్సెస్ రచనల్లో రాజనీతికి సంబందించిన అనేక విషయాలను వెల్లడించారు. ఈ ప్రజలను పాలించడానికి రాజుకుండాల్సిన లక్షణాలను ప్రిన్స్ గ్రందంలో చెప్పారు. నిర్దయగా నిర్బంద శక్తిని ఉపయోగించడం, ప్రచార ప్రోద్బలం. స్థిర సంకల్పాచరణ కలిగిఉండాలని వివరించాడు. నక్కజిత్తులను, సింహబలాన్ని మిళితం చేసి అవకాశవాదాన్ని రాజు ప్రదర్శించాలన్నారు. సుస్థిరతకు మిశ్రమ ప్రభుత్వం ఆమోదయోగ్యమైనదిగా బావించిన మాకియవెల్లి రాజరిక ప్రజాస్వామ్య ప్రభుత్వాల గూర్చే ఎక్కువ చర్చించాడు. మాకియవెల్లి చారిత్రక దృక్పదానికి భిన్నంగా ఆంగ్ల తత్వవేత్త దామస్ హాబ్స్(1588-1679), జాన్‌లాక్ (1632-1704), రూసో(1712-1778)లు అనేక ఆధునిక రాజనీతి సిద్ధాంతాలను రూపొందించారు. వీరి ముగ్గురిని సామాజిక ఒడంబడిక వాదులుగా పరిగణిస్తారు. హాబ్స్, లాక్‌లు ఇంగ్లండ్ సమకాలీన రాజకీయాలలో క్రియాత్మకంగా పాల్గొన్నారు. హాబ్స్ అపరిమిత సార్వబౌమాదికారాన్ని, రాచరిక వ్యవస్థను సమర్థిస్తే లాక్ పరిమిత ప్రభుత్వాన్ని, అబివృద్ధిలోకి వస్తున్న ప్రజాస్వామ్య అదికృతను బలపరిచాడు. వీరిద్దరితో పోల్చినప్పుడు రూసో చాలా బిన్నమైనవాడు. రూసో తాత్విక చింతన చేయలేదు. హేతుబద్ధంగా, శాస్త్రీయంగా కాక అంతర్‌బుద్ధితో సిద్ధాంతాలను రూపొందించాడు. దీనినే ఆయన 'జనేచ్ఛ' అన్నాడు. డికార్పోర్, డిప్రైస్, లెవియదాన్, డిహోమినే, పాలిటిక్స్, తూయీడైడ్స్, ఎలిమెంట్స్ ఆప్ లా అనే గ్రందాలలో రాజనీతికి సంబందించిన అనేక విషయాలను హాబ్స్ వివరించారు. మానవస్వబావం, సామాజిక ఒడంబడిక, సార్వబౌమాదికారం, ప్రభుత్వం అంశాలపై వీరు ముగ్గురు వేర్వేరు అబిప్రాయాలు వ్యక్తం చేశారు. హాబ్స్ ప్రకారం...మానవుడు అనాగరిక పాకృతిక వ్యవస్థలో జీవించాడు. సార్వబౌమాదికారం గల పాలకుడు లేని ప్రాకృతిక వ్యవస్థలో మానవులు నిరంతరం పోరాడుతూ, పోటీపడుతూ, పరస్పర విశ్వాసం లేకుండా మృగప్రాయ జీవితాన్ని గడిపారు. ఈ వ్యవస్థలో మంచి-చెడు, దర్మం-అదర్మం అనే విచక్షణ కలిగిలేరని హాబ్స్ అబిప్రాయపడగా, ప్రాకృతిక వ్యవస్థలో... మానవులంతా సమానులు. స్వేచ్ఛాప్రియులు. ఇష్టం వచ్చినట్లు కాక సహజన్యాయాలను అనుసరించి జీవిస్తారు. ప్రభుత్వాలు, మానవనిర్మిత చట్టాలు ఉండవు. మానవులు ప్రశాంతంగా, ఒకరితొకరు ఆసరాగా జీవించారు. సహజ అసమానతలతో బాధపడుతున్న వారికి సహాయం అందించడానికి ప్రబుత్వం అవసరమైంది. రూసో ప్రాకృతిక వ్యవస్థలో మానవుడు స్వేచ్ఛగా, సంతోషంగా ఉండేవాడు. ప్రజల హక్కులను కాపాడటం, బద్రత కల్పించడం తదితర విదులు నిర్వహించమే ప్రబుత్వ బాద్యతని లాక్ చెప్పారు. వ్యక్తి స్వేచ్ఛావాదానికి లాక్ మూల పురుషుడు. వ్యక్తి ప్రయోజనాలకే రాజ్యం ఏర్పడిందన్నది ఆయన ప్రదాన వాదన. రూసోను స్వేచ్ఛావాది అంటారు. అతివాద నిరంకుశాదికారాన్ని సమర్థించిన తత్వవేత్తగా కూడా ఆయనను పరిగణిస్తారు.

హాబ్స్, లాక్, రూసో ప్రస్తావించిన వ్యక్తి స్వేచ్ఛావాదం ఆదారంగా ఇంగ్లండ్‌లో 18, 19 శతాబ్దాలలో 'ఉపయోగితావాదము' అనే కొత్త సిద్ధాంతాన్ని ప్రాచుర్యంలోకి వచ్చింది. ఉపయోగితావాదులు వ్యక్తి సంతోషానికి పెద్దపీట వేశారు. వీరి ప్రకారం అధిక సంఖ్యాకుల అత్యధిక సంతోషం కోసం ప్రబుత్వం పనిచేయాలి. డేవిడ్ హ్యూమ్, ప్రిస్ట్లీ, హచ్‌సన్, పాలే, హెల్ విషయస్ తదితరులు ఉపయోగితా వాదాన్ని వివరించడానికి ప్రయత్నించినా కొన్ని నిర్దిష్ట ప్రాతిప



దికలపై ప్రతిపాదించింది జర్మి బెందామ్ (1748-1832). మాల్థస్, రికార్డోలు కూడా ఉపయోగితా వాద సారాంశాన్ని ఆర్థిక శాస్త్రంలోకి తీసుకెళ్లారు. బెందామ్ తర్వాత ఉపయోగితావాదులలో ముఖ్యుడైన జాన్ స్టువర్ట్‌మిల్(1806-1873) ఈ వాదంలో కొన్ని మార్పులుచేశారు. మిల్ వ్యక్తి స్వేచ్ఛకు అదిక ప్రాదాన్యతనిచ్చాడు. మిల్ రాసిన 'ఆన్ లిబర్టీ', 'రిప్రజంటేటివ్ గవర్నమెంట్' అనే గ్రందాల్లో ఉదారవాద ప్రజాస్వామ్య ప్రతిపాదనలు చేశారు. మనో, వాక్, కర్మల్లో వ్యక్తికి పూర్తి స్వేచ్ఛ ఉండాలని మిల్ వాదన. ఉపయోగితా వాదం తర్వాత చెప్పుకోదగింది ఆదర్శవాదము. అతివాద బౌతిక వాదానికి వ్యతిరేకంగా ☞

జర్మనీలో ఆదర్శవాదం ఆవిర్భవించింది.

## సామ్యవాద రాజనీతి తత్వం

19వ శతాబ్దికి ముందు మానవస్వభావం, సామాజిక ఒడంబడిక, రాజ్యం, సార్వభౌమత్వం, స్వేచ్ఛ తదితర అంశాలపై తత్వాలు రూపొందగా ఆ తర్వాత మానవుని ఆర్థిక, సామాజిక స్థితిగతులపై తత్వవేత్తల దృష్టి మళ్లింది. 19వ శతాబ్దం ఆరంభంలో సామ్యవాద రాజనీతి తత్వం ఉద్భవించింది. 1815 నుంచి ఆర్థిక శక్తుల ప్రభావం ఎక్కువ కావడంతో సామ్యవాద ఉత్కర్షం అనివార్యమైంది. పారిశ్రామిక విప్లవంతో అనేక ఆర్థిక, సాంఘిక దుష్ఫలితాలు ఏర్పడ్డాయి. పెట్టుబడిదారులకు, కార్మికులకు మధ్య అగాధం పెరిగిపోయింది. కార్మికుల ఉద్యమాలను పెట్టుబడిదారులు నిర్దాక్షిణ్యంగా అణగదొక్కుతున్నారు. ఈ సమస్యలకు పరిష్కార మార్గాలను సూచిస్తూ కాల్పనిక సామ్యవాద తత్వవేత్తలు బయలుదేరారు. యోగ్యమైన సూత్రాలలో సమాజం ఏర్పడితే సామాజిక దోషాలన్నీ అదృశ్యమౌతాయని వారు ఆశించారు. వీరంతా పెట్టుబడిదారీ వ్యవస్థను విమర్శించారు. కాల్పనిక సామ్యవాదం ఆవిర్భవించడానికి మూలకారణం రాబర్ట్ ఓవెన్ (1771-1858). కార్మికలోకాన్నంతా ఏకంచేసి, పెట్టుబడిదారీ వ్యవస్థను కూకటి వేళ్లతో పెకిలించి వేయాలనే దృఢసంకల్పంతో బయలుదేరింది మార్క్సిజం. కారల్‌మార్క్స్ (1818-1883), ఫ్రెడరిక్ ఎంగెల్స్ (1820-1865)ల శాస్త్రీయమైన సామ్యవాదమే మార్క్సిజం. విశ్వవ్యాప్తంగా సామ్యవాద ఉద్యమాల, సిద్ధాంతాల, ఆచరణలపై మార్క్సిజం ప్రభావం, ప్రాముఖ్యం అనన్యం, సర్వవ్యాపితం. మార్క్స్ రాసిన ది పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ, ది కమ్యూనిస్టు మ్యానిఫెస్టో (ఎంగెల్స్‌తో కలిసి రాసినది), క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ, దాస్ కాపిటల్ గ్రంథాలలో శాస్త్రీయమైన సామ్యవాద రూపురేఖల్ని, పెట్టుబడిదారీ దోపిడీ విధానాన్ని, దాన్ని ఎదుర్కోవడానికి కార్మికులు అనుసరించాల్సిన పద్ధతులను చక్కగా వివరించారు. దీంతో మార్క్స్‌ను జర్మనీ నుంచి, తర్వాత ఫ్రాన్సు నుంచి బహిష్కరించారు. మానవ చరిత్ర అంతా వర్గపోరాటమే అని కమ్యూనిస్టు మ్యానిఫెస్టో వివరించింది. శ్రామికవర్గం అభివృద్ధి చెందడంవల్ల బూర్జువా వర్గం ధ్వంసం అవుతుందని కార్మికులను విప్లవోన్ముఖులను చేసింది. మార్క్సిజానికి ప్రారంభ అంశము హెగెల్ గతితార్కిక భౌతిక వాదం. మానవాభ్యుదయమంతా వైరుధ్యాల ఫలితమే అని గతితార్కిక వాదం. మార్క్స్ గతితార్కిక భౌతికవాదాన్ని, చారిత్రక భౌతిక వాదాన్ని, అదనపు విలువల సిద్ధాంతాన్ని, వర్గపోరాటాన్ని వివరించాడు. మార్క్సిజాన్ని సంస్కరించి రష్యాలోని పరిస్థితులకు అన్వయించుకొని రూపొందించినదే లెనినిజం. దీని సృష్టికర్త వ్లాదిమిర్ ఇలిచ్ ఉల్యనోవ్ (లెనిన్ కలంపేరు) (1870-1924). లెనిన్ అదనపు విలువ, సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఇదేకాలంలో చైనాలో మావోసేతుంగ్ (1893-1976) చైనాలో మావోయిజాన్ని ప్రతిపాదించాడు. ఆ తర్వాత 19వ శతాబ్దం తొలిభాగంలో బహుళ ఆదరణ పొందిన తత్వం ప్రజాస్వామిక సామ్యవాదం. ప్రజాస్వామిక పెట్టుబడిదారీ వ్యవస్థ, నిరంకుశ కమ్యూనిజానికి మధ్యేమార్గం ప్రజాస్వామిక సామ్యవాదం. మార్క్సిజం వల్ల బాగా ప్రభావితమయి రాజ్యమును ద్వేషించే తత్వాలు క్రమంగా ఆవిర్భవించాయి. అవి అరాచకవాదము, శ్రామికసంఘవాదము, వృత్తిసంఘవాదము. అధికారం, పెట్టుబడిదారీ వర్గదోపిడీ నుంచి ప్రజలను పూర్తిగా విముక్తి చేసేదే అరాచకవాదము. రాజ్యవ్యవస్థను వ్యతిరేకిస్తూ, దానిని బూర్జువా సంస్థగా పరిగణించేదే శ్రామిక సంఘ వాదము.

విశ్వవ్యాప్తంగా గత వెయ్యేళ్లుగా ప్రజల సామాజిక జీవనాన్ని ప్రభావితం చేసిన తత్వవేత్తలలో మనదేశానికి చెందిన వారూ ఉన్నారు. అహింస, సత్యాగ్రహ సిద్ధాంతాల ద్వారా మహాత్మాగాంధీ విశ్వవిఖ్యాతి పొందారు. ప్రజాస్వామ్య సిద్ధాంతాలు, పంచశీల సూత్రాల ద్వారా ఆధునిక తత్వవేత్తలలో ఒకరిగా నెహ్రూ గుర్తింపు పొందారు. అస్పృశ్యులుగా పరిగణించబడుతున్న వారికి సమాజంలో హోదా కల్పించే విధంగా రచనలు చేసిన రాజ్యాంగ నిర్మాత బి.ఆర్. అంబేద్కర్, భారతీయ సామాజిక తాత్విక చింతనలో 'రాడికల్ హ్యూమనిజమ్'కు ఆద్యుడైన మానవేంద్రనాథ్‌రాయ్, 'సారే జహాఁసే అచ్ఛా...' అంటూ జాతీయ భావంతో గానంచేసిన కవితాత్వికుడు మహ్మద్ ఇక్బాల్ తదితరులు ప్రపంచ తత్వవేత్తల జాబితాలో తగుస్థానం సంపాదించుకున్నారు.



ప్రాచీనయుగ చరిత్రలో క్రైస్తవం, బౌద్ధం, మధ్యయుగాల్లో ఇస్లాం మతాలు మానవజాతిపై ఎంత ప్రభావం చూపాయో, ఆధునిక యుగంలో మార్క్సిస్టు మంత్రం అంత ప్రభావం చూపిందనడం అతిశయోక్తి కాదు. వైశాల్యంలో అతిపెద్దదయిన సోవియట్ యూనియన్, అత్యధిక జనాభాగల చైనాతోసహా 15 దేశాల్లో కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. వంద దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలున్నాయి. రెండో ప్రపంచ యుద్ధకాలం నుంచి 1980వ దశకం వరకూ ప్రపంచమంతటా ఉధృతంగా వున్న కమ్యూనిస్టు ప్రభంజనం సోవియట్ కూటమి పతనంతో చల్లబడింది. ఇప్పటి యువతరాన్ని ఈ సిద్ధాంతం ఏమాత్రం ఆకర్షించలేకపోతోంది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ పరిణామంపై వై. నాగేశ్వరరావు టూకీ రచన...

# ఎండిపోతున్న 'ఎర్రసముద్రం'

రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం పతనమైనప్పటి నుంచీ, తూర్పు యూరప్‌లో పరిణామాలు ఏర్పడ్డప్పటి నుంచీ కమ్యూనిజానికి కాలం చెల్లిందా? చెల్లడం అవసరమా? అనే ప్రశ్నలు పుట్టాయి. అయితే, దీనికి ఎవ్వరూ స్పష్టమైన సమాధానం చెప్పలేకపోయారు. సరళీకృత ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణలే శరణ్యమన్నారు. ప్రజల అభిప్రాయాలకు భిన్నంగా నేతలు, పెట్టుబడిదారులు వ్యాఖ్యానాలు చేసినా అవి పూర్తి స్థాయిలో నిలవడం లేదు. కమ్యూనిజం ఇప్పటికీ పలు రూపాల్లో ప్రభావం చూపుతూనే వుంది. ఇదొక ప్రయోగం కావడంతో జయాపజయాలు పోటుచేసుకుంటున్నాయి. మానవేతిహాసంలో 150 ఏళ్ళ చరిత్ర కమ్యూనిజానికి వుంది. అందులో 70 ఏళ్ళ పాటు కమ్యూనిస్టు రాజ్యాలు, వివిదదేశాలు గట్టిగా నిలబడగలిగాయి. రష్యాలోని అక్టోబర్ విప్లవం, తర్వాత చైనా విప్లవం ఇతర దేశాలకు ఆదర్శమైంది. ప్రస్తుతం వివిద దేశాల్లో కమ్యూనిస్టు ప్రభుత్వాలు అధికారంలో లేకపోయినా, పలు చోట్ల రంగు వెలిసి వున్నా మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీలు సాయుధ పోరాటాలతో అంతర్యుద్ధాలు సృష్టిస్తునే వున్నాయి. ప్రపంచాన్ని రెండు బావాలుగా చీల్చిన కమ్యూనిజం మొత్తంగా ఆర్థిక పోరాటాలకు, కార్మిక పోరాటాలకు, విముక్తి పోరాటాలకు, ప్రజా ఉద్యమాలకు చేయూతనిస్తునే వున్నాయి. ఇటీవల చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం 50వ వార్షికోత్సవం కూడా జరుపుకుంది. ఈ నేపథ్యంలో వెయ్యేళ్ళ చరిత్రలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రదాన మజిలీగానే రికార్డయిందని చెప్పకతప్పదు. దేశంలోనే కాదు, ఆంధ్ర రాష్ట్రంలో కమ్యూనిస్టులు నక్సలైట్ల పేరుతో కూడా మనుగడ సాగిస్తున్నందున ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ పరిణామ క్రమాన్ని సూక్ష్మంగానైనా పరిశీలించడం అవసరం.

త్వరగతిన పెరుగుతున్న పెట్టుబడిదారీ విదానం శ్రామిక ప్రజలమీద అమితమైన ప్రభావం చూపింది. ప్రపదమంగా ఇంగ్లండ్ దేశంలో రైతులు పెద్ద సంఖ్యలో తమ భూములను గొర్రెలు మేపే పచ్చిక బీళ్ళుగా వదిలేసి రోజు కూలికి ప్యాక్టరీలో చేరాల్సి వచ్చింది. అలాగే చేతి వృత్తుల వారు కూడా పెద్దపెద్ద పారిశ్రామిక ఫ్యాక్టరీల్లో చేరాల్సి వచ్చింది. ఆ విధంగా ఆధునిక కార్మికవర్గం పుట్టుకొచ్చింది. పెట్టుబడిదారీ విధానం అమలు జరుగుతున్న ప్రతి దేశంలోనూ కార్మికవర్గం సృష్టి వేగంగానే సాగింది. ఇక పెట్టుబడిదారులు వాళ్ళ సామాజిక వ్యవస్థకు సహజ లక్షణమైన హద్దులేని పేరాశతో స్త్రీ పురుష, బాల, వృద్ధ విచక్షణలేకుండా కార్మికుడ్ని బానిస చాకిరీ చేయించుకోవడం మొదలెట్టారు. వారి జీవిత పరిస్థితులు బానిసలకంటే అధ్వాన్నంగా తయారైనాయి. 1844 లో ఎంగెల్స్ 'ఇంగ్లాండ్‌లో కార్మికుల స్థితిగతులు' అనే గ్రంధాన్ని రాశారు. ఆయన ఒక సందర్భంలో పెట్టుబడిదారుల మధ్య, కార్మికుల మధ్య సంఘర్షణ స్వబావాన్ని చిత్రీకరిస్తూ 'ఆధునిక పెట్టుబడిదారీ సమాజంలో ప్రతి వ్యక్తి ఇతర వ్యక్తులతో పోరాడితే



గానీ జీవించడం దుర్లభం. ఇదే దాని ప్రధాన లక్షణం, ఈ మహా సంగ్రామం పోటీ రూపంలో వ్యక్తమవుతుంది... పెట్టుబడిదారీ సమాజంలో ప్రతి వ్యక్తీ ఇతర వ్యక్తుల మార్గంలో అడ్డంగా నిలబడతాడు. ప్రతి వ్యక్తీ ఇతర వ్యక్తుల్ని నెట్టేసుకుంటూ తన మార్గానికి అడ్డంగా వున్న స్థానాన్ని ఆక్రమించుకోజూస్తాడు. పెట్టుబడిదారులు ఒకరితో ఒకరు ఎలా పోటీ పడుతారో అలాగే కార్మికులు కూడా ఒకరితో ఒకరుపోటీ పడుతున్నారు. ఈ పోటీ పెట్టుబడిదారుల చేతిలో బలమైన ఆయుదంగా ఉపయోగపడుతుంది' అని చెబుతారు. ఈ ఆయుధాన్ని ఉపయోగించుకుని పసి బాలురు, స్త్రీలతో సైతం 12గంటలు మొదలు 16 గంటల వరకు పని చేయించేవారు. ఇచ్చే కూలితో అర్ధాకలి కూడా తీరేది కాదు. ఈ పరిస్థితిపై 1833లో ఒక పార్లమెంటరీ రిపోర్టు 'ఇంగ్లీషు కార్మికుల పరిస్థితి ఆమెరికాలో బానిసల పరిస్థితి కంటే అధ్వాన్నంగా వుంది' అని పేర్కొంది. ఈ అమానుష పరిస్థితులకు వ్యతిరేకంగా కార్మికులు అనేక రూపాల్లో ప్రతిఘటించేవారు. సంఘ నిర్మాణం, వర్గ చైతన్యంలేని ఆ రోజుల్లో ఒక దశలో యంత్ర విధ్వంసక ఉద్యమం కూడా వచ్చింది. లూడ్ అనే కల్పిత వ్యక్తి పేరుతో వున్న ఉద్యమం ప్యాక్టరీ యాజమాన్యులపై దౌర్జన్యాలకు కూడా దిగింది. ప్రారంభంలో కార్మిక సంఘాలు సమ్మెల సందర్భంలో మాత్రమే ఏర్పడుతుండేవి. ప్రారంబం నుంచే ట్రేడ్ యూనియజం వుండేది. పెట్టుబడిదారీ వ్యతిరేక ధోరణులు ఏర్పడి యూరోపియన్ సోషలిస్టులు ఉత్పన్నమైనారు. యూరప్‌లో ఇలాంటి పరిస్థితులు వున్న సమయంలో మార్క్స్, ఎంగెల్స్‌లు రంగంమీదికి వచ్చారు. శాస్త్రీయ సోషలిజానికి పునాదులు వేశారు.

1845లో ఫ్రాన్సులో ప్రవాసిగా ఉన్న మార్క్స్‌ను ఆ ప్రభుత్వం బహిష్కరించింది. అక్కడ నుంచి ఆయన బ్రసెల్స్ వచ్చారు. ఆనాటికే విప్లవ సంస్థలుగా వున్న 'డెమోక్రటిక్ లీగ్' జనరల్ వర్కర్స్ సొసైటీ'ల కార్యక్రమంలో చురుకుగా పాల్గొన్నారు. 1846 ఫిబ్రవరిలో ఎంగెల్స్‌తో కలిసి 'కమ్యూనిస్టు కమిటీస్ ఆఫ్ కరస్పాండెన్స్' అనే యూనిట్లను నిర్మాణానికి పూనుకున్నారు. ఈ కమిటీల ద్వారా చుట్టుపక్కల దేశాల్లోని విప్లవ కార్యకర్తలతో సంబంధాలు పెట్టుకోవడం కమ్యూనిస్టు ప్రచారం సాగించడం ప్రచారంగా పెట్టుకున్నారు. ఇద్దరి కృషివల్ల 1847లో కమ్యూనిస్టు లీగ్ అనే సంస్థ ఏర్పడింది. ఇది మొదటి అంతర్జాతీయ కమ్యూనిస్టు నిర్మాణానికి దారి చూపింది. ఈ సమయంలోనే ఫ్రెంచి విప్లవం వచ్చింది. 17ఏళ్ళ తర్వాత 1864లో స్థాపించబడిన 'మొదటి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్'కు ప్రాతిపదిక అయ్యింది. ఫ్రెంచి, జర్మనీ, స్విడ్జర్లాండు, ఇటలీ, రష్యా మొదలైన దేశాల నుంచి బహిష్కరించబడిన విప్లవకారులైన ప్రవాసులతోను, మేధావులతోను ఈ లీగ్ ఏర్పడింది. లీగ్‌కు నిబందనావళిని రూపొందించే క్రమంలోనే మార్క్స్, ఎంగెల్స్‌లు కలిసి కమ్యూనిస్టు మ్యానిఫెస్టో ముసాయిదాను తయారు చేశారు. దీన్ని 1848 ఫిబ్రవరిలో లండన్‌లో ప్రచురించారు.

ప్రపంచ కార్మికులకు 'కమ్యూనిస్టు ప్రణాళిక' ప్రప్రథమ విప్లవ కార్యక్రమ పత్రం. ఇది మొదట జర్మన్ భాషలో అచ్చయి, అదే భాషలో జర్మనీ, ఇంగ్లాండ్, అమెరికాల్లో ప్రాచుర్యం పొందింది. 1850లో మొదటిసారిగా దీనిని ఇంగ్లీష్‌లోకి తర్జుమా చేసి ఒక పత్రిక అచ్చు వేసింది. మొదటి ఇంటర్నేషనల్‌కు సంబంధించి లండన్‌లో సెంట్ మార్టిన్ హాల్‌లో ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ సమావేశమైంది. పారిస్ కమ్యూన్ ఓటమి అనంతరం యూరప్ దేశాల్లో ఇంటర్నేషనల్‌పై తీవ్రమైన వేట సాగింది. ఇంటర్నేషనల్‌తో సంబంధం పెట్టుకోవడం నేరమని ఫ్రాన్సులో శాసనం చేశారు. తర్వాత ఇంటర్నేషనల్‌లో అంతరంగిక సంక్షోభం ఏర్పడి మార్క్సిస్టులకు, బకునిస్టులకు మధ్య ఘర్షణ తీవ్రమైంది. ఇంతలో కారల్‌మార్క్స్ 1883 మార్చి 14న తన 65వ ఏటలో మరణించారు.

20వ శతాబ్దం ప్రారంభమయ్యేనాటికే రెండో ఇంటర్నేషనల్ చాలా వరకు మార్క్సిజానికి దూరమైంది. మితవాద అవకాశవాదం బాగా బలపడింది. ఇంటర్నేషనల్‌లో వున్న ముఖ్యమైన పార్టీలన్నీ సామ్రాజ్యవాద విస్తరణ ద్వారా పెట్టుబడిదారీ వ్యవస్థ వర్ధిల్లుతుందని భ్రమలుపడి, రివిజనిస్టు కార్యక్రమంతో ముందుకు వెళ్ళాయి. ఈ క్లిష్ట పరిస్థితిలో రివిజనిజాన్ని శక్తివంతంగా ప్రతిఘటించే శక్తి రష్యాలో బలపడింది. పరిస్థితుల కనుగుణంగా లెనిన్ విప్లవ కార్యక్రమాన్ని


రష్యా విప్లవం

తయారు చేశారు. దానికే 'బోల్షివిజం' అని పేరు వచ్చింది. రష్యన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ విప్లవ పాత్ర నిర్వహించింది. చట్టబద్ధ మార్క్సిస్టులకు వ్యతిరేకంగా లెనిన్ పనిచేసి మార్క్సిస్టు పార్టీ నిర్మాణానికి కృషి చేశారు. జారు చక్రవర్తికి వ్యతిరేకంగా కార్మికులు పోరాటం చేయడంలో 'ఏమి చేయాలి' అనే గ్రంథం ద్వారా సంఘటితపరిచారు. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత 1917లో రష్యాలో అక్టోబర్ విప్లవం ఏర్పడింది. సాయుధ తిరుగుబాటు సాగించిన ఫలితంగా పెట్టుబడిదారుల, భూస్వాముల పాలన కూలిపోయింది. దీనిని ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు విప్లవంగా గుర్తించారు. తనను తాను రక్షించుకోలేని విప్లవం నిరర్థకమని లెనిన్ భావించి రెడ్ ఆర్మీని ఏర్పాటు చేశారు. జాతీయ విమోచనోద్యమాలపై అక్టోబర్ విప్లవం ప్రభావం చూపింది. యూరప్ దేశాల్లోని విప్లవోద్యమాలకు బలమైన ప్రోత్సాహాన్ని ఇచ్చింది. ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్య హంబరు రాచరికాన్ని కూల్చివేసింది. చెకోస్లోవేకియా, హంగేరి, ఆస్ట్రియా దేశాలు స్వతంత్ర దేశాలు తిరిగి ఆవిర్భవించాయి. దీని నుంచి ఉత్తేజం పొందిన చైనా ప్రజలు 1919 మే4 నుంచి ఉద్యమాన్ని ప్రారంభించారు.

మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభంతో రెండో ఇంటర్నేషనల్ ప్రధాన నాయకత్వం కార్మికోద్యమానికి ద్రోహం తలపెట్టి పెట్టుబడి ప్రభుత్వాల యుద్ధ నిర్వహణలో చేతులు కలపడంతో ఈ సంస్థ విచ్ఛిన్నమైపోయింది. దీంతో మూడో ఇంటర్నేషనల్ 1915న ఏర్పడి 1917 వరకు సాగింది. మూడో ఇంటర్నేషనల్ స్థాపన కోసం రష్యా, పోలెండ్, హంగరి, జర్మనీ, ఫిన్‌లాండ్ దేశాల ...

కమ్యూనిస్టు పార్టీలు రష్యా కమ్యూనిస్టు పార్టీ పేరిట పిలుపు ఇవ్వడంతో 1919 మార్చి2న 33దేశాల నుంచి వచ్చిన కమ్యూనిస్టు పార్టీల ప్రతినిధులు సమావేశమయ్యారు. ఈ సందర్భంగా ప్రపంచవ్యాపితంగా సోషలిజం స్థాపించడమే ధ్యేయంగా ప్రకటించింది. తర్వాత మొదటి కాంగ్రెస్ నాటికి వివిధ దేశాల్లో కమ్యూనిస్టు ధోరణులు కలిగిన గ్రూపులు ఏర్పడ్డవి. రెండో కాంగ్రెస్ నాటికి ఈ గ్రూపుల్లో ఎక్కువ భాగం కమ్యూనిస్టు పార్టీలుగా రూపొందినవి. రెండో కాంగ్రెస్ తర్వాత యురోప్ కార్మికోద్యమంపై పెట్టుబడిదారీ ప్రభుత్వాలు దాడి తీవ్రమయ్యాయి. తర్వాత వచ్చిన ముస్సోలినీ ఫాసిస్టు పార్టీ కూడా ఇదే పని చేసింది. ఈ దాడులను ప్రతిఘటించడానికి అన్ని రాజకీయ ధోరణులకు చెందిన ట్రేడ్ యూనియన్లతో ఐక్య సంఘటనలు ఏర్పాటు చేయాలని లెనిన్ గుర్తించారు. సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించిన లెనిన్ 1924 జనవరి 21న మరణించారు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కంటి పాపలాగా కాపాడుతానని లెనిన్ సమాధి దగ్గర స్టాలిన్ ప్రతిజ్ఞ చేశారు.

యుద్ధానంతరం పెట్టుబడిదారీ విధానంలో తాత్కాలిక నిలకడ ప్రవేశించింది. రష్యాలో పార్టీ ఏర్పడిన తర్వాతే ట్రేడ్ యూనియన్లు వచ్చాయి. పార్టీకి సహాయపడే సంస్థలుగా కొనసాగాయి. 1929 అక్టోబర్‌లో ఇదివరకెన్నడూ కనీవినీ ఎరుగని ఆర్థికసంక్షోభం పెట్టుబడిదారీ ప్రపంచాన్ని ముంచెత్తింది. పారిశ్రామిక ఉత్పత్తి పడిపోవడంతోపాటు, నిరుద్యోగం విపరీతంగా పెరిగింది. ఇది అధికోత్పత్తి ద్వారా సంభవించిందని, మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత మొత్తం పెట్టుబడిదారీ వ్యవస్థను, వలస దేశాలతో సహా ముంచెత్తిందని స్టాలిన్ చెప్పారు. యుద్ధంలో గెలిచిన దేశాలకు, ఓడిపోయిన దేశాలకు ముఖ్యంగా జర్మనీకి ఘర్షణ పెరిగి రెండో ప్రపంచ యుద్ధానికి దారి తీశాయి. పెట్టుబడిదారీ విధానంలో వైరుధ్యాలు పెరిగి కూలిపోతున్న ఆర్థిక వ్యవస్థను నిలబెట్టుకునేందుకు అమెరికాలో రూజ్‌వెల్ట్ నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టారు. దీనికి భిన్నంగా జర్మనీలో హిట్లర్ ఫాసిస్టు విధానాన్ని అనుసరించాడు. రష్యాలో స్టాలిన్ నేతృత్వంలో రెండో ప్రపంచ యుద్ధంలో పాల్గొని కమ్యూనిస్టు రాజ్యాలకు విముక్తి కలిగించారు. ఈ సమయంలోనే గెరిల్లా పోరాటాలు ముఖ్యమైన పాత్ర నిర్వహించాయి. హిట్లరు సైన్యాలకు వ్యతిరేకంగా సోవియట్ గెరిల్లాలు వీరోచిత పోరాటాలు చేశాయి. ఎవరికి వారుగా యుద్ధోన్మాదంలో మునిగినందున మూడో ఇంటర్నేషనల్ రద్దు చేయడానికి నిర్ణయించారు. యుద్ధం అనంతరం ఇటలీలో, ఫ్రాన్సులో మిశ్రమ ప్రభుత్వాలు, బ్రిటన్‌లో లేబర్ ప్రభుత్వం ఏర్పడింది.

మొదటి ఇంటర్నేషనల్ పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతున్న దశలో పుట్టింది. సిద్ధాంత రీత్యా, నిర్మాణ రీత్యా ఆధునిక కార్మికోద్యమానికి పునాదులు వేసింది. రెండో ఇంటర్నేషనల్ పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం వేగంగా అభివృద్ధి చెందుతున్న సమయంలో పుట్టింది. ఈ కాలంలోనే ట్రేడ్ యూనియన్లు, కో ఆపరేటివ్ సంస్థలు, కమ్యూనిస్టు పార్టీలు. ప్రజా పునాది కలిగిన సంస్థలు అభివృద్ధి చెందాయి. పెట్టుబడిదారీ క్షీణదశలో, సోషలిజం ఏర్పడనున్న సమయంలో కార్మికవర్గం, రైతాంగం, అణచబడిన విప్లవ సంస్థగా మూడో ఇంటర్నేషనల్ ఏర్పడింది. తర్వాత నాల్గో ఇంటర్నేషనల్ ఏర్పడకపోవడానికి రష్యా విప్లవం, చైనా విప్లవం రెండు మార్గాలు వుండటమే కారణమన్నారు. ఈ ఇంటర్నేషనల్ కార్యక్రమాలను భారతదేశం తరవును ఎం.ఎన్. రాయ్ వంటి మేధావులు అర్థం చేసుకున్నప్పటికీ ప్రధాన పాత్ర వహించలేదు. అమెరికా సామ్రాజ్యవాద శక్తుల కుట్రలకు వ్యతిరేకంగా రుమేనియా, హంగరీ, యుగోస్లేవియా, పోలెండ్, బల్గేరియా, చెకోస్లేవియా, సోవియట్ యూనియన్, ఫ్రాన్సు, ఇటలీ దేశాల కమ్యూనిస్టు పార్టీలు 1947 సెప్టెంబర్‌లో సమావేశమై కమ్యూనిస్టు కార్యకలాపాలను సమన్వయపరిచేందుకు కమ్యూనిస్టు సమాచార కేంద్రం (కొమిన్‌ఫాం) ఏర్పరచుకున్నారు. స్టాలిన్ మరణానంతరం కృశ్చేవ్ రాకతో రష్యాలో పెట్టుబడిదారీ ప్రభుత్వాలతో శాంతియుత సహజీవనం ప్రతిపాదనలు చేశారు. స్టాలిన్ హయాంలో జరిగిన తప్పుల నుంచి నేర్చుకోవలసిన గుణపాఠాలు చూపే మిషతో ఆయన పాత్రను పూర్తిగా తిరస్కరించారు. 20వ మహాసభ నుంచి స్టాలిన్ ఇక హంతకుడిగా, ఒక నియంతంగా కృశ్చేవ్ ప్రకటించాడు. ఇక్కడినుంచే అధికారంలో కమ్యూనిస్టు పార్టీ వున్నా సంస్కరణలు ప్రవేశించడంతో కమ్యూనిస్టు ఉద్యమస్ఫూర్తి దెబ్బతింది.



పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసు

ఇదే సమయంలో చైనాలో విప్లవం మరింత పుంజుకుంది. ప్రపంచంలో అత్యంత వెనుకబడిన సామాజిక వ్యవస్థా వేదికపై ఆవిష్కరించిన ఒక మహాకావ్యం చైనా విప్లవం. జపాను దురాక్రమణను తిప్పికొట్టడంలో భాగంగా ఈ విప్లవం ఆర్భవించింది. భారత్‌లాగే చైనా కూడా అర్ధవలస, అర్ధ ఫ్యూడల్ దేశం. 1840 నాటి నల్లమందు యుద్ధం తర్వాత విదేశీ పెట్టుబడి చైనా ఆర్థిక రంగంలోకి చొరబడింది. చైనాలో జాతీయ పెట్టుబడికి సంబంధించిన స్వదేశీయ పెరుగుదలకు ఈ విదేశీపెట్టుబడి ఆటంకపరిచింది. ఉత్తర చైనాలో 1936లో కమ్యూనిస్టు పార్టీ ప్రభుత్వం ఏర్పడి పనిచేయడానికి సిద్ధమైనప్పటికీ జపాను ఉత్తర చైనాలో ఎక్కువ భాగం మంచూరియాతో సహ ఆక్రమించుకుని ముందుకు సాగుతోంది. అక్కడ కమ్యూనిస్టు పార్టీ సోవియట్ నాయకుల సహాయంతో కొమిన్‌టాంగ్‌తో కలిసింది. ప్రారంభంలో చైనా జపానుకంటే బలహీనంగా వున్నా, దీర్ఘకాల పోరాటంలో జపాను ఓటమి తప్పదని మావో హెచ్చరించాడు. నూతన ప్రజాస్వామిక ప్రభుత్వానికి శ్రీకారంచుట్టాడు. 1950 తర్వాత క్యూబా, లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియా దేశాల్లో కమ్యూనిస్టు విప్లవాలు విజయవంతమయ్యాయి. భారతదేశంలో 1925లోనే కమ్యూనిస్టు పార్టీ ఏర్పడ్డప్పటికీ స్వాతంత్ర్యసమరంలో ప్రముఖ పాత్ర నిర్వహించలేకపోయింది. భారతదేశానికి అనుకూలమైన ఎత్తుగడలను ఎంచుకోక, చైతన్యపూరిత కార్యక్రమాలు చేపట్టక ముక్కలైంది. 1964లో సిపిఎం ఏర్పడింది.

పశ్చిమ బెంగాల్‌లో 20 ఏళ్ళకుపైగా ప్రభుత్వాన్ని నిర్వహిస్తోంది. ఆదే రాష్ట్రంలో 1969లోనే నక్సల్బరీ అనే గ్రామంలో చారుమజుందార్ నాయకత్వంలో మార్కిస్టు, లెనినిస్టు మార్గాన్ని ఎంచుకుని ప్రజా యుద్ధ పంథాలో పోరాటం ప్రారంభించారు. తర్వాత సిపిఎం ప్రభుత్వం నక్సల్బరీ గ్రామంలో ప్రజలపై కాల్పులు జరపడంతో అది విస్తృతి చెంది భారత దేశంలోని మరిన్ని రాష్ట్రాలోకి వ్యాపించింది. ఎన్నికల ద్వారా అధికారంలోకి వచ్చేందుకు కమ్యూనిస్టు పార్టీలుగా సిపిఐ, సిపిఎం తదితరమైనవి శాంతియుత పద్ధతులు ఎన్నుకున్నప్పటికీ పలు ఎం.ఎల్. పార్టీలు మాత్రం పలు రాష్ట్రాల్లో సాయుధంగా విప్లవాలు నిర్వహిస్తునే వున్నాయి. ప్రభుత్వాలు వీటిని అణిచేసేందుకు యత్నాలు చేస్తూనే వున్నాయి.

వియత్నాంలో కమ్యూనిస్టు సర్కార్ ఏర్పడింది. మొదట ఫ్రెంచి సామ్రాజ్యవాదానికి, పిదప అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా హోచిమిన్ నాయకత్వంలో వియత్నాం ప్రజలు సుదీర్ఘకాలం సాగించిన పోరాటం చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించదగ్గది. రెండో ప్రపంచ యుద్ధానంతరం రెండు ముక్కలైన కొరియా ఉత్తరభాగం కమ్యూనిస్టుల వశమైంది. 1959లో క్యూబాలో ఫైడల్ కాస్ట్రో ఆధ్వర్యంలో కమ్యూనిస్టు విప్లవం విజయవంతమైంది. కాస్ట్రో సహచరుడు అంతర్జాతీయ విప్లవకారుడు చేగువేరా బొలివియా అడవుల్లో హత్యకు గురయ్యారు. విప్లవాన్ని విదేశాలకు 'ఎగుమతి' చేసే ప్రయత్నం ఆయన హత్యతో విఫలమైంది. సోవియట్ యూనియన్‌తో సహా తూర్పు యూరప్ దేశాల్లో కమ్యూనిస్టు వ్యవస్థలు కుప్పకూలడం, చైనాలో డెంగ్ నాయకత్వంలో జరిగిన సంస్కరణల ఫలితంగా పెట్టుబడి సంస్కృతికి ద్వారాలు తెరవడంతో కమ్యూనిస్టు ఉద్యమ స్ఫూర్తి పూర్తిగా రంగు వెలిసింది. దేశదేశాల్లో ఉన్న కమ్యూనిస్టు పార్టీలు కూడా గడ్డు పరిస్థితిని ఎదుర్కొంటున్న స్థితి. ■







19వ శతాబ్దం చివరి భాగంలో బ్రిటీష్ విద్యార్జన ఫలితంగా భారతీయ మేధావివర్గం ఒకటి అవతరించింది. ఈ వర్గంపై పాశ్చాత్య ప్రజాస్వామిక భావాల ప్రభావం, ఉదార విధానాల ముద్ర బలంగా పడింది. వీరు నిర్వహించిన ప్రచారంవల్ల దేశంలో జాతీయ భావాలు పరివ్యాప్తమయ్యాయి. ఈ జాతీయోద్యమం వివిధ రూపాల్లో వ్యక్తమైంది. సురేంద్రనాథ్ బెనర్జీవంటి వారు, పౌరహక్కులు కావాలని డిమాండ్ చేస్తే, రాజారామమోహన్ రాయ్ వంటివారు సంఘసంస్కరణకు నడుంబిగించారు. జాతీయోద్యమం-కాంగ్రెస్ పార్టీల ఆవిర్భావంపై 'టి. వేణుగోపాల్' పరిశీలన...

# జాతీయ వికాసం-కాంగ్రెస్ జననం


రాజారామ్మోహన్‌రాయ్

భారతదేశ చరిత్ర అంటే దురాక్రమణల చరిత్రేనని కారల్ మార్క్స్ ఒక సందర్భంలో వ్యాఖ్యానించాడు. ఈ దేశాన్ని బ్రిటిష్ వాళ్లు ఆక్రమించకపోయి వుంటే మరొకరు ఆ పని చేసేవారని కూడా ఆయన అంచనా. సహజ వనరులుండి అభివృద్ధికి ఎంతో అవకాశమున్నా కుల ప్రాతిపదిక మీద ఏర్పడిన ఆచారాలు, సంప్రదాయాలు- అవి పునాదిగా వున్న సామాజిక వ్యవస్థా ఇందుకు అడ్డుగా నిలిచాయి. దీనికి కాపలాదార్లు ఫ్యూడల్ ప్రభువులు. తమ పాలన కింద వున్న జనాన్ని అణగదొక్కడంతో పాటు పొరుగునున్న పాలకుడితో నిత్యం ఘర్షణపడే ఇలాంటి వారి స్వభావమే ఈ దురాక్రమణలకు వీలు కల్పించింది. అందుకే, ఈ దేశం మీదకి అనేక దండయాత్రలు జరిగాయి. ఆ వచ్చిన వారు దొరికినంత దోచుకున్నారు. 1757 ప్లాసీ యుద్ధం తర్వాత దోచుకున్న ధనరాశులతోనే బ్రిటిష్ వాళ్లు ఆధునాతన లండన్ నగరాన్ని నిర్మించుకున్నారంటే ఆ 'దోపిడీ'ని అంచనా వేయవచ్చు.

ఈ దోపిడీతో ప్రారంభమైన వారి పాలనలో రైతులు భూముల్ని కోల్పోతే, చేతి వృత్తులన్నీ సర్వనాశనమయ్యాయి. అన్ని రంగాల వారినీ పీల్చి పిప్పి చేసిన ఆ పాలన పర్యవసానమే మరో వందేళ్లకు అంటే 1857లో జరిగిన ప్రదమ భారత స్వాతంత్ర్య సంగ్రామం. అది సారాంశంలో దేశంలో జరిగిన తొలి ప్రజాతంత్ర విప్లవం. బ్రిటిష్ పాలకులు దాన్లోని 'ప్రమాదకరమైన' ధోరణిని పసిగట్టారు. కనుకనే తర్వాత కాలంలో ఫ్యూడల్ సంస్థానాధీశుల్ని కాస్తంత గౌరవంతో చూడటం నేర్చుకున్నారు. ఈ సంగ్రామంలో హిందువుల్ని మించిన ఉత్సాహం ప్రదర్శించిన ముస్లింలని చూసి కూడా వాళ్లు కంగారుపడ్డారు. బ్రిటిష్ దోపిడీని గుర్తించి కుల, మతాలకు అతీతంగా అన్ని వర్గాల ప్రజలూ 'మనందరం ఒక్కటే'నన్న దృక్పథంతో ఈ పోరాటంలో పాల్గొనడం వాళ్లకు రుచించలేదు. దాన్ని జయప్రదంగా అణగదొక్కగలిగినా అనంతర కాలంలో ఏర్పడబోయే పరిణామాలను వాళ్లు ముందే అంచనా వేసుకోగలిగారు. అంతకు 50 యేళ్ల క్రితం అంటే 1800 ప్రాంతంలో దక్షిణాదిన కట్ట బ్రహ్మన మొదలుకొని కొందరు సంస్థానాధీశులు కలిసికట్టుగా చేసిన పోరాటానికీ, దీనికి మౌలికంగానే తేడా వుంది. ఆ పోరాటంలో జనం ఇంత ఐక్యతను ప్రదర్శించలేదు. కుల విభేదాలు అలానే వున్నాయి. దానికి నాయకత్వం వహించిన వారిలో ఒకరైన మరుడ పాండ్యన్ 'ప్రజలు కులపరంగా విడిపోయారు. యూరోపియన్ల కపట స్వభావాన్ని తెలుసుకోలేక తమలో తామే దెబ్బలాడుకున్నార'ని రాసుకున్నాడు. మరి అలాంటి పోరాటంతో పోలిస్తే 1857 సంగ్రామం నిస్సందేహంగా అత్యుత్తమమైనదే. అందుకే హిందూ-ముస్లింల మధ్య ఘర్షణలు పెట్టే పనికి బ్రిటిష్ పాలకులు అంకురార్పణ చేశారు.

తాము వచ్చేసరికి దేశంలోని చాలా ప్రాంతాలు ముస్లిం రాజుల పాలన కింద ఉన్నాయి గనక, మెజారిటీగా వున్న హిందువుల బాధలకు ముస్లింలే కారణమన్న అభిప్రాయాన్ని కలిగించడానికి బ్రిటిష్ పాలకులు ప్రయత్నించారు. పాలకులు ఎవరనే దానితో నిమిత్తం లేకుండా రాజ్యానికి సహజంగా వుండే అణచివేత స్వభావాన్ని బ్రిటిష్ పాలకులు ఆ రాజులు అనుసరించిన మతానికి అంటగట్టారు. ఆ మతం వల్లే మీకు ఈ కష్టాలని చెప్పడం మొదలు పెట్టారు. తాము ఈ దేశానికి రావడానికి ముందున్నదంతా 'అంధయుగమ'ని చిత్రీకరించారు. వాళ్ల ప్రయత్నం కూడా 'వృధా' పోలేదు. అనంతర కాలంలో దేశంలో మొగ్గతొడిగిన జాతీయోద్యమంలో దీని ప్రభావం పడకపోలేదు.

బ్రిటిష్ పారిశ్రామిక రంగానికి కావాల్సిన ముడి సరకుల్ని ప్రాసెస్ చేసి పంపే ప్రాంతంగా మన దేశాన్ని మార్చి వేయడంతో, ఇక్కడి ప్రముఖ పట్టణాల్లో అనేక పారిశ్రామిక సంస్థలు వెలిసాయి. వాటి లావాదేవీల కోసం, వ్యాపారాన్ని విస్తరించుకోవడం కోసం ప్రెసిడెన్సీ బ్యాంకులు కూడా వచ్చాయి. భారత్‌ని వలసదేశంగా మార్చుకొని, ఇక్కడి వారికి చాలా పరిమితమైన అవకాశాలిచ్చినా, ఈ పరిమితుల్లోనే మధ్య తరగతి వర్గం ఒకటి ఆవిర్భవించింది. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం నాటికే ఏర్పడిన మధ్య తరగతి వర్గం నిజానికి బ్రిటిష్ వాళ్ల సృష్టే. రక్తంలో తప్ప వేష భాషల్లో, ఆచార వ్యవహారాల్లో, ఆలోచనల్లో బ్రిటిష్ జాతీయులను పోలి వుండే 'జనాన్ని' సృష్టించబోతున్నానని చెప్పిన మెకాలే విద్యావిధానం అప్పటికే అమలైంది. దాని 'సత్ఫలితాలు' కనబడటం మొదలయ్యాయి. ఈ వర్గంలోని కొందరు విద్యావంతులై ప్రభుత్వోద్యోగాల్లో ప్రవేశం కోసం ప్రయత్నించినప్పుడు వాళ్లని దెబ్బ తీయడానికి బ్రిటిష్ పాలకులు ఎన్నో విధాల ప్రయత్నించారు. బెంగాల్ నుంచి ఐసిఎస్‌కి ఎంపికైన సురేంద్రనాథ్ బెనర్జీకి ఈ పరిస్థితి ఎదురైన తర్వాత బ్రిటిష్ వ్యతిరేకత వెల్లువెత్తింది. తాము కూడా బ్రిటిష్ పౌరులమనీ, పైగా వారికి దత్త పుత్రులమనీ సురేంద్రనాథ్ బెనర్జీ అనేవాడు. తమ సొంత దేశంలో తమ పౌరులకెలాంటి హక్కులిస్తున్నారో, మాకూ అవే కల్పించండని డిమాండ్ చేసేవాడు. వీటిని సాధించుకోవడానికే. అప్పటికే దేశంలోని వివిధ ప్రాంతాల్లో పనిచేస్తున్న బ్రిటిష్ ఇండియా అసోసియేషన్ (కలకత్తా), సార్వజనిక్ సభ (పూనే), జెంది మహాసభ (మద్రాస్) లాంటివి ఏకమై 1883లో జాతీయ మహాసభ జరిపాయి. ఈ మహాసభ కోర్కెల్లో ఎక్కువ బాగం మధ్య తరగతికి సంబంధించినవే. మేమూ బ్రిటిష్ వారిమేనని చెప్తున్న సురేంద్రనాథ్ బెనర్జీని సైతం చూసి బ్రిటిష్ వాళ్లు బెదిరారు. అతని నాయకత్వంలో ఏర్పడిన జాతీయ మహాసభ వల్ల ఏం ముప్పు వస్తుందోనన్న భయంతో మరింత మెతకగా వుండేవారితో మరో సంస్థ ఏర్పడాలని ఆశించారు. ఇలాంటి ప్రయత్నాల ఫలితంగానే 1885లో భారత జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించింది. ఇండియా లాంటి సువిశాల ప్రాంతాన్ని పరిపాలించాలంటే కేవలం చట్టాలు మాత్రమే పనికిరావని, ప్రజలతో సంబంధాలు ఏర్పర్చుకుని వారి ఆలోచనలు ☞


తిలక్





తెలుసుకుంటూ, తమకు అనుకూలమైన సామాజిక పునాదిని నిర్మించుకోవాలని బ్రిటిష్ వారు అప్పటికే నిర్ణయానికి వచ్చారు. అందువల్లే భారత జాతీయ కాంగ్రెస్ స్థాపకులు బ్రిటిష్ జాతీయులే కావడం యాదృచ్ఛికం కాదు. బ్రిటిష్ పాలనను కూడా మనం ఒక ముద్దగా చూస్తే అర్థం కాదు. బ్రిటన్‌లోని కన్సర్వేటివ్ పార్టీ, లిబరల్ పార్టీ రెండూ భిన్నధోరణులతో వుండేవి. భారత్‌లో జాతీయోద్యమాన్ని మొగ్గలోనే తుంచాలన్నది కన్సర్వేటివ్ పార్టీ విధానమైతే, ఆ దేశ ప్రజలకు కొన్ని రాజకీయ హక్కులివ్వాలని, వారితో కాస్త రాజీ ధోరణితో వ్యవహరించాలని లిబరల్ పార్టీ అనుకొనేది. వీరిద్దరి మధ్యా అధికారం చేతులు మారినప్పుడల్లా దాని ప్రభావం ఇక్కడి జాతీయోద్యమం పైనా, ప్రజలపైనా వుండేది. పరిపాలనా సంస్కరణలు లమలు జరపాలన్న డిమాండ్లతో కాంగ్రెస్ ఆందోళన నిర్వహించడానికి పూనుకోవడంతో దానిపై బ్రిటిష్ ప్రభుత్వం కఠినవైఖరి అవలంబించడం మొదలు పెట్టింది. ప్రభుత్వోద్యోగులెవరూ కాంగ్రెస్ కార్యకలాపాలతో సంబంధం పెట్టుకోరాదన్న తాఖీదులు పంపింది. కొన్ని విన్నపాలతో తీర్మానాలు చేసి ఎవరిళ్లకు వారు వెళ్లే సంస్కృతిని కాంగ్రెస్ విడనాడడమే కాక మధ్య తరగతి డిమాండ్లను దాటి కరువు కాటకాలు, జనం అనుభవిస్తున్న దుర్భర దారిద్ర్య పరిస్థితుల గురించీ మహజర్లు ఇచ్చింది.

దీనికి సమాంతరంగా సమాజ సంస్కరణ భావాలు బాగా వ్యాపించాయి. 1873లో మహారాష్ట్రలో జ్యోతి బాపూలే సత్యశోధక్ సమాజ్ స్థాపించి హిందూ సమాజంలో ఉన్న అమానవీయ కులవ్యవస్థకు వ్యతిరేకంగా ఉద్యమిస్తే, రాజారామ్మోహన్ రాయ్ లాంటి వారు దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడారు. ఇవికాక ఆర్యసమాజం, రామకృష్ణ-వివేకానంద ఉద్యమంలాంటివి హిందూ మత పునరుజ్జీవనానికి విశేష కృషి చేశాయి. హిందూ సమాజంలో సంస్కరణలు తేవాలన్న రామ్మోహన్‌రాయ్‌లాగే, ముస్లింలలో అలాంటి ప్రయత్నం చేసిన వ్యక్తి సయ్యద్ అహ్మద్‌ఖాన్. తన మతంలో ఛాందసులకు వ్యతిరేకంగా ఆయన పోరాడాడు. అయితే, హిందూ పునరుజ్జీవన ఉద్యమాల ప్రభావం కాంగ్రెస్‌పై పడి బాలగంగాధర్ తిలక్ వంటి వారు గణేశ్ ఉత్సవాలను, శివాజీ జయంత్యుత్సవాలను జాతీయోద్యమానికి వాహికలుగా చేసుకొనే సరికి సయ్యద్ అహ్మద్ ఖాన్ వంటి వారిలో పునరాలోచనలు మొదలయ్యాయి. కాంగ్రెస్ కోరే విధంగా ప్రజలెన్నుకున్న వారికే అధికారాన్ని కట్టబెడితే ముస్లింల వంటి అల్ప సంఖ్యాకులను అన్యాయం జరుగుతుందని ఆయన భావించారు. ఇలాంటి భావనలు పొగొట్టే ప్రయత్నాలు తగు మాత్రం జరగకపోవడం, బ్రిటిష్ వారు 'రాయించిన' చరిత్ర అనంతర కాలంలో దేశ విభజన డిమాండ్‌కి ఉపయోగపడ్డాయి.

జాతీయోద్యమానికి ఆయువుపట్టుగా వున్న బెంగాల్‌ని విభజిస్తే, ఉద్యమం వెన్ను విరుగుతుందనే దురాలోచనతో దాన్ని విడగొట్టినప్పుడు దేశమంతటా జాతీయ భావాలు మరింత ఆవేశంతో వ్యక్తమయ్యాయి. ఆ ప్రయత్నం బెడిసికొట్టి అప్పటి వరకూ స్వరాజ్యం ఊసెత్తని కాంగ్రెస్‌లో అతివాదులు బయలేరి తొలిసారి 1906లో స్వరాజ్యమే తమ లక్ష్య సాధనని ప్రకటించారు. ఇదే సమయంలో విభజనను వ్యతిరేకించిన ఢాకా నవాబు వంటి సంపన్న ముస్లింలకు రాష్ట్రాన్ని విడగొడితే లాభపడేది మీరేనని బ్రిటిష్ పాలకులు ఆశ చూపారు. కొత్తగా ఏర్పడే రాష్ట్రంలో ముస్లింలు ఎక్కువగా వున్న ప్రాంతాలున్నాయని వివరించారు. బ్రిటిష్ పాలకులు చివరకు బెంగాల్ విభజనను రద్దు చేసుకోవాల్సి వచ్చినా, తమ వర్గానికి ఉండాల్సిన ప్రత్యేక సౌకర్యాలు, హక్కులూ కోరుతూ ముస్లిం లీగ్ ఆవిర్భవించడానికి ఇది దోహదం చేసింది. బ్రిటిష్ పాలకుల వ్యూహాలకు ప్రతివ్యూహాలు పన్నుతూ, ఒక్కోసారి ఎదురు దెబ్బలు తింటూ, మరోసారి ముందుకు దూసుకెళ్తూ నడిచిన జాతీయోద్యమం జన జీవనంలో ప్రవేశ పెట్టిన విలువలు మాత్రం ఉన్నతమైనవి. పౌరులందరికీ భావ ప్రకటనా స్వేచ్ఛ వుండాలని, తమ మతాలను ప్రచారం చేసుకొనే స్వేచ్ఛ వుండాలని, అల్ప సంఖ్యాకుల భాషా సంస్కృతులను కాపాడాలని, బావులు, చెరువులు, రోడ్లు మొదలైన వాటిపై పౌరులందరికీ సమాన హక్కులుంటాయని, మరణశిక్ష వుండరాదని, ఈ దేశ సంపదపై ఇక్కడివారికే సర్వహక్కులూ వుండాలని, విద్య, ఉద్యోగావకాశాలు అందరికీ సమానంగా వుండాలనీ ఈ జాతీయోద్యమం ఆకాంక్షించింది. ■



ఈ సహస్రాబ్ది మానవ నాగరికత ఔన్నత్యం మహాత్మాగాంధీ రూపంలో వ్యక్తమైంది. ఆయన జీవితమే ఒక పవిత్ర గ్రంథం. సత్యం, అహింస, గ్రామస్వరాజ్ వంటి గాంధీ బోధనలే రాబోయే శతాబ్ది మానవ వికాసానికి వెలుగుబాటలు కాగలవు. చేతికర్రతో సామ్రాజ్యవాదాన్ని తరిమికొట్టిన ఈ 'గోచీపాతరాయుని'పై కె.వి. రామిరెడ్డి విశ్లేషణ...

# సహస్రాబ్ది మహాత్ముడు

ఆయనకన్నా ఎక్కువగా మరెవరూ నోబెల్ శాంతిబహుమతికి అర్హులు కాకపోవచ్చు. భవిష్యత్తులో కూడా.

మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ (1868 - 1948) సత్య, అహింస, ప్రేమల సాకారస్వరూపం. మహాత్ముడు ప్రపంచానికి ఎన్నెన్నో విలువలు నేర్పాడు. అట్టడుగు మనిషి గురించి ఆలోచించిన రోజే రాజైనా, దేవుడి ఉనికైనా మనగలిగేది అని చెప్పగలిగాడు. ఖద్దరు గోచీతో ... చేతి కర్రతో...అత్యంతమామూలు మనిషిగా నేలమీద నడిచిన ఆయన భారతదేశాన్ని స్వాతంత్ర్యం కోసం ఉద్యమించడంలో ఒకతాటిపై నడపటం లోనే కాదు, ప్రపంచమానవాళికి జాతి వివక్ష వికృత స్వరూపాన్ని గుర్తించేలా చేయగలిగాడంటే నమ్మగలరా? మార్టిన్ లూథర్‌కింగ్‌ను అడిగినా, నెల్సన్‌మండేలాను అడిగినా ఈ విషయాన్ని మరింత వివరిస్తారు.

"మహాత్మాగాంధీ అనే పేరుతో ఒక మనిషి ఈ భూమ్మీద సంచరించాడంటే భావితరాలు నమ్మవు" అన్నాడు ఐన్‌స్టీయిన్.

ఇరవయ్యో శతాబ్దపు మేధో మూల స్థంభాల్లో ఒకరిగా ప్రఖ్యాతిగాంచిన ఐన్‌స్టీయిన్ అన్న మాటల వెనుక అర్థం చాలా ఉంది. గాంధీ గురించి, ఆయన జీవితాన్ని గురించి, ఆయన కృషి గురించి తెలుసుకుంటే నిజంగా అలా జీవించగలగడం సాధ్యమా? నమ్మశక్యం కాదు? అలాంటి మనిషంటూ ఉంటారా? అన్నది ఆ ప్రఖ్యాత శాస్త్రవేత్త మాటల వెనుక అర్థం.

'ది మ్యాన్ ఆఫ్ ది మిలీనియమ్'గా ప్రపంచం గాంధీజీని గుర్తించిన వేళ ఇది. ఆయన పేరే ఎందుకు మళ్ళీ ప్రస్తావనకొచ్చింది. వెయ్యేళ్ళ కాలంలో ఒక మనిషి కృషికి సాటిరాగల ఇతరుల శ్రమ లేదంటారా? భారతదేశం వరకు తీసుకుంటే మనకెందరో సంస్కర్తలు ఉన్నారు. నాయకులు ఉన్నారు. గురుగోవింద్‌సింహ్, రామకృష్ణపరమహంస, వివేకానంద, మదర్‌థెరిసాలు ఓవైపు, అక్బర్, నేతాజీ సుభాష్ చంద్రబోస్, నెహ్రూ, తాంతియాతోపేలు మరోవైపు ఉన్నారు.

తులసీదాస్, మీరాబాయ్, కబీర్, టాగూర్, గాలిబ్, సి.వి.రామన్, చంద్రశేఖర్, రామానుజమ్, రాణిలక్ష్మీబాయి, మహారాణాప్రతాప్, శివాజీ, జంషెడ్‌జీ టాటా...ఇలా ఎందరో చిరస్మరణీయులు కూడా ఉన్నారు. వారు మానవాళి చరిత్రలో మైలురాళ్ళు. అయినా ప్రతివారి పెదాలపై చప్పున కదిలే పేరు... ప్రతిమనిషీ నోట ఉచ్చరించే పేరు... గుర్తుకు వచ్చే పేరు మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ. భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనలోనూ, ఈ దేశం నూతన భారతదేశంగా ప్రపంచం ముందు ఆవిష్కృతమవడంలోనూ మహాత్ముడి కృషి ఎనలేనిది.



గాంధీజీని మిగిలిన వారికన్నా భిన్నంగా, ప్రత్యేకంగా నిలుపుతున్న కారణమేంటి?

గాంధీజీ జీవితంలోని మొదటి ముప్పయి, నలభై ఏళ్ళను గమనించండి. ఏ రకంగానూ చూసినా ఆయన చాలా సాదాసీదా మనిషిగానే గడిపాడు. ఆయన చేతిరాత కూడా బావుండేది కాదు. తను రాసింది తనే చదవగలిగేవాడు కాదు. లాయర్‌గా కోర్టులో వాదించేందుకు ఆయన నోరు పెగిలేది కాదు. ఆయన ఏ పని చేసినా తనతో తాను యుద్ధం చేయాల్సినంత పని అయ్యేది. భారతదేశ కోర్టులలో బాపూజీ సంపాదించేది పెద్దగా ఉండదనుకున్న పెద్దలు ఆయనను ఆఫ్రికాకు పంపేందుకు సిద్ధమయ్యారు. కనీసం అక్కడయినా ఆయనకు సరిపడా సంపాదించుకోగలరని నమ్మిక. గాంధీజీ జీవితంలోని ఈ రెండవదశ ఆయన్ను పూర్తిగా మార్చివేసింది. మాటలకే తడబడే ఆయన కోర్టు వ్యవహారాల్లో పెద్దపెద్ద న్యాయవాదులతో తలపడగలిగారు. తన ఉపన్యాసాలతో వందలాది, వేలాది మందిని ప్రభావితం చెయ్యగలిగారు. 'మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్' పేరిట ఆయన రాసుకున్న జీవితచరిత్ర ఓ అత్యద్భుతమైన పుస్తకంగా చెప్పుకోవచ్చు. 'సత్యంతో నా ప్రయోగాలు' అంటూ సత్యశోధననే జీవితంగా ఎంపిక చేసుకుని ఆయన తన జీవితాన్నే ప్రయోగశాలగా మలచుకుని గాంధీజీ చేసిన కృషి అప్పుడూ అబ్బురమే. ఇప్పటికీ ఆశ్చర్యమే. రేపటికీ విస్మయకరమే.

ఆత్మన్యూనతతో, మరిన్ని వ్యక్తిగత లోపాలతో సాధారణ మానవుడిగా జీవితాన్ని మొదలుపెట్టిన గాంధీజీ తన జీవితకాలంలోనే సమస్తమానవాళి ఆశ్చర్యపడేలా తయారయ్యారంటే కాలం సైతం కాసేపు కనురెప్పలు విప్పార్చుకుని గమనించే వుంటుంది. "చంద్రశేఖర్, ఐన్‌స్టీయిన్ లాంటి మేధావులు మిగతా మానవాళికన్నా అద్భుతమైన తెలివితేటలతోనే పుట్టారు. పుట్టుకతోనే జీనియస్‌లు అయ్యారు. బాపూజీ అలా కాదు. ఆయన సాదాసీదా మనిషిగానే ఉంటూ ఊహించడానికి కూడా అందని పనులు చేశారు" అనే మేధావులూ ఉన్నారు.

తన జీవితకాలమంతా ఓ పోరాటంగానే సాగించిన బాపూజీలో విమర్శకు అందిన కోణాలు ☞





లేవంటే సత్యదూరమే. కానీ ఆయన తనపై వచ్చిన విమర్శల విషయంలోగానీ, తనలోని లోపాల విష యంలోగానీ రాజీధోరణిని ఎప్పుడూ అవలంబించ లేదు. లోపాలను అంగీకరిస్తూనే, వాటిని అధిగమిం చేందుకు ప్రయత్నించారు. గతంలోని నాయకులు, నేటి నాయకులను సైతం పోల్చిచూస్తే గాంధీజీ వ్యక్తి త్వం అందనంత ఎత్తులో ఉన్నట్లనిపించకమానదు. ప్రతి నాయకుడు తన కుటుంబం, తర్వాత ప్రజాజీ వితం అన్న రెండు పద్ధతుల్లోనే ఇమిడి కనిపిస్తారు. ప్రజాజీవితంలో ఎలాంటి విలువలు ఉండాలనుకు న్నారో, అలాంటి విలువలనే కుటుంబ జీవితంలోనో ఉండాలని తపించారు గాంధీజీ. వ్యక్తిగత జీవితం, ప్రజాజీవితం అంటూ రెండూరెండు వేర్వేరు కోణా లుగా ఆయన నిర్వచించుకోలేదు. ఆ రెండింటిని మమేకం చేస్తూనే తన 'సత్యశోధన' కొనసాగిం చారు. జీవితంలో వైఫల్యాలు, రాజకీయ జీవితంలో వైఫల్యాలు ఉన్నప్పటికీ ఇవేవీ ఆయన వ్యక్తిత్వాన్ని చెక్కుచెదిరేలా చెయ్యలేకపోయాయి. తన వెంట నడి చిన నాయకులే తన మాటను బేఖాతరు చేసినా, తన సిద్ధాంతాలతో విభేదించినా తనదైన మార్గంలో సూటిగా నడుచుకుంటూనే సాగారు గాంధీజీ. స్వతంత్ర భారతదేశం గురించి కూడా ఆయనకు స్పష్టమైన అభిప్రాయాలే ఉండేవి. గ్రామీణజీవితం ప్రాతిపదికగానే భారతదేశ అభివృద్ధి సాధ్యమని నమ్మిన మనిషి ఆయన.

బాపూజీ కన్నకలలు, ఆశయాలు ఆచరణకు అసాధ్యమైనా, ఏ మనిషీ నష్టజాతకుడు కారాదు అన్న భావనలోంచే... ఏ మనిషీ పీడితుడు కారాదు అన్న లక్ష్యం నుంచే అవన్నీ ఆవిర్భవించాయి అంటే కాదనలేని సత్యం. దక్షిణాఫ్రికాలో జాతివివక్షకు వ్యతిరేకంగా ఉద్యమించినా, భారత స్వాతంత్ర్యోద్య మంలో ముందునడిచినా 'అహింసనే ఆయుధంగా కలిగిన బాపూజీ మానవాళి చరిత్రలో తనదైన ప్రత్యేక అధ్యాయాన్ని సృష్టించుకున్నారు. బాపూ జీలా ప్రజాజీవితంలో మమేకమైపోయిన నాయకుణ్ణి గుర్తించడం కష్టం అంటే ఆశ్చర్యపడాల్సింది లేదు.

కష్టనష్ట భూయిష్టమైన జైలు జీవితం, తెల్లదొర లతో తలపడటం ఎన్ని చేసినా గాంధీజీలో ద్వేషపూ రితమైన భావాలకు చోటులేదు. శత్రువుతో సైతం వ్యక్తిగతకక్షలకు ఆస్కారం లేదని చెప్పిన బాపూజీ దంతా 'సత్యాగ్రహమే.' ప్రపంచవ్యాప్తంగా సమకా లీన మేధావుల్లోనూ, నాయకుల్లోనూ, తాత్వికచింత నాపరుల్లోనూ గాంధీజీ పేరు మార్మోగిన చరిత్ర ఆయనది. జాతిమత వైషమ్యాలను ఎదురొడ్డి పోరా డిన మహాత్ముడు ఓ ఆధ్యాత్మికవాదా? లేక వ్యూహచ తురుడా? ఈ మిలీనియంలోనే ఓ మహాత్ముడిగా గుర్తింపును పొందిన మోహన్‌దాస్ కరంచంద్ గాం ధీజీ భావాలతో విభేదించే వారెందరో ఉండవచ్చు. ఆయన ఆలోచనలన్నీ ప్రయోజనకరమైనవేనని గట్టిగా చెప్పలేకపోవచ్చు. కానీ నిర్లక్ష్యం వహిస్తే పట్ట ణనాగరికత గ్రామీణజీవితాన్ని అతలాకుతలం చేస్తుంది అన్న ఆయన ముందుచూపు ఆలోచనలు భారత ఆర్థికవేత్తలు, రాజకీయ నాయకులు శిరసుకె త్తుకుని ఆచరించివుంటే ఇప్పటి పరిస్థితులు ఇంత దారుణంగా ఉండవన్నది కాదనలేని సత్యం. కునారి ల్లిపోతున్న గ్రామీణవ్యవస్థలను గమనిస్తే ఇందులో సత్యం పాలు తెలియకపోదు.

సహనం, శాంతి, అనుకున్న లక్ష్యసాధనలో వెనుకంజవేయని మొండితనం, తన నమ్మకాలపై అపారవిశ్వాసం వంటి లక్షణాలతో గాంధీజీ సాధిం చిన ఫలితాలేవీ తక్కువకాదు. అత్యంత శక్తివంత మైన బ్రిటిష్ సామ్రాజ్యంతో తలపడి నెత్తురు చుక్క పడనీయని ఉద్యమం నడిపిన ఘనత ఆయనది. 1930లలో అహ్మదాబాద్ నుంచి దండి వరకు 200 మైళ్ళు కాలినడకన ప్రయాణించి గుప్పెడు ఉప్పును చేతబట్టి బ్రిటిష్ వ్యవస్థకు శాసనోల్లంఘన తీరుతె న్నులను తెలియబరచిన మహాత్ముడు 1947 ఆగస్టు 15న కలకత్తా వీధుల్లో ముసుగుకప్పుకుని చెలరేగు తున్న మతకలహాలకు కలతచెందుతూ ఒంటరిగా, ఏకాకిగా ప్రయాణించారంటే ఎందరు నమ్మగలరు. తన జీవితాన్ని పోరాటంతోనే ముడిపెట్టిన 'అర్ధ నగ్నఫకీరు' జీవితసారం 'సత్యశోధన' చదివితే ముం దుతరాలకు జ్ఞాపకాలు తడిమితే, నేటి తరానికి ఆదర్శం తెలుస్తుంది. రాబోయేతరాలకు వెలుగు బాట దొరుకుతుంది. ■





# హైందవ పతాకం

"ధర్మభూమిగా మనగలిగే అర్హత ఉన్న దేశమేదైనా ఉంటే- కర్మ పరిపక్వం కోసం సమస్త జీవులు చేరవలసిన పుణ్య భూమి ఏదైనా ఉంటే- ప్రతి జీవాత్మ విధిగా చేరవలసిన తావు పుడమిలో ఎక్కడైనా ఉంటే- పరమోన్నత పదాన్ని అందుకునే దివ్యధామం ఎక్కడైనా ఉంటే- అది మన భారతదేశమే"అని స్వామి వివేకానంద చాటారు. చికాగో ఆధ్యాత్మిక సదస్సులో భారతీయ వాణిని వినిపించిన వివేకానందుడు విద్యార్థి దశనుంచే తాత్వికతను అలవరచుకున్నారు.

కలకత్తాలో 1863 జనవరి 12న ఆయన జన్మించారు. మాతా పితరులైన విశ్వనాథదత్తు, భువనేశ్వరీ దేవి ఆయనకు నరేంద్రనాథ దత్తుగా నామకరణం చేశారు. ప్రెసిడెన్సీ కళాశాలలో చదువుతున్నప్పుడే విఖ్యాతులైన తత్వజ్ఞానుల బోధనలను, ఆధునిక వైజ్ఞానిక పద్ధతులను, సిద్ధాంతాలను నరేంద్రుడు ఔపోసన పట్టారు. అప్పట్లో రాజా రామమోహన రాయ్ నెలకొల్పిన బ్రహ్మ సమాజం భావాల ప్రభావం నరేంద్రుడిపై పడింది. అంతర్లీనంగా ఉన్న ఆధ్యాత్మికతవల్ల నిరంతర ధ్యానం కొనసాగించేవారు. అందుకే ఏ ధార్మికులను చూసినా "మీరు భగవంతుడిని ప్రత్యక్షంగా చూశారా?" అని అడిగేవారు. ఒకనాడు మహర్షి దేవేంద్రనాథ ఠాగూర్‌నికూడా ఇదే విధంగా ప్రశ్నించారు. ఆయన నరేంద్రుడి జిజ్ఞాసను గమనించి సూటిగా సమాధానం చెప్పకుండా- "నీలో యోగ లక్షణాలు ఉన్నాయి. నిత్యం ధ్యానం చేయి, ఫలితం తప్పక సిద్ధిస్తుంది" అని ప్రోత్సాహపరిచారు. ఈ అన్వేషణే శ్రీరామకృష్ణుల చెంతకు నరేంద్రుడిని చేర్చింది. 1884లో బిఎ పరీక్షలు రాసిన కొద్ది కాలానికే నరేంద్రుడికి పితృ వియోగం కలిగింది. దాంతో కుటుంబ పోషణ భారం నరేంద్రుడు మోయవలసి వచ్చింది. సంసార బాధ్యతలవల్ల తనకు ప్రాప్తించిన అనుభూతుల కారణంగా సన్యసించాలని తీర్మానించుకున్నారు. గురుదేవుని అనుజ్ఞ స్వీకరించాలని నరేంద్రుడు తలంచి రామకృష్ణులను కలిశారు. ఆయనే వారికి వివేకానందుడనే నామధేయాన్ని ప్రసాదించారు. "జగజ్జనని కార్య నిమిత్తమే నీవీ ప్రపంచంలో కాలుమోపావు. సంసారిక జీవితం నీవు గడపలేవు. కానీ, నేను బతికి ఉన్నంతకాలం నువ్వు ఇంటిలోనే గడుపు" అని పంపించేశారు. 1886 ఆగస్టు 16న రామకృష్ణ పరమహంస మహా సమాధిని పొందారు. 1893 మే 31న స్వామి వివేకానంద విశ్వమత సమ్మేళనంలో పాల్గొనడానికి చికాగో బయలు దేరారు. వివిధ మత సాంప్రదాయాలన్నింటినీ సామరస్యపూర్వకంగా తనలో ఇముడ్చు కున్న హిందూ మత విశాలతను స్వామి సోదాహరణంగా వివరించారు. యూరప్‌లో ఉన్నప్పుడే స్వామీజీ ఆచార్య మాక్స్ ముల్లర్‌తో వేదాంత చర్చ జరిపారు. ఇంగ్లండ్, అమెరికాలలో రెండు సమాజాలను స్థాపించారు. 1897 జనవరి 26న స్వదేశానికి తిరిగివచ్చారు. ఆయన యువకులను స్వయం చాలిత శక్తులుగా గుర్తించారు. "భావి భారతోదయం మన చేతల మీద ఆధారపడి ఉంది. నిద్రించడానికిది సమయం కాదు. లేవండి, మేలుకొండి, మీరు అద్భుత కార్యాలను నిర్వర్తించగలరు. భయపడిన తక్షణమే ఎందుకు పనికి రాకుండా పోతారు. నిర్భయత ఒక్క క్షణంలో స్వర్గాన్ని సైతం తెచ్చి పెట్టగలదు. గమ్యం చేరేవరకూ ఆగొద్దు" అని యువతను మేలుకొల్పారు. బేలూరులో ఆయన స్థాపించిన రామకృష్ణమిషన్ అనేక సంక్షేమ , ఆధ్యాత్మిక కార్యక్రమాలను చేపడుతూ అంతర్జాతీయ ఖ్యాతిచెంది, అనేక జాతీయ, అంతర్జాతీయ అవార్డులను పొందింది. 1902 జూలై 4న స్వామి వివేకానంద భౌతికయాత్ర చాలించి మహాసమాధిని పొందారు. ■ -ఆర్ఎస్‌జి



# విశ్వకవీంద్రుడు

మహనీయుడు రవీంద్రనాథ్ టాగోర్ భారతదేశానికి తొలి నోబెల్ పురస్కారాన్ని అందించారు. 'గీతాంజలి' కావ్యానికిగాను టాగోర్‌కు ఈ సాహితీ పురస్కారం లభించింది. నిండైన సృజనాత్మక జీవితానికి నిలువెత్తురూపం టాగోర్. భారతీయ సాహితీతేజాన్ని విశ్వవ్యాప్తం చేసిన మహనీయుడైనందునే ఆయన విశ్వకవిగా ప్రసిద్ధు లయ్యారు. సాహిత్య, కళా రంగాలలో వినూత్న పోకడల్ని పాదుకొల్పారు. దేశంలో టాగోర్ రాసిన 'జనగణమన' గీతాన్ని ప్రతినిత్యం లక్షలమంది ఆలపిస్తారు. ఈ విధంగా జాతిజాతంతా రోజూ ఆయన్ని స్మరించుకుంటుంది. ఆయన గీతాన్ని 'జాతీయగీతం'గా చేసుకుని స్మరిస్తూంది.

రవీంద్ర కవీంద్రుడి సమస్త సాహితీసృష్టి ఒక ఎత్తు, ఆయన గీతాంజలి ఒక ఎత్తు. పైకి చదువుతూంటే ఏదో తెలీని మార్మికతతో మనసును కల్లోలపరుస్తున్నట్టు, అదే సమయంలో ఎక్కడా లేని ప్రశాంతతో జోకొడుతున్నట్టు అనిపించే శైలితో సాగిన 'గీతాంజలి' గీతాలు రవీంద్రకవీంద్రుని సృజనాత్మకప్రతిభకు, అంతులేని తాత్వికచింతనకు పరాకాష్ఠగా అనిపిస్తాయి. కవిత్వం వినోదం కాదు, అనుభవం. మానవుడి హృదయానికి విశాలత్వాన్నిచ్చి, ఉన్నత పరివర్తన కలగజెయ్యాలని ప్రయత్నిస్తుంది- అనే మాటకు అక్షరసత్యాల్లా నిలుస్తాయి గీతాంజలి పంక్తులు. రవీంద్రనాథ్ టాగోర్ సాహితీ సృజనలైనా, చిత్రకళారూపాలైనా ఓ రుషితుల్యుని యజ్ఞఫలాలుగానే సాక్షాత్కరిస్తాయి. ఆయన సృజనాత్మక కృషిని ఓ తపస్సులా చేశారు కాబట్టే కుటుంబ జీవితంలో పెద్దగా ఆనందించింది లేదనే వారు కూడా ఉన్నారు.

కవిగా, రచయితగా, చిత్రకారుడిగా, సంగీతజ్ఞుడిగా ఇలా తనను తాను బహుముఖ ప్రతిభాసంపత్తితో వికసింపచేసుకున్న కళారవి... టాగోర్. రవీంద్రనాథ్‌ఠాగోర్ తన కాలంలో రాజకీయ, సామాజిక అంశాలపై సున్నితంగా స్పందించేవారు. అంతర్జాతీయంగా వివిధరంగాల్లోని ప్రముఖులతో చర్చలు చేసేవారు. భారత స్వాతంత్ర్యపోరాటం రోజుల్లోనూ రవీంద్రకవీంద్రుడి స్పందన ఉంది. 'రవీంద్రుడు తన జీవితకాలంలో సాహితీరంగంలో, సామాజికరంగంలో చేసిన సేవలో కనిపించేది... ఆయా విషయాలపై ఆయన వ్యక్తీకరించిన భావాల్లో వినిపించేది భారతీయ ఆత్మ' అంటారు విమర్శకులు. రవీంద్రుని జీవితం నుంచి భారతీయతను, భారతీయతాత్వికచింతనను వేరుచేసి చూడలేం. "నా కవిత్వం నా దేశ ప్రజల కోసం. నా చిత్రాలు పాశ్చాత్యులకు కానుకలు" అని రవీంద్రుడు ఓసారి అన్నారు. కలకత్తాలోని ప్రసిద్ధమైన టాగోరు వంశంలో రవీంద్రనాథ్‌టాగోరు 1865 మే 7న జన్మించారు. ఆయన తల్లిదండ్రులు శారదాదేవి, దేవేంద్రనాథ్ టాగోర్లు. సాహితీరంగంలోనేకాక, కళారంగంలో, సంగీతంలో, తత్వశాస్త్రంలో, పాలనారంగంలో ఈ వంశీకులు ఎంతో పేరుప్రఖ్యాతులు గడించారు. మహర్షి అనే బిరుదుతో ప్రసిద్ధుడైన దేవేంద్రనాథ్ టాగోరుకు ఆఖరి సంతానంగా జన్మించిన రవీంద్రుడికి, చిన్నతనానే మాతృవియోగం కలిగింది. రవీంద్రనాథ్ టాగోరు తన జీవితం చివరిదశలోనూ సాహిత్యపరంగా అత్యున్నత కృషి సలిపారు. అనేక సమస్యలతో సతమతమవుతున్న మానవాళి పట్ల, మానవసంబంధాలపట్ల ఆయన స్పందన చివరికంటా కొనసాగింది. 1941 ఆగస్టు 7న కలకత్తాలోని తన స్వగృహంలో తను పుట్టిన గదిలోనే కన్నుమూశారు రవీంద్రుడు. ఆయన 'గీతాంజలి' నిత్యం ప్రపంచంలో ఏదో మూల నినదిస్తూనే ఉంది. ఆయన కుసుమార్ద్రభావాల ఆవిష్కారంగా 'శాంతినికేతన్' పరిమళిస్తూంటుంది. ■

- కె.వి.రామిరెడ్డి



# భూమిమించి



రెండో ప్రపంచ యుద్ధానికి కారకుడైన అడాల్ఫ్ హిట్లర్ తొలి నాళ్లలో గాయకుడు. కళాకారుడు. కళాకారుడైనప్పటికీ ఆయన ఒంటరిగా కాలం గడిపేవాడు. ఆస్ట్రియాలో 1889 లో హిట్లర్ ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయాడు. ఆయన బాల్యమంతా లింజ్, ఆస్ట్రియా, వియన్నా దేశాల్లో గడిచింది. 1913లో హిట్లర్ మ్యూనిచ్‌కు తన మకాంను మార్చాడు. ఆస్ట్రియా దేశస్థుడైనప్పటికీ హిట్లర్ జర్మన్ సైన్యంలో చేరాడు. జర్మన్ సైన్యంలో చేరి మొదటి ప్రపంచ యుద్ధంలో పాల్గొన్నాడు. పాల్గొనడమే కాకుండా యుద్ధంలో గాయపడ్డాడు. 1919లో జర్మన్ వర్కర్స్ పార్టీలో సైన్యానికి ఏజెంట్‌గా పనిచేయడంతో హిట్లర్ రాజకీయజీవితం ప్రారంభమైంది. 1920లో జర్మన్ వర్కర్స్ పార్టీ ప్రచార విభాగానికి ఆయన అధిపతిగా మారాడు. అదే సంవత్సరంలో జరిగిన మ్యూనిక్ తిరుగుబాటులో పాల్గొని తొమ్మిది నెలలపాటు జైలు శిక్షను అనుభవించాడు. జైలులో ఉన్న సమయంలోనే 'మైన్ కాంఫ్' (నా పోరాటం) అనే గ్రంథాన్ని రాసాడు. ఆ గ్రంథంలో హిట్లర్ నాజీ పార్టీ గూర్చి విపులంగా రాసాడు. త్వరితగతిన ఎదిగి హిట్లర్ జర్మన్ వర్కర్స్ పార్టీకి అధ్యక్షుడయ్యాడు. జర్మన్ వర్కర్స్ పార్టీయే తదనంతరం నేషనల్ సోషలిస్ట్ పార్టీగా రూపొందింది. యూదులన్నా, మార్క్సిస్టులన్నా, ఉదారవాదులన్నా, సాత్వికవాదులన్నా ఆయనకు పరమద్వేషం. జర్మన్‌వర్కర్స్ పార్టీ అధ్యక్షుడు కాగానే హిట్లర్‌కు అధికార దాహం ఎక్కువైంది. దాంతో ఆయన ప్రజల్లో తన పునాదిని ఏర్పరుకోసాగాడు. 1932లో జర్మనీలో అధ్యక్షపదవికి ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికల్లో పాల్ వాన్ హిడెన్‌బర్గ్‌కు వ్యతిరేకంగా హిట్లర్ పోటీచేసి ఓడిపోయాడు. కానీ, 1933లో జర్మనీ చాన్స్‌లర్‌గా నియమించబడ్డాడు. అదే సంవత్సరంలో హిట్లర్ యూత్ అనే సంస్థను స్థాపించాడు. ఈ సంస్థ మగ పిల్లలను చేర్చుకొని నాజీ సూత్రాలను బోధించేది. 1934లో చాన్స్‌లర్ కార్యాలయాన్ని, అధ్యక్ష కార్యాలయంతో మిళితం చేశారు. ఈ చర్యకు అనుకూలంగా జనాభిప్రాయ సేకరణ కూడా జరిపారు. దాంతో హిట్లర్ జర్మనీ అధ్యక్షుడయ్యాడు. నాజీ సిద్ధాంతాల ప్రచారం ఊపందుకొంది. హిట్లర్ విదేశాంగ విధానంపై దృష్టిని సారించాడు. 1939లో పోలండ్ పై యుద్ధం ప్రకటించాడు. ప్రపంచాన్నంతా కబళించాలనే అధికార దాహంతో నియంతగా వ్యవహరించిన హిట్లర్ 1945 ఏప్రిల్ 30న ఆత్మహత్య చేసుకొన్నాడు. ■

- తెలిదేవర భానుమూర్తి

హిట్లర్ ఆగడాలకు పరాకాష్ఠ



మొదట్లో కొంతమంది మేధావి వర్గానికే పరిమితమైన కాంగ్రెస్ పోరాటం గాంధీజీ నాయకత్వం లభించడంతో స్వరూపాన్ని మార్చుకుంది. కోట్లాదిమంది ప్రజలు పాల్గొన్న ఉద్యమంగా రూపాంతరం చెందింది. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అనేకమంది ఆత్మబలిదానాలు చేశారు. లక్షలాదిమంది జైళ్లపాలయ్యారు. గాంధీజీ అహింసోద్యమంతో పాటు దేశంలో అనేకచోట్ల సాయుధ తిరుగుబాట్లు కూడా తలెత్తాయి.

స్వాతంత్ర్య పోరాటంపై శ్రీకాంత్ విహంగ వీక్షణం...

# మ్రోగిన స్వరాజ్యభేరి

భారత దేశంలోకి చాపకింద నీరులా ప్రవేశించిన బ్రిటీష్ పాలకులు భారత ప్రజలను పీల్చి పిప్పి చేశారు. తమ పరిపాలనను సుస్థిరం చేసుకోవడానికి స్వదేశీ సంస్థానాధీశుల మధ్య తగవులు పెట్టి వారిని అణచివేసి తమ గులాములుగా చేసుకొన్నారు. డల్హౌసి వచ్చి భారత దేశంలో సంక్రమణా సిద్ధాంతాన్ని అమలు జరిపారు. సంతానం లేని స్వదేశ రాజులు బ్రిటీష్ ప్రభువుల అనుమతి లేనిదే దత్తత సైతం తీసుకోరాదు. అలాంటి సంస్థానాధీశులకు బ్రిటీష్ పాలకులే దత్త పుత్రులు. వారి రాజ్యం బ్రిటీష్ వారికే చెందుతుంది. దీని ప్రకారం జైపూర్, ఉదయ్‌పూర్, నాగ్‌పూర్ మొదలగు సంస్థానాలను బ్రిటిష్ రాజ్యంలో కలిపేసుకున్నారు. బిడ్డలు లేకుండానే ఝాన్సీరాణి భర్త చనిపోయాడు. దత్తతకు బ్రిటీష్ వారు అనుమతించలేదు. బ్రిటిష్ వారి ఈ ముష్కరత్వానికి వ్యతిరేకంగా స్వదేశీ సంస్థానాధీశుల్లో ఆగ్రహావేశాలు పెల్లుబికాయి. మరో వైపు సామాన్య ప్రజానీకం సైతం బ్రిటీష్ పాలనను ఈసడించుకున్నారు.



వీటికి తోడు బ్రిటిషు వారు సైన్యంలో సైతం నలుపు - తెలుపు విభేదాలు ప్రవేశపెట్టారు. పంది కొవ్వు, ఆవుకొవ్వుతో చేసిన తూటాలను పంటితో నొక్కి లాగవలసి వచ్చేసరికి సైన్యంలోని హిందూ - ముస్లిం సైనికులు తిరుగుబాటు చేశారు. ఈ విధంగా భారతదేశం చరిత్రలో సిపాయిల 'పితూరీ'గా వ్యవహరించబడిన తొలి భారత స్వాతంత్ర్య సమరానికి అంకురార్పణ జరిగింది.

**వీర భారతం**

బ్రిటిషువారి పెత్తనానికి వ్యతిరేకంగా మొత్తం ఉత్తర భారతమంతా తిరుగుబాటు జరిపింది. 1857 తొలి స్వాతంత్ర్య సమరంలో మంగల్‌పాండే, నానా సాహెబ్, తాంతీయా తోపే, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలగువారితోపాటు పీష్వా వీరులు, మీరట్ వీరులు వేలాదిమంది బ్రిటిషు సామ్రాజ్యవాద బలగాలను ఎదిరించి పోరాడారు. ఢిల్లీ, మీరట్ తదితర ప్రాంతాల్లో కొన్నిరోజులపాటు భారత జాతీయ పతాకాన్ని ఎగురవేసి పాలన సాగించారు. భారత స్వాతంత్ర్య పోరాటాన్ని అణచడానికి అప్పటికి భారత దేశంలో వున్న 40వేల మంది బ్రిటీష్ సైనికులు చాలక మరో 40వేల మందిని దిగుమతి చేసుకొన్నారు. వీరంతా కలిసి 1857 తొలి స్వాతంత్ర్య పోరాటాన్ని అణచివేశారు. ఈలోగా బ్రిటీషు రాణి కొత్త ఎత్తు వేసి భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ పాలనను తన పాలన కిందికి తెచ్చింది. భారతదేశంలో ఎవరి ఆస్తి వారికి వదిలిపెడుతున్నట్టు ప్రకటించడంతో భూస్వామ్య వర్గాలన్నీ బ్రిటిషు వారికి మద్దతుగా తయారయ్యాయి. 1857 ఏప్రిల్‌లో మంగళ్ పాండే ఆత్మ బలిదానంతో ప్రారంభమైన పోరాటం 1859 ఏప్రిల్ 18న తాంతియా తోపే వీరమరణంతో ముగిసింది. భారతదేశంలో బ్రిటిష్‌రాణి పరిపాలన సుస్థిరమైంది. భారత సామాన్య ప్రజానీకం మోయలేని పన్నులతో, కడగండ్లతో జీవితం సాగించవలసి వచ్చింది. బ్రిటీష్ ప్రభుత్వం దమనకాండతో తొలి స్వాతంత్ర్య పోరాటాన్ని అణచివేసినా భారతీయుల హృదయాలలో స్వాతంత్ర్య జ్వాలను చల్లార్చలేకపోయింది. చివరకు స్వాతంత్ర్య జ్వాల కార్చిచ్చై బ్రిటీష్ సామ్రాజ్యవాదులను దహించింది.

దేశ ప్రజానీకంలో జాతీయ భావాలు పెంపొందసాగాయి. మద్రాసులో స్వదేశీ మిత్రన్ బెంగాల్‌లో అమృతబజార్ లాంటి పత్రికలు అవతరించి బ్రిటిష్ వారి దమన నీతిని నిరసించనారంభించాయి. 1903 నాటికి ఆంధ్రదేశంలో కృష్ణాపత్రిక ముట్నూరు కృష్ణారావు నాయకత్వాన ప్రారంభమైంది. బందరు, గుంటూరు, బాపట్ల మున్నగు ప్రాంతాలు జాతీయోద్యమాలకు కేంద్రాలైనాయి. దుగ్గిరాల బలరామ కృష్ణయ్య, ఉన్నవ లక్ష్మినారాయణ, కొండా వెంకటప్పయ్య పంతులు లాంటి దేశభక్తులెందరో జాతీయోద్యమ ప్రభావితులైనారు.





అంతకుముందే బెంగాల్‌కు చెందిన సురేంద్రనాద్ బెనర్జీలాంటి వారు భారతదేశమంతటా పర్యటనలు జరిపి దేశ ప్రజల్లో స్వాతంత్ర్యేచ్ఛను, జాతీయ బావాలను నూరిపోయసాగారు.

**కాంగ్రెస్ అవతరణ**

బారతదేశంలో బ్రిటిష్ పాలకులకు సలహాలిచ్చేందుకై బారతీయులతో ఒక సంస్థ ఏర్పాటు చేయాలన్న ఆలోచన ఆంగ్లేయులకు కలిగింది. దేశంలో పెల్లుబుకుతున్న జాతియవాద బావాలను ఈ రకంగానైనా జోకొట్టవచ్చునని వారి ఆలోచన. ఫలితంగా హ్యూమ్ సలహాలో 1885లో కాంగ్రెస్ సంస్థ ఏర్పాటైంది. హ్యూమ్ సలహాపైనే డబ్ల్యు.సి.బెనర్జీ కాంగ్రెస్ తొలి అధ్యక్షునిగా ఎన్నికైనారు. ఈ కాంగ్రెస్ సంస్థ బ్రిటిష్ ప్రభుత్వంపైనా, బ్రిటిష్ మహారాణిపైనా భక్తి విశ్వాసాలను ప్రకటించింది. మరోవైపున భారతీయులు స్వపరిపాలనకు అర్హులమని బ్రిటిష్ పార్లమెంటుకు విజ్ఞప్తులు పంపుతుండేది.

**అతివాదుల ప్రవేశం**

బారత జాతీయ కాంగ్రెస్‌లో బాల గంగాదర తిలక్‌లాంటి మహా నాయకులు అతివాద పక్షం వహించి మితవాదులకు వ్యతిరేకంగా పోరు తీవ్రం చేశారు. మరో వైపున బెంగాల్ విప్లవ కారులు వీర సావర్కర్ నడిపిన అబినవ బారత్ పత్రిక నుండి ఉత్తేజాన్ని పొందారు. ఆ కాలంలో ఆయన రచించిన 'బారతీయుల తొలి స్వాతంత్ర్య సమరం' అన్న గ్రంధం విప్లవకారులకు పారాయణ గ్రంధమైంది.

ఇదిలా ఉండగా బ్రిటిష్ ప్రభుత్వం రూపాయిలో వెండి విలువను తగ్గించింది. బారతదేశానికి దిగుమతయ్యే బ్రిటిష్ సరుకులపై దిగుమతి సుంకాన్ని తగ్గించింది. ఈ విధంగా బారతీయ పరిశ్రమలను దారుణంగా దెబ్బతీయడంతో భారతదేశంలోని స్వదేశీ పెట్టుబడిదారీ వర్గం సైతం బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంకాజొచ్చింది.

**యువలోకం తిరుగుబాటు**

'మహాజర్ల' ద్వారా స్వరాజ్యాన్ని సాదించాలన్న కాంగ్రెస్ నాయకుల వాదనలతో విసుగెత్తిన యువతరం తిరుగుబాటు ప్రకటించింది. విప్లవ పంథా అనుసరించింది. బాంబులను, రివాల్వర్లతో టెర్రరిస్టు పద్ధతులకు పూనుకొంది. బ్రిటిష్ ప్రభుత్వం విప్లవ కారులపై 'అలీపూర్ కుట్ర కేసు' బనాయించింది.

**రౌలట్ చట్టం**

భారతదేశంలో బ్రిటిషు ప్రబుత్వానికి వ్యతిరేకంగా జరిగే కుట్రలను, తిరుగుబాట్లనూ అణచడానికి 'రౌలట్' చట్టం అమలులోకి వచ్చింది. ఈ చట్టానికి వ్యతిరేకంగా భారత ప్రజలలో ఆందోళన ప్రారంభమైంది. భారత రాజకీయ రంగంలో గాంధీజీ ప్రముఖ స్థానం ఆక్రమించింది సైతం ఈ కాలంలోనే. విప్లవ వీరులను ఉరికంబాలనెక్కించి, స్వాతంత్ర్యోద్యమాన్ని అణచాలనుకున్న బ్రిటిష్ వారి కల్లలైనాయి. ఒక వీరుడు మరణిస్తే వేల కొలది ప్రభవించనారంభించారు. బ్రిటీష్ ప్రభుత్వ కిరాతక చట్టానికి వ్యతిరేకంగా దేశంలో ప్రజా ఉద్యమం తీవ్రమైంది.

**బెంగాల్ విభజన**

దీనికి తోడు బ్రిటిష్ ప్రభుత్వం 1905లో బెంగాల్‌ను రెండుగా విబజించింది. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా దేశవ్యాపిత మహోద్యమం, విదేశీ వస్తు బహిష్కరణతోపాటు ప్రారంభమైంది. బెంగాల్ విభజనను వ్యతిరేకిస్తూ వ్యాసం రాసినందుకు ఆంధ్ర దేశంలో గాడిచర్ల సర్వోత్తమరావు కారాగార వాసం అనుభవించారు. ఈ దశలోనే భారత రాజకీయ రంగం అతివాద మితవాద శిబిరాలుగా చీలింది. అతివాదులుగా వ్యవహరించబడిన యువతరం విదేశీ వస్తు బహిష్కరణోద్యమంతో సంతృప్తి చెందలేదు. బెంగాల్‌లో విప్లవకారులు విజృంభించారు. బ్రిటిష్ అధికారులపై హత్యాయత్నాలు సాగించారు. మిడ్నపూర్ ప్రాంతంలో రైల్‌రోకోకు యత్నించారు. ముజఫర్‌పూర్‌లాంటిచోట్ల బాంబులను ప్రయోగించారు. తెల్ల ప్రబుత్వం విప్లవకారులను వేటాడనారంభించింది. కుట్రకేసులు పెట్టి విచారణ తంతు జరపడం, ఉరిశిక్షలు సర్వసాధారణమయ్యాయి. దేశబంధు చిత్తరంజన్‌దాస్‌లాంటి ప్రముఖ న్యాయవాదులు విప్లవవాదుల పక్షాన వాదించడానికి సన్నద్ధమైనారు.

**అగ్నిపర్వతం**

1908 మార్చి 13న తిరునల్వేలిలో చిదంబరం పిళ్ళై మున్నగు విప్లవకారులను ప్రభుత్వం ☞

అరెస్టు చేసింది. దీనికి నిరసనగా ప్రజానీకం ఆగ్రహావేశాలతో రెచ్చిపోయింది. ప్రభుత్వ ఆఫీసులను ధ్వంసం చేసింది. 1911 నాటికి భారతదేశం ప్రజ్వలించే అగ్నిపర్వతంలా తయారైంది. కాంగ్రెస్‌లోని తీవ్రవాదులందరినీ బ్రిటిష్ ప్రభుత్వం జైళ్ళలో నిర్బంధించింది. మరోవైపు బెంగాల్‌లోని టెర్రరిస్టులు గెరిల్లా పోరాటపంథా అవలంభించారు. ఇంకొకవైపు ఐదవ జార్జి చక్రవర్తిగా పట్టాభిషిక్తుడవబోతున్నాడు. భారతదేశంలో అడుగుపెడుతూనే ఐదవజార్జి ప్రాణాలు తీయాలని భారతీయ యువకులు శపథంపట్టారు. బ్రిటిష్ ప్రభుత్వం భారీఎత్తున ఇండ్ల సోదాలకు పూనుకొంది. క్రూరంగా ప్రజలను నిర్బంధించింది. దేశభక్తులను కూడా క్రూరంగా హింసించసాగింది.

**వందే మాతరం**

ఆ రోజుల్లోనే మేడం కామాగా ప్రసిద్ధిగన్న బికాయిజి రుస్తుం కామా వందేమాతరం పత్రిక ద్వారా ప్రజల్లో స్వాతంత్ర్యోద్యమ ప్రచారంగావించేది. 1907లో 'స్టట్ గార్టు'(జర్మని)లో జరిగిన ప్రపంచ సోషలిస్టు మహాసభలకు హాజరైన భారతీయ ప్రతినిధుల మధ్య త్రివర్ణ పతాకను ఎగురవేసింది ఈమె. వీర సావర్కర్ మొదలైన విప్లవ వీరులందరూ ఈమె సహచరులే. విదేశాలలో జీవిస్తున్న భారతీయ యువకులందరూ సాయుధులై జాతీయపోరాటంలో పాల్గొనడానికి భారతదేశానికి పయనమైవచ్చారు. బాబాసోహన్ సింగ్ భక్నా నాయకత్వాన 1913 జనవరిలో గదర్ పార్టీ స్థాపించబడింది. పృథ్వీసింగ్, కర్తార్‌సింగ్ మున్నగు స్వాతంత్ర్యోద్యమ వీరులందరూ గదర్ పార్టీ సభ్యులే. అసంఖ్యాకంగా గదర్ వీరులు భారత స్వాతంత్ర్య సమరంలో ఆత్మార్పణగావించారు. 1920 నాటికల్లా భారతదేశంలో విప్లవవీరుల కార్యకలాపాలు విస్తరించాయి. బ్రిటిష్ ప్రభుత్వం దమనకాండ ఎక్కువచేసే కొద్దీ భారతదేశంలో స్వాతంత్ర్యేచ్ఛ పోరాటపటిమ, పెల్లుబుకుతూ వచ్చింది. విదేశీవస్తు బహిష్కరణ, ఖాదీ ఉద్యమం, సత్యాగ్రహం వంటి కార్యచరణతో భారత జాతీయ కాంగ్రెస్ ప్రజలలో సుస్థిర స్థానం సాధించగలిగింది. గాంధీ మహాత్ముని నాయకత్వాన దేశ వ్యాప్తంగా స్వాతంత్ర్యోద్యమం విజృభించింది.

**సోషలిస్టు విప్లవ ప్రభావం**

1917లో రష్యాలో లెనిన్ నాయకత్వాన సోషలిస్టు విప్లవం విజయవంతమైంది. ఇది ప్రపంచం మొత్తాన్ని కుదిపివేసింది. అప్పటికే బ్రిటీష్ దమనకాండకు గురై జైళ్ళలో శిక్షలు అనుభవిస్తున్న యువకులను అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం, మార్క్సిస్టు సిద్ధాంతాలు బలంగా ఆకర్షించాయి. ప్రజల మధ్యన ఉన్న విప్లవకారులు సోషలిస్టు సిద్ధాంతాల చైతన్యంతో కార్మికోద్యమాన్ని నిర్మించనారంభించారు.

**జలియన్ వాలాబాగ్**

రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా 1919 ఏప్రిల్ 13న పంజాబ్‌లోని జలియన్ వాలాబాగ్‌లో మహాసభ జరిగింది. శాంతియుతంగా జరుగుతున్న సభపై డయ్యర్ అమానుషంగా కాల్పులు సాగించాడు. పసికందులతో సహా దాదాపు నాలుగు వందల మంది ఆ కాల్పుల్లో చనిపోయారు. మరో 12మంది గాయపడ్డారు. దానితో దేశం అట్టుడికిపోయింది. ఈ కిరాతకానికి నిరసనగా దేశమంతటా ప్రజా ఉద్యమాలు ప్రజ్వలించాయి. రైతుకూలీ ఉద్యమాలు, కార్మిక పోరాటాలు, హిందూ ముస్లిం సఖ్యతను ఖిలాఫత్ ఉద్యమాలు విజృంభించాయి. 1920లో భారతదేశంలో సమ్మెల వెల్లువ ప్రారంభమైంది. బెంగాల్, నాగపూర్ రైల్వే సమ్మె, మిద్నపూర్ పన్నుల వ్యతిరేకోద్యమం, మలబారులో 'మాప్లా' రైతుల తిరుగుబాటు, పంజాబ్‌లో అకాలీ ఉద్యమం, బార్డోలీలో సర్దార్ పటేల్ నాయకత్వాన రైతుపోరాటం, ఆంధ్రదేశంలోని పల్నాడులో కన్నెగంటి హనుమంతు నాయకత్వాన పన్నుల నిరసనోద్యమం ప్రారంభమైనాయి. చౌరాచౌరీలో ఆగ్రహావేశులైన ప్రజానీకం పోలీసుస్టేషన్‌ను నేలమట్టం చేశాయి. ఒక్క 1921లోనే బ్రిటిష్ ప్రభుత్వం 20 వేల మంది దేశభక్తులను జైళ్ళలో పెట్టింది.

**మన్యం విప్లవం**

ఈ కాలంలోనే ఆంధ్రదేశంలోని మన్యప్రాంతంలో అల్లూరి సీతారామరాజు మూడేళ్లపాటు బ్రిటిష్ పాలకులకు దూరంగా సాయుధ పోరాటం నిర్వహించారు. సీమనించి బ్రిటిష్ సైన్యాలు మందీ మార్బలంతో దిగినా ఆ పోరాటాన్ని అణచలేక పోయాయి. తన 'మెరుపు దాడులు', 'మిరపకాయ టపా'తో అల్లూరి భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఆంధ్రదేశానికి స్వర్ణ ఘట్టం లిఖించారు. 1924 మే 7న ఆ వీరుడు నేలకొకొరిగే వరకూ మన్య విప్లవం అప్రతిహతంగా కొనసాగింది.

**కాన్పూరు కుట్ర కేసు**

ఈనాటికల్లా భారతదేశంలో సోషలిస్టు కార్మికోద్యమం బలపడింది. 1924లో కాన్పూర్ కుట్రకేసు బనాయించి బ్రిటీష్ ప్రభుత్వం డాంగే, ముజఫర్ అహ్మద్, షౌఖిల్ ఉస్మానీ ప్రభృతులను నిర్బంధించింది. భగత్‌సింగ్ సహచరులలో ఒకరైన చంద్రశేఖర్ ఆజాద్ హిందూస్తాన్ సోషలిస్టు రిపబ్లిక్ అసోసియేషన్ స్థాపించారు.

**సైమన్ కమిషన్ బహిష్కరణ**

1927లో సైమన్ కమిషన్ భారతదేశానికి వచ్చింది. దానిని బహిష్కరించమని కాంగ్రెస్ దేశ ప్రజలకు పిలుపునిచ్చింది. 1923లో బొంబాయిలో డాంగే నాయకత్వాన 'గిర్నీ కాంగార్' యూనియన్ 65వేల మందితో సైమన్ కమిషన్‌కు వ్యతి రేకంగా చరిత్రాత్మకమైన ప్రదర్శన జరిపింది. విప్లవ వీరులు భగత్‌సింగ్, బటుకేశ్వర దత్తు 1929 ఏప్రిల్ 8న సెంట్రల్ అసెంబ్లీ భవనంలో బాంబులు విసరి 'ఇంక్విలాబ్ జిందాబాద్' అంటూ నినాదాలు చేసి అరెస్టయ్యారు. ఈ కేసులో వీరద్దరికీ ద్వీపాంతరవాస శిక్ష విధించబడింది. గాంధీజి 1939 ఏప్రిల్ 8న 'దండి' సత్యాగ్రహం ప్రారంభించారు. అదే నెల ఏప్రిల్ 18వ తేదీన బెంగాల్‌లో చిటగాంగ్ విప్లవ వీరులు ఆయుధగారాల్ని దోచుకున్నారు. సరిగ్గా కరాచీ కాంగ్రెస్ జరుగుతుండగానే 1931 ఏప్రిల్‌లో భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను బ్రిటీష్ ప్రభుత్వం ఉరితీసింది. అప్పటికే గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగింది. కాంగ్రెస్ 1937 ఎన్నికల్లో పాల్గొని, ఏడు రాష్ట్రాలలో మంత్రివర్గాలను ఏర్పాటు చేసింది. అంతలో రెండవ ప్రపంచ యుద్ధం మొదలైంది. బ్రిటిష్ ప్రభుత్వం భారత ప్రజాభిప్రాయాన్ని పట్టించుకోకుండానే యుద్ధగుండంలోకి ఈడ్చింది. దీనికి నిరసనగా కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా ఇచ్చాయి. 1940 సెప్టెంబరులో కాంగ్రెస్ వ్యక్తి స్వాతంత్ర్యానికి పిలుపునిచ్చింది.

**క్విట్ ఇండియా**

1912 మార్చిలో క్రిప్సు భారతదేశం వచ్చి కాంగ్రెస్ నాయకులతో చర్చలు జరిపారు. కానీ క్రిప్పు రాయబారం విఫలమైంది. 1942 ఆగస్టు 8న కాంగ్రెస్ క్విట్ ఇండియా తీర్మానం చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం రాత్రికి రాత్రే జాతీయ నాయకులందరినీ జైళ్లలో పెట్టింది. దీనికి దేశవ్యాప్తంగా ఆలజడి, ఆందోళన ప్రారంభమైంది. కార్మికుల సమ్మెలు ప్రారంభమయ్యాయి. రైళ్ళ రాకపోకలు ఆగిపోయ్యాయి. ఆగ్రహావేశులైన ప్రజలు పోలీసుస్టేషన్లు, పోస్టాఫీసులనూ రైల్వేస్టేషన్లను ధ్వంసం చేశారు. ప్రభుత్వ పాలన స్తంభించిపోయింది. ఈ ఆగస్టు ఉద్యమంలో ఆంధ్రదేశం సైతం అపారమైన త్యాగాలు చేసింది.

**ఆజాద్ హింద్ ఫౌజు**

ద్వితీయ ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ సైన్యాలు 1942 ఫిబ్రవరి 15న సింగపూర్‌లో జపాన్‌కు లొంగిపోయాయి. ఫలితంగా బ్రిటన్ ఫిబ్రవరి 17న సింగపూర్‌లోని ఫెర్రర్ పార్కులో భారత సైన్యాలను జపాన్‌కు అప్పగించింది. ఆ యుద్ధ ఖైదీలు 1942 సెప్టెంబరు 1న భారత సైన్యంగా ఏర్పడ్డారు. 1943 జులైలో నేతాజీ సుభాష్‌చంద్రబోస్ సింగపూర్ వెళ్లి ఆజాద్ హిందు ఫౌజును ఏర్పాటు చేశారు. అఖిల తూర్పు ఆసియా మహాసభను ఏర్పాటు చేశారు.

1943 అక్టోబరు 21న 'ఆర్జీ హుకూమత్-ఎ-ఆజాద్ హింద్' ప్రకటించబడి మంత్రులు ప్రమాణ స్వీకారం చేశారు. ఈ తాత్కాలిక ప్రభుత్వమే బ్రిటన్ అమెరికాలపై యుద్ధం ప్రకటించింది. జపాను ప్రభుత్వం ఈ భారత ప్రభుత్వానికి అండమాన్ నికోబార్ దీవులను అప్పగించింది. ఈ తాత్కాలిక ప్రభుత్వం సింగపూర్ నుండి రంగూన్‌కు మారింది. ఆజాద్ హిందు ఫౌజు సైనికులపై కేసులు పెట్టి శిక్షించింది. ఈ శిక్షలకు వ్యతిరేకంగా 1946 ఫిబ్రవరి 18న పోరాటం ప్రారంభమైంది.

ఈ చారిత్రాత్మక పోరాటంలో 250 మంది నావికులు ఆత్మార్పణం చేశారు. ఈ పోరాటాలన్నింటిలో బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో మనుగడ సాధించే స్థితిని కోల్పోయింది. తమ అధికారం అప్పగించకపోతే విప్లవం వచ్చి తీరుతుందన్న భయం సైతం తెల్లదొరలకు పట్టుకుంది. భారతదేశానికి స్వాతంత్ర్యం ఇస్తున్నట్టు ప్రకటించింది. 1947 సెప్టెంబరు 25న కేంద్రంలో తాత్కాలిక స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటైంది. అయినప్పటికీ బ్రిటీష్ ప్రభుత్వం హిందూ ముస్లిం తగువులు పెట్టింది. భారత ఉపఖండాన్ని ముక్కలు చేసింది. జిన్నా నాయకత్వాన పాకిస్థాన్ ఏర్పాటైంది. 1947 ఆగస్టు అర్ధరాత్రి భారత స్వాతంత్ర్యం ప్రకటించబడింది. ■





పారిశ్రామిక విప్లవం పుణ్యమా అని పశ్చిమ దేశాల్లో వస్తూత్పత్తి విపరీతంగా పెరిగి తెగబలిసిపోయాయి. ఉత్పత్తులను అమ్ముకోవడానికి మార్కెట్ల వేట మొదలైంది. యూరప్ దేశాల మార్కెట్ వేట ఫలితమే మొదటి ప్రపంచ యుద్ధం. ఈ యుద్ధంలో యూరప్ దేశాలతోపాటు వాటి వలసలూ పాల్గొనాల్సి వచ్చింది. రెండో ప్రపంచ యుద్ధానికి మార్కెట్ వేటతోపాటు జాత్యహంకారం, హిట్లర్ విస్తరణ కాంక్ష మరికొన్ని తక్షణ కారణాలు పనిచేశాయి. రెండు ప్రపంచ యుద్ధాలపై **టి.కె. లక్ష్మణరావు** నివేదిక...





# దారుణ మారణహోమాలు

రాజ్యకాంక్ష, కీర్తి కండూతి వెరశి ప్రాచీన, మధ్య యుగాల యుద్ధాలు. కత్తులు కటార్లు, బల్లాలు, విల్లమ్ముల నుంచి యుద్ధాలు. రథ, గజ, హయ, పదాతి (చతురంగ బలాలు) దళాలతో వ్యూహాత్మకంగా యుద్ధాలు ఆనాటివి. పారిశ్రామికీకరణ, అధికోత్పత్తి, అందుకోసం మార్కెట్ల వేట ఇవి ఆధునిక యుద్ధాలకు కారణాలు. యూరప్‌లో అన్ని విధాలా బలోపేతమైన జర్మనీయే చరిత్ర కనీవినీ ఎరుగనంతటి రెండు ప్రపంచ యుద్ధాలకు కారణభూతమైంది. మొదటి ప్రపంచ యుద్ధం(1914-1917)లో తొలిసారి బంకర్లు నిర్మించి అందులో సురక్షితంగా వుంటూ తుపాకులు పేల్చడం ప్రారంభమైంది. మర ఫిరంగులు, మందుపాతర్లు, యుద్ధ విమానాలు, టాంకులు, జలాంతర్గాములు ఆ యుద్ధంలో చోటు చేసుకున్నాయి. బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, ఇటలీ, రుమేనియా చివర్లో అమెరికా తదితర దేశాలు ఒక పక్షంగా, జర్మనీ, టర్కీ, బల్గేరియా తదితర దేశాలు మరో పక్షంగా త్రివిధ బలాలు (పదాతి, వైమానిక, నౌకా దళాలు) మానవ మారణహోమం సృష్టించాయి. కోటి ప్రాణాలు గాలిలో కలిసిపోగా రెండుకోట్ల మంది క్షతగాత్రులయ్యారు. మొదటి ప్రపంచ యుద్ధంలో బాగా దెబ్బతిన్న జర్మనీ తిరిగి కోలుకుని నరహంతక నాజీ నియంత హిట్లర్ నేతృత్వంలో బలోపేతమై, ఆర్యన్ జాత్యహంకారంతో, ఫాసిస్ట్ నాజీ సైన్యంతో ఒక్కొక్కటిగా పొరుగు దేశాలను కబళించింది. జీవించే హక్కే లేదంటూ లక్షలాది యూదుల్ని హిట్లర్ ఊచకోత కోశాడు. మానవజాతి పరిచిపోలేని విధంగా లక్షలాది మందిని అత్యంత పాశవికంగా కాన్సంట్రేషన్ కేంప్స్‌ల్లో చిత్రహింసల పాల్జేసి క్రూరంగా హతమార్చాడు. పొరుగు దేశాలపై విజయాలపై విర్రవీగి జపాన్, ఇటలీలతో జతకట్టి ప్రపంచంపై విరుచుకుపడ్డాడు. బ్రిటన్, రష్యా, అమెరికాల నేతృత్వంలో మిత్రపక్ష సైన్యాలు హిట్లర్ నెదుర్కొనగా ఉక్కు మనిషి స్టాలిన్ వ్యూహంలో చిక్కుకొని నాజీ సేనలు చావుదెబ్బ తిన్నాయి. జపాన్‌లోని హిరోషిమా, నాగసాకి పట్టణాలపై మూడు రోజుల వ్యవధిలో అమెరికా వేసిన 2 ఆటంబాంబులు (ఆగస్టు 6, 9-1945) ఒక్కసారిగా 3లక్షలమందికి పైగా బలితీసుకున్నాయి. మొత్తంగా ఐదున్నర కోట్ల మంది బలిదానంతో (1939-45) రెండో ప్రపంచ యుద్ధం ముగిసింది.







## మొదటి ప్రపంచ యుద్ధం

తొట్టతొలిసారి ప్రపంచాన్నంతా కుదిపేసిన మహా సంగ్రామం మొదటి ప్రపంచ యుద్ధం. ఆర్థికంగా, సైనికంగా బలపడిన యూరోప్ దేశాల మధ్య నెలకొన్న వైరుధ్యాలవల్ల ఈ యుద్ధం ప్రజ్వరిల్లింది. ఆధునిక జాతీయ రాజ్యాల ఆవతరణ తర్వాత జరిగిన బీకర యుద్ధం ఇది. మునుపెన్నడూ లేని రీతిలో ఈ యుద్ధంలో విపరీతంగా ప్రాణనష్టం సంభవించింది. ప్రతి దేశం ఏదో ఒక రూపంలో ఈ యుద్ధంలో పాల్గొనక తప్పని పరిస్థితులు ఆనాడు ఏర్పడ్డాయి.

ఈవిధంగా ప్రపంచమంతా మొదటి ప్రపంచ యుద్ధపు దారుణ విధ్వంసానికి అతలాకుతలమయింది. ఈ యుద్ధం ఆకస్మాత్తుగా రాలేదు. దీనికి పూర్వం యూరోప్‌లో పలు ప్రాంతాల్లో ఉద్రిక్తతలు చోటు చేసుకున్నాయి. 1904లో రష్యా-జపాన్‌ల మధ్య యుద్ధం జరిగింది. 1911లో జర్మనీ-ఇంగ్లాండ్‌ల మధ్య దాదాపుగా యుద్ధం మొదలవబోయి చివరి క్షణంలో తగ్గుముఖం పట్టాయి. ఆస్ట్రియాలో

1909-10 మధ్య ఇంగ్లాండ్ రాజ్యాంగం సంక్షోభంలోపడింది. 1911లో ఇంగ్లాండ్ చరిత్రలో ఎన్నడూ లేని స్థాయిలో పారిశ్రామిక అశాంతి నెలకొంది. మరోవైపున ఐర్లాండ్‌లో 1912లో అంతర్యుద్ధం చెలరేగింది. జర్మనీ పారిశ్రామికంగా అభివృద్ధి చెంది వలసలకోసం ప్రయత్నించింది. ఇందుకోసం ఫ్రాన్స్, ఇంగ్లాండ్‌వంటి దేశాలతో కయ్యానికి కాలు దువ్వింది. యుద్ధం వల్లనే సమస్యలు పరిష్కారమవుతాయన్న జర్మన్ చక్రవర్తి రెండో విలియమ్ ప్రచారం చేశారు. ఈ క్రమంలో సైనిక బలగాల్ని, నౌకా బలాన్ని పెంచారు. ప్రపంచ రాజకీయాలలో తలమానికంగా ☞



ఉండాలని జర్మనీని బలవత్తర దేశంగా రూపొందించేందుకు కృషిచేశారు. ఈ పరిణామాలే జర్మనీ యుద్ధోన్మాదంతో వ్యవహరించడానికి దారి తీశాయి.

సెర్బియాకు, ఆస్ట్రియా-హంగరీలకు మధ్య చాలా కాలంగా వివాదాలున్నాయి. ఆస్ట్రియా-హంగరీ యువ రాజైన ఫ్రాన్సిస్ ఫెర్డినాండ్ 1914 జూన్ 28న సెరజివోను సందర్శించినప్పుడు ఒక రహస్య సంఘం సభ్యుడు హత్య చేశాడు. దీన్ని సాకుగా తీసుకొని ఆస్ట్రియా-హంగరీ సెర్బియా మీద యుద్ధం ప్రకటించింది. సెర్బియాకు రష్యా అండగా నిలచి ఆస్ట్రియాపై యుద్ధానికి దిగింది. దీంతో జర్మనీ రష్యాపై యుద్ధం ప్రకటించింది. బ్రిటన్, ఫ్రాన్స్‌లు జర్మనీ వ్యతిరేక పక్షం తీసుకొని యుద్ధానికి దిగాయి. టర్కీ, బల్గేరియాలు జర్మనీపక్షం వహించాయి. మరోవైపున చాలా కాలంవరకు ఈ యుద్ధానికి దూరంగా ఉన్న అమెరికా 1917లో రంగప్రవేశం చేసింది. తదనంతరం బ్రిటన్, ఫ్రాన్స్‌లకు ఇటలీ, రుమేనియాలు కూడా అండగా నిలిచాయి. ఈ యుద్ధంలోనే తొలిసారిగా గోతులు తవ్వి తుపాకులు పేల్చడం ప్రారంభించారు. మందుపాతరలను, యుద్ధ విమానాలను, జలంతార్గములను వాడారు. టాంకులను ఉపయోగించారు. సైనిక, సామాన్య ప్రజలనే తేడా లేకుండా శత్రుదేశాల ప్రాంతాలపై బాంబుల వర్షం కురిపించారు. కనుకనే యుద్ధంతో సంబంధం లేని అమాయక జనాలు ప్రాణాల్ని, ఆస్తుల్ని కోల్పోయారు. 1914 నుంచి 1918 వరకు ఈ యుద్ధం సాగింది. దీనిలో జర్మనీ పరాజయం పాలై తీవ్రంగా నష్టపోయింది. ఈ యుద్ధంలో కోటి మంది దాకా చనిపోయారు. దాదాపు రెండు కోట్ల మంది గాయపడ్డారు. నాలుగు లక్షల కోట్ల రూపాయల ఆస్తి వరకు నాశనమైంది.

అమెరికా అధ్యక్షుడు ఉడ్రోవిల్సన్ ప్రతిపాదించిన సూత్రాల ఆధారంగా 1920లో నానాజాతి సమితి ఏర్పాటయింది. ప్రపంచదేశాల మధ్య సహకారం, శాంతిభద్రతల సాధన ఈ సమితి లక్ష్యాలు. కాని ఈ యుద్ధం నుంచి ప్రపంచం గుణపాఠాలు నేర్చుకోలేదు. కనుకనే రెండో ప్రపంచ యుద్ధం సంభవించింది. మానవ చరిత్రలో విషాదాన్ని సృష్టించింది.

## రెండో ప్రపంచ యుద్ధం

మానవజాతి చరిత్రలో మరపురానివిధంగా యావత్ ప్రపంచాన్నీ ఆరేళ్లపాటు (1939-45) భయానక, బీభత్సాల్లో ముంచితేల్చిన ఘట్టం రెండవ ప్రపంచ యుద్ధం. మొత్తం ప్రపంచాన్ని రాజకీయ, ఆర్థిక రంగాలను కుదిపివేసి పెనుమార్పులకు గురి చేసింది ఈ యుద్ధమే. ఖచ్చితమైన లెక్కలు తేల్చలేకపోయినా ఐదున్నర కోట్లకు పైగా సైనికుల్నీ, ప్రజల్నీ ఈ యుద్ధం బలితీసుకుంది.

ఇంతటి మారణహోమానికి మూల కారకుడు ఫాసిస్ట్ జర్మనీ నియంత అడాల్ఫ్ హిట్లర్! ఆర్యజాతి మహోత్కృష్టమయిందనీ, ఆర్యులకే ప్రపంచాన్ని పాలించే అర్హత, హక్కు ఉన్నాయనీ తన వాక్చాతుర్యంతో ఆకట్టుకునే ప్రసంగాలతో రెచ్చకొట్టి జర్మనీ చాన్సలర్‌గా గద్దెనెక్కి లక్షలాదిమంది యూదుల్ని ఊచకోత కోశాడు. స్వస్తిక్ చిహ్నాలతో కూడిన నరహంతక నాజీ సైన్యాలను ప్రపంచ దేశాలమీదికి ఉసిగొల్పి ఘనవిజయాలను సాధించి చివరకు ఘోర పరాజయాన్ని చవిచూసి అవమానభారంతో ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

1933లో హిట్లర్ జర్మనీ అధినేత కాగానే చెకొస్లోవేకియాలో కొంతభాగాన్నీ, ఆస్ట్రియాను పూర్తిగానూ ఆక్రమించాడు. ఆపై 1939 ఆగస్టులో పోలెండుపైకి నాజీ సైన్యాలను నడిపించాడు. బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు అండగా వున్నా నాజీల ధాటికి తట్టుకోలేక 18 రోజుల్లోనే పోలెండు జర్మనీ పాదాక్రాంతమయింది. జర్మనీ విజయానికి మెరుపు యుద్ధం కీలకమైంది. వేగంగా పరుగులెత్తే టాంకులు, యుద్ధ విమానాల అండదండలతో శక్తివంతమైన పదాతి దళాలు ప్రత్యర్థుల్ని మట్టికరిపించాయి. బ్రిటన్ రాయల్ ఎయిర్ ఫోర్స్‌ను తుదముట్టించమంటూ హిట్లర్ ఆదేశించడంతో 1940 ఆగస్టులో జర్మన్ యుద్ధ విమానాలు బ్రిటన్ రాయల్ ఎయిర్‌ఫోర్స్ (ఆర్.ఎ.ఎఫ్)పై విరుచుకుపడ్డాయి. సెప్టెంబర్ నెలలో ఈ దాడులు ఎడతెరిపి లేకుండా కొనసాగాయి. అయినప్పటికీ ఆర్ఎఎఫ్ దృఢంగా నిలబడింది. సెప్టెంబరు మధ్యలో ఆర్ఎఎఫ్‌పై దాడులను ఆపి లండన్ నగరంపై జర్మనీ రాత్రివేళల్లో బాంబుల వర్షం కురిపించి వేలాదిమంది అమాయక ప్రజలను పొట్టన పెట్టుకుంది. ఈ దాడుల పరిణామమే రెండవ ప్రపంచ యుద్ధానికి నాంది పలికింది. 1941 వసంతంలో డెన్మార్క్ ఒక్క రోజులోనే జర్మనీకి లొంగిపోయింది. హాలెండ్, బెల్జియం లొంగిపోగా నార్వేను కూడా జర్మన్ సేనలు వశపరచుకున్నాయి. జూన్ 21న ఫ్రాన్సు సైతం లొంగిపోగా బ్రిటిష్ సైన్యాలు ఇంటి ముఖంపట్టాయి.

## సోవియెట్ మీదికి జర్మన్ సేనలు

బ్రిటన్‌ను లొంగదీసుకునే వ్యూహం ఫలించకపోవడంతో హిట్లర్ తన సైన్యాలను సోవియెట్ మీదికి నడిపించాడు. 30 లక్షల నాజీ సైన్యం 1940 జూన్ 22న సోవియెట్ సరిహద్దుల్లోకి చొచ్చుకెళ్ళింది. సోవియెట్ వెనుకంజవేస్తూ సగం వైమానిక బలాన్ని కోల్పోయింది. సెప్టెంబరు నెలాఖరుకల్లా జర్మన్ సేన రాజధాని మాస్కోను సమీపించింది. అయితే వాతావరణ పరిస్థితులు సోవియెట్‌ను రక్షించాయి. వర్షాకాలం కావడంతో జర్మన్ టాంకులు మాస్కో బురద రోడ్లలో కూరుకుపోయాయి. ఈ దశలో చలికాలం ప్రవేశించింది. ఎముకలు కొరికే చలిని ఎదుర్కోవడం జర్మన్ సైన్యానికి సాధ్యంకాని పనైంది. నాజీ సైనికులు వేల సంఖ్యలో చలికి బిగుసుకుపోయి మరణించగా టాంకులు, తుపాకులు పనికిరాకుండా పోయాయి. రష్యన్ సైన్యం మాత్రం ఆ వాతావరణాన్ని ఎదుర్కోగల శక్తిసామర్థ్యాలను కలిగివుంది. ఇదే అదనుగా సోవియెట్ ఆర్మీ కమాండర్ మార్షల్ ఝుకోవ్ తన సేనలతో డిసెంబర్ 6న ఎదురుదాడి ప్రారంభించారు. జర్మన్ సేనలు లొంగిపోయాయి. మాస్కో ఊపిరి పీల్చుకుంది.

ఇలావుండగా 1940లో ఫ్రాన్స్ పతనమవడంతో ఆగ్నేయాసియాలోని ఫ్రెంచి వలసలను జపాన్ ఆక్రమించింది. అంతకుముందే 1930వ దశకంలో కొరియా, మంచూరియాలను, చైనాలోని అధిక భాగాన్నీ జపాన్ జయించింది. జపాన్ విస్తరణ కాంక్ష అమెరికా, బ్రిటన్ ప్రయోజనాలను దెబ్బ తీసేలా వుండడంతో ఒక ఒప్పందానికి రంగం సిద్ధమయింది. ఆ దశలో అనగా 1941 డిసెంబర్ ☞







7న జపాన్ విమానాలు అమెరికా పసిఫిక్ సముద్ర జలాల్లోని పెరెల్ హార్బర్, హవాయిలపై అనూహ్యంగా విరుచుకుపడ్డాయి. వెంటనే అమెరికా, బ్రిటన్‌లు జపాన్‌పై యుద్ధం ప్రకటించాయి. ఈ యుద్ధంలో జపాన్ సైన్యాలు అప్రతిహతంగా పురోగమిస్తూ వరుసగా ఫిలిప్పీన్, మలయా, సింగపూర్, హాంకాంగ్, బర్మా, డచ్ ఈస్టిండియాను, అసంఖ్యాకమైన పసిఫిక్ మహాసముద్ర దీవుల్ని ఆక్రమించాయి. అట్లాంటిక్ సముద్రంలో జర్మన్ సబ్‌మెరైన్లు, యు-బోట్లు మోహరించి ఊపిరి సలపనీయని పరిస్థితుల్లో అమెరికా సహాయంతో బ్రిటన్ నెగ్గుకు రాగలిగింది.

### ఎడారియుద్ధం

జర్మనీ పక్షాన 1940 జూన్ 10న ఇటలీ సేనలు యుద్ధరంగంలోకి దిగాయి. సెప్టెంబర్‌లో ఈజిప్టును ఇటలీ ఆక్రమించింది. ఈజిప్టులోని సూయజ్ కెనాల్‌ను కొద్దిపాటి సైన్యంతోనే బ్రిటన్ ఇటలీ సైన్యాలను ధైర్యంగా ఎదుర్కొని తరిమికొట్టింది. ఉత్తర ఆఫ్రికా ఎడారి యుద్ధం ఇక్కడే మొదలైంది. 1941 ప్రారంభంలో జర్మన్ సైన్యాలు జనరల్ ఎర్విన్ నాయకత్వంలో ఉత్తర ఆఫ్రికా ఎడారుల్లోకి ప్రవేశించాయి. 1942 అక్టోబరుకల్లా ఈజిప్టులోకి చొచ్చుకుపోయి సూయజ్ కెనాల్‌ను స్వాధీనం చేసుకుందుకు తలపడ్డాయిగాని సాధ్యం కాలేదు. బ్రిటన్ 8వ ఆర్మీ కొత్త కమాండర్ జనరల్ మాంటిగోమెరి నాయకత్వంలో ఇటలీ సేనల్ని లిబియాలోకి తరిమికొట్టాయి. 1942 నవంబరు 8న అమెరికన్, బ్రిటన్ సైన్యాలు ఉత్తర ఆఫ్రికాలో ప్రవేశించాయి. తూర్పున ట్యునీషియా వైపు నుంచి జర్మనీపై దాడిచేశాయి. కొత్త జర్మన్ సేనలు ఇటలీ నుంచి రావడంతో అనివార్యంగా జాప్యం జరగడంతో 1943 మే 12న జర్మన్, ఇటలీ సైన్యాలు ఉత్తర ఆఫ్రికాలో లొంగిపోయాయి. దీంతోనే ఆ యుద్ధం ముగిసింది.

### రష్యాలో ఓటమి

ఇలా వుండగా 1942 వసంతకాలంలో రష్యాలో యుద్ధానికి అనుకూల వాతావరణం ఏర్పడ్డంతో ఓల్గా నదీ తీరాన వున్న పారిశ్రామిక నగరమైన స్టాలిన్‌గ్రాడ్‌ను స్వాధీనం చేసుకోవలసిందిగా ఆదేశించాడు. జర్మన్ రాజధానిలో వున్న హిట్లర్ స్వయంగా స్టాలిన్‌గ్రాడ్‌పై దాడి వ్యూహాన్ని పర్యవేక్షించాడు. అయితే, రష్యన్ సేనలు వీరవిహారం చేశాయి. స్టాలిన్‌గ్రాడ్‌ను అన్నివైపులనుంచీ చుట్టుముట్టాయి. 1943 ఫిబ్రవరిలో జర్మన్ సేనలు లొంగిపోయాయి. ఏడాది పొడవునా రష్యన్ సైన్యాలు విజృంభించి 890 రోజులుగా జర్మన్ గుప్పిట్లో వున్న లెనిన్‌గ్రాడ్‌ను 1944 జనవరికల్లా పట్టుకున్నాయి. అంతటితో ఆగక రష్యన్ సేన కదంతొక్కుతూ హిట్లర్ స్వాధీనంలోని తూర్పు యూరప్ దేశాలను విముక్తం చేశాయి. ఆయా దేశాలు కమ్యూనిస్టుల ఆధీనంలోకి వచ్చాయి. ఆవిధంగా యుద్ధం పూర్తవకముందే యూరోప్ మొత్తం తూర్పు, పశ్చిమ యూరప్‌లుగా కమ్యూనిస్టు, కమ్యూనిస్టేతర రాజ్యాలుగా విభజనరేఖ పడింది.

### హిట్లర్ పతనం

1943 నుంచి జర్మనీపై అమెరికా, బ్రిటన్ యుద్ధ విమానాలు రాత్రింబవళ్ళు నిర్విరామంగా బాంబుల వర్షం కురిపిస్తూనేవున్నాయి. నైతికంగా జర్మన్లు దెబ్బ తినివుండటం, ఎడతెరిపిలేని బాంబింగ్‌తో నగరాలు శిధిలమవుతుండటంతో మిత్రపక్షాల సేనలు విజృంభించి యూరోప్ మొత్తాన్ని హిట్లర్ చెర నుంచి విడిపించడానికి సంసిద్ధమయ్యాయి. 1944 జూన్ 6న నార్మెండీలో ప్రవేశించాయి. తీవ్రపోరాటం అనంతరం జర్మనీవైపు నుంచి ఫ్రాన్స్ తీరంలోకి మిత్రపక్షాల సేనలు చొచ్చుకుపోగలిగాయి. డిసెంబరు మధ్య కల్లా అమెరికా సేనలు రైన్ నదీతీరానికి చేరుకున్నాయి. నదినిదాటి జర్మనీలోకి ప్రవేశించే తరుణంలో అనుకోకుండా హిట్లర్ సైన్యాలు ఎదురుదాడికి దిగడంతో వెనక్కి తగ్గి ఫ్రాన్స్‌కు మళ్ళాయి. ఈ వెనకడుగు తాత్కాలికమే అయ్యింది. జర్మనీకి పరాజయం తప్ప మార్గాంతరం లేదని మిత్రపక్ష సైన్యాలు ధీమాగా వున్నాయి. 1945 వసంత రుతువులో మిత్రపక్షాల సేనలు జర్మనీకి పశ్చిమం వైపు అతి సమీపంలోకి వెళ్లాయి. రష్యన్ సేన తూర్పువైపు నుంచి జర్మనీలోకి దూసుకెళ్ళింది. ఘోర పరాజయభారంతో ఏప్రిల్ 30వ తేదీన నరహంతక హిట్లర్ బెర్లిన్ భూగర్భంలోని తన బంకర్‌లో ఆత్మహత్య చేసుకున్నాడు. అనంతరం మే 8వతేదీన జర్మనీ లొంగుబాటును ప్రకటించింది.




### జపాన్ పతనం

జపాన్ యుద్ధ విమానాలు పెరల్‌హార్బర్‌పై దాడి చేసిన సమయంలో అమెరికన్ పసిఫిక్ విమాన వాహకనౌకలు అదృష్టవశాత్తూ అక్కడలేవు. అవి ఎక్కడో సముద్రంలో ఉన్నాయి. ఆవిదంగా భారీ నష్టాన్ని తప్పించుకున్న ఆ నౌకలు అనంతరం జరిగిన పసి ఫిక్ మహాసముద్ర యుద్ధంలో అమెరికా విజయానికి తోడ్పడ్డాయి. అంతకుముందే 1942లో అమెరికన్ దళాలు జపాన్‌కు చెందిన నాలుగు విమాన వాహక నౌకల్ని ముంచేశాయి.

కీలకమైన ఈ విజయం జపాన్ ఆక్రమిత ప్రాంతాలను 1942 మొదటి ఆరు నెల్లలోపే తిరిగి మిత్రపక్షాల కైవసం కావడానికి తోడ్పడింది. భారత్‌పై జపాన్ దాడిచేయకుండా వుండేందుకు బ్రిటన్, భారత్ దళాలు జాగ్రత్తలు తీసుకున్నాయి.

### ఆటమిక్ బాంబు

జపాన్‌పై యుద్ధాన్ని అమెరికా తీవ్రతరం చేసి దిగ్బంధం చేసింది. యుద్ధంలో కనీసం పదిలక్షల మంది సైనికుల్ని బలిపెట్టవలసి వస్తుందని అమెరికా మిలటరీ నిపుణులు అంచనా వేశారు. ఈ పరిస్థితులలో కొత్తగా కనుగొన్న ఆటమిక్ బాంబును ప్రయోగించడం మేలని తలచింది. 1945 ఆగస్టు ఆరున హిరోషిమా నగరంపై ఆటమిక్ బాంబును ప్రయోగించడంతో ఆ నగరం అత్యదికభాగం నాశనమైపోయింది. తిరగి మూడురోజుల అనంతరం ఆగస్టు 9వతేదీన రెండో ఆటమిక్ బాంబు నాగసాకి పట్టణంపై ప్రయోగించారు. రెండు బాంబుల వల్ల లక్షన్నరమందికి పైగా మరణించగా లక్షలాది మందికిపైగా గాయపడ్డారు. జపాన్ మిత్రపక్షాలకు లొంగిపోయింది. రెండో ఆటమిక్ బాంబుతో యుద్ధానికి తెరపడింది.

### యుద్ధ ఫలితాలు

రెండో ప్రపంచ యుద్ధం వల్ల బ్రిటన్, ఫ్రాన్సు దేశాలు ఆర్థికంగా బాగా బలహీనపడ్డాయి. అంతవరకూ వారి ఆధీనంలో వుండే వలస దేశాలు స్వాతంత్ర్య పోరాటాలను తీవ్రతరం చేశాయి. ఈ ప్రపంచ యుద్ధానంతరమే చైనా విముక్తమయింది. భారతదేశానికి స్వాతంత్ర్యం లబించింది. టెక్నాలజీ, ఆర్థికపరమైన అంశాలకు ప్రాదాన్యత పెరిగింది. వర్తక వాణిజ్యాలు ప్రపంచవ్యాప్తంగా నిర్వహించడానికి పరస్పర సహకారాన్ని పెంపొందించుకునేందుకు అన్ని దేశాలూ ముందుకు వచ్చాయి. ■





వేల సంవత్సరాలపాటు ఓకే చరిత్రను పంచుకున్న ప్రాంతం, ఒకే సాంస్కృతిక వారసత్వాన్ని అనుభవిస్తున్న ప్రాంతం రెండు ముక్కలై స్వాతంత్ర్యాన్ని పొందాయి. కలిసి కన్నీరు కార్చిన వాళ్లు, ఉమ్మడిగా ఉత్సవాలు చేసుకున్న వాళ్లూ దాయాదులుగా విడిపోయారు. రగులుతున్న పగలతో విడిపోయారు. బ్రిటిష్ కుటిల నీతి వల్ల ఉపఖండంలో రెండు శతృదేశాలు పుట్టాయి. కత్తులతో పొడిచి మరీ నెత్తురోడుతున్న దేహానికి బ్రిటిష్ వాళ్లు విముక్తిని ప్రసాదించారు. దేశవిభజన, స్వాతంత్ర్య ఘట్టాలపై కె. శ్రావణ్ కుమార్ కథనం...



విభజన సందర్భంగా పాకిస్థాన్‌కు బయల్దేరిన ప్రత్యేక రైలు

# నెత్తురోడే దేహానికి విముక్తి

1947 జూన్ 3 ....ఆరోజు భారత ఉపఖండం ముక్కలైన రోజు. అన్నదమ్ములు విడిపోయారు.

వందలాది సంవత్సరాలుగా ఉపఖండంగా కలిసి ఉన్న గడ్డ మతపరమైన దేశాలుగా విడిపోయింది. మరికొద్ది రోజుల్లో స్వాతంత్ర్యం వస్తుందన్న ఆనందం కన్నా దేశం ముక్కలైపోతుందన్న విషాదమే జాతీయోద్యమ నాయకులను కదిలించివేసింది. స్వాతంత్ర్యం కోసం కులాలు, మతాలు, ప్రాంతాలు, భాషలు, జాతులు, వర్గాలకు అతీతంగా పోరాడిన భరత ఖండ ప్రజల్లో అంతర్గత బేదాలు తలెత్తాయి. భారత స్వాతంత్ర్యోద్యమం ద్వారా కోట్లాదిమంది భారతీయులు ఐక్యమై బ్రిటిష్‌వారిని ఉపఖండం నుంచి తరిమివేయడానికి ఉరకలు వేస్తున్న నేపథ్యంలో తమ ఉనికి కోల్పోక తప్పదని భావించిన బ్రిటిష్ పాలకులు దేశంలో కల్లోలం సృష్టించడానికి కుట్రపన్నారు. విడదీసి పాలించడం పుట్టుకతో పునికిపుచ్చుకున్న బ్రిటిష్ పాలకులు అన్నదమ్ములుగా మెలిగిన హిందూ, ముస్లింల మధ్య చిచ్చుపెట్టారు. ముస్లింకు చెందిన అతివాదులైన కొంతమందిని చేరదీసి ప్రత్యేక రాజ్యం ఏర్పాటు నినాదాన్ని ఎగవేశారు. మతఘర్షణలకు కారణమయ్యారు. మతఘర్షణల్లో రక్తం ఏరులై పారింది. శాంతికి నిలయమైన భారత దేశంలో మతఘర్షణలు పెచ్చుమీరాయి. అశాంతి పెల్లుబికింది. చివరకు దేశం రెండుముక్కలైంది. దేశాలు ముక్కలై యాభై ఏళ్లు గడిచినా దాయాదుల మధ్య పోరుమాత్రం ఆగలేదు. విభజన సమయంలో తలెత్తిన మనస్తాపాలు ఇప్పటికీ వీడలేదు. అప్పటి వ్యాజ్యం ఇప్పటికీ సరిహద్దులో కొనసాగుతూనే ఉంది. దాయాదుల పోరుకోసం వేలాది కోట్ల రూపాయల రక్షణ వ్యయానికి వెచ్చించేలా చేసింది. ఇది ఆయుదపోటీకి దారితీయడమేకాక, వినాశకరమైన అణుబాంబుల ఉత్పత్తికి కారణమైంది.

## దేశవిభజనకు దారితీసిన పరిస్థితులలోకి వెళ్తే...

బ్రిటిష్ ప్రభుత్వం 1946 మార్చిలో అధికార బదిలీ కోసం భారత జాతీయ నాయకులతో సంప్రదింపులు జరపడానికి ఒక కేబినెట్ మిషన్‌ను పంపింది. కాంగ్రెస్, ముస్లింలీగ్ నాయకులతో సంప్రదింపుల అనంతరం ఒక ప్రణాళికను రూపొందించి భారతీయుల అభిప్రాయాన్ని కోరింది. కొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చే వరకు ఒక తాత్కాలిక ☞

# Back Home

# We Offer

# Investment Opportunities

# for

# Your hard earned money.

With 104 years of unparalleled professional expertise in retail banking PNB presents 3 deposit options to suit your individual investment needs.

- ▶ Non Resident (External) Rupee Account - **NRE**
- ▶ Non Resident (Non Repatriable) Rupee Account - **NRNR**



- ▶ Foreign Currency (Non Resident) Account - **FCNR**

  Maintainable in four currencies i.e. US Dollar, Pounds Sterling, Deutsche Mark and Euro

- Exempt from Gift Tax and Income Tax.
- Interest on quarterly / half yearly intervals.
- Overdraft/loan facility against deposits.
- Freely repatriable - principal and interest. (Principal not repatriable in NRNR account)

***OTHER INTERNATIONAL OPERATIONS***

- *Rupee Drawing Arrangements with leading Exchange houses:*
- *M/s UAE Exchange Centre, Abu Dhabi; M/s Al-Fardan Exchange Company, Doha-Qatar; M/s Bahrain Exchange Company, Kuwait and M/s Bahrain Financing Company, Bahrain.*
- *Representative office at Almaty, Kazakhstan.*
- *Joint venture with Everest Bank Ltd. (EBL), Nepal.*
- *222 correspondent banks worldwide.*
- *2 way SWIFT connectivity for quick transmission of Forex transactions.*



punjab national bank

......the name you can BANK upon!

Visit us at : www.punjabnationalbank.org.

CANCO/PNB/12/99

జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తామని బ్రిటిష్ రాయబార వర్గం సూచించింది. ఫలితంగా, 1946 సెప్టెంబర్‌లో జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలో తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పాటైంది. మంత్రివర్గంలో చేరేందుకు ముస్లింలీగ్ నాయకులు కొన్నాళ్ల పాటు విముఖత చూపినప్పటికీ చిట్టచివరికి అక్టోబర్‌లో మంత్రి వర్గంలో చేరారు. అయితే, లీగ్ సభ్యులు మాత్రం రాజ్యాంగ పరిషత్తును బహిష్కరించారు. అప్పటి బ్రిటిష్ ప్రధాని క్లెమెంట్ అట్లీ 1948 జూన్ వరకు పూర్తిగా బ్రిటిష్ వారు భారత దేశంను విడిచి వెళ్తారని ఫిబ్రవరి 20,1947న స్పష్టం చేశారు. త్వరలో స్వాతంత్రం లభిస్తుందన్న ఆనందం కాస్త మతకలహాల్లో మట్టికొట్టుకుపోయింది. దేశమంతటా మత ఘర్షణలు ప్రజ్వరిల్లాయి. జరిగిన పరిమాణాలకు గాంధీ కంటనీరు పెట్టుకున్నారు. మత కలహాగ్నులను ఆర్పడానికి బెంగాల్, బీహార్‌లలో పాదయాత్ర చేశారు. మత వైషమ్యాలను రూపుమాపడానికి గాంధీజీ, ఇతర జాతీయ నాయకులు తీవ్రంగా కృషి చేశారు. 1947 మారిలో భారత వైస్రాయిగా వచ్చిన లార్డ్ మౌంట్ బాటెన్ కాంగ్రెస్, ముస్లింలీగ్ నాయకులతో సుధీర్ఘంగా సంభాషించాడు. దేశాన్ని రెండుగా విభజిస్తే కాని మత ఘర్షణలు ఆగవని, ఇందుకు ఇరువర్గాలు అంగీకరించి తీరాలని మౌంట్‌బాటెన్ చెప్పి దేశాన్ని ముక్కలు చేయాలన్న బ్రిటిష్ కుయుక్తిని బట్టబయలు చేశాడు. దీనికి జాతీయ నాయకులు అంగీకరించారు. రక్తపాతాన్ని నివారించడానికి ఇంతకంటే మరో మార్గం లేదని వారన్నారు. అయితే, ద్విజాతి సిద్ధాంతాన్ని మాత్రం వారు అంగీకరించలేదు. ముస్లింలీగ్‌కు మహమ్మద్ అలీ జిన్నా నాయకత్వం వహించాడు. ఆయన నేతృత్వంలని లీగ్ అడిగిన మూడోవంతు భూభాగాన్ని ఇవ్వడానికి ఒప్పుకోలేదు. ముస్లింలీగ్ ప్రాబల్యం వున్న ప్రాంతాలను మాత్రమే అప్పగించడానికి భారత జాతీయ నాయకులు అంగీకరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే హిందూ, ముస్లిం మతాల పేరుతో దేశవిభజన చేయరాదన్నది భారత జాతీయోద్యమ నాయకుల డిమాండ్. దీనిమేరకు హిమాలయ ప్రాంతాలకు ఎగువబాగంగా ఉన్న సింధూ నది ప్రాంతంలోని భూభాగం, పశ్చిమ పంజాబ్, ఇతర సారవంతమైన నేలలు పాకిస్థాన్ పరమయ్యాయి. కాగా, ముస్లింలీగ్ ప్రభావం అంతంతమాత్రంగా వున్న వాయువ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, అస్సాంలోని సిల్హెట్ జిల్లాలోను ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని ప్రతిపాదించారు.

ఈ క్రమంలో 1947 జూన్ 3న భారత, పాకిస్థాన్ దేశాల ఏర్పాటు ప్రకటన వెలువడింది. దీనిమేరకు భారత స్వదేశీ సంస్థానాధీశులకు భారత్‌లోకానీ, పాకిస్థాన్‌లో కానీ చేరే అవకాశం వారి అభీష్టానికి వదిలివేశారు. అయితే, భారత్‌లోని కథియవాడ్ తీరంలోని చిన్న సంస్థానం జునాగఢ్ తదితర సంస్థాన ప్రభువులు పాకిస్థాన్‌లో కలవడానికి నిశ్చయించారు. దీన్ని ఆయా సంస్థానాల ప్రజలు అడ్డుకున్నారు. భారత్‌లో చేరడానికే వారు మక్కువ చూపారు. ఇదికాక మొండికేసిన వారిని ఉక్కుమనిషి సర్దార్ వల్లభాయ్‌పటేల్ రాజకీయ దౌత్యం, సైనిక చర్యలద్వారా అనేక రాజ్యాలను భారత్‌లో విలీనం చేయగలిగారు. ఇదిలా ఉంటే, నిజాం నవాబు, కాశ్మీరు రాజు తమకు స్వతంత్ర ప్రతిపత్తి కావాలని భారత్, పాకిస్తాన్ రెండింటిలో కలిసే ప్రసక్తేలేదని కొంతకాలం మొండికేశారు. ఆ తర్వాత తెలంగాణ ప్రాంతంలో సాగిన సాయుధ పోరాటం, సైనిక చర్యలకు జెదిరి భారత యూనియన్‌లో నిజాం తన రాజ్యాన్ని కలిపివేయగా, పాకిస్తాన్ సాయుధ దళాలు, పఠాన్‌లు కాశ్మీర్‌పై దాడి చేస్తుండడంతో కాశ్మీర్ సామ్రాజ్యంలో ప్రజాభిప్రాయాన్ని సేకరించి ప్రజల అభీష్టంమేరకు అటు పాకిస్తాన్‌లో కలపడం, భారత్‌లో విలీనం చేయడం లేక స్వతంత్ర్య రాజ్యంగా ప్రకటించడం అన్న నియమంతో కాశ్మీర్ రాజు తన సామ్రాజ్యాన్ని జవహర్‌లాల్ నెహ్రూకు అప్పగించారు.


శాంతి, పరమత సహనాన్ని ప్రభోదిస్తున్న గాంధీ

1947 ఆగస్టు 15 .. భారతదేశానికి దాస్యం వీడింది. రెండువందల సంవత్సరాలకుపైగా పాలించిన బ్రిటిష్ పాలకులు భారత్‌కు స్వతంత్రాన్ని ప్రకటించారు. ఒకవైపు ఆనందోత్సాహాలు మిన్నంటుతుండగా మరోవైపు దేశ విభజన జ్వాలలు దేశాన్ని చుట్టుముట్టి దేశ ప్రజల ఆనందంపై నీళ్ల చల్లాయి. మత ఘర్షణల్లో వేలాదిమంది హత్యలు జరిగాయి. రక్తం ఏరులా ప్రవహించింది. స్వాతంత్ర్యం కోసం కులమతాలకు అతీతంగా ఐక్యంగా ఉద్యమించిన ప్రజలకు నిలయమైన దేశం రెండుగా విడిపోవాలని రక్తపాతం జరిగింది. తరతరాలుగా నివసిస్తున్న వారు గత్యంతరంలేని పరిస్థితిలో పుట్టిన గడ్డనువీడి వలస వెళ్లాల్సి వచ్చింది. దేశ విభజన సమయంలో తలెత్తిన హింసా కాండపట్ల చలించిన మహాత్మా గాంధీ శాంతి,పరమత సహనాన్ని ప్రభోదిస్తూ పాదయాత్రను ప్రారంబించాడు. బెంగాల్‌లో పాదయాత్ర చేస్తుండగా 1948 జనవరి 30న గాంధీ వైఖరి నచ్చని నాథూరాం గాడ్సే ఆయనపై కాల్పులు జరిపి అంతం చేశాడు. దేశం ముక్కలైన శోకం తీరకముందే మహాత్మా గాంధీ హత్య మరో శోకాన్ని తెచ్చిపెట్టింది. అప్పటి వైరం సరిహద్దుయుద్ధంగా నేటికీ కొనసాగుతోంది. ■


దేశ విభజన సందర్భంగా నెహ్రూ, మౌంట్‌బాటెన్ జిన్నా





# ఉప్పల్‌కలాన్ మున్సిపాలిటీ - రంగారెడ్డి జిల్లా



శ్రీ నారా చంద్రబాబు నాయుడు
ఆం.ప్ర.ముఖ్యమంత్రి



శ్రీ టి. దేవేందర్ గౌడ్
రాష్ట్ర హోంశాఖామాత్యులు



శ్రీ రాణి కుముదిని
జిల్లా కలెక్టర్

## అభివృద్ధి కార్యకలాపాలు

ఉప్పల్‌కలాం మున్సిపాలిటి మూడు గ్రామ పంచాయితీలు అంటే హబ్సిగూడ, ఉప్పల్ మరియు రాంమాంతపూర్‌లను ఐక్యం చేసుకుంటూ ఇది 1987లో 19.54 స్క్వేర్ కి.మీలలో స్థాపించబడినది. 1991 జనాభా లెక్కల ప్రకారం జనాభాసంఖ్య 78,562 కాగా ప్రస్తుతం ఈ సంఖ్య 1.50 లక్షలకు చేరుకుంది. గత రెండు సంవత్సరాల కాలంలో క్రింద తెలుపబడిన అభివృద్ధి కార్యక్రమాలు మరియు సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడం జరిగింది.

| క్రమ సంఖ్య | పనిపేరు | అంచనా విలువ (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | రోడ్లు వేయుట మరియు డ్రెయిన్‌లనిర్మాణం | 139.00 |
| 2. | కార్యాలయ భవన నిర్మాణం | 52.00 |
| 3. | షాపుస్టాల్స్ మరియు కూరగాయల స్టాల్స్ నిర్మాణం | 55.00 |
| 4. | స్టేడియం నిర్మాణం | 41.00 |
| 5. | పార్కుల అభివృద్ధి | 5.20 |
| 6. | మున్సిపల్ ఏరియాలో ట్విన్‌లైట్ సెంట్రల్ లైటింగ్ ఏర్పాట్లు | 34.00 |
| 7. | జన్మభూమిక్రింద చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు | 112.00 |
| 8. | జన్మభూమిస్కీములో హబ్సిగూడలో అండర్‌గ్రౌండ్ డ్రైనేజీ | 1000.00 |
| 9. | N.S.D.P. క్రింద వాటర్‌పైప్‌లైను వేయుటకు | 173.00 |
| 10. | S.J.S.R.Y & N.S.D.P. క్రింద మహిళా గ్రూపులచే సి.సి.రోడ్లు వేయుట మరియు డ్రెయిన్‌ల నిర్మాణము | 38.00 |

## ప్రభుత్వ స్కీములక్రింద చేపట్టిన పనులు

| | | లబ్దిదారుల సంఖ్య | రూ. లక్షలలో |
|---|---|---|---|
| 1. | సాముదాయక స్వల్పవ్యయ శానిటేషన్ | 1506 | 69.85 |
| 2. | శిశుబాలిక సంక్షేమ స్కీము | 10 | 0.54 |
| 3. | వృద్ధాప్యపింఛన్‌లు | 425 | 3.84 |
| 4. | ఆదరణ స్కీము | 362 | 9.60 |
| 5. | C.M.E.Y. గ్రూప్‌లు | 28 | 28.00 |
| 6. | D.W.C.U.A. | 4 | 11.00 |
| 7. | S.J.S.R.Y. క్రింద రివాల్వింగ్ ఫండ్ పంపిణి | 83 | 16.00 |

Dr.L. మోహన్
స్పెషల్ ఆఫీసర్

(R. రామమోహనరావు)
కమీషనర్, ఉప్పల్‌కలాం మున్సిపాలిటి



పండిత జవహర్‌లాల్ నెహ్రూ మార్గదర్శనలో డాక్టర్ అంబేద్కర్‌వంటి ప్రజ్ఞాశాలి రూపుదిద్దిన భారత రాజ్యాంగం చలువవల్లే ఈ దేశంలో ప్రజాస్వామిక వ్యవస్థ చెక్కుచెదరకుండా నిలబడగలిగింది. వలసపీడను తొలగించుకొని కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన అనేక దేశాల్లో అనతి కాలంలోనే ప్రజాస్వామిక వ్యవస్థలు కుప్పకూలి నియంతృత్వాలు తలెత్తాయి. కానీ, భారత్‌కు ఆ ప్రమాదం ఎదురుకాలేదు. భారత రాజ్యాంగం మనదేశ ప్రజాస్వామ్యానికి రక్షాకవచంగా నిలబడింది. ప్రపంచంలో అప్పటివరకున్న అన్నిరకాల రాజ్యాంగాలను ఆమూలాగ్రంగా అధ్యయనం చేసి భారతీయ సమాజంలోని అన్నివర్గాల శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రచించిన రాజ్యాంగంపై రాజా రామ్మోహన్‌రావు పరిచయం...

# 'భారతీయులమైన మేము...'



భిన్నసంస్కృతుల సమ్మేళనమైన మన దేశంలో పౌరులందరి హక్కులను పరిరక్షించడంలోనూ, ప్రజాస్వామ్యవిలువలను కాపాడడంలోనూ రాజ్యాంగం కీలకపాత్ర పోషిస్తోంది. అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంగా ఆవిర్భవించిన నాటినుంచి నేటివరకు ప్రభుత్వాల ఏర్పాటులోనూ, పాలనా వ్యవహారంలో ప్రజల భాగస్వామ్యంతోనూ దేశం విరాజిల్లడానికి భారతరాజ్యాంగ పాత్రే కీలకం. నాగరిక ప్రపంచం రూపుదాల్చి ప్రజల్లో హేతువాదం పెంపొందినప్పటి నుంచి పాలనా వ్యవస్థల రూపకల్పనకు మార్గం సుగమమైంది. మనం అనుభవిస్తున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు కారణభూతమైన రాజ్యాంగ రూపకల్పన ప్రక్రియ దాని చారిత్రక నేపథ్యాన్ని భావితరాలు తెలుసుకోవడం సముచితం. మనదేశంలో ఏరకమైన ప్రభుత్వం కావాలో, ఎటువంటి రాజ్యాంగాన్ని నిర్మించుకోవాలో నిర్ణయించేది ప్రజలేనన్న భావం 1920వ దశకంలోనే ప్రారంభమైంది. అది క్రమంగా 1940వ దశకానికిగాని స్పష్టమైనరూపం సంతరించుకోలేదు. స్వాతంత్ర్య సంగ్రామంలో కీలకభూమిక వహించిన యోధులందరూ స్వతంత్ర రాజ్యాంగ పరిషత్తుపై కూడా దృష్టినిలిపారు. ఈ క్రమంలోనే 1938లో నెహ్రూ ఒక ప్రకటన చేస్తూ స్వతంత్రభారతావనికి ప్రజల అభీష్టం మేరకు రాజ్యాంగాన్ని రూపొందిస్తామన్నారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో భారతీయుల సహకారం కోరుతూ బ్రిటిష్ ప్రభుత్వం స్టాఫర్డ్ క్రిప్స్ ద్వారా నెరపిన రాయబారం విఫలమైనప్పటికీ రాజ్యాంగ పరిషత్తు రూపకల్పనకు ఆమోదం లభించింది. 1945 డిసెంబర్,1946 జనవరిలో జరిగిన ఎన్నికల ద్వారా ఏర్పాటైన శాసనసభలు, ఆయా శాసనసభలు ఎన్నికైన రాజ్యాంగపరిషత్తు సభ్యులను ఎన్నుకోవడం వేగంగా జరిగిపోయాయి. ఆ విధంగా ఏర్పాటైన రాజ్యాంగ పరిషత్తు సభ్యుల తొలి సమావేశం 1946 డిసెంబరు 9న జరిగింది. ఇప్పటినుంచే రాజ్యాంగ రూపకల్పనకు చర్చలు ప్రారంభమయ్యాయి. విస్తృతమైన ఈపని ఏ ఒక్కరి చేతుల మీదుగానో జరిగేది కాదు. విభిన్న అంశాలు, వాటి పర్యవసానాలను గుర్తించగలిగి అందుకనుగుణంగా నియమావళిని రూపొందించేందుకు ప్రముఖులతో కూడిన 7కమిటీలను ఏర్పాటు చేశారు. సారథ్య సంఘం, నియమావళి కమిటీలకు బాబు రాజేంద్ర ప్రసాద్, ముసాయిదా కమిటీకి డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్, మైనార్టీల రక్షణ కమిటీకి హెచ్.సి.ముఖర్జీ, కేంద్ర రాజ్యాంగ కమిటీకి జవహర్‌లాల్ నెహ్రూ, సలహా సంఘానికి, రాష్ట్ర రాజ్యాంగ కమిటీకి సర్దార్ వల్లభాయి పటేల్, అధ్యక్షులుగా ఈ కమిటీలు ఏర్పాటయ్యాయి. 1947 ఆగస్టు 29న తొమ్మిదిమంది సభ్యులతో ముసాయిదా కమిటీ రూపొందింది. ముసాయిదా కమిటీ రూపొందించిన రాజ్యాంగం తొలి ముసాయిదాపై 2సంవత్సరాల 11నెలల 18రోజులపాటు సుదీర్ఘంగా చర్చలు జరిగిన తర్వాత 1949 నవంబర్26న రాజ్యాంగాన్ని ఆమోదించారు. 1950 జనవరి 26నుంచి భారత రాజ్యాంగం అమలుకొచ్చింది. రాజ్యాంగ రూపకల్పన ప్రక్రియ కొన్ని ముఖ్య ఆశయాలతో కూడుకొంది. వీటిలో ముఖ్యమైనవి: భారతదేశం సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యంగా ఉండాలి. ప్రజల భాగస్వామ్యంతోనే ప్రభుత్వాలు ఏర్పాటు కావాలి. ప్రజలకు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండాలి. వెనుకబడిన వర్గాలకు, అల్ప సంఖ్యాక వర్గాలకు న్యాయమైన హక్కులు ఇవ్వాలి. ప్రపంచ శాంతికి కృషి చేస్తూ ప్రపంచదేశాల సరసన సగర్వంగా నిలిచేదిగా ఉండాలి. ప్రజలందరికీ సామాజిక, ఆర్థిక, రాజకీయ సమానత్వం కల్పించాలి. సర్వోన్నత శాసనమైన భారత రాజ్యాంగంలో ప్రజల హక్కులు, వాటి పరిరక్షణ, ప్రభుత్వ అధికారాలు వాటి పరిమితులను నిర్దేశించినందువల్ల లిఖిత రాజ్యాంగంగా రూపొందింది. రాజ్యాంగంలో కేంద్ర, రాష్ట్ర సంబంధాలను విస్తృతంగా చర్చించడంతోపాటు పౌరుల ప్రాథమిక హక్కులు, విధులు, ఆదేశిక సూత్రాలను సమగ్రంగా వివరించారు. సమానత్వపు హక్కు, స్వాతంత్ర్యపు హక్కు, దోపిడీని నిరోధించేహక్కు, మత స్వాతంత్ర్యపు హక్కు, సాంస్కృతిక, విద్య హక్కులనేవి రాజ్యాంగంలో నిర్దేశించిన పౌరుల ప్రాథమిక హక్కులు. పౌరుల హక్కులకు, విధులకు అవినాభావ సంబంధం ఉంది. హక్కులు మాత్రమే సాధించుకునే ప్రయత్నం చేస్తూ బాధ్యతగా మెలగనప్పుడు రాజ్యాంగానికి అర్థంలేదు. అందువల్ల సవరణల్లో భాగంగా ప్రాథమిక విధులను కూడా రూపొందించారు. పౌరుల ప్రాథమిక విధులు: 1. రాజ్యాంగంపై విధేయత కలిగుండాలి. 2. జాతీయ స్వాతంత్ర్య ఉద్యమాన్ని ఉత్తేజపరిచిన ఉదాత్త, ఉత్తమ ఆదర్శాలను అనుసరించాలి. 3. భారతదేశ ఐక్యత, సమగ్రత, సార్వభౌమా



జాతీయ జంతువు



జాతీయ పక్షి

ధికారాలను సంరక్షించాలి. 4. దేశ సంరక్షణకు, సేవకు సదా సిద్ధంగా ఉండాలి. 5. ప్రజల మధ్య సౌభ్రాతృత్వ భావనను పెంపొందించాలి. స్త్రీ గౌరవ ప్రతిష్ఠలకు అపకీర్తి వచ్చే పనులు చేయకూడదు. 6. మన ఉమ్మడి సంస్కృతి వారసత్వ విలువలను, గొప్పతనాన్ని కాపాడాలి. 7. సహజ వాతావరణాన్ని, వన్యమృగాలను సంరక్షించి అభివృద్ధి చేయాలి. 8. శాస్త్రీయ దృక్పథం, మానవతావాదం, సంస్కరణవాదాలను పెంపొందించుకోవాలి. 9. ప్రభుత్వ ఆస్తులను కాపాడాలి. 10. అన్ని రంగాలలోనూ వ్యక్తిగత, సమిష్టి కార్యకలాపాల నిర్వహణలో శ్రేష్ఠత సాధించాలి. రాజ్యాంగంలో కేంద్ర, రాష్ట్ర కార్య నిర్వాహక వర్గాలు, పాలక వర్గాలు, వాటి విధులు, నియమాలు, కేంద్ర, రాష్ట్ర సంబంధాలు, న్యాయవ్యవస్థ, ఎన్నికల సంఘం, రాజ్యాంగ సంస్థలు వంటి అనేక అంశాలపై సమగ్ర వివరణలున్నాయి. రాజ్యాంగ నిబంధనలకు అనుగుణంగా స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుంచి నేటివరకు అన్ని స్థాయిల్లోనూ ప్రజల అభీష్టం మేరకే ప్రభుత్వాలు ఏర్పాటవుతున్నాయి. ఇప్పటి వరకు 10మంది రాష్ట్రపతులు ఎన్నికయ్యారు. కేంద్రంలో 13ప్రభుత్వాలు ఏర్పాటయ్యాయి. 13మంది ప్రధానులుగా పని చేశారు. రాజ్యాంగ ప్రకారం ఏర్పాటవుతున్న ప్రభుత్వాలు ప్రజా జీవనానికి, పాలనా వ్యవహారాలకు ప్రభుత్వాలు వారధులుగా పనిచేస్తున్నాయి. ■

***జాతీయ పతాకం:*** *కాషాయం, తెలుపు, ఆకుపచ్చ రంగులతో కూడిన త్రివర్ణపతాకాన్ని మన జాతీయ జెండాగా గుర్తించారు. పతాకం అగ్రభాగాన కాషాయం, మధ్యలో తెలుపు, కింద భాగాన ఆకుపచ్చ రంగులతో కూడి మధ్యలో అశోక చక్రం ఉంటుంది. మధ్యన ఉన్న చక్రంలో 24 ఆకులుంటాయి. ఈ పతాకాన్ని జాతీయజెండాగా 1947జులై 22న ఆమోదించారు. జెండా పొడవు వెడల్పు 3:2 నిష్పత్తిలో ఉంటుంది. దీని నమూనాను పింగళి వెంకయ్య రూపొందించారు.*

**జాతీయ చిహ్నం:** అశోక చక్రవర్తి తన రాజధాని సారనాథ్‌లో నిర్మించిన అశోక స్థూపం పైభాగాన్ని జాతీయ చిహ్నంగా గుర్తించారు. స్థూపంపై నాలుగువైపులా నాలుగు సింహం తలలుంటాయి. చిహ్నంలో 3తలలు మాత్రమే కన్పిస్తాయి. స్థూపం కింది భాగంలో ధర్మ చక్రం ఉంటుంది. చక్రానికి కుడివైపున ఒక వృషభం, ఎడమవైపున అశ్వం ఉంటాయి. దానిపై 'సత్యమేవ జయతే' అని దేవనాగరి లిపిలో చెక్కి ఉంటుంది.

***జాతీయ గీతం:*** *విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ రచించిన 'జనగణమన అధినాయక జయహే...' అనే గీతాన్ని జాతీయ గీతంగా గుర్తించారు. 1911 డిసెంబర్27న కలకత్తాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశంలో మొదటిసారిగా ఈ గీతాన్ని ఆలపించారు. 1950 జనవరి 24న రాజ్యాంగ నిర్మాణ సభ ఈగీతాన్ని జాతీయ గీతంగా గుర్తించింది.*

**జాతీయ గేయం:** బంకించంద్ర చటర్జీ రచించిన 'వందేమాతరం' గేయాన్ని జాతీయ గేయంగా గుర్తించారు. స్వాతంత్ర్యోద్యమంలో ఈగేయం ఎందరినో ఉత్తేజితులను చేసింది. 1896లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశం నుంచే ఈ గేయం విశేష ప్రాచుర్యం పొందింది. ■



'యుద్ధమంటే రాజకీయాల కొనసాగింపే'నన్నాడు ఒకాయన. ప్రచ్ఛన్న యుద్ధానికైనా, ప్రత్యక్ష యుద్ధానికైనా ఇది వర్తిస్తుంది. ప్రచ్ఛన్న యుద్ధమంటే- నిజరూపాలు కౌగలించుకుంటుంటే నీడలు జగడమాడటం. ఇద్దరు పెత్తందారులు చేతికి 'మట్టి' అంటకుండా పరస్పరం కలహానికి దిగడం. అక్కడ యుద్ధం కనబడదు- వినబడుతుంది! మనిషిని బెంబేలెత్తిస్తుంది. నిలువునా ముంచేస్తుంది. నాలుగు దశాబ్దాల 'కోల్డ్‌వార్'పై టి. వేణుగోపాల్ విశ్లేషణ...

# ప్రపంచానికది ప్రత్యక్ష నరకం

రెండో ప్రపంచ యుద్ధానంతరం నాలుగు దశాబ్దాలకు పైగా ప్రపంచాన్ని అస్థిరత్వంలోనూ, అశాంతిలోనూ ముంచెత్తిన కీలక ఘట్టం ప్రచ్ఛన్న యుద్ధం. ఇంగ్లీషులో 'కోల్డ్‌వార్'గా ఈ స్థితికి మొట్టమొదట పేరు పెట్టినవాడు అమెరికా రాజనీతిజ్ఞుడు బెర్నార్ బరుచ్. యుద్ధమూ లేక, శాంతీ ఏర్పడక కనబడని ఉద్రిక్తతతో సతమతమయ్యే పరిస్థితే ప్రచ్ఛన్నయుద్ధం. సోవియెట్ యూనియన్‌కీ, పాశ్చాత్య దేశాలకు- ముఖ్యంగా లమెరికాకు మధ్య ప్రపంచాధిపత్యం కోసం సాగిన ఈ 'ప్రచ్ఛన్న యుద్ధం' వల్ల మూడో ప్రపంచ యుద్ధం మన ముంగిట్లోకి వచ్చేసిందేమోనని ప్రపంచ ప్రజలు అనేకసార్లు భయాందోళనలకు గురయ్యారు. మహాసాగరాల్లో మాటుకాసి, బడుగు దేశాల్లోని ప్రజలను ఒడిదుడుగులకు గురిచేసి ఎటుచూస్తే అటు సైన్యమై, భూగోళాన్నే రెండుగా చీల్చిన ప్రచ్ఛన్న యుద్ధం ప్రత్యక్ష యుద్ధాన్ని మించిన నష్టాన్నే కలగజేసింది.

ఏదీ కారణం లేకుండా మొదలు కాదు. కొనసాగదు. 'హమ్మయ్య ఈ పీడ విరగడైంద'ని రెండో ప్రపంచ యుద్ధం మిగిల్చిన విషాదం నుంచి జనం కోలుకోంటుండగానే, ఆ యుద్ధం ముగింపులోనే ప్రచ్ఛన్న యుద్ధానికి బీజాలు పడ్డాయి. ఏ యుద్ధానికైనా పైకి కనపడే కారణాలు ఏమైనా ఉండొచ్చుగానీ, అసలు కారణాలు ఆర్థిక వ్యూహాలే. రెండో ప్రపంచ యుద్ధంలో చేజిక్కిన విజయాన్ని ఆసరా చేసుకుని ప్రపంచ గమనాన్ని తన కనుసన్నల్లో నిర్దేశించేందుకు అమెరికా ప్రయత్నించడంతోనే దీనికి అంకురార్పణ జరిగింది. సైనికంగా జోక్యం చేసుకోవడం, ఆర్థికంగా పెత్తనం చెలాయించడం అనే రెండు సూత్రాలతో మునుముందుకి దూసుకొచ్చిన అమెరికాకు సోవియట్ కంట్లో నలుసులా కనబడింది. అప్పుడప్పుడే ముగిసిన ప్రపంచ యుద్ధంలో సైనికంగా, ఆర్థికంగా ఎంతో నష్టాన్ని చవిచూసిన సోవియెట్ పేకమేడలాంటిదని, గట్టిగా వత్తిడి తెస్తే మట్టి కరుస్తుందనీ అమెరికా భ్రమ పడింది. పైగా తన దగ్గర ఆటంబాంబు ఉందన్న అహంకారం ఉంది. కానీ, రెండో ప్రపంచ యుద్ధంలో తిన్న దెబ్బలు గుర్తుండి, అలిసిన సేనల్ని చూసి 'కొద్ది కాలం ఆగుదాం. కంగారేముందిలే' అనే ధోరణిలో నేరుగా యుద్ధానికి తలపడటం వాయిదా వేసుకుంది.

అలాని అమెరికా ఊరికే ఏం ఉండలేదు. అప్పటి



క్యూబన్ మిస్సైల్ బేస్

అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ పేరుమీద 'ట్రూమన్ సిద్ధాంతం'గా 1947 మార్చిలో వెలుగుచూసిన విధానానికి అనుగుణంగా అనేక దేశాల్లో సైనిక జోక్యానికి ఆ దేశం పాల్పడింది. చమురు దేశాలు చేతిలో ఉంటేనే భవిష్యత్తుని శాసించగలమని ఆ దేశం అంచనా వేసుకుంది. రెండో ప్రపంచ యుద్ధం పుణ్యమా అని పాలకుడే లేని అరాచక దేశాలు అప్పట్లో చాలా ఉన్నాయి. ఈ పరిస్థితిని ఉపయోగించుకుని అనేక దేశాల్లో తన కీలుబొమ్మలకు అమెరికా పట్టాభిషేకం చేసింది. వీటన్నిటికీ ఆర్థికంగా తోడ్పడటం కోసమంటూ 'మార్షల్ ప్లాన్'ని ప్రవేశపెట్టింది. (అప్పటి అమెరికా విదేశాంగ మంత్రి మార్షల్ దీని సృష్టికర్త) గ్రీస్, టర్కీల నుంచి వియత్నాం దాకా ఇది సాగింది. అదే సమయంలో కమ్యూనిస్టు భూతం ప్రపంచాన్ని కబళించబోతున్నదంటూ ప్రచారం లంకించుకుంది. హిట్లర్ సేనలను తరుముకుంటూ వెళ్లిన ఎర్రసైన్యం తిరిగి స్వదేశానికి బయలుదేరుతుంటే, ఆ వెళ్లినంత మేరా 'ఎర్రరాజ్యాలు' అవతరిస్తుంటే అమెరికా, దాని సహచర దేశాలకు ఊపిరి ఆడలేదు. ఆ తర్వాత అవన్నీ కలిసి పరస్పరం సహకరించుకోవడానికి 'కామిన్‌ఫామ్'ని ఏర్పాటు చేసుకున్నాయి. ట్రూమన్ సిద్ధాంతం, మార్షల్ ప్లాన్‌లతో కమ్యూనిస్టు రాజ్యాలు ఏకం కావడానికి పరోక్షంగా దోహదపడిన అమెరికా, దాని మిత్రదేశాలకు ఏం చేయాలో ఇక తోచలేదు. సోవియట్ చుట్టూ సైనిక స్థావరాలను ఏర్పాటు చేయడం ప్రారంభించారు. ఇలాంటివి దాదాపు 45 స్థావరాలను మొదలెట్టారు. సహజంగానే దీనికి సోవియెట్ నుంచి ప్రతిస్పందన వచ్చింది. ఎర్ర 'ఆటంబాంబు' భళ్ళున పేలింది. ఆ 'బాంబు'పై గుత్తాధిపత్యం తనదేనను కున్న అమెరికా భ్రమ కూడా దాంతోనే బద్దలయింది!

### స్నేహాలూ, సహకారాలూ

రెండో ప్రపంచ యుద్ధం తర్వాత 'కోల్డ్‌వార్' అనే పదం నిఘంటువులోకి వచ్చి చేరినట్టే, నిఘంటువులోని పాత పదాలకు కొత్త అర్థాలు ఏర్పడ్డాయి. ఆర్థిక రంగం నుంచి ఆయుధరంగం దాకా ఒకరినిమించి ఒకరు ఎదగాలని రెండు అగ్రరాజ్యాలూ పోటాపోటీగా చేసిన ప్రయత్నాల వల్ల ప్రపంచం దాదాపు రెండుగా చీలింది. ఏదో ఒక అగ్రరాజ్యం సరసన నిలబడకపోతే మనుగడే ఉండదేమోనన్న భయం చిన్న దేశాలను ఆవరించింది. రెండు అగ్రరాజ్యాలూ తొలిదశలో వీలున్నంతమేర ఆక్రమించుకుంటూ పోయి, తమ కీలుబొమ్మలను ప్రతిష్ఠించి, వారితో స్నేహ, సహకార ఒప్పందాలను కుదుర్చుకుంటూ పోయాయి. తర్వాత కాలంలో అనేక ఇతర దేశాలతో ఇవి కొనసాగాయి. 'స్నేహమూ', 'సహకారమూ', 'రక్షణ' అనే పదాలకు అర్థమే మారిపోయింది. ఈ పదబంధాల మాటున అమెరికా, సోవియెట్‌లకు అనేక దేశాలు అర్థవలస దేశాలుగా, ఉపగ్రహాలుగా మారాయి.

ఇద్దరు అగ్రజులకూ సమదూరాన్ని పాటిస్తూ 1967లో భారత్, యుగోస్లావియాల చొరవతో ఆలీనో

# ప్రగతి పథంలో వికారాబాద్ మండలం






స్వర్ణాంధ్ర లక్ష్య సాధనకు బాటలు వేసే నవశకానికి, శతాబ్ది వత్సరానికి స్వాగతం...సుస్వాగతం. పేద, బడుగు వర్గాల అభ్యున్నతికి ఇతోధికంగా పాటు పడుతున్న ముఖ్యమంత్రి **చంద్రబాబునాయుడు** నేతృత్వంలోని రాష్ట్ర ప్రభుత్వ ఆశయాలకనుగుణంగా స్వర్ణాంధ్రప్రదేశ్ నిర్మాణ దిశగా నడిచి భావితరానికి ఆదర్శంగా నిలుద్దాం. వికారాబాద్ మండలానికి వివిధ అభివృద్ధి పనులు మంజూరు చేయిస్తున్న ఎమ్మెల్యే **డాక్టర్ ఎ.చంద్రశేఖర్** కృషి మరచిపోలేనిది. గత నాలుగున్నరేళ్ల కాలంగా మండల పరిషత్తుకు అన్ని విధాలుగా సహకరించిన అధికారులు, ప్రజాప్రతినిధులు, ప్రజలకు నూతన సహస్రాబ్ది సందర్భంగా మా హార్దిక శుభాకాంక్షలు.

మండల పరిషత్ అధ్యక్షురాలు: **ఎం. అనంతమ్మ**
మండల పరిషత్ ఉపాధ్యక్షులు : **కె.కమాల్‌రెడ్డి**
జడ్.పి.టి.సి. సభ్యులు: **ఎన్.లక్ష్మణ్‌రావు**
ఎం.పి.టి.సి. సభ్యులు:
**వీరప్ప** (మద్గుల్‌చిట్టెంపల్లి)
**భాస్కర్** (పులుమద్ది)
**రాంచంద్రయ్య** (గిరిగెట్‌పల్లి)
**సాయన్న** (గొట్టిముక్కల)
**శ్రీమతి నర్సమ్మ** (ధన్నారం)
**శ్రీమతి జానకమ్మ** (సిద్దులూరు)
**గులామ్ రసూల్** (కో-ఆప్షన్ సభ్యులు)

మండల పరిషత్ కార్యాలయం, వికారాబాద్

ద్యమం ఆవిర్భవించిందిగానీ, దాని ఎజెండాలో ఆర్థిక స్వావలంబనకు సంబంధించిన అంశమే లేనందు వల్ల, ఆచరణలో అదంత సత్ఫలితాలను అందించలేకపోయింది. అందులోని చాలా దేశాలు తమ ప్రాంతీయ ప్రయోజనాల కోసం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మళ్లీ ఇద్దరిలో ఎవరో ఒకరితో సన్నిహితమయ్యాయి. ఉదాహరణకు పొరుగుదేశం పాకిస్థాన్‌కి అమెరికా అండ ఉందన్న కారణంతో భారత్ సోవియెట్‌తో స్నేహ, సహకార ఒడంబడిక కుదుర్చుకుంది.

ఈ ప్రచ్ఛన్న యుద్ధ సమయంలో రెండు దేశాలూ కూటములు కట్టి, పరస్పరం కాలుదువ్వాయి. 1949లో అమెరికా నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్ (నాటో) పేరిట అనేక దేశాలను కూడగట్టింది. అనంతర కాలంలో 'సీటో', 'మెడో' లాంటి కూటములు ఏర్పరిచినా ఇవన్నీ నాటోలో భాగాలుగానే మెలిగాయి. దీనికి ప్రతిగా 1955లో సోవియెట్ యూనియన్ అల్బేనియా, బల్గేరియా, తూర్పు జర్మనీ, పోలండ్ లాంటి దేశాలతో 'వార్సా' కూటమిని ఏర్పరిచింది.

మరింత మెరుగైన సమాజాలను స్థాపించడానికీ, ఆర్థికాభివృద్ధికీ కృషిచేస్తున్నామని చెప్పుకుంటూ రెండు అగ్రరాజ్యాలూ చేసిన పనులు అన్నీ ఇన్నీ కావు. కమ్యూనిస్టు దేశాల్లో మానవ హక్కులు మృగ్యమయ్యాయని, వాటి చుట్టూ ఉన్న ఇనుప తెరల వెనక నియంతృత్వాల్లో జనం నానా అగచాట్లూ పడుతున్నారనీ అమెరికా, ఇతర పాశ్చాత్య దేశాలూ వాపోయేవి. ఈ 'ఇనుప తెర'ను విస్తరించకుండా చూడటానికీ, దాన్ని ఛేదించడానికే తాను పుట్టానన్నట్టు అమెరికా వ్యవహరించేది. వెనకబడిన దేశాల్లోని విప్లవ ప్రభుత్వాలను ప్రతీప శక్తులనుంచి కాపాడటానికీ, పెట్టుబడిదారీ విషకోరల కాటువడకుండా ఉండేందుకూ తాను నడుం బిగించానని సోవియెట్ దండోరా వేసు కునేది. ఇద్దరి మాటల్లోనూ అర్ధసత్యాలే ఉన్నాయని చరిత్ర అనేకసార్లు నిరూపించింది. రెండుదేశాల సేనల పదఘట్టనల్లోనూ అనేక దేశాల జనం మూగగా రోదించారు. ఇథియోపియా, ఈజిప్ట్, ఇజ్రాయెల్, సౌదీ అరే బియా, టర్కీ, గ్రీస్ లాంటి దేశాల్లో అమెరికా సేనలు కవాతు చేస్తే, పోలండ్, తూర్పు జర్మనీ, ఆఫ్ఘనిస్థాన్ లాంటి దేశాల్లో సోవియెట్ సేనలు కదం తొక్కాయి. పరస్పరం ఘర్షించిన అమెరికా, సోవియెట్‌ల మధ్య జనం నలిగిపోయారు. ఒక దేశం మీదకు మరో దేశం రాకెట్లు, మిస్సైళ్లు గురిపెట్టుకుని అందుకు మూడో దేశాన్ని స్థావరంగా మార్చుకున్నాయి. ఎవరు ఏం చెప్పినా, స్థానిక ప్రజల ఆకాంక్షలను, ఆరాటాలను ఇద్దరూ అణిచేశారు. ఇరాన్‌లో మహ్మద్ రెజా పహ్లవీ అనే ఇరాన్ షా చేసిన అకృత్యాలకు, చిలీలో పినో చెట్ పైశాచిక పాలనకూ వంతపాడినప్పుడు అమెరికాకు 'మానవ హక్కులు' జ్ఞాపకం రానట్టే, ఆఫ్ఘనిస్థాన్‌లోనో, అంతక్రితం పోలండ్‌లోనో, చెకోస్లొవేకియాలోనో జాతీయ ఆకాంక్షల్ని తొక్కిపెట్టినప్పుడు సోవియెట్‌కీ గుర్తుకు రాలేదు. సోవియెట్ చివరి రోజులనాటికి ఒక్క తూర్పు జర్మనీలోనే మూడు లక్షల సోవియెట్ సైన్యం తిష్టవేసి ఉందంటే పరిస్థితి ఎలా ఉండేదో ఊహించుకోవచ్చు. దాదాపు అంతే సంఖ్యలో పోలండ్‌లోనూ, ఆఫ్ఘనిస్థాన్‌లోనూ ఆ దేశం సైన్యం ఉండేది. ఇన్ని ఉన్నా అనేక చోట్ల జనం రెండు దేశాలనూ నెత్తురోడి ఎదిరించారు. అమెరికాకు వియత్నాం, ఇరాన్‌లాంటి దేశాల ప్రజలు, సోవియెట్‌కి పోలండ్, తూర్పు జర్మనీ లాంటి దేశాల ప్రజలూ ఈ విషయాన్ని నిరూపించి చూపారు.

## ప్రచ్ఛన్న యుద్ధంలో సంధులు

అమెరికా, సోవియెట్‌లు పరస్పరం కాలుదువ్వుకుంటూనే కొన్ని ఒడంబడికలు చేసుకున్నాయి. 1959లో సోవియెట్ అధ్యక్షుడు కృశ్చేవ్ 'మూడు శాంతుల సిద్ధాంతాన్ని' ప్రకటించినప్పుడు ఈ ప్రక్రియ మొదలైంది. పెట్టుబడిదారీ సమాజంతో శాంతియుత సహజీవనం, శాంతియుత పోటీ ఉంటే, శాంతియుత పరివర్తన సాధ్యమేనన్నది స్థూలంగా దీని సారాంశం. ఇది ప్రకటించాక కృశ్చేవ్ వాషింగ్టన్ పర్యటనకెళ్లి అప్పటి అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హోవర్‌ని కలిశారు. ఐక్యరాజ్య సమితిలో ప్రసంగించారు. నాలుగేళ్లలో నిరాయుధీకరణ (అస్త్ర సన్యాసం) చేసేస్తామన్నారు. దీని పర్యవసానంగా అణుపరీక్షలపై పాక్షికంగా నిషేధం విధించే ఒప్పందంపైనా, అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం (వాళ్లకు తెలిసిన అణురహస్యాలను మిత్రులకు అందించకపోవడం) లాంటి ఒప్పందాలూ కుదిరాయి. 1972లో అప్పటి అమెరికా అధ్యక్షుడు నిక్సన్ మాస్కో వెళ్లారు. మరో రెండు ఆయుధ నియంత్రణ ఒప్పందాలపై సంతకాలయ్యాయి. దీనికి ప్రతిగా 1973లో సోవియెట్ కమ్యూనిస్టు పార్టీ అధినేత బ్రెజ్నేవ్ వాషింగ్టన్ పర్యటించారు. ప్రపంచ శాంతికి కృషిచేస్తామని రెండు దేశాలూ అప్పుడే ప్రతిజ్ఞ చేశాయి. అనేక రంగాల్లో సహకరించుకోవడానికి అంగీకారం కుదుర్చుకున్నాయి. ఒకపక్క ఈ ఒప్పందాలూ, సామరస్యాలూ సాగుతుండగానే రెండు అగ్రరాజ్యాలూ అనేకచోట్ల నిప్పు రాజేశాయి. 1962లో క్యూబా క్షిపణి సంక్షోభం, 1968లో చెకొస్లొవేకియాలో సోవియెట్ సేనల జోక్యం, ఇరాన్, చిలీ, ఇథియోపియా లాంటి చోట అమెరికా ఆగడాలు, 1973లో ఇజ్రాయిల్-ఈజిప్ట్ తగాదాల్లో ఇద్దరు చెరోపక్షాన్ని సమర్థించడం లాంటివెన్నో ఈ కాలంలోనే సంభవించాయి. ప్రపంచ చమురు అవస రాల్లో 60 శాతాన్ని తీరుస్తున్న పశ్చిమాసియాలో నిరంతరం యుద్ధ వాతావరణమే ఉండేది. హిందూ మహా సముద్రం అగ్రరాజ్యాల సైనికవేదికగా మారింది.


జాన్ ఎఫ్ కెనడీ


కృశ్చేవ్

ఈ ఘర్షణలు బౌద్ధిక రంగంలో కూడా ప్రవేశించాయి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గొప్పతనాన్ని, అమెరికా అనే స్వర్గం గురించి అద్భుతంగా చిత్రీకరించే నవలలు, సినిమాలు బోలెడు ఆ సమయంలోనే వెలువడ్డాయి. ప్రపంచాన్ని కాపాడగల సత్తా, సామర్థ్యాలు అమెరికాకే ఉన్నాయని అవన్నీ ఎలుగెత్తి చాటేవి. అనేక దేశాల్లో అమెరికన్ లైబ్రరీలు వెలిసాయి. ముఖ్యంగా సోవియట్ యూనియన్ నుంచి వచ్చే విభీషణులకు 'స్వేచ్ఛా స్వర్గం'లో పూర్ణ కుంభంతో స్వాగతం పలికేవారు. వారంతా సోవియెట్ 'నరకం' గురించి కథలుకథలుగా చెప్పేవారు. సోవియెట్ యూనియన్ కూడా దీనికి దీటుగా ప్రచార రంగంలోకి దూకింది. 'ప్రవదా' ప్రచురణల ద్వారా అమెరికా నుంచి వచ్చే ముప్పును గురించి హెచ్చరిస్తూ, కమ్యూనిస్టు సిద్ధాంతాల గొప్పతనాన్ని తెలియజేస్తూ అనేక గ్రంథాలు వెలువడ్డాయి. సోవియెట్ మహా రచయితలు ప్రపంచ ప్రజలందరికీ సన్నిహితులయ్యారు. సోవియెట్ పతనానంతరం అటు అమెరికన్ లైబ్రరీలూ మూతబడుతున్నాయి. ఇటు సోవియెట్ ప్రచురణలూ నిల్చిపోయాయి. ఇప్పుడు ఏ పుస్తకమూ చదవనవసరం లేకుండానే అమెరికాను పరివిధాల పొగిడే తరం ఒకటి వచ్చేసింది.

## సోవియెట్ బ్లాక్‌లో ముసలం

అమెరికా (పెట్టుబడిదారీ ప్రపంచం)తో 'శాంతియుత సహజీవనం' మొదలెట్టాక సోవియట్ మిత్రదేశాల్లో ముసలం పుట్టింది. ముఖ్యంగా ఆసియాలో ఉన్న అతి పెద్ద దేశం కమ్యూనిస్టు చైనాతో విభేదాలొచ్చాయి. 1959లో కృశ్చేవ్ ప్రతిపాదించిన 'మూడు శాంతుల సిద్ధాంతం' చైనాకు ససేమిరా నచ్చలేదు. సోవియెట్ మార్క్స్, లెనిన్ సిద్ధాంతాల నుంచి గాడి తప్పిందని బహిరంగంగానే విరుచుకుపడింది. అంతకు తొమ్మిదేళ్ల క్రితం రెండు దేశాల మధ్యా ముప్ఫై యేళ్ల కోసం కుదిరిన 'పరస్పర స్నేహ, సహకార ఒప్పందం' రద్దయినట్టేనని చైనా ఏకపక్షం గానే ప్రకటించింది. ముందు విముక్తమైన దేశాలు ప్రపంచ సోషలిస్టు విప్లవానికి పెద్దదిక్కుగా నిలవాలన్న లెనిన్ మాటకు సోవియెట్ పాతరేసిందని ఈసడించుకుంది. దేశదేశాల్లోనూ కమ్యూనిస్టులు సోవియట్, చైనా గ్రూపులుగా విడిపోయారు. పెట్టుబడిదారీ ప్రపంచాన్ని 'శాంతియుతంగా' పరివర్తన చెందించాలన్న కృశ్చేవ్ సూత్రం చివరికి సోవియెట్‌కే వర్తించింది. మరో మూడు దశాబ్దాల తర్వాత 'ఇనుపతెర' బద్దలై- 'స్వేచ్ఛా వాయువుల'కోసం ఎగబడిన జనం కాళ్లకింద సోవియెట్ 'యూనియన్' నుజ్జునుజ్జయింది.

అనేక రిపబ్లిక్‌లుగా విడిపోయింది. ప్రచ్ఛన్నయుద్ధం పరిసమాప్తమై ప్రపంచ రారాజుగా, పెద్ద పోలీసుగా అమెరికా అవతారమెత్తింది. అది ఇరాక్, పనామా, యుగొస్లావియా, ఆఫ్ఘనిస్థాన్లపై దాడులు చేసి, మరికొన్ని దేశాలను హెచ్చరించి తన 'దారికి' తెచ్చుకోవాలని చూస్తోంది. ప్రపంచ వాణిజ్యాన్ని శాసించడానికి ప్రయత్నిస్తోంది. ■

ఆంధ్రప్రదేశ్ అవతరణ దేశం మొత్తం మీదనే భాషాప్రయుక్త రాష్ట్రాల ఆవిర్భావానికి బాటలు వేసింది. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు కోసం పొట్టి శ్రీరాములు చేసిన ఆత్మత్యాగం, 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' పేర కమ్యూనిస్టులు చేసిన ఆందోళన, పెద్ద మనుషుల ఒప్పందం వంటి నేపథ్యాలపై కె.వి. రామిరెడ్డి క్లుప్తీకరణ...



# ముక్కలైన తెలుగునేల ఒక్కటైన రోజు

స్వాతంత్ర్యసమరయోధుడు, స్వార్థరహిత దేశభక్తుడు అయిన పొట్టి శ్రీరాములు గాంధేయ సిద్ధాంతాలకు ప్రభావితమై, చేస్తున్న ఉద్యోగాన్ని వదిలేసి సబర్మతీ ఆశ్రమంలో గాంధీచేరువలో 12ఏళ్ళు గడిపారు. 1927లో సహాయనిరాకరణోద్యమంలో, 1930లో ఉప్పు సత్యాగ్రహంలో, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్న పొట్టిశ్రీరాములు మూడుసార్లు జైలుకు కూడా వెళ్ళారు. తన లక్ష్యాల సాధనకు పోరాటం చేయటం ఆయన నైజం. హరిజనోద్ధరణ నిమిత్తం 1948లో పొట్టిశ్రీరాములు 29రోజులు నిరాహారదీక్ష చేశారు. అదే రీతినే ఆయన ఆంధ్రరాష్ట్ర సాధనకు 1952 అక్టోబరు 19న మద్రాసులో బులుసు సాంబమూర్తి ఇంట్లో ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు. కానీ ఆ దీక్షను కేంద్ర ప్రభుత్వం పట్టించుకోలేదు. దీక్ష మధ్యకాలంలో ఆంధ్ర రాష్ట్ర సమస్యను పరిశీలించగలనని నెహ్రూ చెప్పినా పొట్టిశ్రీరాములు విశ్వసించలేదు. బేషరతుగా ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేస్తేనే తప్ప దీక్ష విరమించేది లేదని ఆయన తన ఆమరణ నిరశన కొనసాగించారు. 58రోజులపాటు దీక్ష కొనసాగించి డిసెంబరు 15 అర్ధరాత్రి అమరజీవి అయ్యారు. పొట్టిశ్రీరాములు ఆత్మాహుతి ఆంధ్రదేశాన్ని అగ్నిగోళంగా మార్చింది. ఈ ఆందోళనలకు కేంద్రం దిగివచ్చింది. పొట్టి శ్రీరాములు త్యాగఫలితంగా 1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం అవతరించింది. టంగుటూరి ప్రకాశం పంతులు మొదటి సిఎంగా ప్రమాణస్వీకారం చేశారు.

1953 అక్టోబరు 1న కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. కోస్తా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లోని 11 జిల్లాలు ఈ రాష్ట్రంలో భాగమయ్యాయి. అప్పుడు విస్తృతమైన తెలంగాణా హైదరాబాద్ రాష్ట్రంలో ఉండేది. ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలన్నింటిని కలుపుకొని 'విశాలాంధ్ర' ఏర్పడాలని తొలిసారిగా 1946లో కమ్యూనిస్టుపార్టీ పిలుపునిచ్చింది. 1949 ప్రాంతంలో అయ్యదేవర కాళేశ్వరరావు 'విశాలాంధ్ర మహాసభ'ను నెలకొల్పారు. ఇక్కడ నెలకొంటున్న పరిస్థితులను గమనించిన నెహ్రూ 'విశాలాంధ్ర' ప్రతిపాదనను వ్యతిరేకించారు. 1953 డిసెంబరులో భాషా ప్రాతిపదికపై రాష్ట్ర పునర్విభజన సంఘం ఏర్పడింది. ఈ సంఘం 1955 సెప్టెంబరులో కేంద్రానికి సమర్పించిన నివేదికలో ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు చేయాలని సూచించింది. '61వరకు 'విశాలాంధ్ర' ప్రతిపాదన వాయిదావేయాలని కోరింది. ఈ నేపధ్యంలో విశాలాంధ్ర సాధనకుగాను తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాల్లోని కొందరు పెద్దమనుషులు 1956 ఫిబ్రవరి 20న ఒక ఒప్పందానికి వచ్చారు. అదే పెద్దమనుషుల ఒప్పందంగా పేరొందింది. ఈ ఒప్పందంలో తెలంగాణాకు అనేక రక్షణలు కల్పించారు. కమ్యూనిస్టులు, కాంగ్రెస్‌లోని అత్యధికులు 'విశాలాంధ్ర'కు కేంద్రంపై ఒత్తిడి తెచ్చారు. 1956 ఆగస్టులో ఈ ప్రతిపాదనను కేంద్రం అంగీకరించింది. దరిమిలా 1956 నవంబరు 1న హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది. నీలం సంజీవరెడ్డి మొదటి ముఖ్యమంత్రి అయ్యారు. ■



'భారతీయత'ను దర్శించిన మహాపండితుడు ఈ దేశానికి తొలి ప్రధాని. ఆయనో భావుకుడు, భౌతిక వాది, తత్వవేత్త, రచయిత, సౌందర్యారాధకుడు, పసిహృదయం గలవాడు, పసిడి ఆశయాలున్నవాడు. వలస శృంఖలాలు తెంచుకున్న ఆజాద్ భారత్‌ను ఒక అమేయమైన ఆర్థికశక్తి రూపొందించాలన్న తపనతో పంచవర్ష ప్రణాళికలకు రూపకల్పన చేశాడు. రష్యాలో ఏర్పడిన సోషలిస్టు వ్యవస్థను చూసి ఉత్తేజితుడయ్యాడు. ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమలకు పునాదిరాళ్లు వేశాడు-ఆర్థికరంగం పటిష్ట తకు-కార్మిక సంక్షేమానికి కలల సౌధాలు కట్టుకున్నాడు. పెద్దపెద్ద బహుళార్థ సాధక ప్రాజెక్టులకు శంకుస్థాపన చేశాడు- ఇవే మా కొత్త దేవాలయాలంటూ ప్రణమిల్లాడు, హరిత విప్లవానికి నారుపోశాడు. ఈ మహాస్వాప్నికుడు నవభారతాన్ని నిర్మించిన తీరుపై కె.వి. రామిరెడ్డి సంక్షిప్త చిత్రణ...

# నవభారత నిర్మాణం



ఆయనను 'ఆధునికభారతనిర్మాత' అంటారు. చొక్కాగుండీపై గులాబీపువ్వుతో, కళ్లల్లో స్వప్నాలతో భారతదేశ ప్రథమప్రధానిగా స్వతంత్రభారతాన్ని నడిపిన తొలిసారథి ఆయన. గాంధీజీ రాజకీయవారసుడు, 17ఏళ్ళపాటు భారతదేశపరిపాలనా పగ్గాలు చేతపట్టినవాడు ఆయన. భారతదేశ లౌకికతత్వానికి రూపురేఖలు దిద్దాడు. ఆర్థికరంగంలో ప్రణాళికలు రచించాడు. ప్రపంచానికి స్వతంత్రభారతవాణిని వినిపించాడు.

'జవహర్‌లాల్ నెహ్రూ - భారతదేశం' అనేమాట ఎప్పుడూ చర్చనీయాంశమైన విషయంగానే నేటికీ చెలామణి అవుతుందంటే భారతావనిపై నెహ్రూ పండితుడి ప్రభావం ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. అలహాబాద్‌లో 1889 నవంబరు 14న జన్మించిన నెహ్రూజీ హారోలోను, కేంబ్రిడ్జిలలోను చదువుకున్నారు. కెమిస్ట్రీ, జియాలజీ, బాటనీ సబ్జెక్టులను చదువుకున్న నెహ్రూజీ తరువాత బారిస్టరు అయ్యారు. న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. మోతీలాల్ నెహ్రూ, స్వరూపరాణిల ముద్దుబిడ్డడు భారతస్వాతంత్ర్యోద్యమపోరాటంలో పాల్గొని అనేక సంవత్సరాలు జైలులో గడిపారు. జాతీయకాంగ్రెస్‌కు అధ్యక్షుడయ్యాడు. స్వతంత్రభారతానికి 58 ఏళ్ళ ప్రాయంలో తొలిప్రధాని అయ్యాడు. భారతదేశ విదేశాంగ విధానాన్ని రూపుదిద్దాడు. అమెరికా, రష్యా, ఫ్రాన్స్, ఇంగ్లండ్, ఈజిప్ట్ నాయకులతో స్నేహసంబంధాలు నెరిపాడు. ఐక్యరాజ్యసమితిలో ప్రసంగించాడు. తృతీయ ప్రపంచదేశాలు ప్రపంచవేదికలపై తమ సమస్యలను గొంతువిప్పి చెప్పటంలో వెన్నుదన్నుగా నిలిచాడు. తన జీవితకాలంలో ప్రజాజీవితంలో తిరుగులేని నాయకుడిగా కొనసాగిన జవహర్‌లాల్ నెహ్రూకు శాస్త్రసాంకేతిక విషయాలు, సామ్యవాదం చాలాచాలా ఇష్టమైన మాటలు. పెద్దపెద్ద ప్రాజెక్టులను ఆధునిక దేవాలయాలుగా అభివర్ణించిన నెహ్రూజీ, వ్యవసాయరంగంలోనూ, విద్యుత్ ఉత్పత్తిలోనూ వాటి ప్రాముఖ్యతను స్పష్టంగా వివరించాడు. చారిత్రక విషయాల్లోనూ, ఇతర ప్రపంచవిషయాల్లోనూ తిరుగులేని ప్రతిభా వ్యుత్పత్తులతో స్కాలర్‌గా గుర్తింపు పొందిన నెహ్రూజీకి వేదాలు క్షుణ్ణంగా తెలిసిన విషయాలు. ఈ హేతువాది బుద్ధిజాన్ని ప్రేమించాడు.

తన జైలుజీవితంలో నెహ్రూజీ అపూర్వమైన రచనలను చేశారు. ఆయన 'గ్లిమ్‌సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ, డిస్కవరీ ఆఫ్ ఇండియా, 'ఆత్మకథ'లలో చాలా పేజీలు జైలుగోడలమధ్య రాసినవే. వాటి శైలి, భాష ప్రపంచసాహిత్యంలో తమకంటూ ప్రత్యేకస్థానాన్ని ఆక్రమిచుకున్నాయంటే ఆశ్చర్యం వేయకమానదు. తన కాలంలో ఇంగ్లీషులో అననుకరణసాధ్యంగా గద్యాన్ని రాసినవాడిగా, అనితరసాధ్యంగా ఉపన్యాసాలిచ్చినవాడిగా నెహ్రూజీకి ప్రపంచవ్యాప్త గుర్తింపు ఉంది. "ఆనాటి మా జైలు జీవితం ఓ అద్భుతం. జీవితంలోని అత్యంత విలువైన రోజులవి అని





నెహ్రూ కలలుగన్న ఆధునిక దేవాలయం నాగార్జునసాగర్ ప్రాజెక్టు

నేను చెప్పగలను. దేశస్వాతంత్రం కోసం పోరాటం. గాంధీజీ లాంటి నాయకుడి మార్గదర్శకత్వం. ఎంత గొప్పరోజులవి" అంటూ తన జైలుజీవితం గురించి అపురూపంగా చెప్పుకున్నారు నెహ్రూజీ.

'పంచశీల' ప్రభోదకుడిగా అంతర్జాతీయంగా దేశాలమధ్య సంబంధాలను మెరుగుపరిచే కృషి చేసిన నెహ్రూజీ అలీనవిధానం భారతదేశ విదేశాంగ విధాన ముఖ్యలక్షణంగా రూపకల్పన చేశారు. వెనుక బడిన దేశాల అభివృద్ధికి, వలసదేశాల స్వాతంత్ర్యసాధనకు భారతదేశం నిర్విరామంగా కృషిచేయాలన్నది పండిట్‌జీ లక్ష్యం. "స్వాతంత్ర్యానికి భంగం వాటిల్లినపుడు, అన్యాయం జరిగినపుడు, ఏ దేశమైనా దురాక్రమణ చేసినపుడు, భారతదేశం తటస్థంగా ఉండజాలదు. ఉండదు." అని నెహ్రూ 1949లో అమెరికన్ కాంగ్రెసులో భారతవిదేశాంగ విధానాన్ని గూర్చి వివరించారు. ఇలా మనదేశవిదేశాంగవిధానాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దిన నెహ్రూజీ, రష్యాసామ్యవాదం నచ్చి భారతదేశంలో పాటించాలని తపించారు. ఇవన్నీ నెహ్రూ ఆలోచనతీరుకు మాత్రమే సాధ్యమయ్యే విషయాలుగా గుర్తించకతప్పదు. ఇందుకు కారణం విశాలభావాలున్న వ్యక్తి ఆయన. సంకుచిత ధోరణిలో ఆలోచించడానికి ఆయన సహించేవారు కాదు. పార్లమెంటేరియన్‌గా ఆయన అత్యుత్తమ విలువలకే పెద్దపీటవేశారు. తన భావాలతో, ఆలోచనలతో తీవ్రంగా విభేదించేవారితోనైనా సరే ఆయన వ్యక్తిగతవైషమ్యాలకు చోటివ్వలేదు.

లక్ష్యాలను నిర్దేశించుకోవడం, లక్ష్యసాధనలో శ్రమించడం అంటే ఎంతో ఇష్టపడే కార్యశీలి నెహ్రూ. అందుకే పంచవర్షప్రణాళికలను రూపుదిద్దినా, అంతకు ముందే ప్రణాళికల విషయంలో చర్చలు సాగించినా ఆయన అధ్యక్షతనే జరిగాయి అన్నీ. 1938 డిసెంబరు నుంచి 1949 నవంబరు వరకూ ప్రణాళికా సంఘం 72సార్లు సమావేశమైంది. అందులో 71సార్లు నెహ్రూ స్వయంగా అధ్యక్షత వహించారు. గ్రామీణపరిశ్రమలను బలపరుస్తూనే, భారీపరిశ్రమలకు చోటివ్వాలన్నది ఆయన ఆలోచనగా ఉండేది. 'పెద్దపెద్ద పరిశ్రమలను విస్మరిస్తే ఇక ప్లానింగ్ అనే మాటకు అర్ధమేమిటి. అయితే మనం ప్రణాళికలను రూపొందించే విషయంలో మాత్రం కుటీర పరిశ్రమలను ప్రోత్సహించాలన్నదే కాంగ్రెస్ మూలవిధానమన్న విషయాన్ని మాత్రం దృష్టిలో ఉంచుకోవాల్సి ఉంటుంది" అన్నది నెహ్రూజీ అభిప్రాయం. ప్రజల భౌతిక, సాంస్కృతిక జీవనానికి సంబంధించిన సకల శాఖలకు జాతీయాభివృద్ధి పథకంలో సముచితస్థానం ఉడాలని నొక్కివక్కాణించిన నెహ్రూజీ ప్రణాళికా సంఘానికి అధ్యక్షుడిగా, ప్రధానిగా భారతదేశంలో ఓ నూతనశకం ఆవిర్భావానికి నాందిపలికారు.

పిల్లలను అమితంగా ఇష్టపడే చాచాజీ ప్రకృతిని ప్రేమించడంలోనే కాదు ప్రకృతిలోని మార్మికవిషయాలను సైతం గుర్తించిన శాస్త్రవేత్త. ఆలోచనల్లో తాత్వికచింతనకు ఎంత పెద్దపీట వేసేవారో, భౌతిక భావజాలానికి అంతే చోటిచ్చేవారు. భారతదేశాన్ని ప్రపంచదేశాలకు, మరీముఖ్యంగా తృతీయప్రపంచ దేశాలకు 'దిక్సూచి'గా మలచాలన్న కల నెహ్రూజీది. ఆ కల సాఫల్యం కోసం తన జీవితాంతం అవిశ్రాంతంగా కృషిచేశారాయన.

నిజమైన ప్రజాస్వామ్యమంటే భావప్రకటనాస్వేచ్ఛ ఉండటమే అని గట్టిగా నమ్మిన నెహ్రూజీ భారతీయ ఆత్మ తెలిసిన కాశ్మీరీపండితుడు. ఆధునికప్రపంచవ్యవస్థ తీరుతెన్నులు తెలిసిన ప్రపంచమానవుడు. భారతీయత, ఆధునికతల మేళవింపుతో స్వేచ్ఛాభారతానికి రూపురేఖలు దిద్దాలని శ్రమించిన కార్యశీలి. రాజనీతిజ్ఞత, పాండిత్యం, మానవత,ఆదర్శవాదం, దార్శనికత వెరసి బహుముఖప్రజ్ఞాశైలీయం నెహ్రూజీ జీవితం.

*ఎవరు చెప్పు యింతటి దాకా*
*ఈ భూవలయం మీద ఇంత హుందాగా*
*ఇంత అందంగా*
*ఇంత గర్వంగా తిరిగిన మనిషి*
*ఎవరు చెప్పు ఈ విశాల గగనం మీద*
*ఈ దిక్కునుండి ఆ దిక్కుకు యింత అర్థవంతంగా*
*ఆగామి మానవసంతతికి ఆదేశంగా ఆదర్శంగా*
*స్వర్ణాక్షర సంకేతాన్ని రచించిన మనీషి*
*ఎవరు చెప్పు యీ ప్రపంచ చరిత్ర*
*తలుపు తట్టి*
*లోపలి చీకటిలో గదిగదిలో మూల్గులు వినవచ్చే*
*ఎదఎదలో*
*ఆశా కర్పూర దీపాన్ని వెలిగించిన నవీన రాజర్షి!*
*జవహర్...*

**- తిలక్ కవితాపంక్తులు**



# పడిలేచే కడలి తరంగం

ఇందిరాగాంధీ 19 సంవత్సరాల అధికార రాజకీయ జీవితం అధికార పోరాటంతో ఆరంభమై, అధికార పోరాటాల మీదుగాసాగి, అధికార పోరాటంతో ముగిసింది. ఆ విధమైన పరిస్థితి ఆమెకు తప్పనిసరి అయిందన్నది ఒక అభిప్రాయం కాగా, అందులో కనీసం కొంత ఆమె చేజేతులా సృష్టించుకున్నారన్నది మరొక అభిప్రాయం. అందు గురించిన చర్చను అలా ఉంచితే, ఇందిరాగాంధీ తాను ప్రధానమంత్రి అయిన 1966నుండి మొదలుకుని 1984లో హత్యకుగురయ్యే వరకూ ఇటువంటి పరిస్థితుల మధ్యనే జీవించారన్నది మాత్రం యథార్థం. ఒకవేళ తనకు ఇట్టి పరిస్థితులు ఏర్పడి ఉండనట్లయితే ఆమె ఎటువంటి రాజకీయ నాయకురాలిగా, ఎటువంటి పరిపాలకురాలిగా రూపొంది ఉండేవారోనన్నది ఒక ఆసక్తికరమైన చర్చ. కానీ, అధికార స్థిరత్వం కోసం నిరంతర ఘర్షణ సాగించక తప్పని పరిస్థితుల మధ్య ఆమె ఒక 'నిర్మాణాత్మక శక్తి'గా కన్నా 'సంఘర్షణాశీలి'గా మాత్రమే చరిత్రలో మిగిలిపోయారు. ఆమె నుండి తర్వాత తరాల వారు అధికార సంఘర్షణా విద్యల గురించి నేర్చుకొనగలది ఎంతైతో ఉన్నదో, దేశ నిర్మాణ దక్షత గురించి నేర్వదగినది అంతలేదు.

ప్రధానమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రి ఆకస్మిక మరణంవల్ల 1966 ఆరంభంలో ఆ స్థానాన్ని అధిష్టించిన ఇందిరాగాంధీకి, ఆమెకన్న సీనియర్లూ, ఆమెతన తండ్రి నెహ్రూ నుండి ఒక మేరకు స్వీకరించిన 'లెఫ్ట్ ఆఫ్ ద సెంటర్' రాజకీయ దృక్పథంతో విభేదించే వారూ అయిన మొరార్జీదేశాయ్ ప్రభృతులతో మొదటి నుండే ప్రచ్ఛన్నయుద్ధం మొదలైంది. అదే పరిస్థితి 1967 ఎన్నికల తర్వాత దేశాయ్‌ని ఉపప్రధానిగా







**స్వాతంత్ర్యానంతర భారత రాజకీయాల్లో అంతటి ప్రజాకర్షణగల వ్యక్తి మరొకరు లేరు. అంతటి సాహసోపేతమైన నేత కూడా మరొకరు కనిపించరు. ఎటువంటి పెను సవాళ్లనైనా గుండె నిబ్బరంతో ఎదుర్కొని విజయం సాధించడం ఆమె విలక్షణ శైలి. మళ్లీ కొత్త సవాళ్లను తానే సృష్టించుకోవడం, మళ్లీ పోరాడి గెలవడం కూడా ఆమె తరహా రాజకీయమే. ఇందిరాగాంధీ రాజకీయ జీవితాన్ని మూడు దశల్లో సాగిన అధికార పోరాటంగా టంకశాల అశోక్ విభజిస్తున్నారు...**

నియమించక తప్పని స్థితిని, 1969 లో పార్టీ చీలికను, 1977లో మధ్యంతర ఎన్నికలను, ఆలోగానే బ్యాంకుల జాతీయకరణ, రాజభరణాల రద్దు వంటి 'అభ్యుదయ' చర్యల ప్రకటనను తప్పనిసరి చేసింది. 1971లో ఆమెకు మంచిమెజార్టీ లభించి, అప్పటికే పార్టీ చీలిక కారణంగా మొరార్జీ వర్గపు సమస్య పోవడంతో నిజానికి ఆ తర్వాత ఇక అధికారాన్ని నిలుపుకునే సమస్య ఉండకపోవలసింది. 1966 నుండి 71తో తన అధికార బాల్యారిష్టాలు తొలగి, ఇక ఆమె ఒక మంచి పరిపాలకురాలిగా ఎదగవలసింది. కానీ, ఇంచుమించు అదే దశ నుండి కొన్ని కొత్త రకాల సవాళ్లు ఇందిరాగాంధీకి ఎదురయ్యాయి. వాస్తవానికి అవి ఆమెవల్ల తలెత్తిన సవాళ్లు కాదు. 1947 నుండి 67 వరకుగల ప్రభుత్వాల పరిపాలనా వైఫల్యాలవల్ల ఏర్పడిన ఆర్థిక, సామాజిక సమస్యలవి.

వాటిలో ఒకటి అవినీతికి వ్యతిరేకంగా గుజరాత్, బీహార్‌లతో మొదలైన విద్యార్థుల ఆందోళనలు, జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వాన సాగిన 'సంపూర్ణ విప్లవ' ఉద్యమాలు కాగా, మరొకటి బెంగాల్‌తో ఆరంభమై పలు రాష్ట్రాలకు పాకిన నక్సలైట్ ఉద్యమం. ఈ సమస్యలతో ఇందిరాగాంధీ తన రాజకీయాధికారం కాపాడుకునేందుకు రెండవదశ పోరాటం ఆరంభించారు. అది తనకు వ్యతిరేకంగా అలహాబాద్ హైకోర్టు తీర్పుతో నాటకీయమైన మలుపు తిరిగి 1975లో ఎమర్జెన్సీ రూపం తీసుకున్నది. ఎమర్జెన్సీ రెండేళ్లకాలమూ సంఘర్షణేకాగా, 1977 ఎన్నికల ఓటమి, జనతా ప్రభుత్వ సమయమంతా రాజకీయ ఎత్తుగడలు, ప్రజలలో తిరిగి నమ్మకం సంపాదించే ప్రయత్నాలు, చివరకు 1980లో తిరిగి ఎన్నికల విజయం వరకూ మొత్తం ఎనిమిదేళ్ళ కాలమూ రెండో పోరాట దశగా గడిచింది. 1971నాటి విజయంతోవలెనే 1980నాటి విజయంతోనైనా ఆమెకు ఇక సమస్య తీరిపోవలసింది. అప్పటివలెనే ఇపుడూ మెజారిటీ లభించి అధికారం హస్తగతమైంది. అపుడు మొరార్జీ వర్గం చిత్తుకాగా ఈసారి జనతా పార్టీ రూపంలో అదే వర్గం మరొకమారు ఓడిపోయింది.



కానీ, 1980 ఎన్నికల అనంతరం ఇందిరాగాంధీ సరిగా ఊపిరైనా తీసుకున్నారో లేదో మూడవ దశ పోరాటం ఆరంభమైంది. ఆసరికి ఒకవైపు కాంగ్రెస్ పార్టీ వేర్వేరు రాష్ట్రాలలో బలహీనపడసాగింది. క్రమంగా కొన్ని రాష్ట్రాలలో ప్రాంతీయ పార్టీలు అధికారానికి వచ్చాయి. తాను గత 15 సంవత్సరాలకాలంలో బ్యాంకుల జాతీయం, గరీబీ హటావో నినాదం, అణ్వస్త్ర పరీక్ష, బంగ్లాదేశ్ యుద్ధం వంటివి ఎన్ని చేసినా, మాట్లాడినా పరిపాలనపై, అభివృద్ధిపై, సామాన్యుల జీవితం మెరుగుపడటంపై దృష్టి కేంద్రీకరించకపోయినందున ప్రజలలో కాంగ్రెస్‌పై విశ్వాసం తగ్గటంతో ఆమెకు భవిష్యత్తులో అధికార సాధనపై అనుమానాలు ఏర్పడ్డాయి. ఏ రాష్ట్రంలో ఏ చిన్న అసమ్మతినీ సహించలేని మనస్తత్వం ఏర్పడింది. మొరార్జీ తదితరుల అనుభవంతో, తనకు పోటీకాగలరనుకున్నవారి నెవరినీ ఎదగనివ్వని ధోరణి అంతకు ముందే మొదలైంది. ప్రతిపక్షాలను కుయుక్తులతో దెబ్బతీయటం కూడా ఇందులోనే భాగమైంది. పంజాబ్‌లో అకాలీలను భింద్రన్‌వాలే మార్కు తీవ్రవాదంతో చీల్చజూడటం సైతం ఈ రాజకీయమే. దీని పర్యవసానం 1984లో ఏవిధంగా వికటించిందో తెలిసిన విషయమే. ఆమె మూడవ దశ అధికార రాజకీయ ఘర్షణ ఆవిధంగా ముగిసింది.

ఇటువంటి పరిస్థితుల మధ్య ఒక వ్యక్తి వ్యక్తిత్వం ఏవిధంగా రూపుదిద్దుకుంటుందో, ఆ వ్యక్తి నాయకత్వానగల పార్టీకి ఎటువంటి లక్షణాలు ఏర్పడతాయో, పరిపాలనకు వెచ్చించగల సమయమెంతో, పరిపాలనను తన రాజకీయ ఉనికికి ఉపయోగపడేవిధంగా మార్చుకునే ప్రయత్నమెలా జరుగుతుందో, ఆ కారణంగా రాజ్యాంగ వ్యవస్థలు, పాలనా విభాగాలు, విలువలు ఎలా ధ్వంసమవుతాయో, ఈ చిరకాలపు ఘర్షణలు, విధ్వంసనలు చివరకు ప్రజల అవిశ్వాసాన్ని పెంచి తన అస్తిత్వానికే ముప్పుతెచ్చి, తన పార్టీని నిస్తేజం చేసి, రాజకీయ శూన్యాన్ని సృష్టించి, ఆ శూన్యంలోకి ఇతర రాజకీయ శక్తుల కోసం ఎలా మార్గాలు వేస్తాయో ఇందిరాగాంధీ చరిత్ర క్రమానుగతిని పరిశీలించినవారికి తేలికగా బోధపడుతుంది. ఆతర్వాత ఈ 15 ఏళ్లలోనూ ఆమె పార్టీ మధ్యమధ్య ఏదో గాలివాటుకు భగ్గుమని వెలగటంతప్ప, తిరిగి ప్రాణమిచ్చే చమురును మాత్రం పోసుకోలేకపోయింది. ■





ప్రపంచం మీద ఆధిపత్యం సాధించడానికి కావల్సిందేమిటి? ఆర్థిక శక్తుల అండదండలా?.... సామాజిక శక్తుల సహకారమా? ఆధునిక యుగారంభంలో ఆర్థిక-సైనిక శక్తుల తోడ్పాటుతో ఇంగ్లండ్ ప్రపంచాన్ని శాసించింది. రెండో ప్రపంచ యుద్ధానంతరం దాన్ని అనుకరించబోయిన అమెరికాకు రష్యా రూపంలో సామాజిక శక్తుల ప్రతిఘటన ఎదురైంది. కానీ, కొంతకాలమే. ఇప్పుడు అమెరికాదే ఏకధ్రువ ప్రపంచ సింహాసనం. అంతిమ విజయం ఆర్థిక శక్తులదేనా? సామాజిక శక్తులు స్పార్టకస్‌లు కావలసిందేనా, బెర్లిన్ గోడలా కూలిపోవలసిందేనా... టంకశాల అశోక్ వివరణ...

# జగదేక రాజ్యం



ఏదో ఒక దేశం అన్ని దేశాలనూ శాసించే ఏకధ్రువ ప్రపంచం ఏర్పడటం గత సహస్రాబ్ది కాలంలో ఇది మొదటిసారి కాదు. ప్రస్తుతం అమెరికా ఏ స్థానంలో ఉందో 18, 19వ శతాబ్దాల కాలంలో ఇంగ్లాండు కూడా అదే స్థానంలో ఉండేది. అంతకన్నా ముందు అసలు ఏ దేశమైనా సరే ఏవో కొన్ని ప్రాంతాలను జయించటం తప్ప ప్రపంచాన్నంతా శాసించేందుకు తగిన పరిస్థితులు ఉండేవి కావు. పారిశ్రామిక విప్లవం కారణంగా ఇంగ్లాండులో ఉత్పత్తులు, అంతర్జాతీయ వాణిజ్యాలు, సంపదలు, అందుకోసం అంతటా మార్కెట్లు, వలసలు, సముద్రాలను అదుపు చేసేందుకు నౌకాబలాలూ ఒకదాని వెంట ఒకటి విజృంభించి పెరగటంతో నిజమైన ఖండాంతర సామ్రాజ్యమొకటి ప్రపంచ చరిత్రలో మొదటిసారిగా అవతరించింది. దాదాపు రెండు దశాబ్దాల కాలం వారిని సవాలు చేసి నిలువ గల వారు మరెవరూ లేకపోవటంతో అపుడది ఏకధ్రువ ప్రపంచమే అయింది.

19వ శతాబ్దం ముగుస్తూ 20 శతాబ్ది ఆరంభమైన దశలో ఒక కొత్త పరిస్థితి రూపుదిద్దుకొన్నది. ఇంగ్లాండ్‌లో వెనుకటి ఉత్పత్తులు, అవి సృష్టించే సంపదలు, వలసలను కొల్లగొట్టడం, అంతర్జాతీయ వాణిజ్యంలో ఎదురులేని స్థితి వంటివన్నీ క్రమంగా స్థగితమై బలహీనపడే దశ ఆరంభమైంది. వలసలలో స్వాతంత్ర్య ఉద్యమాలు, ప్రపంచ యుద్ధాలు బ్రిటన్ ఏకధ్రువ ఆధిపత్యాన్ని ప్రత్యక్షంగా సవాలు చేసాయి. ఆరిక మాంద్యం కోలుకోలేని దెబ్బవేసింది. అట్టి పరిస్థితుల మధ్య ప్రపంచ రంగం నుండి బ్రిటన్ క్రమంగా ఉపసంహరించుకుంటూ రాగా, ఆ శూన్యాన్ని పూరించేందుకు అమెరికా అనే కొత్త వాణిజ్య - ఆర్థిక శక్తి సిద్ధపడసాగింది. అంతా సజావుగా సాగి ఉంటే ఏకధ్రువ ప్రపంచ స్థానపు బదిలీ ఇంగ్లాండు నుండి అమెరికాకు సాఫీగానే సాగిపోయి ఉండేది. ఇంగ్లాండు స్థానాన్ని ఆక్రమించగలనని ఒక దశలో బెదిరింపును సృష్టించిన జర్మనీ అతివాద ధోరణులలో పడి ప్రపంచ యుద్ధాల కారణంగా దెబ్బతినిపోయిన తర్వాత ఇక అమెరికాకు ఎదురు లేకుండాపోవలసింది. కానీ, ఏ ఆర్థిక శక్తులైతే మొదట ఇంగ్లాండును తర్వాత అమెరికాను అంతటి స్థాయికి తీసుకువెళ్ళాయో, అవే ఆర్థిక శక్తుల వికటవర్తన కారణంగా క్రమంగా రూపుదిద్దుకున్న సామాజిక శక్తులు 20వ శతాబ్దం వచ్చేసరికి విశ్వరూపం ప్రదర్శించి రష్యాలో విప్లవాన్ని తెచ్చాయి. పరస్పరం సంఘర్షించిన ఈ రెండు విధాలైన శక్తులు, భావ ధోరణులు ప్రపంచాన్ని 'ద్విధ్రువం'గా మార్చివేసాయి. వేల కొలది సంవత్సరాల మానవేతిహాసం పొడవునా సమాజంలోగాని, సాహిత్యంలోగాని, రాజకీయాలలోగాని వేర్వేరు రూపాలలో కన్పిస్తూ వచ్చిన 'మంచి-చెడు' వక్తులు ఈ రెండు ధ్రువాలుగా ఆవిష్కృతమయ్యాయని, ఇక అవి దీర్ఘకాలంపాటు స్థిరపడిపోగలవన్న భావన కొంతకాలం సాగింది. కాని రష్యా తరహా విప్లవాలు మరికొన్ని దేశాలలో సంభవించి కూడా ప్రపంచ స్థాయిలో ఈ 'రెండవ ధ్రువం' క్రమంగా బలపడటానికి బదులు 20వ శతాబ్దపు చివరి దశాబ్దాలు సమీపిస్తున్నకొద్దీ క్రమంగా బలహీనపడటం మొదలైంది. ఆ శూన్యాన్ని సైతం ఆక్రమించసాగిన అమెరికన్లది ఏకధ్రువ స్థాయిగా పరిణమించింది. ఆ విధంగా ప్రస్తుత సహస్రాబ్ది ముగిసి కొత్త సహస్రాబ్దికి తెరలేవనుండగా మనకు కన్పిస్తున్న ఏకధ్రువ ప్రపంచం.

ఇట్టి పరిణామాలకు కారణమేమిటన్నది ఒక ప్రశ్న కాగా, మునుముందు పరిస్థితులు ఏ విధంగా ఉండవచ్చునన్నది మరొక ప్రశ్న. 18వ శతాబ్దంతో ఆరంభించి ఇంతవరకు జరిగింది ఏమిటి? ఆర్థిక (వాణిజ్య, వైజ్ఞానిక, సాంకేతిక, పారిశ్రామిక అంశాలు ఇందులో భాగాలు), సైనికశక్తుల ప్రాబల్యంతో ఇంగ్లాండ్‌ది మొదటి ఏకధ్రువ ప్రపంచమైంది. ఇంగ్లాండ్ బలహీనపడగా తిరిగి అదే శక్తుల ప్రాబల్యంతో అమెరికా ఆ స్థానంలో అడుగుపెట్టింది. దానిని సవాలు చేసిన సామాజిక శక్తులు కొంతకాలంపాటు రెండవ ధ్రువాన్ని నిలపగలిగినా ఆర్థిక-సైనిక ప్రాబల్యంలో దీటుకాలేక దెబ్బతినిపోయాయి. ఆ విధంగా ఇంగ్లాండ్ స్థానంలో అమెరికా ఇపుడు రెండు కాళ్ళనూ మోపి స్థిరపడి, మరొకమారు ఏకధ్రువ ప్రపంచాన్ని నెలకొల్పుతున్నది. దీనిని బట్టి ఈ సహస్రాబ్ది చెప్పున్న పాఠమేమిటని భావించాలి? ఆర్థిక- సైనిక శక్తుల శిబిరానికి సామాజిక శక్తుల శిబిరానికి మధ్య మానవేతిహాసంలో మొదటి నుండి జరుగుతున్న ఘర్షణలో ప్రతిసారీ సామాజిక శక్తులు తాత్కాలిక విజయాలను ఆర్థిక-సైనికశక్తులు అంతిమ విజయాలను సాధిస్తూ వస్తున్నట్లే ఈ సహస్రాబ్ది అంతంలోనూ జరుగుతున్నదని అభిప్రాయపడాలా? ఈ పరిణామాలకు అంతిమ నిర్ణేతలు ఆర్థిక-సైనిక శక్తులేనా? లేక ఇందుకు సంబంధించి మరేదైనా దృక్కోణం ఉందా? ఇకముందు పరిస్థితులేమిటి? మానవ పురోగమనం అనంతం. ఇంత వరకు జరిగిన చరిత్ర వయసు సుమారు ఐదు సహస్రాబ్దులే. ఈ కాలంలో సామాజిక శక్తులు స్పార్టకస్ తిరుగుబాటు నుండి తాత్కాలికంగానైనా ప్రపంచంలోనే రెండో ధ్రువ స్థాయికి ఎదిగే వరకు పురోగమించాయి.



మంచికి ప్రాతినిధ్యం వహించే మానవుడు రానున్న సహస్రాబ్ది లోని మరేదో దశలో ఇంత కన్న మరింత పురోగమించడా? అతనిదే ఏకధ్రువం కాబోదా? ■





రాజీవ్‌గాంధీ హయాంలోనే కాంగ్రెస్ పార్టీ క్షీణదశ ఆరంభమైంది. కానీ, దేశమంతటా విస్తరించిన ఏకైక ప్రత్యామ్నాయశక్తి ఏదీ అప్పటికి రూపొందకపోవడంతో, కొంతకాలం పాటు విపక్షాల్లోని కుడి ఎడమ పార్టీల ఐక్య సంఘటన కొనసాగింది. విశాలజన బాహుళ్యం మద్దతు సంపాదించి ప్రత్యామ్నాయ రాజకీయ శక్తిగా ఎదగడానికి రెండు పక్షాలు దేనికదే ప్రయోగించిన రెండు బాణాలు మండల్, మందిర్. ఈ రెండు బాణాలు సృష్టించిన కల్లోలంపై ఎం. నాంచారయ్య వివరణ...



# అగ్గిరగిల్చిన రాజకీయ బాణాలు

ఇరవయ్యో శతాబ్దం చివరి పదేళ్లలో భారత రాజకీయాలను శాసించిన అంశాలు మండల్-మందిర్. వెనుకబడిన వర్గాల వారికి (బీసీలు) ఉద్యోగాల్లో కోటా, ప్రభుత్వాధికారంలో వాటా కల్పించాలనేవి మండల్ రాజకీయాలు. 'మండల్'కు విరుగుడుగా ఉత్తరప్రదేశ్‌లోని ఫైజాబాద్ జిల్లా అయోధ్యలోని వివాదాస్పద స్థలంలో (బాబ్రీ మసీద్) రామాలయం నిర్మించాలనే నినాదంతో కులాలకు అతీతంగా హిందువులందరినీ సమీకరించడానికి 'మందిర్' రాజకీయం మొదలయింది. "మండల్ కమిషన్ నివేదిక ఆధారంగా-సామాజికంగా, విద్యాపరంగా వెనుకబడిన వర్గాలకు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో 27 శాతం రిజర్వేషన్ కల్పించి, సామాజిక న్యాయం అందేలా చూడాలని నా ప్రభుత్వం నిర్ణయించింద"ని 1990 ఆగస్టు 7న పార్లమెంటులో అప్పటి ప్రధాని వి.పి. సింగ్ చేసిన ప్రకటన దేశ రాజకీయ స్వరూప స్వభావాలను మున్నెన్నడూ లేని విధంగా మార్చివేసింది. దక్షిణాది రాష్ట్రాల్లో వెనుకబడిన కులాలకు విద్యా సంస్థల్లోనూ, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాల్లోనూ రిజర్వేషన్లు స్వాతంత్ర్యం రాకముందు నుంచీ అమలులో ఉన్నాయి. అదీగాక, 1977 'జనతా' ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చే వరకూ ఉత్తరాది రాష్ట్రాల్లో ఈ రకమైన రిజర్వేషన్లు సైతంలేవు. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో బీసీలకు రిజర్వేషన్లు కల్పించే విషయమై భారత రాజ్యాంగ నిర్మాత బి.ఆర్.అంబేద్కర్ ఆనాడే బీసీ కమిషన్ ఏర్పాటు చేయమని సూచించారు. జవహర్లాల్ నెహ్రూ హయాంలో కాకా కాలేల్కర్ అధ్యక్షతన ఏర్పడిన మొదటి బీసీ కమిషన్ ఎట్టకేలకు తాను సమర్పించిన నివేదికనే తిరస్కరించి, నివేదికకు విలువలేకుండా చేసింది. కేంద్రంలో జనతాపార్టీ అధికారంలో వున్న కాలంలో 1979 జనవరి ఒకటిన బీహార్‌కు చెందిన బి.పి మండల్ అధ్యక్షతన రెండో బీసీ కమిషన్ ఏర్పాటు చేయగా, ఈ కమిషన్ తన సిఫార్సులతో 1980 డిసెంబర్ 31న నివేదికను అప్పటి కాంగ్రెస్ ప్రధాని ఇందిరాగాంధీకి సమర్పించింది. అంటే కాంగ్రెస్ ప్రభుత్వాల పాలనలో దాదాపు పదేళ్ళ నుంచి దుమ్ముకొట్టుకుపోయి మూలనపడి వున్న మండల్ కమిషన్ నివేదికకు వి.పి.సింగ్ ప్రాణం పోశారు. దేశవ్యాప్తంగా బీసీలకు రిజర్వేషన్లు కల్పించే అంశంపై చర్చకు అవకాశం ఇవ్వడమేగాక, అప్పుడప్పుడే రాజకీయంగా ముందుకొస్తున్న బీసీలకు పాలనా వ్యవస్థలో సైతం వాటా ఆలస్యంగానైనా కల్పించే ప్రయత్నం చేశారు. అయితే, ఎప్పటిలాగానే ఈ మండల్ రిజర్వేషన్లను వ్యతిరేకిస్తూ అగ్రకులాలకు చెందిన విద్యార్థులు దేశవ్యాప్తంగా, ప్రదానంగా ఉత్తరాది రాష్ట్రాల్లో ఉద్యమించారు. ఈ రిజర్వేషన్ల వ్యతిరేక ఆందోళన చాలా చోట్ల హింసాకాండకు దారితీసింది. చివరికి విద్యార్థులు ఆత్మాహుతి చేసుకునే స్థాయికి చేరింది. ఈ ఉద్యమం కొంత కాలానికి తగ్గుముఖంపట్టే దశలో దేశరాజకీయాల్లో మరో ముఖ్యమైన పరిణామం సంభవించింది. హర్యానా నేత, ఉప ప్రధాని దేవీలాల్‌ను ప్రభుత్వం నుంచి తొలగించాక, 1990 ఆగస్టు 9న దేవీలాల్ ఢిల్లీలో జరపతలపెట్టిన కిసాన్ ర్యాలీని దెబ్బతీసేందుకూ, దేశంలో తనకు సుస్థిరమైన గణనీయమైన ఓటు బ్యాంకును ఏర్పాటు చేసుకోవడానికే వి.పి.సింగ్ రెండు రోజుల ముందు 'మండల్' అస్త్రం ప్రయోగించారనే విమర్శలొచ్చాయి. దేశ జనాభాలో 52 శాతానికి పైగా వున్న వెనుకబడిన కులాల వారిని ప్రభావితం చేసే 'మండల్' వంటి బలమైన అస్త్రాన్ని ప్రయోగించిన వి.పి.సింగ్, మధ్యంతర ఎన్నికలకు సిద్ధమవుతున్నారనీ, ఇక జాగ్రత్త పడాలనే లక్ష్యంతో నేషనల్ ఫ్రంట్ సర్కారుకు బయట నుంచి మద్దతు ఇస్తున్న బిజెపి మండల్‌కు విరుగుడుగా మందిర్‌ను మళ్లీ రంగం మీదికి తెచ్చింది. వి.పి.సింగ్ మండల్ కమిషన్ సిఫార్సుల అమలుకు ప్రభుత్వం నిర్ణయించిందని ప్రకటించిన తర్వాత బిజెపి నేతలు బహిరంగంగానే అయోధ్యను ప్రధానమైన అజెండాగా స్వీకరించారు. అంతేగాక, 'రామజన్మభూమి'ని విముక్తం చేసేందుకు అప్పటి బిజెపి అధ్యక్షుడు ఎల్.కె.అద్వానీ సోమనాథ్ నుంచి అయోధ్యకు రథయాత్ర ప్రారంభించారు. కొన్ని రోజుల వరకూ ప్రభుత్వంగాని, పాలక సంకీర్ణంలో ప్రధానపక్షమైన జనతాదళ్‌గాని ఈ రథయాత్రను సీరియస్‌గా తీసుకోలేదు. అయితే, అద్వానీ యాత్ర సాగుతున్న కొద్దీ దేశంలో 'వేడి' పెరుగుతోంది.

1990లో మండల్ మంటల్లో

ఆహుతవుతున్న రాజీవ్‌గోస్వామి



వి.పి. సింగ్

అద్వానీ రథయాత్ర మొదలైన కొద్ది రోజులకు ప్రధాని వి.పి.సింగ్ తనను కలిసిన బిజెపి నేత ఎ.బి.వాజ్‌పాయిని,"అద్వానీ అయోధ్య యాత్ర అసలెందుకు ప్రారంభించాల్సి వచ్చింద"ని ప్రశ్నించారు. "మీరు మండల్ ప్రయోగిస్తే, మేం దానికి ప్రతిగా కమండలాన్ని బయటకు తీయాల్సి వచ్చింద"ని వాజ్‌పేయి జవాబిచ్చారు. అయితే "మండల్ రిజర్వేషన్లను తొలుత బిజెపి అంత తీవ్రంగా వ్యతిరేకించలేదుగదా" అని వి.పి.సింగ్ అన్నప్పుడు "స్వాతంత్ర్య దినం రోజున మీ ప్రసంగం దేశ రాజకీయాల్ని మలుపు తిప్పింది. ఆ రోజున మీరు మైనారిటీలకు, దళితులకు వరాలు ప్రకటించారు. మేం చూస్తూ వూరుకుంటే మీరు రోడ్ రోలర్‌లా మా మీద నుంచి పోతారని భయపడ్డాం, మధ్యంతర ఎన్నికలకు సిద్ధమౌతున్నారని భావించాం. 1977 తర్వాత నాటి పరిస్థితులు పునరావృతం కాకుండా బిజెపి ఓటు బ్యాంకులను కాపాడుకోవడమేగాక, వాటిని విస్తరించడానికే రథయాత్ర ప్రారంభించామ"ని వాజ్‌పేయి తేల్చి చెప్పారు.

అయోధ్య వివాదానికి ఇరుపక్షాలకూ ఆమోదయోగ్యమైన పరిష్కారం కనుగొని, అద్వానీ యాత్రను అయోధ్య చేరకుండానే ఫుల్‌స్టాప్ పెట్టడానికి ప్రభుత్వపరంగా వి.పి.సింగ్ అనేక ప్రయత్నాలు చేసినా ఫలితం లేకపోయింది. రథయాత్ర కార్యక్రమం ప్రకారం అక్టోబర్ 30న రామభక్తులు వివాదాస్పద స్థలంలో రామాలయ నిర్మాణానికి 'కరసేవ' చేయాల్సి వుండగా, ఈ సమస్యకు పరిష్కారం సాధ్యమేనని వి.పి.సింగ్ అక్టోబర్ 16న ప్రకటించారు. అయోధ్యలో ఆలయ నిర్మాణాన్ని అడ్డుకున్నా లేదా రథయాత్రకు అడ్డంకులు కల్పించినా నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరిస్తామని బిజెపి జాతీయ కార్యవర్గం మరుసటి రోజునే హెచ్చరించింది. అద్వానీ రథం అయోధ్య చేరేలోగా సమస్య పరిష్కరించాలని భావించిన వి.పి.సింగ్ సర్కారు ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో అక్టోబర్ 23న అద్వానీని బీహార్‌లోని సమస్తిపూర్‌లో అరెస్టు చేయడంతో రథయాత్ర ముగిసింది. అయితే, వెంటనే అదే రోజు ఫ్రంట్ ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరిస్తున్నట్టు బిజెపి రాష్ట్రపతికి తెలిపింది. దీంతో రాజీనామా చేయాలని వి.పి.సింగ్ మొదట భావించినా, చివరికి లోక్‌సభలో బలపరీక్షను ఎదుర్కోవాలనీ, ఈలోగా అయోధ్యలో కరసేవ జరగకుండా ఆపాలని నిర్ణయించుకున్నారు. కరసేవ రోజున యుపిలో జరిపిన కాల్పుల్లో కొందరు మరణించినప్పటికీ బాబరీ మసీదును కూలిపోకుండా కేంద్రంలోని వి.పి.సింగ్ ప్రభుత్వం, యుపిలోని ములాయంసింగ్ యాదవ్ ప్రభుత్వం కాపాడాయి - బలపరీక్షలో నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం ఓడిపోయాక, కాంగ్రెస్ మద్దతుతో అధికారంలోకి వచ్చిన చంద్రశేఖర్ నేతృత్వంలోని జనతాదళ్ చీలిక వర్గం ప్రభుత్వం కూడా 1991 ఆరంభంలోనే కూలిపోగా మే-జూన్‌లో జరిగిన మధ్యంతర ఎన్నికలు జరిగాయి. మొదటి దశ పోలింగ్ జరిగాక కాంగ్రెస్ అధ్యక్షుడు రాజీవ్‌గాంధీ తమిళటైగర్ల చేతిలో హత్యకు

*1992లో అయోధ్యలోని బాబ్రీ మసీదును కూల్చివేస్తున్న దృశ్యం*



ఎల్.కె. అద్వానీ

గురికావడంతో కాంగ్రెస్ ఊహించినదానికన్నా ఎక్కువ స్థానాలతో అతి పెద్ద పార్టీగా ఆవిర్భవించి అధికారంలోకి వచ్చింది. అయోధ్యలో రామమందిరం నినాదం పేరుతో ఎన్నికల్లో పోరాడిన బిజెపి తన బలాన్ని గణనీయంగా పెంచుకోగలిగింది. అయితే, అద్వానీ బీహార్‌లోని జనతాదళ్‌ప్రభుత్వం అరెస్టు చేసినప్పటికీ, ఈ రాష్ట్రంలో 'మండల్' ప్రభావం వల్ల జనతాదళ్ ఘన విసయం సాధించింది. 1991లో అధికారంలోకి వచ్చిన పి.వి.నరసింహారావు నేతృత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం హయాంలోనే మండల్ రిజర్వేషన్లు రాజ్యాంగబద్ధమేనని సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనం తీర్పుఇచ్చింది. ఫలితంగా పి.వి. ప్రభుత్వం ఈ రిజర్వేషన్లను అమలు చేసినప్పుడు దేశంలో ఎక్కడా వ్యతిరేకత కన్పించకపోవడం విశేషం. వి.పి.సింగ్ బీసీలను కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో 27% రిజర్వేషన్ ప్రకటించినప్పుడు ఈ నిర్ణయాన్ని వ్యతిరేకంగా కాంగ్రెస్, బిజెపిలు చివరకు అంగీకరించక తప్పలేదు. 1996 లోక్‌సభ ఎన్నికల్లోనూ, ఆ తర్వాత జరిగిన 1998 మధ్యంతర ఎన్నికల్లోనూ ప్రత్యక్షంగా మండల్, మందిర్‌ల ప్రస్తావన రాకపోయినా ఈ అంశాలు ప్రభావం అనేక ప్రాంతాల్లో లేకపోలేదు. అయితే, మొన్న 1999 సెప్టెంబర్‌లో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో మాత్రం యుపిలో బిజెపి బాగా దెబ్బతినడం, బీహార్‌లో పాలకపక్షమైన ఆర్‌జెడి ఘోర పరాజయం పాలు కావడంతో మందిర్-మండల్ రాజకీయాల్లో వచ్చిన మార్పులు ఏ స్థాయిలో వుంటాయో అర్థమవుతోంది. మరో ముఖ్య విషయం ఏమంటే, 1990లో మండల్ రిజర్వేషన్ల విషయంలో కేంద్ర కేబినెట్‌లో వి.పి.సింగ్ పక్కన చివరి వరకూ నిలబడిన అప్పటి మంత్రులు రాం విలాస్ పాశ్వాన్, శరద్ యాదవ్‌లు అయోధ్యపై బిజెపిపై ఏ స్థాయిలో పోరాటం జరిపిందీ తెలిసిందే. వారిద్దరూ ఇప్పుడు వాజ్‌పేయి నేతృత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వంలో మంత్రులుగా కొనసాగుతున్నారు. అలాగే మండల్ రాజకీయాల ఫలితంగా ఇటీవల యుపి ముఖ్యమంత్రి కల్యాణ్ సింగ్‌ను తొలగించడానికి బిజెపి చాలా రోజులు వెనకాడాల్సి వచ్చింది. అలాగే లోక్‌సభలో తనంతట తానుగా పూర్తి మెజారిటీ సాధించే వరకూ అయోధ్యను ఎన్నికల ఎజెండాలో చేర్చరాదని బిజెపి నిర్ణయించుకుంది. ఈ కారణంగానే, ఈ మధ్య యుపి కొత్త సిఎం రాంప్రకాష్ గుప్తా చేసిన వ్యాఖ్యల వల్ల బిజెపి పార్లమెంటులో ఇబ్బందులు ఎదుర్కొన్నప్పటికీ, ఎన్‌డిఎ అజెండాలో అయోధ్య లేదని ప్రధాని హామీ ఇవ్వాల్సి వచ్చింది. ప్రధానంగా ఉత్తరాది రాష్ట్రాల ప్రజలను ప్రభావితం చేసే అంశాలపైన ఈ మండల్-మందిర్‌లు పూర్వరూపంలో కన్పించకపోయినా వాటి ప్రభావం ఇంకా మాయం కాలేదు. ప్రస్తుతానికి మందిర్ మాట ప్రస్తావించకూడదనేది పాలక పక్షాల మధ్య ఒక అంగీకారంగా మారింది. ఇక పోతే, బీసీలకు రిజర్వేషన్లు, వారికి అధికారులు వాటా ఇవ్వడాన్ని దాదాపు అన్ని పార్టీలు అయిష్టంగానే జీర్ణించుకుంటున్నాయి. ■



పెట్టుబడిని పెద్ద పీటపై కూర్చోబెట్టారు. సోషలిస్టు అటకెక్కాడు. లిబరలైజేషన్ ఇప్పుడు పెద్ద ఫ్యాషన్. ప్రజా సంక్షేమం రికార్డు అరిగిపోయింది. ఆర్థిక రంగంలో ఉదారవాద విత్తనాన్ని రాజీవ్‌గాంధీ నాటితే, దానికి నీరుపోసి 'ఎరువులు' వేసి మరీ పెంచిన ఘనత పి.వి.నరసింహారావుది. అటల్ బిహారీ హయాంలో వటవృక్షంగా విస్తరించింది. ఈ పరిణామ క్రమంపై

టంకశాల అశోక్ విశ్లేషణ...

# తాజా ఫ్యాషన్... లిబరలైజేషన్!

భారతదేశం 1947లో తనను తాను సోషలిస్టు ఆశయాలుగల సంక్షేమ రాజ్యంగా ప్రకటించుకోవటం ఎంత సహజమైన స్థితో, అప్పటి నుండి 40ఏళ్లు గడిచిన తర్వాత ఆర్థిక సంస్కరణలవైపు మళ్ళటం కూడా అంతే సహజమైన పరిణామం. 1985లో ప్రధాని రాజీవ్‌గాంధీ-ఆర్థిక మంత్రి వి.పి.సింగ్‌ల బృందంతో ఆరంభించి పి.వి.నరసింహారావు-మన్మోహన్ సింగ్, దేవెగౌడ-చిదంబరం, వాజ్‌పేయి-యశ్వంత్‌సిన్హాల వరకు ఏ పార్టీకి చెందిన ఏ మంత్రి వర్గం కూడా మినహాయింపు లేకుండా ఈ మార్గాన్ని అనుసరించిందంటేనే భారతదేశ రాజకీయ వర్గాలు అన్నీ 1947 నాటితో పోల్చితే ఈ సరికి మారిపోయాయని, వెనుకటి ఆర్థిక పరిస్థితులు మారిపోయినట్లు భావిస్తున్నాయని, కనుక సంస్కరణలను, లేదా ఉదారవాదాన్ని అనుసరించజూస్తున్నాయని ఎవరికైనా తేలికగా అర్థమవుతుంది. భారతదేశపు ఆర్థికరంగ తాత్విక చింతనలో స్వాతంత్ర్యానంతరపు 50ఏళ్ల కాలంలో ఈ విధంగా రెండు దశలు కన్పిస్తున్నప్పటికీ వాస్తవానికి ఈ రెండింటికి కూడా మూలాలు అనదగ్గవి స్వాతంత్ర్యానికి పూర్వం నుండే ఉన్నాయి. అవి దేశ ఆర్థిక, సామాజిక స్థితిగతులలో ఉన్నాయి. ఆర్థికంగా భారతదేశం మొదటి నుండీ సుసంపన్నమైనదే. సహజ వనరులు, మానవ వనరులు, వృత్తి నైపుణ్యం గణనీయంగా ఉండే ఏ దేశం కూడా పేదది కాదు. ఆ వనరుల ఫలితాలు కొందరి చేతిలో ఉండటం వేరు. కానీ, యథాతథంగా సంపదలకు కొరత లేదు. ఇటువంటి ఏ వ్యవస్థ అయినా క్రమంగా అధికోత్పత్తి, వాణిజ్య విస్తృతి, సంపదల అభివృద్ధి మార్గంలో పయనిస్తుంది. అట్టి మార్గానికి తగిన రాజకీయ వ్యవస్థ, ఆర్థిక విధానాలు ఉదార రూపంలోనే ఉండక తప్పదు. అందువల్లనే దేశ స్వాతంత్ర్యోద్యమం కాంగ్రెస్ నాయకత్వాన ఒక వ్యవస్థీకృత రూపం తీసుకున్న తర్వాత అందులోని వ్యవసాయిక, పారిశ్రామిక, వాణిజ్య, వైజ్ఞానికశక్తులు తమతమ వ్యాపకాల స్వేచ్ఛా నిర్వహణ కోసమే బ్రిటీష్ పాలన నుండి మొదట స్వయం ప్రతిపత్తిని తర్వాత స్వాతంత్ర్యాన్ని కోరాయి. స్వాతంత్ర్యోద్యమంలోని రెండవపాయ అయిన సంక్షేమవాద సామాజిక శక్తుల ప్రభావంతో స్వాతంత్ర్యానంతర ప్రభుత్వాల విధానాలు సంక్షేమ ధోరణిలో సాగినంతకాలం అందుకు వ్యతిరేకంగా వత్తిడులు సృష్టించాయి. అయితే ఆ దశలో వాటి వాణిజ్య-పారిశ్రామిక-వైజ్ఞానిక శక్తి కూడా పరిమితమైనదే అయినందున వత్తిడులు ఆ పరిమితులలోనే ఉండిపోయాయి. క్రమంగా వారి సంపదలు, సమర్థత పెరుగుతుండటంతో, మరొకవైపు రాజకీయ నాయకత్వపు వెనుకటి సంక్షేమ దృక్పథం సడలుతుండటంతో, ఇంకొకవైపు అంతర్జాతీయ ఆర్థిక ధోరణులు తమకు కలిసిరావటంతో ఈశక్తుల వత్తిడి ఉదారవాదం కోసం బాగా పెరిగిపోయింది. ఆర్థిక, రాజకీయ ఉదారవాదాలు ఆ విధంగా 15 సంవత్సరాల క్రితం ఆరంభించి బాగా ఊపిరిపోసుకుంటున్నాయి. ప్రస్తుత ధోరణులను బట్టి చూడగా ఇక సమీప భవిష్యత్తులో ఈ శక్తులకు వెనుకడుగు అనేది ఉండబోదని చెప్పవచ్చు. స్వాతంత్ర్యానికి పూర్వంతో ఆరంభించి ఉదారవాద ఆర్థికశక్తుల మూలాలు, పరిణామక్రమం ఇవికాగా, సంక్షేమవాద శక్తుల మూలాలు కూడా స్వాతంత్ర్యానికి పూర్వపు ఆర్థిక సామాజికస్థితి గతులలోనే ఉన్నాయి. పైననే ప్రస్తావించినట్లు అభివృద్ధి ఫలాలు అందని సామాజిక తరగతులు, దేశ సామాజిక నిర్మాణం, వైవిధ్యాలూ సంక్షేమవాదానికి మూలమయ్యాయి. స్వాతంత్ర్యోద్యమంలో వీరి వాణి కూడా చేరింది. చివరకు రాజకీయ నాయకత్వం సామాజిక శాంతి కావన్న గుర్తింపుతో సంక్షేమవాదంపట్ల మొగ్గుగల మధ్యేమార్గ ఆర్థిక విధానాలను చేపట్టారు. అయితే, ఇదంతా అప్పటి పరిస్థితులకు, నాయకత్వానికి సరిపోయింది. స్వాతంత్ర్యానంతరం వలసపాలన నాటి దోపిడీ తగ్గుముఖంపట్టగా దేశీయ ఆర్థిక శక్తులు మెల్లగా నిలదొక్కుకున్నాయి. వాటి పురోగతి వివిధ పరిపాలనా వైఫల్యాలు, విధానపరమైన లోపాలవల్ల జరగవలసినంత వేగంగా జరగకపోయినప్పటికీ మూడు నాలుగు దశాబ్దాలు గడిచేసరికి తగినంత బలపడ్డాయి. అంతకాలం నడుస్తూ వచ్చిన ఆ శక్తులు ఇక పరుగులు తీయాలని కోరుకోగా అందుకు సంక్షేమవాద విధానాలు అవరోధాలుగా మారాయి. గతంలో ఉద్దేశపూర్వకంగా సంక్షేమవాదానికి పెద్ద పీట వేసిన రాజకీయతరం ఇప్పటికీ గడిచిపోవటంతో, సంక్షేమ రాజ్య విధానాలు సడలి ఆర్థిక ఉదారవాదానికి కొత్తతరం నాయకత్వం తలుపులు తెరవటం ఆరంభించింది. ఆ తలుపులే క్రమంగా ఈ శతాబ్ది ముగుస్తుండగా బార్లా అవుతున్నాయి. ఆర్థిక ప్రగతికి, సంక్షేమానికి కొత్త భాష్యాలు వస్తున్నాయి. ఆర్థిక రంగం నుండి ప్రభుత్వ ఉపసంహరణ పెరుగుతూ 'ప్రైవేటు' పాత్ర ఎక్కువవుతున్నది. దేశ సంపదలు స్వాతంత్ర్యోద్యమ దశకు, ఆ స్ఫూర్తికి ముందు నాటి కాలంలో ఏ విధంగానైతే కొందరి చేతిలో కేంద్రీకృతమై ఉండేవో తిరిగి ఆ స్థితి ఏర్పడుతున్నది. సంక్షేమవాదానికి ఆధారమైన వర్గాల పక్షాన ఆర్థిక రంగంలో జోక్యం కల్పించుకునే రాజకీయ ధోరణిగాని, నాయకత్వంగాని ఇపుడులేదు. ఆవిధంగా,15 ఏళ్ళ నుండి కొత్తఊపిరులు పోసుకుంటున్న ఆర్థిక ఉదారవాదపు వక్షస్థలం శతాబ్ది ఆఖరు నాటికి బాగానే పొంగింది. కొత్త శతాబ్దంలో ఆ పొంగులను కొలవటం ఇక ఎవరితరమగునో! ■





# పురపాలకసంఘ కార్యాలయము

## అల్వాల్, రంగారెడ్డి జిల్లా

### పురపాలకసంఘ ప్రజలకు విజ్ఞప్తి

1. ఆస్తిపన్నులు, నీటిపన్నులు మరియు లైసెన్సు రుసుములు సకాలములో చెల్లించి పుర పాలకసంఘ అభివృద్ధి కార్యక్రమములు చేపట్టుటకు సహకరించండి.
2. నూతనముగా లేక అదనముగా నిర్మాణములు చేసిన యజమానులు వారి పేరిట ఆస్తిప న్ను వేయించుకొనగలరు.
3. పట్టణములో వ్యాపారము చేయు యజమానులు వ్యాపార లైసెన్సు తప్పనిసరిగా పొం దవలెను.
4. పట్టణములో పరిశుభ్రత - పచ్చదనమునకు పాటుపడండి.
5. జన్మభూమి క్రింద మీవాటా ధనముతో మీ కాలనీని అభివృద్ధి పరచుకుని పట్టణ సౌభాగ్యానికి తో డ్పడండి.
6. ప్రతీ ఇంటికీ రెండు మొక్కలైనా నాటి వాతావరణ కాలుష్యనివారణ మరియు వాతావరణ స మతుల్యానికై పాటుపడండి.
7. త్రాగు నీటిని వృధా చేయరాదు.
8. చెత్తను చెత్తకుండీలలో మాత్రమే వేయవలెను.
9. ఎక్స్‌నోరా స్వయం పారిశుద్ధ్య పథకము క్రింద వారి వారి కాలనీల పరిశుభ్రత కొరకు మీవంతు కర్తవ్యంగా చెత్తాచెదారములు నిర్దేశిత స్థలాలలోనే వేయండి.
10. లోకాస్ట్ శానిటేషన్ పథకము క్రింద వారి స్వంత స్థలములోనే మరుగుదొడ్లను నిర్మించుకోండి.
11. మహిళలు పొదుపుజ్యోతి, డ్వాక్రా గ్రూపులలో చేరి స్వయం ఉపాధి పథకాలు ప్రారం భంలో మహిళ అభ్యున్నతికై పాటుపడండి.

**చిన్న కుటుంబం - చింతలేని కుటుంబం**

**ఇల్లాలి చదువు - ఇంటికి వెలుగు**

**యం. రవికుమార్,**
కమిషనర్,
అల్వాల్ పురపాలకసంఘం, రంగారెడ్డి జిల్లా.



భారతీయ లలితకళల వయసు వేల సంవత్సరాల్లోనే ఉంది.
అజంతా గుహల్లో, ఖజురహో శిల్పాల్లో, తాన్‌సేన్ గాత్రంలో,
అన్నమయ్య పదాల్లో, ఆంధ్రనాట్య లాస్యంలో, కూచిపూడి నాట్యంలో,
భరతనాట్య ముద్రల్లో, కర్నాటక బాణీల్లో, 'హిందుస్తానీ'లో భద్రంగా
చిరునామా చెక్కుకున్న భారతీయ లలితకళలపై
'పి.వి. రామ్మోహన్‌నాయుడు' క్లుప్త పరిచయం...

# కళాభారతి వెలుగునీడలు

నిప్పుతో రాజుకొన్న మానవుని జీవితం కళలతో ఎదిగింది. పెరిగింది. నేతవాడి నూలు రంగుల కలనేతలో..ఆభరణాల ఆకృతులలో, జవ్వనుల స్నానఘట్టాల గాన శృతులలో, సింధూనదీ...నైలూ నదీ...ఎక్కడైతేనేం..కళ మానవ సమాజంతో అల్లుకుపోయి నాగరిక ప్రస్థానపు మూలమలుపై మనిషి జీవితాన్ని రాగరంజితం గావించింది.

సిరిమువ్వల్లో సిరివెన్నెలలో కురిపించే నాట్యం, లాస్యం. మయూరాలకే నడకలు నేర్పే అమృతగాత్రం సంగీతం. కంటికి ఇంపైన చిత్రం, సంస్కృతికి ఆకృతులు దిద్ది నగిషీలై ఒదిగే శిల్పం అన్నీ మానవ ప్రవృత్తిలోని కళాచందనశాల తర్క వితర్కాలే... కళాపిపాస నుంచి జనియించిన గాంధర్వాలే..

భారతదేశం కళలకు పుట్టిల్లు. యుద్ధాలు, దండయాత్రల రాపిడిలో మన కళలూ సంకరమయ్యాయి. ఇది ఉత్తరభారతాన ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ముఖ్యంగా సంగీతంలో.

జాతి యావత్తుకు ఒకటే సంగీత శాస్త్రం వుండేది. దండయాత్రల ఫలితంగా ఉత్తరాదిన హిందుస్థానీ ఉద్భవించింది. యుద్ధాల బెడద అంతగా లేని దక్షిణాదిన ప్రాచీన సంప్రదాయపు సంగీత కళ చెక్కు చెదరకుండా నిలబడింది.

నవాబులు, అధికారులు, జాగీర్దార్ల మొప్పు కోసం, సైనికుల ఉల్లాసం కోసం మొదలైె హిందూస్థానీ సంగీతం వినోదప్రదంగా నిలిచింది. అదే దక్షిణ భారతాన భగవంతుడి అభిముఖంగా స్వర రస రేఖలు ప్రసరిస్తూ కర్నాటక సంగీతం భక్తి సంగీతంగానే ఎక్కువగా వాడుకలో వుంది.

తెలుగులో సంగీత రచనకు లక్షణం రాసిన తొలి వాగ్గేయకారుడు పద కవితా పితామహుడు అన్నమయ్య. అభ్యాస సంగీతానికి రూపమిచ్చిన వాగ్గేయ కారుడు కర్నాటక సంగీత పితామహుడు పురందర దాసు. వీరిద్దరూ 15వ శతాబ్దికి చెందిన వారు. తర్వాత 16వ శతాబ్దంలో నారాయణ తీర్థులు వ్రాసిన 'కృష్ణలీలా తరంగిణి' సంస్కృత యక్షగానంగా ప్రసిద్ధి పొందింది. ఇందులో నృత్య ప్రాధాన్యం తక్కువగా, నాటకీయత ఎక్కువగా వుండటంతో యక్షగానంగా సార్థకమైంది. 'అదిగో భద్రాది, గౌతమి' అంటూ గొంతెత్తిన భద్రాద్రి రామదాసు రాసిన పద కవితలు చాల గొప్పవి. భజన సంప్రదాయాన్ని సుస్థిరం చేసిన ధన్యజీవి ఆయన. 'కృతి' అనే సంగీత రచనకు పితామహుడు రామదాసు.

రాజా రవివర్మ పెయింటింగ్



రాధాకృష్ణుల శృంగారాన్ని 'కృతి' పరిచిన వాడు మహాకవి క్షేత్రయ్య. 1600-1680 మధ్య కాలానికి చెందిన క్షేత్రయ్య తంజావూరు కేంద్రంగా పాలించిన నాయక ప్రభువుల కొలువులో తెలుగు దేవదాసీలను ఆకర్షించాడు. అపూర్వమైన భరతనాట్యానికి పునాదు లేసాడు. నాట్యానికీ, సంగీతానికి పనికివచ్చే రచనలు చేసిన క్షేత్రయ్య పదాలు త్యాగరాజు, దీక్షితారు కృతుల స్థాయికి సరితూగుతాయి.

శ్యామశాస్త్రి, దీక్షితార్, త్యాగరాజులను కలిపి సంగీత త్రిమూర్తులుగా పేర్కొంటారు. వారి శిష్య ప్రశిష్యుల ద్వారా ప్రచారంలోకి వచ్చిన సంగీత శాస్త్రమే నేటికీ వాడుకలో వుంది. వారి సంప్రదాయానికి భిన్నంగా పాడుకొనే అవకాశమే లేదు. పండిత్ రవి శంకర్ సితారతో, హరిప్రసాద్ చౌరసియా వేణువుతో, శివశంకర్ శర్మ సరోద్‌తో, బిస్మిల్లాఖాన్ షెహనాయ్‌తో మనదేశ కళావారసత్వ సంపదను సుసంపన్నం చేసిన స్రష్టలు.

మంగళంపల్లి బాలమురళీకృష్ణ, నూకల చిన సత్యనారాయణ, పినాకపాణి, అన్నవరపు రామస్వామి, అక్లాజీరావు తదితరులు త్యాగరాజు ఫణితిని అనుకరిస్తున్నారు, ప్రచారం గావిస్తున్నారు.

వాయిలీనంతో స్వరమేళలు ఆవిష్కరించి సంగీత సరస్వతికి స్వరార్చనలు గావించిన సంగీత స్రష్టలు వడివేలు, తిరుక్కోడి కేవల్, కృష్ణయ్యర్, గోవింద స్వామి పిళ్లే, ద్వారం వెంకటస్వామినాయుడు, ద్వారం నరసింగరావు, చౌడయ్య మున్నగువారు. యూరోపియన్ వయొలిన్‌ను కర్నాటక సంగీతానికి వినియోగించిన ప్రయోగశీలి బాలస్వామి దీక్షితులు. ద్వారం నాయుడు కోసమే ఫిడేలు పుట్టింది అనేది నానుడి. పుట్టు గుడ్డి అయిన ద్వారం తన సంగీత రసావిష్కరణతో సకల ప్రపంచాన్ని జయించాడు.

నూకల చినసత్యనారాయణ, సిరిపల్లె వెంకటరమణ వంటి ఎందరికో విద్యాభ్యాసం చేసి సంగీతకారులుగా తీర్చిదిద్దారు.

ద్వారం వేంకటస్వామి నాయుడి వయొలిన్‌కు పక్క వాద్యాలుగా ప్రముఖ మార్దంగికుడు....కోలంకి వెంకటరాజు, సిరిపెల్లె (ఘటం)తో కచేరీ చేస్తే అది సంగీతం కాదు అమృత వర్షమే.

వీణావాదనంలో ఈమని శంకరశాస్త్రి, చిట్టిబాబులది శృతి పక్వమైన చేయి. వారి చేతి వేలి స్పర్శకే వీణలు అద్భుత సంగీత సరస్వతులుగా మారుతాయన్నది ప్రశంస. కానీ, వారి చాతుర్యానికి అదే ప్రతీక.

మృదంగంలో కోలంకి వేంకట్రాజు, పాలఘాట్ మణిఅయ్యర్, దండమూడి రామమోహన్‌రావు, పళని సుబ్రహ్మణ్యం పెద్ద పేర్లు. కానీ, కచేరీలలో పక్క వాయిద్యంగా మిగిలిన మృదంగాన్ని మధ్యకు తెచ్చిన ఘనత ఎల్లా వెంకటేశ్వరరావుదే. ఆయన నాదముని. లయరాజు. డొక్క శ్రీరామమూర్తి, శ్రీ

రుక్మిణీదేవి అరుండేల్ కూర్చిన ఒక నాట్య సన్నివేశం



పాద, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, నేదునూరి కృష్ణమూర్తి, శ్రీరంగం గోపాలరత్నం, ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి, ఎమ్.ఎల్.వసంతకుమారి, ఓలేటి వెంకటేశ్వర్లు, నూకల తమ గాత్ర సంగీత అభినివేశంలో రసజ్ఞులను రసగంగలో ముంచెత్తారు. హరిప్రసాద్ చౌరాసియా హిందూస్తానీలో వేణువు మ్రోయించినా, ప్రపంచం సీతారామ్, బలరామశర్మలు కర్నాటక ఊదినా అభిరుచి వున్న మనసులు రేపల్లె వాడల్లా పులకించి పోవలసిందే.

క్రీస్తుశకం మూడో శతాబం నాటికే నాట్యకళ తెలుగునాట పుట్టిందని పరిశోధకుల భావన. కూచిపూడి, భరతనాట్యం వంటి శాస్త్రీయ నృత్యలకు ఆధార గ్రంథమైన 'అభినయ దర్పణం' నందికేశ్వరుడు మూడు లేదా నాలుగవ శతాబ్దిలో రాసి వుంటాడని ప్రతీతి. 13వ శతాబ్దంలోనే తెలుగువాడి నృత్యానికి ప్రాధాన్యత కనిపిస్తోంది. 1213లో నిర్మితమైన రామప్ప దేవాలయంలో నృత్య భంగిమలు శిల్పాలుగా కనిపిస్తాయి. అదే ఏడాది జాయప సేనాని 'నృత్య రత్నావళి' రచించాడు. 1798-1832 మధ్య మహారాష్ట్ర రాజు అయిన రెండవ శంభోజి ఆస్థానంలో భరత నాట్యంకు రూపకల్పన జరిపినట్లు చెబుతుంటారు. అంతకు ముదు ఆ నాట్యరీతికి సదిర్ లేదా దాసి ఆటగా వాడుకలో వుండేది. 'కథాకళి', 'మణిపూరి', 'కథక్' 'ఒడిస్సీ'లు కూడా ఇంచుమించు అదే సమయంలో ఉద్భవించినవే. బ్రిజ్ మహారాజ్ కదక్ నృత్యానికి, కేలు మహాపాత్ర ఒడిస్సీకి తలమానికంగా నిల్చున్నారు. మాళివిక సారాబాయి, సోనాలి మాన్‌సింగ్ తమ నృత్య ప్రతిభతో ఖండంతరాలను చెరిపే సాంస్కృతిక రాయబారులుగా భాసిల్లారు.

కూచిపూడి అగ్రహారంలో పుట్టి ఖండాంతరాలకు వ్యాప్తిచెందిన నాట్యం కూచిపూడి. వెంపటి లక్ష్మీ నారాయణశాస్త్రి ఎన్నో ప్రయోగాలు చేసి ఆ నర్తన రీతిని బతికించారు. ఏకపాత్ర నృత్య ప్రదర్శనలు ఆయనే ప్రారంభింపచేశారు. భరతనాట్యంలో శ్రీమతి రుక్మిణీ అరండేల్, చంద్రలేఖ, పద్మా సుబ్రహ్మణ్యం, హేమామాలిని, వైజయంతిమాల, చిత్ర, వాణి గణపతి మున్నగువారు తమ పదనర్తనంతో భరతనాట్యాన్ని ప్రపంచపటంపై జిగేల్‌మని మెరిపించారు. కూచిపూడిలో వెంపటి చినసత్యం ఎన్నో ప్రయోగాలు చేసి, రసరంజకమైన రూపకాలు సృజియించి ఆ నర్తన రీతికి ఖండాంతరాలలో ప్రాచుర్యం కల్పించారు. కోరాడ నరసింహారావు తరతరాలకు గుర్తుండి పోయే నాట్య ప్రదర్శనలు చేశారు. శోభానాయుడు సిరిమువ్వలకే శోభగా నిలిచారు. 'భామా కలాపం'లో సత్యభామగా కనిపించి అష్టవిధ నాయికలను అభినయించి మధురానుభూతిని ప్రేక్షకులకు అందించిన అరుదైన ప్రతిభ ఆమెది. యామినీ కృష్ణమూర్తి, రాధారాజారెడ్డి, స్వప్న సుందరి, రత్నపాప, అలేఖ్య, సరళాకుమారి 'కూచిపూడి' ఒడిలో ప్రభవించిన నాట్య శిరోమణులు. నటరాజ రామకృష్ణ అపురూప సృష్టి ఆంధ్రనాట్యం. పతివాడ రాధిక, కళాకృష్ణ, పేరిణి రమేశ్ ఆయన శిష్యగణం.

'కావ్యేషునాటకం రమ్యమ్' 19వ శతాబ్దపు తొలి రోజుల్లో నాటకాలు దేశాన్ని, రాష్ట్రాన్ని రసకందాయంలో ముంచెత్తాయి. నాటక రంగంలో బెంగాలీలు అగ్రస్థానంలో వుండేవారు. శిశిర్‌కుమార్ బాధురి, అహిన్ చౌదురి నాటకాలు దేశవ్యాప్తంగా ప్రాచుర్యం పొందాయి. ద్విజేంద్రలాల్ రాయ్ నాటకాలు అన్ని భాషల్లోకి అనువాదమయ్యాయి. అలాగే మరాఠీలో బాల గంధర్వ, పట్వర్ధన్‌ల నాటకాలంటే ప్రజల్లో విపరీతమైన అభిమానం.

సురభి నాటక సమాజం ఈ అభినయ కళ కోసమే పుట్టిన కళాకారుల సమూహంగా వర్ధిల్లింది. సురభి కమలాదేవి, కడారు నాగభూషణం, కన్నాంబ వంటి అగ్రశ్రేణి నటరత్నాలను సురభి అందించింది. తిరుపతి వేంకట కవులు పద్యనాటకాలకే కొత్త సొగసులు అద్దారు. 'పాండవోద్యోగ విజయాలు వారి అపూర్వ సృష్టి. 'బావా ఎప్పుడు వచ్చితీవు' పద్యం పశులకాపరులకూ కంఠోపాఠం. చిలకమర్తి వారి గయోపాఖ్యానం కూడా ప్రజాదరణ పొందిన నాటకం. 1943 నుంచి తెలుగు నాటకరంగం కొత్త ఊపందుకొంది. ఆంధ్ర నాటక కళా పరిషత్ ఆధ్వర్యంలో కొత్త ప్రయోగాలు చోటు చేసుకున్నాయి. స్త్రీ పాత్రలను స్త్రీలే పోషించాలన్న నియమం వచ్చింది. ఆత్రేయ, డి.వి.నరసరాజు, కొత్తపాటి, భమిడిపాటి, గొల్లపూడి మారుతీరావు సాంఘీక నాటకాలు రాసారు. బళ్లారి రాఘవ, ఈలపాట రఘురామయ్య, డి.వి. సుబ్బారావు, షణ్ముఖి ఆంజనేయరాజు, పృధ్వీ వెంకటేశ్వరరావు, మాధవపెద్ది వెంకట్రామయ్య, పీసపాటి, అబ్బూరి, ఆచంట వెంకటరత్నం నాయుడు ఆ రోజుల్లో ఇంటింటి పేర్లు.

ప్రజానాట్య మండలి పుట్టింది. డాక్టర్ రాజారావు, సుంకర, వాసిరెడ్డి వంటి వారు సమాజమే నేపథ్యంగా నాటకాలు ప్రదర్శించి ప్రజలలో చలనం తెచ్చారు. 'రక్త కన్నీరు' నాగభూషణం తిరగని పల్లె లేదు, ప్రదర్శించని వేదికా లేదు. గురజాడ 'కన్యాశుల్కం' నాటకంతో జె.వి.రమణమూర్తి బృందం తెలుగునాట ప్రతిచోట తిరిగారు. కె.వెంకటేశ్వరరావు, ఎ.ఆర్.కృష్ణ, భానుప్రకాశ్, దేశిరాజు, రామస్వామి, చాట్ల శ్రీరామమూర్తి, గరిమెళ్ల ఆధునిక నాటకరంగం కోసం పనిచేశారు.

సినిమా తాకిడికి రంగస్థలం దాదాపు కూలిపోయింది. సుందరం, తనికెళ్ల భరణి 'గోగ్రహణం', 'కొక్కొరకో', 'జంబూద్వీపం'లతో కొంత కాలం రంగస్థలానికి కాపలాకాసారు. ప్రభుత్వం రంగస్థలాన్ని కార్పొరేషన్ చేసింది. ప్రభువుల ఆదరణలో మళ్లీ నాటకరంగం వెలుగుతుందేమో ఆశిద్దాం.

ప్రపంచ యుద్ధాలకూ, బెంగాల్ కరువుకూ, నగరీకరణకు మధ్య కళ కకావికలమైన పోయింది. కంప్యూటరీకరణ, ప్రపంచీకరణల నడుమ భారతీయ కళ వెలవెలాపోతోంది. వచ్చే కొత్త సహస్రాబ్దిలో భారతీయ కళ కొత్త వెలుగులతో సరికొత్త కాంతులతో కళకళలాడాలి. ■





వెండితెర మీద అందాలను ఆరబోసింది సినిమా. చందమామలోని ఆనంద సీమల్ని తెచ్చి చూపింది సినిమా. ముద్దబంతి పువ్వులూ, మూగకళ్ల ఊసులు, గుండెకైలూ, కళ్లలోని అగాధాలు... కాలేదేవీ సినీభాషకనర్హం. నవ్వించీ, కవ్వించీ, లాలించీ, మురిపించీ, సమ్మోహ నపరిచిన సినిమా భారతీయ జనజీవనంలో అవిభాజ్య భాగమైంది. డెబ్బయ్యేళ్ల కిందట మాటలు నేర్చిన భారతీయ సినిమా ధగధగలకు కోట్లాది జనం ఉత్తేజితులయ్యారు. 'ఆస్కార్'లతో కొలవలేనిదీ- దండిగా జనం పురస్కారాలందుకున్నదీ భారతీయ సినిమా. పంచరంగుల వెన్నెల జలతారుపై 'పి.వి. రామ్మోహన్‌నాయుడు' వీక్షణం...

# స్వప్న వ్యాపారాల మంత్ర విపణి

రాజ్‌కపూర్ నర్గీస్



'షోలే'లో సన్నివేశం



గాజు కెరటాల, వెన్నెల సముద్రాల మంత్రనగరి సినిమా. గత శతాబ్దంలో పుట్టిన సినిమా వడివడిగా నడకలు నేర్చింది. మాటలు నేర్చింది. ఏడాదికాయేడు కొత్త పుంతలు తొక్కుతూ సినిమా ఎన్నెన్నో చిత్రాలు చేసింది. భారతీయ సినిమా పుట్టింది 1913లో. 'రాజాహరిశ్చంద్ర' నిర్మించిన దాదా సాహెబ్ ఫాల్కే భారత చలన చిత్ర జనకుడిగా చరిత్ర పుటల్లో ఎక్కారు. ఫాల్కే కంటే ముందే భారతదేశంలో సినిమాకు ఊపిరి పోసినవాడు మన తెలుగువాడు రఘుపతి వెంకయ్య. ఫాల్కే చలన చిత్ర నిర్మాణంవైపు దృష్టి సారిస్తే ఈయన తన మద్రాసు ఫోటో స్టూడియోలో చిత్ర ప్రదర్శన శాఖను ప్రారంభించారు. విదేశాల నుంచి లఘు చిత్రాలను తెప్పించి దేశంలోని వివిధ నగరాలతో పాటు, బర్మా, సిలోన్‌లలో కూడా ప్రదర్శించేవాడాయన. తమ కుమారుడు ఆర్.ఎస్.ప్రకాశ్‌ను హాలీవుడ్‌లోని 'సిసిల్ బిడిమలే' వద్దకు దర్శకత్వంలో శిక్షణ నిమిత్తం పంపారు.

1913 మే 3వ తేదీన దాదా ఫాల్కే 'రాజా హరిశ్చంద్ర' మూకీ చిత్రాన్ని ముంబాయిలో ప్రదర్శించారు. 1917 నుంచి కలకత్తాలోనూ, 1919 నుంచి మద్రాస్‌లోను చిత్ర నిర్మాణ ప్రక్రియ మొదలైంది. తొలి తెలుగు మూకీ చిత్రం 'భీష్మ ప్రతిజ్ఞ (1922) ను నిర్మించిన తెలుగు బిడ్డ ఆర్.ఎస్.ప్రకాశ్. తెలుగు సినిమా తొలి హీరో, తొలి దర్శకుడు కూడా ఆయనే. ఆ తరువాత 'గజేంద్ర మోక్షం', 'మత్స్యావతారం', 'నందనార్' వంటి లఘు చిత్రాలను నిర్మించారు. మూకీ సినిమాల ప్రదర్శనలో సన్నివేశ స్ఫోరకంగా నేపథ్య సంగీతాన్ని-థియేటర్‌లో ఓ మూల ఆర్కెస్ట్రాను ఏర్పాటుచేసి వాయింపచేసేవారు. కథను వివరించడానికి కదకులు వుండేవారు. కస్తూరిశివరావ్, పేకేటి శివరామ్‌లు కదకులుగా ఆ రోజుల్లో ప్రేక్షకుల్లో పెద్ద క్రేజ్.

తెలుగు వారికి సినిమా అందించాలన్న తపనతో రఘుపతి వెంకయ్య ఆయన కుమారుడు ఆర్.ఎస్.ప్రకాశ్ తమ కష్టార్జితాన్నంతా పోగొట్టుకున్నారు. అయితే వారి వద్ద శిష్యరికం నెరపిన సి.పుల్లయ్య, వై.వి.రావు వంటి ఎందరో తరువాతి రోజుల్లో నిర్మాతలుగా, దర్శకులుగా రాణింపులోకి వచ్చారు. తొలి సినిమాలు అందించిన 'దాదాఫాల్కే' పేరిట జాతీయ స్థాయిలోనూ, 'రఘుపతి వెంకయ్య' పేరిట రాష్ట్ర స్థాయిలోనూ ప్రతిష్ఠాత్మక అవార్డులు ప్రభుత్వం ఏర్పాటుచేసింది.

**మాటలు నేర్చిన సినిమా**

కదిలే బొమ్మల సమ్మోహనం నుంచి తేరుకోకముందే సినిమాలకు మాటలొచ్చాయి. మూకీలు టాకీలయ్యాయి. 1931 మార్చి14న 'ఆలంఆరా' సినిమా మొదటిసారిగా మాట్లాడింది. తెలుగు సినిమాకు మాటలు నేర్పింది హెచ్.ఎం.రెడ్డి. 'భక్త ప్రహ్లాద' మొదటి తెలుగు టాకీ. సురభి కమలాబాయి లీలావతిగా, మునిపల్లె సుబ్బయ్య హిరణ్యకశపుడిగా నటించారు. చందామార్కుల మొద్దబ్బాయిగా నటించిన ఎల్.వి.ప్రసాద్ తొలి హాస్య నటుడు. అప్పటి నుంచి సినిమా రోజుకో మలుపు తిరుగుతూ, మెరుపులు విరజిమ్ముతూ తన ఉజ్వల చరిత్రను చాటుకొంది.

భారతీయ కళారీతులనన్నింటికీ వేదికగా ఉదయశంకర్ రూపొందించిన 'కల్పన', శాంతారాం 'డాక్టర్ కోట్నీస్ అమర్ కహానీ', కె.అబ్బాస్ 'ధర్తీకే లాల్', సొరబ్ మోడి 'సికందర్', 'పుకార్', ఎస్.ఎస్.వాసన్ 'చంద్రలేఖ', ☞

జె.బి.వాడియా 'కోర్టు డాన్సర్', రాజ్‌కపూర్ 'బర్సాత్', 'ఆగ్' వెలువడి సినీ మాయా జలతారును దేశవ్యాప్తంగా జిగేల్ మనిపించాయి. అదే సమయంలో తెలుగులో పౌరాణిక చిత్రాలు వెండి తెరను అలంకరించాయి. సి.పుల్లయ్య దర్శకత్వంలో పారుపల్లి సుబ్బారావు రాముడిగా, మంగళగిరి శ్రీరంజని సీతగా నటించిన 'లవకుశ' సంచలనం సృష్టించింది. జనం బళ్లు కట్టుకొని జాతరకు వెళ్లినట్టు ఆ సినిమాను చూశారు. అయితే, 1936లోనే 'ప్రేమ విజయం' అనే తొలి సాంఘీక చిత్రం విడుదలైంది. మరో రెండేళ్లకు 'రంగూన్ రౌడి' నాటకం ఆదారంగా హెచ్.ఎం.రెడ్డి, బి.ఎన్.రెడ్డి 'గృహలక్ష్మి' రూపొందించారు. 1938లోనే గూడవల్లి రామబ్రహ్మం 'మాలపిల్ల' వెండితెర చరిత్రలో సంచలనాంశమై జ్వలించింది. హరిజనోద్యమాన్ని కదావస్తువుగా తీసుకొని సామాజిక స్పృహతో చేసిన తొలి ప్రయోగం ఇది. గుడిపాటి వెంకటాచలం కదను సమకూర్చగా, ప్రఖ్యాత జర్నలిస్టు, రచయిత తాపీ దర్మరావు సంబాషణలను పొదిగారు. ప్రముఖ కవి బసవరాజు అప్పారావు గీతాలు రాశారు. ఇందరి హేమాహేమీల నిబద్దత, సృజనాత్మక కృషి ఫలితమే 'మాలపిల్ల'. జమీందారి విదానంపై ఎక్కుపెట్టిన దృశ్యాస్త్రం 'రైతుబిడ్డ'. త్రిపురనేని గోపీచంద్ సంబాషణలు రాసిన ఈ చిత్రం జమిందారులు, భూస్వాముల నిరసనవల్ల నిషేదానికి గురైంది. ఆ తరువాత వరకట్న సమస్యపై 1939లో 'వరవిక్రయం', వితంతు పునర్వివాహంపై 1940లో 'సుమంగళి' గూడవల్లి వారి ఆలోచనల నుంచి రూపుదిద్దుకొని నాటి సమకాలీన సమాజాన్ని జాగృతం చేశాయి.

1950వ ప్రాంతంలో కళాఖండాల ఆవిష్కరణ జరిగింది. శాంతారాం, బిమల్‌రాయ్, గురుదత్, రాజ్‌కపూర్, బి.ఎన్.రెడ్డి, కె.వి.రెడ్డి అనేకానేక కళాత్మక చిత్రాలకు రూపశిల్పులు. కె.ఆసిఫ్ 'మొఘల్-ఎ-ఆజం' తరతరాలకు గుర్తుండిపోయే కళాత్మక చిత్రం. బిఎన్‌రెడ్డి శిల్పించిన 'మల్లీశ్వరి' నాటికీ నేటికీ గుర్తుండిపోయే కళాఖండం.

ఎన్‌టి ఆర్,



భానుమతిల నటనావైదుష్యానికి సాలూరి వారి స్వర చమత్కృతి తోడై 'మల్లీశ్వరి' మనోహర దృశ్య కావ్యంగా భాసిల్లింది. వేదాంతం రాఘవయ్య దర్శకత్వంలో వెలువడిన 'దేవదాసు' శరత్ ప్రేమకద. నాగేశ్వరరావు, సావిత్రిల అద్భుత అభినయాలకు ఘంటసాల గొంతులో దొర్లాడిన పాటలు ఆ చిత్రాన్ని, ఆ పాత్రలను సజీవంగా నిలబెట్టాయి.



సత్యజిత్ రే

మహాభారతంలో శశిరేఖా పరిణయం విజయావారి 'మాయా బజార్' కథావస్తువు. తొలిసారిగా కృష్ణుడి పాత్రలో కనిపించిన ఎన్.టి.ఆర్. తెరవేల్పుగా ఆంధ్రుల నీరాజనాలు అందుకొన్నారు. ఎస్.వి.ఆర్., అక్కినేని, సావిత్రి, రేలంగిల నటన, పింగళివారి పాటలు, మాటలు, కె.వి.రెడ్డి దర్శకత్వ ప్రతిభ ఆ చిత్రాన్ని అగ్రశ్రేణి చిత్రంగా నిలబెట్టాయి. కె.వి.రెడ్డి 'పాతళభైరవి', 'పెద్ద మనుషులు', 'దొంగరాముడు', బి.ఎన్.రెడ్డి 'బంగారుపాప', 'రంగులరాట్నం', కమలకర కామేశ్వరరావు 'నర్తనశాల', ఆదుర్తి 'మూగమనసులు', ఎల్.వి.ప్రసాద్ 'మిస్సమ్మ', తాపీ చాణక్య 'రాముడు-భీముడు', బాపు 'సాక్షి', 'సీతా కళ్యాణం', విశ్వనాద్ 'సాగరసంగమం' తెలుగు చిత్ర జగతిలో మణి స్తంబాలు.కీలుగుర్రం, దేవదాసు, అమరశిల్పి జక్కన, బాటసారి, తోడికోడళ్లు, గుండమ్మ కథ, చిరంజీవులు, గులేభకావళి కద, సువర్ణసుందరి, లైలామజ్ను, శ్రీవేంకటేశ్వర మహత్మ్యం, చెంచులక్ష్మి, బాంధవ్యాలు, పునర్జన్మ, సీతా కళ్యాణం, శంకరాభరణం మున్నగు చిత్రాలు ఒక్కో వెన్నెల కెరటం.

**తారాతోరణం**

అశోక్ కుమార్, దిలిప్ కుమార్, దేవానంద్, రాజ్‌కుమార్, రాజేంద్రకుమార్, బలరాజ్ సహాని, సంజీవ్ కుమార్, శశికపూర్, జితేంద్ర, రాజేష్‌ఖన్నా, అమితాబ్ బచ్చన్, రిషికపూర్, శత్రుఘన్, మిధున్ చక్రవర్తి, అనిల్‌కపూర్, షారుఖ్ ఖాన్, సల్మాన్‌ఖాన్, అమీర్‌ఖాన్, అక్షయ్ కుమార్‌లు హిందీలో వెలిగిన హీరోలు, సూపర్ హీరోలు.

దేవికారాణి, నర్గీస్, నూతన్, వైజయంతీమాల, తనూజ, వహీదారహ్మాన్, లీలానాయుడు, హేమామాలిని, రేఖ, పర్వీన్‌బాబి, అశాపరేఖ్, జీనత్, సారికా, శ్రీదేవి, మాధురీ దీక్షిత్, జూహీ చావ్లా, మనీషా కోయిరాలా, కాజోల్, సోనాలి బింద్రే తమ అందచందాలతో వెండితెరపై తళుక్కుమన్న తారామణులు.

ఎస్.వి.రంగారావు, ఎన్.టి.రామారావు, అక్కినేని, కృష్ణ, కాంతారావు, రాజనాల, శోభన్‌బాబు, హర్నాద్, కృష్ణంరాజు, గుమ్మడి, గోవిందరాజు

సావిత్రి

ల, మహంకాళి వెంకయ్య, సి.ఎస్.ఆర్., రేలంగి, రమణారెడ్డి, వంగర, రాజబాబు, కస్తూరి శివరావ్, నాగభూషణం, రావుగోపాలరావు, ఆర్.నాగేశ్వరరావు, సత్యనారాయణ, చిరంజీవి, మురళీమోహన్, నాగార్జున, వెంకటేశ్, పవన్‌కళ్యాణ్‌లు తెలుగు నట పరివారంలో ముఖ్యులు. అలాగే కాంచనమాల, సూర్యకుమారి, సావిత్రి, కృష్ణవేణి, అంజలీదేవి, కన్నాంబ, రాజశ్రీ, దేవిక, శారద, షీలా, శ్రీదేవి, ఆరతి, కాంచన, జయసుధ, జయప్రద, చంద్రకళ, విజయనిర్మల, లక్ష్మి, సూర్యాకాంతం, రోజా, భానుప్రియ, విజయశాంతి, సౌందర్య, సిమ్రాన్‌లు ఒక్క తెలుగు నాటే కాకుండా దక్షిణాదిన కొందరు యావద్భారతాన్ని తమ అందచందాలతో నట, నర్తనాలతో సమ్మోహన పరిచిన లలనామణులు.

కన్నడంలో రాజ్‌కుమార్, విష్ణువర్ధన్, తమిళంలో ఎంజిఆర్, శివాజీ గణేషన్, జెమినీ గణేషన్, జయశంకర్, రజనీకాంత్, కమలహాసన్, విజయ్, అజిత్, కార్తిక్, మలయాళంలో ప్రేమ్‌నజీర్, మధు, మమ్ముట్టి, మోహన్‌లాల్, సురేష్ గోపీ, బెంగాల్‌లో ఉత్తమ్ కుమార్, ఉత్పల్‌దత్, మరాఠీలో దాదా కోండ్కె, సచిన్‌లు సినిమా మంత్రనగరి ధగదగల్లో పాలుపంచుకున్న కదానాయకులు.

రజనీకాంత్, చిరంజీవిలు బాక్సాపీస్ చుట్టుకొలతలను విపరీతంగా పెంచేసిన సూపర్‌స్టార్స్.

మల్లాది, సముద్రాల, ఆత్రేయ, ఆరుద్ర, సినారే, దాశరది, వేటూరి, వీటూరి, కొసరాజు వంటి కవిశ్రేష్టులు అనుభూతుల అంచుల వరకూ వెళ్లి రాసి పారేసిన గేయాలను ఏరుకొచ్చి, గుదిగుచ్చి వెన్నెట్లో ముంచి అమృత గుళికల్లా అందించారు స్వరబ్రహ్మలు సాలూరి రాజేశ్వరరావు, కె.వి.మహదేవన్, ఆదినారాయణరావు, సుసర్ల దక్షిణామూర్తి, మాస్టర్ వేణు, రమేష్‌నాయుడు, సత్యం, ఇళయరాజా, కీరవాణి, కోటి, హిందీలో మదన్ మోహన్, ☞

సి.రామచంద్ర, ఎస్.డి.బర్మన్, హేమంత్‌కుమార్, రఫీ, ముఖేశ్, మన్నాడే, లతా మంగేష్కర్, జేసుదాసు, ఆశాభోంస్లే, ఆర్.డి.బర్మన్‌లు జాతీయ సినీ సంగీత నందన వనంలో విరబూసిన స్వర పుష్పాలు, రాగ మందారాలు.

భానుమతి, ఘంటసాల, సుశీల, ఎస్.వరలక్ష్మి, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.బి.శ్రీనివాస్, చిత్ర, మనో, ఎల్.ఆర్.ఈశ్వరీ, జిక్కి, లీల, సౌందర్‌రాజన్, హరిహరన్‌లు తమ గంధర్వ గానంతో సినిమాను రాగరంజితం, మనోరంజితం గావించారు.

**కలల బేహారి రాజ్ కపూర్-**
**సత్య జీవన పథికుడు 'రే'**

కలలను, అనుభూతులను మనోహర దృశ్య కావ్యాలుగా మలచి గుండెలోతుల్లో మమతాను రాగాలను గుబాళింప చేసిన రాజ్‌కపూర్ 'రంగురంగుల కలల బేహారి'. శ్రీ420, బర్సాత్, ఆహ్, మేరానామ్ జోకర్, బాబీ, రామ్‌తేరి గంగా మెయిలీ ఆయన చిత్రిక పట్టిన కలల చిత్రపటాలు.

వాస్తవ జీవన గాథలను తెరకెక్కించిన చిత్రకళా దార్శనికుడు సత్యజిత్‌రే. బెంగాల్ కరువు తదితర అంశాల ప్రభావంతో వాస్తవ వాదాన్ని ప్రతిపాదికగా ఆయన 'పథేర్ పాంచాలి' నిర్మించారు. భారతీయ వాస్తవ చిత్రాల గమనానికి 'పదేర్ పాంచాలి' స్ఫూర్తి ప్రదాతగా నిలిచింది. అంతకు ముందు చేతన్ ఆనంద్ 'నీచానగర్', బిమల్‌రాయ్ 'దో భీగా జమీన్', రిత్విక్ ఘటక్ 'నాగరిక్', నిమాయ్ ఘోష్ 'చిన్నమ్మూల్' నిర్మించినా 'పథేర్ పాంచాలి' మాత్రమే ఉద్యమ స్ఫూర్తితో నవీన పందానికి నాంది పలికింది.

**ఉద్యమంగా సినిమా**

రే మార్గంలో కొంచెం ముందు వెనుకగా బెంగాల్ నుంచి రిత్విక్ ఘటక్, మృణాల్‌సేన్ తమ చిత్రాలతో రియలిస్టిక్ సినిమాకు ఊపిరి పోశారు. వీరి ప్రభావంతో గౌతం ఘోష్, బుద్ధదేవ్‌దాస్ గుప్తా, అపర్ణాసేన్, ఉత్పలేందు చక్రవర్తి ఇంకా ఎందరో నవ్య సినిమాకు రంగులద్దారు. పట్టాభి 'సంస్కార' కన్నడంలో నవ్య సినిమా ఉద్యమానికి శ్రీకారం చుట్టింది. బి.వి.కారంత్ గిరీష్ కర్నాడ్, నాగాభరణ, ప్రేమ కారంత్, గిరీష్ కాసరవెల్లి, కంవేశ్‌లు తమ వంతు పాత్రను పోషించారు. అటు మలయాళంలో ఆదూరు గోపాలకృష్ణన్, అరవిందన్, జాన్ అబ్రహం, షాజి కరుణ్, కె.ఆర్.మోహనన్, టి.వి.చంద్రన, జార్జి, లెనిన్ రాజేంద్రన్, బాలచంద్ర మీనన్‌లు నవ్య సినిమాకు తమ వెర్రి గొంతునిచ్చి మోసారు.

తెలంగాణా ఫ్యూడల్ కథలను తెరకెక్కించిన దర్శకులు శ్యాం బెనిగళ్ 'అంకుర్', 'నిశాంత్', 'మంథన్', 'భూమిక', 'మండి'లు ఆయన మేధస్సులో పూచిన వెలుగు రేణువులు. గోవింద్ నిహలానీ, మణికౌల్, కేతన్ మెహతా, సయీద్ మీర్జా, సాయి పరంజపే, ఎం.ఎస్.సత్యు, ముజఫర్ ఆలీ, రవీంద్ర ధర్మరాజ్, అవతార్ కౌల్, కల్పనాలాజ్మీలు హిందీలో వాస్తవ చిత్రాల సరళికి బాటలువేశారు.

బి.ఎస్.నారాయణ, బి.నర్సింగ్‌రావులు తెలుగులో నవ్యచిత్ర ఉద్యమానికి ఆనవాళ్లు. 'దాసి', 'మట్టి మనుషులు' చిత్రాలలో నర్సింగ్‌రావు జాతీయ స్థాయిలోకి తెలుగు నవ్య చిత్రాన్ని తీసుకెళ్లారు. కె.బి.తిలక్, దాసరి నారాయణరావు కూడా ఆలోచింప చేసే కథాంశాలతో సినిమాలు తీసారు.

శ్రీధర్, ఆదుర్తి, ఎస్.ఎస్.వాసన్, పుట్టణ్ణ, బాలచందర్, కె.విశ్వనాథ్, బాపు, సింగీతం శ్రీనివాసరావు, ప్రత్యగాత్మ, సి.ఎస్.రావు, వి.మధుసూదన్ రావు, భారతీరాజా, కె.రాఘవేంద్రరావు, భాగ్యరాజా, భరతన్, ప్రతాప్ పోతన్ తదితరలు దక్షిణ భారతాన చలనచిత్ర వైభవానికి తమ వంతు సాయం చేసిన దర్శకులు.

హిందీలో ప్రకాశ్ ఝా, యాష్ చోప్రా, గుల్జార్, మన్‌మోహన్ దేశాయ్, జి.పి.సిప్పి, బాసుఛటర్జీ తదితరులు ఎన్నో విజయవంతమైన చిత్రాలు నిర్మించి ఫార్ములా సినిమాను శక్తివంతం గావించారు.

మాధురీ దీక్షిత్



**షోలే ఒక సంచలనం**

1976లో విడుదలైన 'షోలే' భారతీయ చలన చిత్రచరిత్రలో ఓ సువర్ణాధ్యాయం. వ్యాపార సూత్రాలు దండిగా వున్న సృజనాత్మక చిత్రరాజం షోలే. అమితాబ్ బచ్చన్, ధర్మేంద్ర, హేమామాలిని, జయ బాధురీ, సంజీవ్ కుమార్ వంటి అగ్రతారాగణం, అమేయమైన సాంకేతిక పరిజ్ఞానాలను మేళవించిన ఈ చిత్రం సినీ అభిమానులను మాయా జగత్తులోకి తీసుకెళ్లి నిలబెట్టింది. విలన్‌గా నటించిన అమ్జాద్ ఖాన్ చిత్రంతో తారాపథంలోకి దూసుకుపోయాడు. అదే సమయంలో కొత్త తారాలతో హంగు ఆడంబరాలు ఏమీ లేకుండా తీసిన రాజశ్రీ వారి సంగీత ప్రేమ కావ్యం 'గీత్‌గాతాచల్' కూడా సంచలన విజయం సాధించింది. తరానా, సావన్‌కో ఆనేదో, చిత్‌చోర్, రజనీగంధ, గోల్‌మాల్ వంటి లోబడ్జెట్ సినిమాలు కూడా వసూళ్లలో పెద్ద స్థానాలు పొందాయి.

టివి వచ్చింది. అయినా చక్కటి ప్రేమకథలకు, సంగీత భరిత కథాంశాలకు నూనత ఒరవడి కథలను ప్రేక్షకులు ఎప్పుడూ ఆదరిస్తారని నిరూపిస్తూ 'హమ్ ఆప్‌కే హై కౌన్', 'మైనే ప్యార్ కియా' 'దిల్‌తో పాగల్ హై' 'దిల్‌వాలే దుల్హన్‌కో లేజాయేంగే' 'పరదేశ్', 'రోజా' 'జీన్స్' 'ప్రేమదేశం' 'జంటిల్‌మన్' చిత్రాలు నిలబడ్డాయి. శివ, సత్యలతో రామ్‌గోపాల్‌వర్మ, బండిట్‌క్వీన్‌తో శేఖర్‌కపూర్, రోజాతో మణిరత్నం జాతీయ స్థాయిలో పేరుపొందారు. జీన్స్ శంకర్, అంతఃపురం కృష్ణవంశీలు సంచలనాలకు ప్రతీకలుగా నిలబడ్డారు. ఇదంతా ఒకెత్తయితే అతి తక్కువ బడ్జెట్‌తో హైదరాబాద్ బ్లూస్ సినిమాతో అంతర్జాతీయ మార్కెట్‌లో లాభాలు, ప్రఖ్యాతినార్జించిన నగేష్ కొకునూర్ సంచలనాలకే సంచలనం. 21వ శతాబ్దం సినిమాకు కొత్తదారులు వేసింది ఈయనే. ఆదారి వెంట ఇప్పటికే డాలర్ డ్రీమ్స్‌తో శేఖర్ కమ్ముల, చలో అమెరికాతో పియూష్ ఝా విజయపథం చేశారు. మరికొందరు సిద్ధమవుతున్నారు. సినిమా కళగా, సినిమా వ్యాపారంగా సినిమా జీవితంగా, సినిమా ఉద్యమంగా రూపాంతరాలు చెందింది. కాలానుగుణంగా దాని ఆకృతులు అదే దిద్దుకొంది. కొత్త శృతులు జత చేసుకుంది. కొత్త శతాబ్దంలోకి క్రొంగొత్త తళుకులతో ముందుకు సాగుతోంది. ■

వందల ఏళ్లపాటు కొనసాగిన గురుకుల విద్యావిధానం ఇంగ్లీషు వాళ్ల రాకతో గుమస్తాల తయారీ విద్యావిధానంగా మారిపోయింది. గత పది పదిహేనేళ్లుగా విద్యారంగం వృత్తి విద్యాకోర్సుల వెంట పరుగులు తీస్తోంది. ఈ వ్యామోహంలో సామాజిక శాస్త్రాలు కొడిగట్టిన దీపాల్లా మిణుకు మిణుకుమంటున్నాయి.

భారతీయ విద్యారంగ పరిణామంపై

'శివప్రసాద్, సత్యప్రకాశ్, వెంకటరామిరెడ్డి'ల అధ్యయనం...



# అక్షరాస్యతకు కంప్యూటర్ కొలమానం

వెయ్యేళ్ల కాలగమనంలో భారతీయ విద్యారంగం అనేక ఆటుపోట్లకు గురికావడంతోపాటు విప్లవాత్మక మార్పులకు వేదికయ్యింది. అయితే, గడచిన దశ శతాబ్దాల కాలంలో కేవలం చివరి రెండు శతాబ్దాల్లోనే మార్పులన్నీ సంభవించడం విశేషం. గురువు కేంద్రంగా, ఉపాధ్యాయుడికి సేవలు చేయడమే విద్యార్జనకు చెల్లించే మూల్యమని భారతీయ విద్యావిధానం పదో శతాబ్దం నుంచి దాదాపు 17వ శతాబ్దం చివరి వరకు కొనసాగింది. అయితే, తురుష్కులు (ముస్లింలు), పర్షియన్లు, డచ్చి, పోర్చుగల్, బ్రిటన్ తదితర దేశాల దాడులు, యుద్ధాలు, అంతర్గత కలహాల కారణంగా అన్ని రంగాల్లో తీవ్రమైన మార్పులు వచ్చినట్లే భారతీయ విద్యారంగంలో కూడా విప్లవాత్మక మార్పులు చోటుచేసుకున్నాయి. భారతీయ విజ్ఞాన, శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానానికి చెందిన అమూల్య గ్రంథాలు, పుస్తక భాండాగారాలు, తాళపత్ర ప్రతులు కాలగమనంలో చాలా వరకు కలిసిపోయాయి. యుద్ధాల కారణంగా కూడా శత్రువుల దాడుల్లో భారతీయ విజ్ఞాన సాధనాలు, గ్రంథాలు నాశనమయ్యాయి. అయితే, ఎన్ని ఆటుపోట్లు ఎదురైనా బారతీయ సంప్రదాయ జీవనం, సంస్కృతితో సమ్మిళితమైన విద్యావిధానం సజీవంగా మనుగడ సాగిస్తూ దశ శతాబ్దాలు ముందుకు నడిచింది. అయితే, 19వ శతాబ్దంలో బ్రిటిష్ పాలకుల విధానాలు, మెకాలే విద్యావిధానం అమలుతో భారతీయ విద్యావిదానం తీవ్ర మార్పులకు గురైంది. అప్పటి వరకు మాతృభాషలో సాగిన విద్యాబోధన ఇంగ్లీషు ప్రభావానికి గురికావడంతోపాటు మెడిసిన్, ఇంజనీరింగ్, లా తదితర కోర్సులు పూర్తిగా ఆంగ్ల మాధ్యమంలోనే బోధనతో ఉన్నాయి. ఆ తర్వాత 20వ శతాబ్దం మధ్యభాగం నుంచి పాశ్చాత్య దేశాల విపరీత సంస్కృతి భారతీయ విద్యావిధానంపై తీవ్ర ప్రభావం చూపింది. సమాచార, ప్రసార మాధ్యమాల్లో వచ్చిన విప్లవాత్మక మార్పులు, పాశ్చాత్య దేశాల సంస్కృతి తదితర అంశాల కారణంగా భారతదేశ విద్యారంగంలో 20వ శతాబ్దం చివర్లో పెను మార్పులు సంభవించాయి. వేలాది సంవత్సరాల నుంచి విజ్ఞానానికి పునాదులుగా నిలిచిన సామాజిక, భాషా శాస్త్రాల అస్తిత్వాన్ని సైతం ప్రశ్నించే విధంగా పరిస్థితులు ఉద్భవించాయి. టి.వి.లు, ఇంటర్‌నెట్, ఇతర ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ సాధనాలతో భారతీయ విద్యారంగం 21వ శతాబ్దంలో మరెన్నో మార్పులకు గురికాబోతుందనడంలో ఎలాంటి సందేహం లేదని విద్యావేత్తలు అంటున్నారు. అయితే, సంప్రదాయమైన సమాజం, అధిక జనాభా, విబిన్న మతాలు, కులాలు, అనేక తారతమ్యాలు కలిగిన భారతదేశ సమాజానికి పాశ్చాత్య ధోరణులు, విదేశీ విద్యావిధానాలు ఎంతవరకు సరిపోతాయనేది చూసుకొని వాటిని అమలు చేయాలని, లేకుంటే భారతీయ సమాజం తీవ్ర సంక్షోభానికి గురై అనేక విపత్కర పరిస్థితులు సంభవిస్తాయనడంలో ఎలాంటి సందేహం లేదని విద్యావేత్తలు అభిప్రాయపడుతున్నారు.

ఉస్మానియా ఆర్ట్స్ కళాశాల



**భారతీయ విద్యారంగాన్ని మలుపు తిప్పిన తత్వవేత్తలు, విద్యావేత్తలు**

భారతీయ విద్యారంగంపై తమ ఆలోచనా తరంగాలతో ప్రగాఢ ప్రభావాన్ని కలుగజేసిన విద్యావేత్తలు, తత్వవేత్తలు ఎంతోమంది ఉన్నారు. అయితే గడిచిన వేయేళ్ల కాలంలో కేవలం 17వ శతాబ్దం తర్వాత మాత్రమే విద్యారంగాన్ని ప్రభావితం చేసిన చెప్పుకోదగ్గ తత్వవేత్తలు, విద్యావేత్తలు జీవించారు. తమ భక్తి ఉద్యమాలు, ప్రసంగాలతో కబీర్, గురునానక్, జైదేవ్, తులసీదాస్, అరబిందో, స్వామి దయానంద సరస్వతి, స్వామి వివేకానంద భారతీయ విద్యారంగంపై ప్రగాఢ ప్రభావాన్ని కలుగచేశారు. తెలుగు వ్యాకరణాన్ని అందించి చిన్నయసూరి చరిత్రలో నిలిచిపోయారు. ఆ తర్వాత ఆదునిక భారత దేశంలో బాలగంగాధర్‌తిలక్, రవీంద్రనాథ్ టాగోర్, గోపాలకృష్ణ గోఖలే, మదన్ మోహన్ మాలవ్యా, మహాత్మా గాంధీ, అంబేద్కర్, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్, అబ్దుల్ కలాం ఆజాద్, జాకీర్ హుస్సేన్, రఘుపతి వెంకటరత్నం నాయుడు, కట్టమంచి రామలింగారెడ్డి, ఆచార్య జి.రామిరెడ్డి, డాక్టర్ కొఠారి, ప్రొఫెసర్ లక్ష్మణ్ స్వామి మొదలియార్, ప్రొఫెసర్ సి.పి.రామస్వామి అయ్యర్, జె.పి.నాయక్, పండిట్ నెహ్రూ, ఇందిరాగాంధి, రాజీవ్‌గాంధి, పి.వి.నరసింహారావు తదితరులు విద్యారంగాన్ని ప్రభావితం చేసిన వారిలో ఉన్నారు. నైతిక విలువలతో కూడి ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించే విధంగా విద్య ఉండాలని స్వామి వివేకానందుడు ఘోషించారు. స్వేచ్ఛాయుతమైన వాతావరణంలో విద్యాభ్యాసం జరిగినప్పుడే జ్ఞానం వికసించి సమగ్ర వ్యక్తిత్వం అలవడుతుందని అరవిందుడు, నోబెల్ బహుమతిగ్రహీత గురుదేవులు రవీంద్రనాథ్ టాగోర్ ప్రవచించారు. నైతిక విలువలతోపాటు అహింస, శాంతి, సామరస్యం, సోదరభావం, సేవ, ఆధ్యాత్మిక భావాలను పెంపొందించేదే నిజమైన విద్య అని మహాత్మగాంధీ ఉపదేశించారు. తిలక్, గోఖలే, మాలవ్య హిందూ ధర్మాలు, సంస్కృతి ఆధారంగా విద్యా బోధన జరగాలని కోరారు. డాక్టర్ సర్వేపల్లి భారతీయ తత్వ పునాదులపై ☞



విద్యాబోధన జరగాలని చెప్పారు. సమానత్వం, సామాజిక న్యాయం పునాదులపై విద్యావకాశాలు అందరికీ అందుబాటులో ఉండాలని, విద్యా బోధన జరగాలని డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ కోరారు. కేంద్రంలో మొట్టమొదటి విద్యా మంత్రి అబ్దుల్ కలాం ఆజాద్, రాష్ట్రపతిగా పనిచేసిన జాకీర్ హుస్సేన్, కట్టమంచి రామలింగారెడ్డి, పండిట్ నెహ్రూ, ఇందిరాగాంధి, రాజీవ్‌గాంధీలు ఆదునిక శాస్త్ర సాంకేతిక మార్పులు, విజ్ఞాన పునాదులపై విద్యా బోధన జరగాలని కోరారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు క్రమశిక్షణతో కూడిన విద్యా విధానం కోసం పాటుపడ్డారు. భారతీయ విద్యారంగంలో వినూత్నమైన మార్పులకు నాంది పలికిన డాక్టర్ కొఠారి కమిషన్ (1964-66) ప్రాదమిక విద్యారంగానికి ప్రాధాన్యత ఇచ్చింది. అంతకు ముందు ఏర్పాటైన డాక్టర్ సర్వేపల్లి రాదాకృష్ణన్ కమిషన్,ప్రొఫెసర్ లక్ష్మణస్వామి మొదలియార్ కమిషన్ విద్యారంగంలో సంస్కరణలు, మార్పులు అవసరాన్ని సూచించాయి. ఆచార్య కట్టమంచి రామలిం గారెడ్డి గ్రామీణ ప్రాంతాలకు ఉన్నత విద్యావకాశాల విస్తరణ గురించి పాటు పడ్డారు. ఆచార్య జి.రామిరెడ్డి దూరవిద్య ద్వారా ఉన్నత విద్యావకాశాలను గ్రామీణ, పేద, మధ్యతరగతి వర్గాలకు అందుబాటులోకి తెచ్చేందుకు విశేషంగా కృషి చేశారు. 1986లో అప్పటి ప్రధాని రాజీవ్‌గాంధి నేతృత్వంలో జాతీయ నూతన విద్యావిధానం అమలులోకి రావడం చెప్పుకోదగ్గ అంశం. ఆ తర్వాత ప్రదానమంత్రిగా పనిచేసిన పి.వి. నరసింహారావు ఉన్నత విద్యారంగంలో సైతం సంస్కరణలు చేపట్టి విస్తరణ కోసం ప్రైవేటీకరణను ప్రోత్సహించారు.

## విద్యారంగంలో మైలురాళ్ళు

*10వ శతాబ్దం నుంచి 14వ శతాబ్దం వరకు-*

వేదవిద్య, ఉపనిషత్తులు, సంస్కృత భాషలో బోధన జరిగేది. గురుకులాల్లో విద్యాబోధన, మత గురుకుల చేతుల్లో విద్యారంగం ఉండేది.

*15వ శతాబ్దం నుంచి 18వ శతాబ్దం వరకు-*

చర్చి, మసీదులు, దేవాలయాలు విద్యారంగంలో కీలకపాత్ర పోషణ, వివిద దండయాత్రలు, యుద్ధాలు, విదేశీ దాడుల ప్రబావానికి భారతీయ విద్యారంగం తీవ్రంగా గురై తన సహజసిద్ధ స్వరూపాన్ని, అస్తిత్వాన్ని కోల్పోవడం, బారతీయ విద్యారంగంలో ఈస్టిండియా కంపెనీ (బ్రిటన్)తో పాటు డచ్, పోర్చుగల్ తదితర వారి జోక్యం పెరగడం, స్వదేశీ సంస్థానాలు, సామంత రాజులు, జమిందార్ల ఆజమాయిషీలో విద్యారంగం, పాశ్చాత్య దేశాల్లో యూనివర్సిటీ విద్య ఆరంబం, ప్రసిద్దికెక్కిన కొలంబియా, కేంబ్రిడ్జ్, ఆక్స్‌ఫర్డ్, లండన్, హార్వార్డ్, కైరో తదితర యూనివర్సిటీల స్థాపన, సామాజిక శాస్త్రాలకు తోడు టెక్నాలజీ కోర్సులు ప్రారంభం.

*19 నుంచి 20వ శతాబ్దం వరకు-*

భారతీయ విద్యారంగంలో ఈస్ట్ ఇండియా కంపెనీ పాత్ర గణనీయంగా పెరగడం, దాతలు, దాతృత్వ సంస్థలు విద్యారంగం అభివృద్దికి ముందుకు రావడం, ఈస్ట్ ఇండియా కంపెనీ స్థానంలో బ్రిటిష్ పాలన మొదలుకావడం, భారతీయ సంప్రదాయ విద్యావిధానాన్ని మెకాలే విద్యావిధానం (1835) అమల్లోకి రావడం, దేశంలో యూనివర్సిటీల విద్యావిదానం ప్రారంభం, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాల్లో యూనివర్సిటీలతో పాటు బెనారస్, అలహాబాద్, మైసూరు యూనివర్సిటీల స్థాపన, ఆంధ్రప్రదేశ్‌లో ఉస్మానియా (1918), ఆంధ్రా యూనివర్సిటీ (1927) స్థాపన.



*ప్రత్యేకంగా 20వ శతాబ్దం*
***(1900 నుంచి 1999 వరకు)***

మెడికల్, ఇంజనీరింగ్ కోర్సులకు ప్రాధాన్యత పెరగడం, విద్యారంగంలో శాఖోపశాఖలుగా విస్తరణ జరిగి సూపర్ స్పెషాలిటీ కోర్సులు ప్రారంభం, ఐఐటి, ఐఐఎం తదితర ప్రతిష్ఠాత్మక సంస్థల ఏర్పాటు, మేనేజ్‌మెంట్, లా, కామర్స్ కోర్సులకు గుర్తింపు, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ, కంప్యూటర్ విద్యరంగ ప్రవేశం, సంప్రదాయ విద్య స్థానంలో దూరవిద్య రంగం (డిస్టెన్స్ ఎడ్యుకేషన్) ప్రవేశం, ఉన్నత విద్య ప్రైవేటీకరణ, ఎంట్రెన్స్, పోటీపరీక్షల శకం ప్రారంభం, అందరికీ విద్య నినాదం.

### యూనివర్సిటీల శకం

భారతీయ విద్యారంగంలో గడిచిన వేయేళ్ల కాలగమనంలో యూనివర్సిటీల శకం ఆవిర్బవించింది. వేయ్యేళ్లకు ముందు, క్రీస్తుపూర్వం భారతీయ విద్యారంగంలో యూనివర్సిటీ స్థాయిలో ఉన్నతవిద్య అమల్లో ఉందనే దానికి నలందా విశ్వవిద్యాలయం నిదర్శనం. అయితే, ఆ తర్వాత కాలగమనంలో రాజుల యుగం ఆటుపోట్లకు గురికావటం, నిరంతర యుద్ధాలు, దాడులు, విదేశీ దండయాత్రలు, అంతర్గత కలహాలు తదితర కారణాల రీత్యా దేశంలో యూనివర్సిటీ విద్య చెప్పుకోదగ్గ గుర్తింపు పొందలేదు. భారతీయ విద్యారంగంలో యూనివర్సిటీ విద్యకు కేవలం 19, 20 శతాబ్దాల్లోనే చెప్పుకోదగ్గ గుర్తింపు లభించింది. అంతకుముందు యూనివర్సిటీ విద్య దాదాపుగా లేనట్లే అని చెప్పుకోవాలి. 1857లో సిపాయిల తిరుగుబాటు కారణంగా (ప్రదమ స్వాతంత్ర్య సంగ్రామం) ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన అంతరించి బ్రిటిష్ మహారాణి విక్టోరియా ప్రకటనతో బ్రిటిష్ పాలన ఆరంభమైంది. ఈ సంవత్సరంలోనే (1857) బ్రిటిష్ ప్రభుత్వం మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాల్లో మూడు యూనివర్సిటీలను లండన్ యూనివర్సిటీ తరహాలో స్థాపించడానికి నిర్ణయం తీసుకుంది. అంటే భారతీయ ఆధునిక విద్యారంగంలో 1857లో స్థాపితమైన ఈ మూడు యూనివర్సిటీలతోనే యూనివర్సిటీ విద్య ఆరంభమైందని చెప్పుకోవాలి. ఆ తర్వాత 1882లో పంజాబ్ యూనివర్సిటీ, 1887లో అలహాబాద్ యూనివర్సిటీ, 1916లో బెనారస్ హిందూ యూనివర్సిటీ, మైసూరు యూనివర్సిటీ, 1918లో ఉస్మానియా యూనివర్సిటీ, 1920లో అలీగఢ్ ముస్లీం యూనివర్సిటీ, లక్నో యూనివర్సిటీ, 1927లో ఆంధ్రా యూనివర్సిటీ ఏర్పాటయ్యాయి. హైదరాబాద్ సంస్థానంలో 1885లో ఏర్పాటైన నిజాం కళాశాల అప్పట్లో మద్రాసు యూనివర్సిటీకి అనుబంధంగా ఉండేది. ప్రస్తుతం దేశవ్యాప్తంగా దాదాపు 220 యూనివర్సిటీలు ఉన్నాయి.

యూనివర్సిటీ విద్యారంగం వ్యాప్తి చెందుతున్న దశలోనే 1960వ దశకం తర్వాత డీమ్డ్ యూనివర్సిటీల ఏర్పాటు ప్రతిపాదన అమల్లోకి వచ్చింది. ఇటీవల 1990వ దశకం తర్వాత మరో అడుగు ముందుకుపడి ఏకంగా ప్రైవేట్ యూనివర్సిటీల ఏర్పాటు ప్రతిపాదన పరిశీలనకు వచ్చింది. (ప్రైవేట్ యూనివర్సిటీల ఏర్పాటు బిల్లు గత మూడేళ్ల నుంచి కేంద్ర ప్రభుత్వ పరిశీలనలో ఉంది). సామాజిక శాస్త్ర కోర్సులతో పాటు ఇంజనీరింగ్, మెడిసిన్, టెక్నాలజీ, సైన్స్ కోర్సుల విస్తరణకు, వివిధ రంగాలు, అంశాలపై పరిశోధనలు పెరగడానికి యూనివర్సిటీలు గణనీయంగా కృషి చేశాయి. ఆదునిక భారత నిర్మాతగా ఘనతకెక్కిన ప్రదమ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మాటల్లో 'నా దృష్టిలో దేవాలయాలంటే యూనివర్సిటీలు, నీటిపారుదల ప్రాజెక్టులు మాత్రమే' అని చెప్పడం విశేషం. శాస్త్ర సాంకేతిక కోర్సుల్లో సూపర్ స్పెషలైజేషన్ పెరగడంతో పాటు అనేక కోర్సులు (దాదాపు వేయి) అమల్లోకి రావడం యూనివర్సిటీల కృషి ఫలితమే. యూనివర్సిటీల తరహాలో కేవలం పరిశోధనల కోసం శాస్త్రసాంకేతిక రంగంలో ఐఐసిటి, సిసిఎంబి, ఎన్‌జిఆర్ఐ, ఎన్ఐఎన్, ఐఐఎస్, డిఆర్‌డిఓ, ☞





డిఆర్‌డిఎల్, ఇస్రో, ఎన్ఎండిసి తదితర అనేక పరిశోధనా సంస్థలు సంబంధిత అంశాలపై ఆవిర్భవించడంతో విజ్ఞానశాస్త్రాలు కొత్త పుంతలు తొక్కాయి.

### ఓపెన్ యూనివర్సిటీల ఆవిర్భావం

1980వ దశకంలో భారతీయ విద్యారంగంలో అప్పటివరకు ఉన్న సంప్రదాయ యూనివర్సిటీల స్థానంలో ఓపెన్ యూనివర్సిటీలు ప్రారంభమై సరికొత్త అధ్యాయానికి నాంది పలికాయి. ఓపెన్ యూనివర్సిటీల స్థాపనకు ముందు సంప్రదాయ యూనివర్సిటీల్లోనే కరెస్పాండెన్స్ కోర్సుల పేరిట (1950 నుంచి) దూరవిద్య విధానం అమల్లోకి వచ్చింది. ప్రపంచంలో ఓపెన్ యూనివర్సిటీ శకం 1960వ దశకంలో బ్రిటన్‌లో ప్రారంభమై వివిధ దేశాలకు విస్తరించింది. 1982లో ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్సిటీ (ప్రస్తుతం అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీ) భారతీయ యూనివర్సిటీల చరిత్రలో ఒక మైలురాయి. (బారతీయ ఓపెన్ యూనివర్సిటీల ఏర్పాటు, విస్తరణకు దివంగత ఆచార్య జి.రాంరెడ్డి చేసిన కృషిని ఈ సందర్భంగా చెప్పుకోవాలి). ఆ తర్వాత 1985లో ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్సిటీ ప్రారంబమైంది. ప్రస్తుతం దేశంలో 11 ఓపెన్ యూనివర్సిటీలు ఉన్నాయి.

### కంప్యూటర్, ఐ.టి. విప్లవం

బారతీయ విద్యారంగంలో 1980వ దశకం చివర్లో వచ్చిన కంప్యూటర్, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ కోర్సులు విప్లవాత్మక మార్పులకు శ్రీకారం చుట్టాయి. వందల సంవత్సరాల నుంచి సంప్రదాయ రీతిలో కొనసాగుతున్న విద్యారంగంలో ఈ కోర్సులతో ప్రకంపనలు రేకెత్తాయి. వందలాది సంవత్సరాల చరిత్ర కలిగిన సామాజిక శాస్త్రాలు సైతం ఒక దశలో కంప్యూటర్, ఐటి కోర్సుల ముందు వెలవెలబోయే పరిస్థితి ఏర్పడింది. అయితే, సామాజిక, మౌలిక జీవన విధానానికి చెందిన సూత్రాలను కలిగి వేలాది సంత్సరాల చరిత్ర, సారం కలిగిన సామజిక శాస్త్రాలు ఎట్టకేలకు తమ ఉనికిని కాపాడుకోవడంలో విజయం సాధించాయి. 1990వ దశకం ప్రారంభంలో విజృంభించిన కంప్యూటర్, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ కోర్సుల ప్రభావం 1998 నాటికి తీవ్ర స్థాయికి చేరుకుంది. రానున్న రెండు దశాబ్దాల కాలంలో (2015 వరకు) కంప్యూటర్, ఐ.టి. కోర్సుల ప్రభంజనం నిరాఘాటంగా కొనసాగగలదని విద్యావేత్తలు, సాంకేతిక నిపుణులు అభిప్రాయపడుతున్నారు. 1999 నాటికి చదవటం, రాయటం వచ్చిన వారే అక్షరాస్యులు కారని, కంప్యూటర్ నాలెడ్జ్ ఉన్నవారే అక్షరాస్యులని, అది లేనివారు నిరక్షరాస్యులతో సమానమని భావించే పరిస్థితి ఏర్పడడం విశేషం. సామాజిక శాస్త్రాల కోర్సుల సిలబస్‌లో సైతం కంప్యూటర్ విద్యను చేర్చారు. ఇంజనీరింగ్, మెడిసిన్, లా, టెక్నాలజీ, మేనేజ్‌మెంట్, ఫైన్ ఆర్ట్స్ తదితర అన్ని కోర్సుల్లో కంప్యూటర్ ఒక పార్యాంశంగా మారడం ఆ రంగానికి ఉన్న ప్రాధాన్యతను చెప్పకనే చెబుతోంది. కంప్యూటర్, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీల్లో వచ్చిన వినూత్న మార్పుల పర్యావసానంగా రానున్న కాలంలో ఇంటర్‌నెట్‌లో యూనివర్సిటీలు ఏర్పాటు కానున్నాయి. ఇ-కామర్స్, ఇ-బిజినెస్, ఇ-బ్యాంకింగ్ తదితర పదాలు, కోర్సులు రోజురోజుకీ పుట్టుకువస్తున్నాయి.

### బోధనలోనూ ఎలక్ట్రానిక్ యంత్రాలే

కంప్యూటర్, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ రంగాల్లో వచ్చిన వినూత్న మార్పుల కారణంగా విద్యారంగంలో గురువు పాత్రకు ప్రాధాన్యత తగ్గుతోంది. గురువు స్థానంలో టేప్‌రికార్డర్లు, వీడియోలు, టి.వి.లు, టెలీ, వీడియో కాన్ఫరెన్స్‌లు వచ్చాయి. ఈ ప్రసార సాధనాలన్నింటికీ కేంద్రబిందువు ఉపగ్రహాలే. తరగతి గదిలో గురువు ముందు కొంతమంది విద్యార్థులు కూర్చొని బోధన, అభ్యాస ప్రక్రియలను కొనసాగించే పరిస్థితి ఆధునిక ప్రసార సాధనాల కారణంగా క్రమంగా కనుమరుగయ్యే స్థితి వచ్చింది. మరికొద్ది సంవత్సరాల్లో టేప్‌రికార్డర్లు, వీడియోలు, టి.వి.లకు సైతం కాలంచెల్లి కేవలం ఇంటర్‌నెట్ మాత్రమే రాజ్యమేలనున్నట్లు తెలుస్తోంది. వినడం, మాట్లాడడం, దృశ్యం, రాత, మెటీరియల్ కాపీయింగ్ తదితర వసతులతో పాటు దేశదేశాల్లోని సుదూర ప్రాంతాల్లో ఉన్న విజ్ఞానగనులను పరిశోధించి కావాల్సిన సమాచారాన్ని పొందే సౌకర్యం ఇంటర్‌నెట్‌లో ఉండడంతో అది ఏకైక ప్రత్యామ్నాయంగా మారుతోంది. ■



బహుళజాతి కంపెనీలు భారత్‌లాంటి దేశాల్లో కొత్త మార్కెట్లను సృష్టించుకున్నాయి. ఇంకా సృష్టిస్తాయి. దేశవాళీ కంపెనీలు బతికి బట్టకట్టాలంటే మార్కెటింగ్ రంగంలో విప్లవాత్మక మార్పులను అనుసరించక తప్పని స్థితి ఏర్పడింది. ఇంటర్‌నెట్ రంగప్రవేశంతో ప్రపంచ మార్కెట్ వినియోగదారుడి ఇంటిలోకే వచ్చింది. దీని ప్రభావంవల్ల భవిష్యత్తులో అసలు దళారీలేని మార్కెట్ వ్యవస్థ ఏర్పడనుందని 'ఎం.ఇ.వి. ప్రసాదరెడ్డి' అంచనా...

# మార్కెట్లలో మహావిప్లవం



ప్రపంచాన్ని నడిపించే అనేక ఆర్థిక సూత్రీకరణలు చేసిన ఆడమ్‌స్మిత్ మార్కెట్ శక్తుల లోపాలను ఎత్తిచూపుతూనే మార్కెట్ ఎంతటి మహత్తర శక్తో నిరూపించారు. మానవజాతి ఆదిమ, ఆటవిక దశలోని వేట నుంచి, సంచార వ్యవసాయ దశనుంచి, భూస్వామ్య వ్యవస్థకు, అక్కడ నుంచి ఉత్పత్తిదారుల పోటీ మార్కెట్ దశకు ఎలా పరిణామం చెందిందో ఆడమ్‌స్మిత్ వివరించారు. మార్కెట్ శక్తుల మధ్య పోటీవల్ల వనరులు సద్వినియోగం అవుతాయని, వేతనాలు ఆరోగ్యకరమైన స్థాయిలో గిరాకీని బట్టి నిర్ణయం అవుతాయని చెప్పారు. ఉత్పత్తి శక్తుల మధ్య సంబంధాలే నాగరిక సమాజంలోని వివిధ వ్యవస్థలను నిర్దేశిస్తాయని ఆయన స్పష్టం చేశారు. 1770 ప్రాంతంలో ఆయన చేసిన ప్రతిపాదనలు సూత్రీకరణలకు రెండు శతాబ్దాల పాటు కొంతమేర గ్రహణం పట్టినా సోషలిస్టు వ్యవస్థ ప్రపంచవ్యాప్తంగా కుప్పకూలడంవల్ల మళ్లీ మార్కెట్ శక్తులకు ప్రాధాన్యత హెచ్చింది.

**మార్కెట్లలో యుద్ధాలు**

గతంలో యుద్ధాలు దేశాలను ఆక్రమించడానికి, మార్కెట్లను స్వాధీనం చేసుకోవడానికి జరిగేవి. వర్తమానంలో యుద్ధాలు మార్కెట్‌లలోనే జరుగుతున్నాయి. చౌకగా, సమర్థంగా, నాణ్యమైన వస్తూత్పత్తి చేసి ప్రపంచ మార్కెట్లను కైవసం చేసుకోవడానికి ప్రతి దేశమూ ప్రయత్నిస్తున్నది. నిజానికి ఇలా ప్రయత్నిస్తున్నవి దేశాలు అనడంకంటే బహుళ జాతి కంపెనీలనడం సబబుగా ఉంటుంది. ఈ కార్పొరేట్ సంస్థల టర్నోవర్లు అత్యధిక దేశాల బడ్జెట్‌లకంటే చాలా ఎక్కువగా ఉన్నాయి. ధనబలం, మార్కెట్‌ను స్వాధీనం చేసుకునే నైపుణ్యంతో ఈ బహుళజాతి కంపెనీలు అనేక కొత్త మార్కెట్‌లను కైవసం చేసుకున్నాయి. అలాగే అనేక కొత్త మార్కెట్‌లను సృష్టించాయి. ఉదాహరణకు పదేళ్ల క్రితం ఇండియా రెడీమేడ్ వస్త్రాలకు మార్కెట్ చాలా పరిమితంగా ఉండేది.



కనీసం ఒక్కశాతం ప్రజలు కూడా రెడీమేడ్ దుస్తులను ధరించేవారు కాదు. అటువంటి మార్కెట్‌లోకి విదేశీ కంపెనీలు, బ్రాండ్‌లు ప్రవేశించి భారతీయ మార్కెట్‌ను కైవసం చేసుకోవడమే కాకుండా మార్కెట్ బాగా విస్తరించడానికి దోహదం చేశాయి. ప్రస్తుతం దేశప్రజల్లో కనీసం 25 శాతం మంది ఏదో రూపంలో రెడీమేడ్ వస్త్రాలను వినియోగిస్తున్నారు. ఇది రానున్న పది సంవత్సరాల్లో 75 శాతానికి పెరగవచ్చని అంచనా. ఈ మొత్తం పరిణామంలో పలు దేశీయ కంపెనీలు కూడా పుట్టుకువచ్చాయి. వస్త్రాల ప్రాసెసింగ్ మెరుగుపడింది. దుస్తులు కుట్టే టెక్నాలజీ అభివృద్ధి చెందింది. తాత్కాలికంగా దుస్తులు కుట్టే దర్జీలకు ఇబ్బందులు ఏర్పడినా లక్షలాది మందికి ఉపాధి సౌకర్యం ఏర్పడింది. బ్రాండ్లను ఏ విధంగా తయారుచేయాలి, కొత్త బ్రాండ్లను ఎలా ప్రవేశపెట్టాలి, ప్రజాదరణ ఎలా పొందాలి అన్న అంశాలను దేశీయ కంపెనీలు విదేశీ కంపెనీల నుంచి గ్రహించగలిగాయి.

### దేశీయ కంపెనీలకు మార్కెటింగ్ పాఠాలు

ఆర్థిక సంస్కరణల వల్ల దేశంలో ప్రవేశించిన అనేక వినియోగ వస్తువుల విక్రయానికి విదేశీ కంపెనీలు అనుసరించిన మార్కెటింగ్ పద్ధతుల వల్ల భారతీయ కంపెనీలకు అనేక కొత్త విషయాలు తెలిసాయి. బహుళ జాతి కంపెనీల ఆర్థిక పటుత్వానికి భయపడి 'థమ్స్ అప్' వంటి బ్రాండ్లను విక్రయించిన రమేష్‌చౌహాన్ లాంటి వ్యక్తులు తమ దేశీయ పరిజ్ఞానానికి కొత్త ఆలోచనలు జోడించి 'బిస్లెరీ' వంటి మినరల్ వాటర్‌ను భారీ బ్రాండ్‌గా రూపొందించడానికి నడుంకట్టారు. అకాయ్ టి.వి.ల అమ్మకంలో కొత్త పద్ధతులు ప్రవేశపెట్టి మీర్‌చందానీ అనే యువకుడు మొత్తం ఎలక్ట్రానిక్ వస్తువుల మార్కెటింగ్ స్వరూప స్వభావాలను మార్చివేశాడు. కొత్తకొత్త ఫైనాన్స్ స్కీములు, ఎక్స్ఛేంజ్ ఆఫర్లతో ప్రత్యర్థులను ఉక్కిరిబిక్కిరి చేశాడు. కన్జ్యూమర్ ఎలక్ట్రానిక్స్ రంగంలో పోటీ పెరగడం వల్ల వినియోగదారునికి ప్రత్యామ్నాయాలు ఏర్పడ్డాయి. 'కన్స్యూమర్ ఈజ్ ది కింగ్' అనే భావన బలపడింది.

### మార్కెట్‌పై ఇంటర్‌నెట్ ప్రభావం

టెక్నాలజీ విస్తరణ ముఖ్యంగా ఇంటర్‌నెట్, వెబ్‌సైట్‌ల విస్తరణ వల్ల మార్కెటింగ్ స్వరూప స్వభావాలే మారిపోనున్నాయి. వస్తు వినిమయ పద్ధతి కాలం నుంచి మార్కెటింగ్ అనేక రూపాలు సంతరించుకుంది. సంప్రదాయ మార్కెటింగ్ పద్ధతుల స్థానంలో బహుళజాతి కంపెనీలు అనేక ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టాయి. అయితే, పాత పద్ధతుల్లో ఉన్న అంశాలు మళ్లీ తిరిగి తిరిగి దర్శనమిస్తున్నాయి. పాతకాలంలో బట్టలను నెత్తిమీద, సైకిళ్లమీద తీసుకొని ఇంటింటికీ వెళ్లి అమ్మే పద్ధతి ఉండేది. ఇప్పుడు మళ్లీ 'డోర్ టు డోర్ సేల్స్', 'డైరెక్ట్ సేల్స్' ప్రత్యక్షమవుతున్నాయి.

సాంకేతిక పరిజ్ఞానం విస్తరించి, ప్రపంచమంతా గ్లోబల్ విలేజ్‌గా మారి ఇంటర్‌నెట్ మానవజాతి నాడీమండలంగా రూపొందడంతో మార్కెటింగ్ పద్ధతులు పూర్తిగా మారిపోనున్నాయి. ఏటా 9లక్షల కిలోమీటర్లు ప్రయాణిస్తూ దాదాపు అన్ని దేశాల్లోనూ ఉపన్యాసాలు ఇచ్చే డిజిటల్ గురువు నికోలస్ నెగ్రోపొంటే (మాసాచూట్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో మీడియా లాబొరేటరీ వ్యవస్థాపక డైరెక్టర్) అభిప్రాయం ప్రకారం భవిష్యత్తులో దళారీల ప్రాధాన్యత తగ్గుతుంది. కారు డీలర్లు, రియల్ ఎస్టేట్ ఏజెంట్లు వంటి వారికి భవిష్యత్తు లేదు. వాళ్ల వ్యాపారంలో కొనసాగాలంటే వినియోగదారులకు వ్యక్తిగతమైన సేవలు అందించాల్సి ఉంటుంది.

### పదాలకు తగ్గనున్న ప్రాధాన్యం

అమెరికాలో చిన్నపిల్లలు, 65 సంవత్సరాల వయస్సు దాటినవారు ఇంటర్‌నెట్‌ను ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. ఇండియాలో కూడా అదే పరిస్థితి క్రమంగా వచ్చి తీరుతుంది. పుస్తకాలకు, వార్తాపత్రికలకు, మేగజైన్లకు భవిష్యత్తు ఉందా, లేదా అన్న ప్రశ్నలు కొందరిలో తలెత్తుతున్నాయి. వాటి మార్కెటింగ్‌లో ఎటువంటి మార్పులు వస్తాయన్న ప్రశ్న కూడా వస్తున్నది. కానీ డిజిటల్ యుగం ప్రారంభం అయిన తర్వాత ప్రపంచమే ప్రతీ వ్యక్తిముందు ఆవిష్కరిస్తోంది. చిత్రాలకు, బొమ్మలకు ఉన్న ప్రాధాన్యత పెరిగి పదాలకు, వాక్యాలకు ప్రాముఖ్యత తగ్గిపోవచ్చు. ఇండియాలో ఇంటర్‌నెట్ వినియోగం పెరుగుతోంది. చర్చించే, ప్రశ్నించే అలవాటున్న జాతి కావడంవల్ల భారతీయులకు ఇంటర్‌నెట్ బాగా ☞





ఉపయోపగపడుతుంది. ఇంటర్‌నెట్ ప్రభావం తమ కంపెనీల మీద ఉండదని భావించే వారు పిచ్చి వాళ్ల స్వర్గంలో నివసిస్తున్నట్లే. వచ్చే సంవత్సరం ముగిసే నాటికి ప్రపంచవ్యాప్తంగా ఎలక్ట్రానిక్ కామర్స్‌ద్వారా మూడు ట్రిలియన్ డాలర్ల వ్యాపారం జరగనున్నది. అయినా, తమ మార్కెటింగ్, డిస్ట్రిబ్యూషన్ పద్ధతులు మార్చుకోవాల్సిన అవసరం లేదని ఎవరైనా భావిస్తే ఆ కంపెనీలకు భవిష్యత్తు లేదని నిర్ధారణకు రావచ్చు. ఇప్పటికే ప్రపంచంలో 15కోట్ల ఇంటర్‌నెట్ వినియోగదారులు ఉన్నారన్న వాస్తవాన్ని ఎవరూ మర్చిపోరాదు.

**ఇంటర్‌నెట్ ద్వారా టమోటాలు**

దళారీలకు కాలం చెల్లిపోతున్నదని నెగ్రోపాంటే హెచ్చరించాడు. దళారీ స్థానాన్ని ఇంటర్‌నెట్ పోషిస్తుందని, అందువల్ల ప్రస్తుతం బ్రోకరేజీ, దళారీ పనులు నిర్వహించేవారు క్రమంగా ప్రత్యామ్నాయాలు చూసుకోకతప్పదని సూచించాడు. అమెరికాలో టమోటాలకు వినియోగదారుడు 50సెంట్లు చెల్లిస్తుంటే అందులో 10సెంట్లు మాత్రమే రైతుకు చెందుతున్నాయి. ఈ టమోటాలు రైతు నుంచి వినియోగదారుణ్ణి చేరేసరికి ఎనిమిది దశలు దాటాల్సి వస్తుంది. ప్రతీ దశలోనూ ఐదు సెంట్ల కమీషన్ చేరడంతో టమోటా ధరలు పెరుగుతున్నాయి. భవిష్యత్తులో మార్కెట్‌కు దగ్గరలో ఉండే రైతు తనవద్ద ఉన్న టమోటాల బొమ్మను ఇంటర్‌నెట్‌లో వేస్తే గృహిణి తనకు నచ్చిన దరకు ఇంటర్‌నెట్‌లోనే బేరం చేసి ఆర్డర్ ఇవ్వవచ్చు. అలాంటి ఆర్డర్లను కొన్ని జమచేసుకొని రైతు టమోటాలను నేరుగా ఇళ్ళకు చేరవేయవచ్చు. లేకపోతే కూరగాయల రవాణాకు ఓ ప్రత్యేక ఏజెన్సీ ఏర్పడి రైతునుంచి వినియోగదారుడికి టమోటాను చేరవేయవచ్చు. ప్రస్తుత మున్న ఎనిమిది దశల స్థానంలో మూడుదశలే ఉండడం వల్ల రైతుకు మంచి రేటు, ఒకేఒక్క దళారీకి ఎక్కువ కమీషన్, వినియోగదారునికి చౌకగా టమోటాలు లభిస్తాయి. ఇది కేవలం టమోటాలకు మాత్రమే పరిమితం కాకుండా అన్ని వస్తువులకు, సరుకులకు విస్తరిస్తుంది. ప్రస్తుతం జరుగుతున్న టెలీమార్కెటింగ్ దీనికి తాజా ఉదాహరణ. దీనితో వ్యాపార సూత్రాలు, వ్యాపార స్వరూప స్వభావాలు మారిపోతాయి. కొరియర్ సర్వీసులకు గిరాకీ బాగా పెరిగే అవకాశాలున్నాయి. దళారీల సంఖ్య తగ్గినా సర్వీసు రంగంలో పనిచేసేవారి సంఖ్య పెద్దగా తగ్గకపోవచ్చు. వారు వినియోగదారులు ఇతర సేవలను అందించే పరిస్థితులు తలెత్తుతాయి.

పుస్తకప్రియులు భవిష్యత్తులో కూడా పుస్తకాల షాపుకు రావచ్చుగానీ ఇంటర్‌నెట్‌లో పుస్తకాలకు ఆర్డర్లు ఇవ్వడం చౌకగా ఉంటుంది. దీనితో పుస్తకప్రియులను ఆకర్షించడానికి పుస్తకాల షాపులు, ఇంటర్‌నెట్ కేఫ్, ఎక్స్‌ప్రెసో మెషిన్ వంటివి ఏర్పాటు చేయడం, పుస్తక ప్రియుల మధ్య స్నేహాన్ని పెంపొందించడానికి కృషి చేయడం తప్పదంటున్నారు నెగ్రోపొంటే. మందుల షాపులకు భవిష్యత్తు ఉండదని, ఔషధాలను కొరియర్ కంపెనీలు నేరుగా వినియోగదారులకు అందజేస్తాయని హెచ్చరిస్తున్నారు.

**కొరియర్ సర్వీసులకు మంచిరోజులు**

ఈ పరిణామాల వల్ల వస్తువులను, సరుకులను ఉత్పత్తి చేసేవారికి భవిష్యత్తులో సందిగ్ధ పరిస్థితులు ఏర్పడక తప్పదు. దీర్ఘకాలం విజయవంతంగా నడిచిన మార్కెటింగ్ చానెల్స్‌ను కాదని ఇంటర్‌నెట్, కొరియర్ సర్వీసుల ద్వారా వ్యాపారం చేయటం వల్ల డిస్ట్రిబ్యూటర్లకు, డీలర్లకు, రిటైలర్లకు తప్పక ఆగ్రహం వస్తుంది. అయితే, ఇది అనివార్య పరిణామమని అన్ని వర్గాలు క్రమంగా గుర్తిస్తాయి. ప్రస్తుతం అమలులో ఉన్న మార్కెటింగ్ చానెల్స్‌లోని కంపెనీలతోనూ, వ్యక్తులతోనూ లౌక్యంగా వ్యవహరిస్తూ ఇంటర్‌నెట్ ద్వారా జరిగే వ్యాపారం బాగా పుంజుకునే వరకు వారికి కొద్దిమొత్తం కమీషన్ చెల్లిస్తూ ఉత్పత్తిదారులు కొంతకాలం ఇలాగే నెట్టాలని ఈ డిజిటల్ గురు సూచిస్తున్నారు. ఉత్పత్తిదారుల నుంచి నేరుగా కొనుగోలు చేసే వినియోగదారుల సంఖ్య బాగా పెరగగానే దళారీలకు స్వస్తి పలకవచ్చని ఆయన హితవు చెబుతున్నారు.

ఇంటర్‌నెట్ వినియోగదారులు పెరిగిన కొద్దీ వ్యాపార ప్రకటనల పద్ధతి ముఖ్యంగా రిటైల్ మార్కెటింగ్ విధానం పూర్తిగా మారిపోతుంది. ఇప్పటికే అమెరికాలో ఇంటర్‌నెట్ ద్వారా జరిగే వ్యాపార ప్రకటనలు చూసి వస్తువులు కొనుగోలు చేసేవారి సంఖ్య అపారంగా పెరిగింది. ఇండియాలో ఇప్పుడప్పుడే ఇవన్నీ జరగకపోవచ్చు. అయినా మహానగరాల్లో ఇంటర్‌నెట్ ద్వారా జరిగే వ్యాపార లావాదేవీలు క్రమంగా పుంజుకుంటున్నాయి. ప్రస్తుతం ప్రజలు సర్వీసులు పొందటానికి చేస్తున్న చెల్లింపులు తగ్గిపోతాయి. చాలా సర్వీసులు ఉచితంగా లభిస్తాయి. వస్తువులు, సరకుల మార్కెటింగ్ వ్యయం తగ్గడం వల్ల వాటి దరలు ఎంతో కొంతమేర తగ్గాలి. ఉత్పత్తి దశలో నాణ్యతకు, బ్రాండ్ ఇమేజీకి చాలా ప్రాముఖ్యత వస్తుంది. కొత్త సహస్రాబ్దిలో ఏ రంగంలో కూడా మార్పులు రావడానికి ఎక్కువ సమయం పట్టదు. కొద్ది సంవత్సరాల్లోనో, నెలల్లోనో వ్యాపార స్వరూప స్వభావాలే మారిపోతుంటాయి. పోటీతత్వాన్ని అలవర్చుకోలేని, మార్పును జీర్ణించుకోలేని సమాజాలు, వ్యక్తులు చరిత్రలో కలిసిపోయినట్లు కంపెనీలు కూడా కలిసిపోతాయి. ■

ఇ-కామర్స్ వ్యవస్థకు శ్రీకారం చుడుతున్న బిల్ క్లింటన్







భూమండలంపై జనాభా పరంగా రెండో పెద్ద దేశం, వైశాల్యంలో
ఏడో పెద్ద దేశమైన భారత్- క్రీడారంగ ప్రమాణాల విషయానికి వచ్చేసరికి
సురినామ్‌లాంటి చిన్న దేశం సాధించిన విజయాలకు కూడా చేరువలేకపోయింది.
హాకీ వైభవం గతం కాగా, చెస్, టెన్నిస్, బిలియర్డ్స్, వెయిట్‌లిఫ్టింగ్
అంశాల్లో మాత్రమే చెప్పుకోదగ్గ ఫలితాలు అందుతున్నాయి.
భారత క్రీడారంగ స్థితిగతులపై 'జె. శ్రీనివాస్' కామెంటరీ...

# క్రీడాభారతి కుంటినడక

కలిగిన దానితో సంతృప్తి చెందే మనస్తత్వం మనది అయినందున కిల్లర్ ఇన్‌స్టింక్ట్ భారతీయుల్లో తక్కువగా వుంటుందనేది క్రీడామానసిక నిపుణుల అభిప్రాయం. ఇది చాలా వరకు నిజం కావొచ్చు. అందుకేనేమో! ఒంటి చేత్తో ఒలింపిక్ హాకీ స్వర్ణాలను గెలిపించిన హాకీ మాంత్రికుడు ధ్యాన్‌చంద్ పేరిట ఏటా ఆగస్టు 29న మనం 'జాతీయ క్రీడా దివస్'ను కేవలం అర్జున, ద్రోణాచార్య అవార్డుల ప్రదానంతో జరుపుకుంటున్నాము. నిరుడు డాన్ బ్రాడ్‌మన్ 90వ జన్మదినం జరిగితే ఆస్ట్రేలియన్లు చేసిన హడావిడి ఇంతా అంతా కాదు. అదే మాదిరి నిరుడు డబ్ల్యుజి గ్రేస్ 150వ జయంతికి బ్రిటన్‌లో కోలాహలం మనకు తెలిసిందే. అమెరికాలో మహ్మద్ అలీ, కార్ల్ లూయిస్, మ్యాజిక్ జాన్సన్, మైకెల్ జోర్డాన్‌లను జనం ఈ శతాబ్ది ఆటగాళ్లుగా కీర్తించారు. బ్రెజిల్‌లో పీలేను జాతీయ సంపద (నేషనల్ అస్సెట్)గా ప్రకటించడం, అర్జెంటీనాలో శతాబ్ది ఆటగాడి పురస్కారాన్ని మారడోనా అందుకునడం చూస్తుంటే మన ధ్యాన్‌చంద్ 'క్రీడా దివస్' పేలవంగా జరుపుకుంటున్నామని అంగీకరించక తప్పదు.

అంతర్జాతీయ క్రీడారంగంపై చెరగని ముద్ర వేసిన భారతీయులు కొందరే వున్నారు. ప్రత్యేకించి ఒలింపిక్స్‌లో హాకీ మాంత్రికుడు ధ్యాన్‌చంద్, బల్బీర్ సింగ్, అజిత్‌పాల్‌సింగ్, ఫుట్‌బాల్‌లో నూర్‌మహ్మద్, జుల్ఫికర్, యూసుఫ్, కుస్తీ యోధుడు కాషాబా జాదవ్, టెన్నిస్ ఆశాజ్యోతి లియాండర్ పేస్ మొదలైన కొద్ది మంది తారలు తళుక్కున మెరిశారు. ఒలింపికేతర క్రీడల్లో శరీర సౌష్టవ యోధులు మనోహర్ ఐచ్, ప్రేమ్ చంద్ డోగ్ర, టెన్నిస్‌లో కృష్ణన్, రమేశ్, అమృత్‌రాజ్ సోదరులు, మహేశ్ భూపతి, బ్యాడ్మింటన్‌లో ప్రకాశ్ పదుకోనే, బిలియర్డ్స్‌లో మైకెల్ ఫెరీరా, గీత్‌సేఠి, క్రికెట్‌లో సునీల్ గవాస్కర్, కపిల్‌దేవ్, అజరుద్దీన్, సచిన్, కుంబ్లే, వెయిట్‌లిఫ్టింగ్‌లో కామినేని ఈశ్వరరావు, కరణం మల్లీశ్వరి, కుంజరాణి, చదరంగంలో వి.ఆనంద్, పెంట్యాల హరికృష్ణ, కోనేరు హంపి, ఆరతి రామస్వామి, మోటారు రేసింగ్‌లో నారాయణ్ కార్తికేయన్, రెగెట్టా పడవ పందాల్లో తారాపూర్-కెల్లీరావు తదితరులు మాత్రమే భారత కీర్తి పతాకను అంతర్జాతీయంగా రెపరెపలాడించారు.

భారత దేశం వైశాల్యం, జనాబాలను చూస్తే క్రీడా రంగంలో ఆ నిష్పత్తిలో అభివృద్ధి జరగలేదనిపిస్తోంది. అంతర్జాతీయ క్రీడల విషయానికి వస్తే పారిస్‌లో 1900లో జరిగిన రెండో ఒలింపిక్స్‌లో కలకత్తాకు నార్మన్ ప్రిచ్చార్డ్ రెండు రజత పతకాలను గెలిచినప్పటి నుంచి గత నూరేళ్లలో ఎనిమిది ఒలింపిక్ స్వర్ణ పతకాలను హాకీలో గెలవడమొక్కటే చెప్పుకోదగ్గ అంశం. వ్యక్తిగత పతకాల విషయానికి వస్తే 1952 హెల్సింకీ ఒలింపిక్స్‌లో మహారాష్ట్రకు చెందిన కాషాబా జాదవ్ కుస్తీలో రజతపతకాన్ని సాధించగా, 44 ఏళ్ల విరామం తరువాత అట్లాంటాలో '96లో లియాండర్ పేస్ టెన్నిస్‌లో కాంస్య పతకాన్ని సాధించాడు. 1956 మెల్బోర్న్ ఒలింపిక్స్‌లో మూడవ స్థానంకోసం జరిగిన మ్యాచ్‌లో ఓడిపోయిన భారత ఫుట్‌బాల్ జట్టుతోపాటు 1960లో మిల్కాసింగ్, 1984లో పి.టి.ఉష త్రుటిలో ఒలింపిక్ పతకాలను కోల్పోయారు. ప్రపంచ చాంపియన్‌షిప్‌ను త్రుటిలో కోల్పోయిన వారిలో వి.ఆనంద్ ప్రథముడు. 1996లో ఇంటెల్ ప్రాయోజిత ప్రపంచ చెస్ ఫైనల్లో తనకు లభించిన ఆధిక్యాన్ని చేజార్చుకుని రెండోస్థానంతో సరిపెట్టుకున్నాడు.

20వ శతాబ్దంలో భారత హాకీ మాదిరి ఉజ్వలంగా ఏ జట్టు వెలుగొందలేదు. 1885లో




కోనేరు హంపి (చెస్)


హరికృష్ణ (చెస్)


మల్లీశ్వరి (వెయిట్ లిఫ్టింగ్)


ముకేష్ (హాకీ)


ధ్యాన్‌చంద్ (హాకీ)


సచిన్



పేస్-భూపతి జంట


గీత్‌సేథి



మొదటి హాకీ క్లబ్ కలకత్తాలో ఏర్పడగా, 1926 లో తొలి అంతర్జాతీయ మ్యాచ్‌ని న్యూజీలాండ్‌తో భారత్ ఆడింది. అనతికాలంలోనే 1928 ఆమ్‌స్టర్‌డామ్ ఒలింపిక్స్‌లోనే ప్రపంచ శక్తిగా భారత్ ఎదిగింది. ఉత్తరప్రదేశ్‌కు చెందిన 22 ఏళ్ల ఆర్మీ కెప్టెన్ ధ్యాన్‌చంద్ నాయకత్వంలోని భారత జట్టు ప్రత్యర్థులకు ఒక్క గోల్ కూడా ఇవ్వకుండా స్వర్ణ పతకాన్ని కైవసం చేసుకునడం విశేషం. 1932 లో లాస్‌ఏంజిలిస్‌లో కేవలం మూడు జట్లు పోటీ పడ్డాయి. ప్రత్యర్థి జపాన్‌ను 11-1తో, అమెరికాను 24-1గోల్స్‌తో భారత్ చిత్తుచేసి స్వర్ణం గెలిచింది. ఇందులో రూప్‌సింగ్ 12 గోల్స్, ధ్యాన్‌చంద్ 7 గోల్స్ చేశారు. ఇదొక చెరిగిపోని రికార్డు. మరో నాలుగేళ్లకు బెర్లిన్‌లో జర్మనీని 8-1 తేడాతో ఓడించి స్వర్ణ పతకాన్ని గెలిచిన భారత్ ఆ మ్యాచ్ తిలకించిన అడాల్ఫ్ హిట్లర్‌కు చేదు అనుభవాలను మిగిల్చాడు.

దేశానికి స్వాతంత్ర్యం లభించాక మైనారిటీ ఆటగాళ్లు పాకిస్థాన్‌కు వలసపోయినప్పటికీ భారత హాకీ జట్టు వరుసగా మరో మూడు ఒలింపిక్ టైటిళ్లను గెలిచింది. తమ పాలనలో వున్న భారత జట్టుతో ఆడి ఓడిపోవడాన్ని తప్పించుకున్న బ్రిటన్ లండన్‌లో జరిగిన ఫైనల్లో తప్పనిసరిగా ఆడాల్సివచ్చింది. ఫలితంగా ధ్యాన్‌చంద్ శిక్షణ చేపట్టిన భారత్ చేతిలో 4-0 తేడాతో బ్రిటన్ చిత్తుగా ఓడిపోయింది. మరో నాలుగేళ్లకు హెల్సింకీలో భారత్ మొత్తం 13 గోల్స్ చేయగా, అందులో పంజాబ్ పోలీసు ఇన్‌స్పెక్టర్ బల్బీర్ సింగ్ 9 గోల్స్ చేశాడు. ఫైనల్లో హాలండ్‌ను 6-1 తేడాతో ఓడించి స్వర్ణాన్ని భారత్ ఐదోసారి గెలిచింది. 1956మెల్బోర్న్‌లో మొదటిసారి పాకిస్థాన్ నుంచి తీవ్ర ప్రతిఘటన రావడంతో 1-0 గోల్‌తో భారత్ గెలిచి స్వర్ణ పతకాన్ని సాధించింది. దాంతో వరుసగా 6ఒలింపిక్ హాకీ స్వర్ణ పతకాలు గెలిచి రికార్డు నెలకొల్పినట్టయింది. 1960 రోమ్ ఒలింపిక్స్‌లో మొదటిసారి హాకీ స్వర్ణం భారత్ చేజారింది. ఈసారి ఫలితం తారుమారైంది. పాకిస్థాన్ 1-0 తేడాతో గెలవడంతో భారత్ రజతంతో సరిపెట్టుకోవలసి వచ్చింది. మరో నాలుగేళ్లకు మొదటిసారి ఆసియా ఖండంలో ఒలింపిక్స్ జరుగగా భారత్ పూర్వ వైభవాన్ని సంతరించుకుంది. హాకీ ఫైనల్లో మళ్లీ 1-0 గోల్ తేడాతో పాకిస్థాన్‌పై గెలిచి ప్రతీకారం తీర్చుకుంది.

మెక్సికో ఒలింపిక్స్‌లో భారత్ మొదటిసారి ఫైనల్‌కు చేరలేకపోయింది. పాక్ స్వర్ణం, ఆస్ట్రేలియా రజతం గెలవగా, భారత్ 2-1తో జర్మనీపై గెలిచి కాంస్య పతకంతో సరిపెట్టుకుంది. 1972 మ్యూనిక్ ఒలింపిక్స్‌లోనూ భారత్ కాంస్యమే గెలిచింది. ఇక్కడ మొదటిసారి స్వర్ణం ఉపఖండం చేజారింది. ఫైనల్లో జర్మనీ 1-0తో పాక్‌ను ఓడించగా, మూడో స్థానం మ్యాచ్‌లో భారత్ 2-1తో హాలండ్‌పై గెలిచింది. 1976లో కొత్త చాంపియన్‌గా న్యూజీలాండ్ అవతరించగా, పాక్ కాంస్యంతో సరిపెట్టుకుంది. భారత్ పరాజయంపాలై ఏడో స్థానం పొందింది. 1980 మాస్కో ఒలింపిక్స్‌కు అమెరికా నాయకత్వంలో పాకిస్థాన్, ఆస్ట్రేలియా, జర్మనీ, ఇంగ్లాండ్ బహిష్కరించాయి. అయినప్పటికీ స్పెయిన్ నుంచి ఎదురైన తీవ్ర ప్రతిఘటనను అధిగమించి భారత్ 4-3 గోల్స్‌తో స్వర్ణం సాధించింది. భారత్‌కు 20వ శతాబ్దంలో ఇదే చివరి ఒలింపిక్ స్వర్ణ పతకం. ఆసియాడ్ విషయానికి వస్తే 1966లో మొదటి సారి, 1998 లో రెండోసారి భారత హాకీ వీరులు స్వర్ణ పతకాలు సాధించారు. మరో పదిసార్లు రజత పతకాలను వశం చేసుకున్నారు. బార్సిలోనా, అట్లాంటా ఒలింపిక్స్‌ల్లో ఆడిన ముఖేశ్‌కుమార్ (హైదరాబాద్), ధనరాజ్ పిళ్లే కాంబినేషన్ బ్యాంకాక్‌లో నిరుదు స్వర్ణం సాధించడంతో చాలా కాలం తరువాత భారత హాకీ మళ్లీ దారిలో పడినట్టుంది.

హాకీ తరువాత అంతర్జాతీయంగా భారత్ పేరు ప్రతిష్ఠలను నిలిపిన వారు ప్రపంచ అమెచూర్ బిలియర్డ్స్ విజేత మైకెల్ ఫెరీరా, ప్రపంచ అమెచూర్, ప్రొఫెషనల్ బిలియర్డ్స్ విజేత గీత్ సేఠి. ఒకవిధంగా ప్రపంచంలో ఇంగ్లాండ్, వేల్స్, ఐర్లాండ్, మాల్టా, ఆస్ట్రేలియాల కన్నా భారత్‌లోనే ఈ ఆట ఇటీవల అత్యంత ప్రజాదరణ పొందుతోంది. అందుకు ఫెరీరా, సేఠీలకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ప్రపంచ చాంపియన్‌షిప్‌లు గెలిచిన మరో ముగ్గురు కూడా ఆంధ్రులే కావడం చెప్పుకోదగ్గ అంశం. 1994లో మళ్లీ 1995లో ప్రపంచ వెయిట్ లిఫ్టింగ్‌లో శ్రీకాకుళం జిల్లా ఆముదాలవలసకు చెందిన కరణం మల్లీశ్వరి టైటిళ్లు గెలిచి, ఆసియాడ్, ఇతర అంతర్జాతీయ పోటీల్లో అనేక పతకాలు గెలిచిన ఆంధ్రుడు కామినేని ఈశ్వరరావుని అధిగమించింది.

చరిత్రకు అందని కాలం నుంచి చదరంగం (చతురంగ బలాలకు ప్రతీక) ఆటను భారతలో ఆడేవారని చరిత్రకారులు చెబుతారు. ఎప్పుడీ ఆట పుట్టిందో ఎవరికీ స్పష్టంగా తెలియనప్పటికీ భారత్ నుంచి పర్షియాకు అటు నుంచి యూరప్, మధ్య ఆసియాకు వలస వెళ్లింది. గత కొన్ని శతాబ్దాలుగా రష్యా ఆటగాళ్లు ప్రపంచ చదరంగంపై పట్టు కలిగివుండగా, 1970 దశకం ప్రారంభంలో బాబీ ఫిషర్ (అమెరికా) సంచలన విజయాన్ని బోరిస్ స్పాస్కీ (రష్యా)పై సాధించాడు. ఈ శతాబ్దపు చదరంగపు పోటీగా దానిని అభివర్ణించారు కూడా. గత మూడు దశాబ్దాలుగా రష్యాకు చెందిన అనతోలి కార్పోవ్, గారీ కాస్పరోవ్‌లు ప్రపంచ చెస్‌పై ఆధిపత్యం చెలాయిస్తున్నారు. కానీ, వీరికి భారత్‌కు చెందిన వి.ఆనంద్ నుంచి తీవ్రమైన సవాలు ఎదురైంది. హైదరాబాద్ శివార్లలోని సంఘీనగర్లో జరిగిన 'ఫీడే' ప్రపంచ చెస్ క్వార్టర్ ఫైనల్లో ఓడినప్పటికీ, ఆ తరువాత న్యూయార్క్‌లో జరిగిన ఇంటెల్ ప్రపంచ చెస్‌లో ఫైనల్లో ప్రవేశించి కాస్పరోవ్‌ను ముప్పుతిప్పలు పెట్టి, తుదకు ఓడిపోయాడు. భారత దేశానికి ☞





సంబంధించినంత వరకు చదరంగంలో ఇదే అత్యుత్తమ ప్రతిభ. జూనియర్ చెస్‌లో 10 ఏళ్ల లోపు విజేత పి.హరికృష్ణ (గుంటూరు), 10, 12 ఏళ్ల టైటిళ్ల విజేత, 12 ఏళ్ల రన్నరప్ కోనేరు హంపి (విజయవాడ), ఇటీవల అండర్ 18 ప్రపంచ చెస్ టైటిల్ గెలిచిన చెన్నై బాలిక ఆరతి రామస్వామి గతంలో 1987లో ఇదే టైటిల్‌ను (అప్పట్లో జూనియర్ ప్రపంచ టైటిల్) గెలిచిన వి. ఆనంద్ సరసన నిలిచింది. 20వ శతాబ్దపు తీపి గుర్తుల్ని నూతన సహస్రాబ్దిలోకి తీసుకువెళుతున్న భారత చదరంగానికి జోహార్లు.

ప్రపంచ స్థాయిలో చెరగని ముద్ర వేసిన భారత క్రీడాకారుల్లో టెన్నిస్ ఆశాజ్యోతులు మహేశ్ భూపతి-లియాండర్ పేస్ ముఖ్యులు. వీరిద్దరు గతంలో ఏ భారతీయుడికి సాధ్యంకానన్ని మూడేసి గ్రాండ్ స్లామ్ టైటిళ్లను గెలిచారు. ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురానికి చెందిన సిజికె భూపతి తనయుడైన మహేశ్ భూపతి అంతకు ముందే 1997లో ఫ్రెంచి ఓపెన్‌లో రికా హిరాకీ (జపాన్)తో కలసి మిక్స్‌డ్ డబుల్స్ టైటిల్‌ను వశం చేసుకున్నాడు. ఇటీవల మరో జపనీస్ అమ్మాయి అల్ సుగియామాతో కలసి యుఎస్ ఓపెన్ మిక్స్‌డ్ డబుల్స్ టైటిల్‌ను గెలిచాడు. కాగా, లియాండర్ పేస్‌తో కలసి ఈ ఏడాది ఫ్రెంచి ఓపెన్, వింబుల్డన్ పురుషుల డబుల్స్ టైటిళ్లను భూపతి గెలిచాడు. మరోవైపు పేస్-లీసా రేమండ్‌తో కలసి ఈ ఏడాది వింబుల్డన్ మిక్స్‌డ్ డబుల్స్ టైటిల్‌ను గెలవడమే కాకుండా, మూడేళ్ల క్రితం అట్లాంటా ఒలింపిక్స్‌లో పురుషుల సింగిల్స్ టెన్నిస్‌లో కాంస్య పతకాన్ని చేజిక్కించుకోవడం విశేషం. 1966, 1974, 1987లలో డేవిస్‌కప్ ఫైనల్ వరకు భారత జట్టు చేరుకున్నప్పటికీ, వ్యక్తిగత పోటీల విషయానికి వస్తే ఆర్.కృష్ణన్, రమేశ్, విజయ్, ఆనంద్ అమృత్‌రాజ్‌లకు దక్కని విజయాలను పేస్-భూపతి జంట వశంచేసుకునడం విశేషం.

శరీర సౌష్టవ పోటీల్లో కలకత్తాకు చెందిన పొట్టివాడు మనోహర్ ఐచ్ కండరాలను పెంచి 1940, 50 దశకాల్లో అనేక మిస్టర్ హెర్క్యులిస్ (ఇప్పటి మిస్టర్ వరల్డ్‌కు సమానం) టైటిళ్లను గెలిచాడు. 1980-1990 దశకాల్లో ఈ ఘనత ప్రేమ్ చంద్ డోగ్రాకు దక్కుతుంది. 1980లో ఆల్ ఇంగ్లాండ్ టైటిల్ గెలిచిన ప్రకాశ్ పడుకోనేతో సరితూగగల ఆటగాడిని భారత బ్యాడ్మింటన్ తయారు చేయలేకపోయింది. సయ్యద్ మోది అకాల మృత్యువు బారినపడటం విచారకరం. ఇటీవలి కాలంలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన పుల్లెల గోపీచంద్ తులుస్ ఓపెన్, స్కాటిష్ ఓపెన్ టైటిళ్లను గెలిచి కొంతవరకు భారత బ్యాడ్మింటన్‌లో ప్రకాశాన్ని నింపాడు. గోపీచంద్‌తో పాటు అపర్ణ పోపట్‌లిద్దరూ వచ్చే సిడ్నీ ఒలింపిక్స్‌లో ఆడే అవకాశాలున్నాయి. కాగా, అట్లాంటా ఒలింపిక్స్‌లో పాల్గొన్న తొలి భారత బ్యాడ్మింటన్ మహిళా క్రీడాకారిణి పివివి లక్ష్మి ఆంధ్ర వనితే కావడం విశేషం. జల క్రీడల విషయానికి వస్తే 1989లో ముంబాయిలో జరిగిన ప్రపంచ ఎంటర్‌ప్రైజ్ క్లాస్ రెగెట్టాలో భారత దేశానికి చెందిన తారాపూర్-కెల్లీరావు (ఆంధ్రుడు) గెలుపొందడం మరపురాని విషయంగా నిలిచిపోతుంది. ఇటీవలి కాలంలో మోటార్ రేసుల్లో చెన్నైకి చెందిన యువ డ్రైవర్ నారాయణ్ కార్తికేయన్ యూరోపియన్ సర్క్యూట్‌లో ఫార్ములా-3 రేసులను గెలిచి అందరి దృష్టిని ఆకర్షించాడు. మంచి భవిష్యత్తున్న కార్తికేయన్ నూతన సహస్రాబ్దిలో భారత్‌కు ఈ క్రీడలో మంచి పేరు తెచ్చే అవకాశం వుంది.

చివరగా నాన్ ఒలింపిక్ ఆట అయినప్పటికీ, ప్రభుత్వ సహాయ సహకారాలు పొందనప్పటికీ ప్రజాదరణే పెట్టుబడిగా క్రికెట్ ఆట భారతీయుల జాతీయక్రీడలనే మరిపిస్తోంది. ప్రపంచవ్యాప్తంగా అత్యంత ధనవంతమైన క్రికెట్ బోర్డుగా భారత్ ఎదిగింది. 1932లో తొట్టతొలి (ఇంగ్లాండ్) పర్యటనకు ఒక ఆంధ్రుడు సికె నాయుడు భారత దేశానికి నాయకత్వం వహించాడు. అయితే భారత్ చెప్పుకోదగ్గ విజయాలను 1970లో వెస్టిండీస్ గడ్డపై సాధించడం, ఆ వెంటనే అదే ఊపులో ఇంగ్లాండ్‌పైనా ఘన విజయాలు సాధించడం భారత క్రికెట్ రూపురేఖల్ని మార్చేశాయి.

1983లో కపిల్‌దేవ్ నాయకత్వంలో ప్రపంచకప్ ఘనవిజయం మొదలుకుని 1985లో సునీల్‌గవాస్కర్ నాయకత్వంలో మెల్బోర్న్‌లో ప్రపంచ చాంపియన్‌షిప్ విజయం వరకు భారత్ విజయాల పరంపర అప్రతిహతంగా కొనసాగింది. 1998లో ఆడిన దాదాపు అన్ని వన్డే మ్యాచ్‌లను గెలిచిన భారత్‌ను తక్కువగా అంచనా వేయరాదు. విజయసారథి అజరుద్దీన్ అయితే విజయాలకు ప్రధాన కారకుడు సచిన్ తెండూల్కరే అన్న సంగతి మరువరాదు. అందుకే భారత క్రికెట్‌లో పటౌడీ, జైసింహ, విశ్వనాథ్, గవాస్కర్, కపిల్‌దేవ్, అజరుద్దీన్‌లను 'హోదా' విషయంలోనూ ప్రజాదరణ విషయంలోనూ సచిన్ అధిగమించాడు. 1999 ప్రారంభంలో ఢిల్లీ టెస్టులో ఒక ఇన్నింగ్స్‌లో మొత్తం 10 పాకిస్థాన్ వికెట్లను తీసుకున్న కుంబ్లే సైతం స్టార్ హోదా పొందాడు. నూతన సహస్రాబ్దిలో స్వదేశంలోనే కాదు, విదేశీ గడ్డపైనా ఘనవిజయాలను సాధించగలమని భారత క్రికెటర్లు నిరూపించాల్సిన అవసరముంది.

ఏది ఏమైనప్పటికీ సురినామ్ లాంటి చిన్న దేశాలతో పోల్చితే భారత దేశపు క్రీడా విజయాలు తీసికట్టే. మన స్టార్ క్రీడాకారులను మనం స్మరించుకున్నప్పుడే యువతకు స్ఫూర్తి లభిస్తుంది. ధ్యాన్‌చంద్‌ని 20వ శతాబ్దపు క్రీడాకారుడిగా ప్రకటించడమే కాకుండా మరిన్ని ఉపయోగకరమైన క్రీడా విధానాలను ప్రవేశపెట్టాల్సిన ఆగత్యం వుంది. అప్పుడే ఈ రంగంలో భారత్ పైపైకి ఎదుగుతుంది. ■


వి. ఆనంద్


ప్రేమ్‌చంద్ డోగ్రా





కలవారి కట్టు, బొట్టులే ఒకనాడు ఫ్యాషన్. ఉదార విధానాలతో ఆర్థిక రంగం వాకిళ్లు తెరుచుకున్న మరుక్షణమే ఫ్యాషన్ ప్రభంజనం భారతదేశం నట్టింట్లోకి దూసుకొచ్చింది. ఇప్పుడు బ్యూటీపార్లర్లు, హెల్త్‌క్లబ్‌లు, డిజైనర్ దుస్తులు మధ్యతరగతి మందహాసాలుగా మారిపోయాయి.

ఫ్యాషన్ ప్రపంచంపై 'శ్రీబాల' సమీక్ష...

ప్రపంచ అందగత్తెల్లో ఒకరిగా పేరుపొందిన జైపూర్ మహారాణి గాయత్రిదేవి



# ఇప్పుడు గ్లామర్... లైఫ్ గ్రామర్

ఐశ్వర్యారాయ్




మనిషి ప్రాథమిక అవసరాల్లో ఒకటైన బట్ట కేవలం అతని అవసరంగా మాత్రమే మిగలలేదు. పరిణామ క్రమంలో ఇది ఫ్యాషన్‌గా పరిణమించింది. పరిశ్రమగా విస్తరిల్లింది. ఫ్యాషన్ ఇప్పుడు కేవలం వస్త్రధారణకు సంబంధించిన విషయమే కాదు సాంఘిక, ఆర్థిక స్థాయికి సంబంధించిన విషయం. అందువల్లనే విభిన్న వర్గాల మధ్య తేడా ఏమంత ఎక్కువ లేనంత కాలం ఆసియా దేశాల్లో, ఆధునిక కాలం వరకూ యూరప్‌లోను వస్త్రధారణ ఫ్యాషన్ స్థాయిని సంతరించుకోలేకపోయింది. ఇపుడు ఫ్యాషన్ వ్యక్తుల చరిత్రనే తేటతెల్లం చేసే విషయం కూడా. సమాజంలో నిమ్నస్థాయి వర్గాలు ఎపుడైతే ఉన్నత వర్గాల వస్త్రధారణకు దగ్గరగా వచ్చాయో, అపుడే ఉన్నతస్థాయి వర్గాలు తమ అధికారాన్ని స్థాయిని ప్రదర్శించుకొనే ప్రయత్నంలో భాగంగా ఫ్యాషన్‌ను సృష్టించాయి. సమాజంలో సాధారణ స్థాయికి చెందిన వ్యక్తికి అందుబాటులో లేని విషయంగా వుండేది కాని ఇపుడు 20వ శతాబ్దాపు చివరి అంచులో కమ్యూనికేషన్ల, ఉత్పత్తి పరిజ్ఞానం అభివృద్ధితో అనేక రూపాలను సంతరించుకొంది. ఇపుడు ఉన్నత వర్గానికో ఫ్యాషన్ , మధ్యతరగతి వర్గానిక ఫ్యాషన్, నిమ్న వర్గానికో ఫ్యాషన్. ఉన్నత స్థాయి వర్గాల ఫ్యాషన్ కేవలం దుస్తులకే పరిమితం కాదు. దుస్తులతో పాటు నగలు, పాదరక్షలు కూడా మంచి ఆహార్యానికి గుర్తుగా వున్నాయి. ఇవన్నీ ఇపుడు అనుబంధ పరిశ్రమలుగా విలసిల్లుతున్నాయి. అంతా కలిపి మోడలింగ్‌ను అనుబంధ రంగంగా మార్చివేశాయి.

ఫ్యాషన్ గతిని పరిశీలిస్తే యూరప్‌లో 16వ శతాబ్దం వరకు ఇటలీ ఫ్యాషన్‌ను మిగిలిన దేశాలు అనుకరించేవి. అక్కడి నుండి స్పెయిన్ దేశపు రీతులను మిగతా దేశాల వారు అనుసరించే వారు. యువకులు తెల్లటి, సిల్కు చొక్కాలను ఫ్రిల్స్‌తో ధరించే వారు. మగవారి జుత్తు పొడుగ్గా వుండేది. 19, 20 శతాబ్దాలకు వచ్చేసరికి స్త్రీ ఫ్యాషన్‌కు ప్యారిస్, పురుషుల ఫ్యాషన్‌కు లండన్ రాజధానిగా మారాయి. యూరప్, అమెరికాలలో ఈ ఫ్యాషన్‌లను జర్నల్స్‌లో ప్రచురించే వారు. అక్కడి నుండే వోగ్, హర్పర్ బజార్‌వంటి పత్రికలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. ఇపుడు ఫ్యాషన్ ఎంతగా విస్తరించిందంటే ఏ సందు మూలల్లో టైలర్ దగ్గరకు వెళ్లినా ఫ్యాషన్ పత్రికలతో పాటు ఫ్యాషన్ నమూనాల పుస్తకాలు అనేకం వుంటాయి. రెండవ ప్రపంచ యుద్ధం అనంతరం దుస్తుల విషయంలో మరింత క్యాజువల్ ధోరణి ప్రస్ఫుటమౌతూ వచ్చింది. అందుకే జీన్స్ ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టించగలిగాయి. మదత మంచం వస్త్రాన్ని కుట్టి ప్యాంట్‌గా చేసిన డెనిమ్ అంతగా ప్రజల్లోకి చొచ్చుకుపోయాయి. ఇపుడు అత్యంత ఫ్యాషనబుల్‌తో పాటు క్యాజువల్ దుస్తులు కూడా జీన్సే. యూరప్‌లో 16 వ శతాబ్దికి ముందు స్త్రీల దుస్తులు వారి సామాజిక స్థాయికి పూర్తిగా దగ్గరగా వుండేవి. స్త్రీల డిజైనింగ్ వారు ఇంట్లో ఏపని చేయరని అర్థమయ్యేది. తమ స్త్రీని కేవలం గాజుబొమ్మగా పెట్టుకోగల పురుషుల ఆర్థికస్థాయి తెలిసేది. స్థూలంగా చెప్పుకోవాలంటే 20 శతాబ్దంలోనే ఫ్యాషన్ పరిశ్రమగా విలసిల్లింది. అనేక రాజవంశీకులు ఫ్యాషన్ వస్త్ర ధారణలో పేరు మోశారు. బ్రిటన్ యువరాణి డయానా కూడా ప్రపంచ వ్యాప్తంగా పేరు పొందిన ఫ్యాషన్ డిజైనర్ల దుస్తులనే ధరించేవారు. అమెరికాలో ఇపుడు కొన్ని పత్రికలు బెస్ట్ డ్రెస్డ్ మ్యాన్ , వుమన్‌ను ఎంపిక చేస్తూ వుంటాయి. ఇపుడు ఈ సంస్కృతి మూడవ ప్రపంచ దేశాలకు కూడా పాకింది. వస్త్రధారణ అందాన్ని ఇనుమడింప చేసుకొనే విషయంగానే కాక మల్టినేషనల్ కంపెనీలు, వివిధ వ్యాపార సంస్థలు తమ వ్యాపారాన్ని పెంపొందించుకొనేందుకు ఉపయోగించే రంగంగా కూడా మారింది. కేవలం వస్త్ర ఉత్పత్తులకు చెందిన పరిశ్రమలే కాక మిగతా అన్ని పరిశ్రమల వారు కూడా ర్యాంప్ షోలను ప్రోత్సహిస్తూ అన్ని దేశాల్లో యువతకు మోడలింగ్‌ను ఎంచుకొనేలా చేస్తున్నాయి. ఇందులో భాగంగానే ఫ్యాషన్ డిజైనింగ్ వంటి కోర్సులు కూడా పుట్టుకొచ్చాయ్. గాంధీ చిత్రానికి కాస్ట్యూమ్ డిజైనర్‌గా పనిచేసిన భాను అతేయ భారత్‌కు తొలి ఆస్కార్ అవార్డును సంపాదించిపెట్టారు. అందాల పోటీల్లో భారతీయ వనితలు 90వ దశకంలో ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టించారు. 94లో ఐశ్వర్యారాయ్,సుస్మితాసేన్ మిస్ వరల్డ్, మిస్‌యూనివర్స్‌గా ఎన్నికయ్యారు. '97లో దయానా హెడెన్, '99లో యుక్తాముఖి మిస్‌వరల్డ్‌గా ఎన్నికయ్యారు. ■







"భారతీయ వాణిజ్యమంటే ప్రపంచ వాణిజ్యమని గుర్తుంచుకోండి. భారతీయ వాణిజ్యంపై పెత్తనం సాగించినవాడే సమస్త ప్రపంచాన్ని శాసించ గలడు"- (18వ శతాబ్ది నాటి భారతీయ ఆర్థిక వ్యవస్థపై అప్పటి రష్యన్ చక్రవర్తి పీటర్ ది గ్రేట్ చేసిన వ్యాఖ్య)భారతీయ సమాజంలోని చేతివృత్తుల ప్రజలు ఒక మహోజ్వల ఆర్థిక వ్యవస్థను సృష్టించారు. రాజులే మారినా, రాజ్యాలు కూలినా చెక్కుచెదరని భారతీయ స్వయంపోషక గ్రామీణ ఆర్థిక వ్యవస్థ బ్రిటిష్ రైళ్ల ఉక్కు పట్టాల పోటుకు నెత్తురోడింది. మన చేతివృత్తి వేళ్లను తెల్లవాడు తెగనరికాడు. అయినా, భారతీయ హస్తకళా విన్యాసం అస్తమించలేదు. నేటికీ కొత్త కాంతులు పూస్తూనే ఉంది. బుక్కెడు బువ్వకోసం కళాకౌశలం నడి వీధుల్లో ఊరేగుతూనే ఉంది. దేశంలో ప్రస్తుత హస్తకళల తీరుతెన్నులపై **తెలిదేవర భానుమూర్తి** వివరణ...



# అద్వితీయం హస్తకళా వైదుష్యం

యాంత్రిక యుగం ప్రారంభం కావడానికి ముందు చేతివృత్తులకే ప్రాధాన్యత ఉండేది. చేతివృత్తుల్లో చేనేత,కుండల తయారీ, వడ్రంగం ముఖ్యమైనవి. హస్తకళలు చేతివృత్తుల్లో అంతర్భాగమేనని చెప్పవచ్చు. ఆయా ప్రదేశాల్లో లభ్యమయే సహజవనరుల బట్టి హస్తకళలుంటాయి. పూర్వకాలంలో పండించిన ధాన్యాన్ని గాదెల్లో దాచుకొనేవారు. నీళ్లను కుండల్లో పట్టుకొనే వారు. పేదలు అన్నాన్ని కూడా కుండల్లోనే వండుకొనేవారు. కుండల్ని తయారుచేసే కుమ్మరులను కుంబాకారులని కూడా అంటారు. కుంబ అంటే ఏనుగు తల. ఏనుగు సరస్సులోనో, నదిలోనో దిగి తొండంతో బురద జల్లుకొంటుంది. కొద్దిసేపయ్యాక ఆ బురద ఆరిపోయి గట్టిపడుతుంది. ఈ విధానాన్ని అనుకరించడం వల్లే కుమ్మరులకు కుంబాకారులని పేరు వచ్చింది. హరప్పానాగరికత వర్ధిల్లిన రోజుల్లోని కుండలు ఇప్పటి కుండలను పోలిఉన్నట్లు రాజస్థాన్‌లోని కాలిబంగా ప్రాంతంలో జరిపిన తవ్వకాల వల్ల తెలుస్తున్నది. కుమ్మరులు కేవలం కుండలనే కాకుండా మట్టితో రకరకాల పాత్రల్ని తయారుచేస్తుంటారు. మన రాష్ట్రంలోని నల్లగొండ జిల్లాలోని భువనగిరిలో కూజాలనూ ఆదిలాబాద్‌లో రంజన్లనూ తయారుచేస్తుంటారు. మన రాష్ట్రంలో తయారయ్యే కూజాలకూ, రాజస్థాన్‌లో తయారయ్యే కూజాలకూ కొద్దిపాటి తేడా ఉంటుంది. రాజస్థాన్‌లో తయారయ్యే కూజాల మూతి సన్నగా ఉంటుంది. ఆ రాష్ట్రంలో నీరు అరుదుగా లభించడం వల్ల నీటిని బంగారంలా చూసుకొంటారు. నీళ్ల ఏమాత్రం తొణకకుండా ఉండేందుకే సన్నని మూతి గల కూజాలను తయారుచేస్తారు. మన దేశంలో పదిలక్షలకు పైగా కుమ్మరులున్నారు. వీరంతా ఎక్కువగా గ్రామాల్లో నివసిస్తుంటారు. మధ్యప్రదేశ్‌లోని రామ్‌గఢ్,ఒరిస్సాలోని సంబల్‌పూర్,గుజరాత్‌లోని కఛ్ ప్రాంతాలు కుండల పరిశ్రమకు ప్రసిద్ధి. కుమ్మరులు ఇంటి కప్పుకు ఉపయోగించే పెంకులనూ, దీపావళి వంటి రోజుల్లో ప్రమిదలనూ తయారుచేస్తుంటారు. మధ్యప్రదేశ్‌లోని మధువని ☞

ప్రాంతంలో ఇళ్ల గోడలపై మట్టితో తయారుచేసిన బొమ్మలను అలంకరణార్థం వేలాడదీస్తుంటారు. సాధారణంగా నగరాల్లో నివసించే కుమ్మరులు ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో రకరకాల దేవతా విగ్రహాల్ని తయారు చేస్తుంటారు. వినాయక చవితిదినాల్లో వినాయకుని విగ్రహాల్ని వివిధ సైజుల్లో తయారుచేస్తుంటారు. అలాగే దేవీనవరాత్రుల సమయంలో కాళీమాత విగ్రహాల్ని రూపొందిస్తారు. దక్షిణ రాజస్థాన్‌లోని ఉదయపూర్‌కు 40 కిలోమీటర్ల దూరంలో ఉన్న మొలెల గ్రామంలోని కుమ్మరులు దేవతల విగ్రహాలతో పాటు రాజపుత్ర వీరుల విగ్రహాల్ని తయారుచేస్తుంటారు. బీహార్‌లోని దర్భంగా జిల్లాలో ఎర్రమట్టితో బొమ్మల్నీ, ఆభరణాల్నీ తయారుచేస్తుంటారు. ప్రస్తుతం చక్రం తిప్పి కుండల్నీ, బొమ్మల్నీ రూపొందించే కుమ్మరులు జీవిత చక్రం మాత్రం సరిగ్గా లేదు.



'గాలిలోనా తేలిపోయే చీర కట్టిన చిన్నాదానా, జిలుగు వెలుగుల చీర శిల్పం ఎలా వచ్చెనో చెప్పగలవా? చిరుగు పాతల బరువూ బతుకుల నేతగాళ్లే నేసినారు'అని కవి అంటాడు. ఇప్పటికీ చేనేత పని వారి పరిస్థితి అక్షరాలా ఆ పాటలో చెప్పినట్లే ఉంది. మనదేశంలోని నేత కార్మికులు చేనేతను కళాత్మకంగా ఉన్నత శిఖరాలకు తీసుకుపోయారు. సాధారణంగా గొయ్యితో కూడిన మగ్గాల మీద చేనేత బట్టల్ని నేస్తుంటారు. ఈ మగ్గాలే చేనేత పరిశ్రమకు వెన్నెముక వంటివి. బెనారస్‌లో జరీతోకూడిన చీరల్నినేస్తారు. పట్టు చీరలకు కంచి ప్రసిద్ధి. గుజరాత్‌లోని సూరత్, బెంగాల్‌లోని ముర్షిదాబాద్, అహ్మదాబాద్,మధ్యప్రదేశ్‌లోని చందేరి ,కర్ణాటకలోని మైసూర్ పట్టు చీరల తయారీకి ప్రసిద్ధిచెందాయి. తేలికగా ఉండే జమ్దాని నూలు బట్టల్ని యుపిలోని దక్కా,టండా ప్రాంతాల్లో తయారుచేస్తుంటారు. యుపిలోని మీర్జాపూర్, ఆగ్రా, భదోహి, రాజస్థాన్‌లోని జైపూర్‌తోపాటు కాశ్మీర్‌లో కార్పెట్లను నేస్తుంటారు. మొగల్ రాజుల కాలంలోనే పెర్షియా నుంచి కార్పెట్ పరిశ్రమ మనదేశానికి వచ్చింది. బట్టలమీద రంగులు అద్దే వారిని రంగ్రేజ్ లని అంటారు. రంగ్ అంటే రంగులనీ రేజ్ అంటే పోయడమనీ అర్థం. డిజైన్లతో కూడిన బ్లాకుల్ని తయారుచేసి కావలసిన రంగుల్లో వాటిని చీరలపై అద్దుతుంటారు. సాధారణంగా ఈ డిజైన్లు సంప్రదాయ సిద్ధంగా ఉంటాయి. ఇస్త్రీ ఏమాత్రం పోని హ్యాండ్‌లూమ్ టెరికాటన్ బట్టలూ ఉన్నాయి.

గుజరాత్,రాజస్థాన్,మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లో కమ్మరులు వ్యవసాయ పనిముట్లను తయారుచేయడంతో పాటు వంట పాత్రలను తయారుచేస్తారు. ఆ పాత్రలు చెడిపోతే వారే బాగుచేస్తారు. ఇత్తడి,రాగి వంటి లోహాలతో కళాఖండాలను కూడా రూపొందిస్తారు. పూర్వకాలంలో వీరులు యుద్ధం చేయడానికి అవసరమైన ఖడ్గాల్నీ,బల్లాల్నీ తయారుచేసేవారు. దేవాలయాల్లోని దీపపు సెమ్మెలనూ, రాగి, ఇత్తడి లోహాలతో కూడిన కళాకృతులనూ కమ్మరులే రూపొందిస్తున్నారు. రాగి, ఇత్తడి పాత్రల్ని తయారుచేసే విధానం రుగ్వేద కాలంలోనే ఒక శాస్త్ర విజ్ఞానంగా అభివృద్ధిచెందింది. ఢిల్లీలోని కుతుబ్‌మినార్ ఇనుముతోనే రూపొందించారు. కమ్మరులలో రెండురకాల వారు ఉన్నారు. హిందూ ధర్మ శాస్త్రాల్లో చెప్పిన విధానాన్ని కొందరు అనుసరిస్తే మరికొందరు లోహపాత్రల తయారీలో గిరిజన విధానాన్ని అనుసరిస్తారు. అటవీ ప్రాంతాల్లో నివసించే గిరిజన కమ్మరులు పశ్చిమ బెంగాల్, దక్షిణ బీహార్, పశ్చిమ ఒరిస్సా, వాయువ్య మధ్యప్రదేశ్ ప్రాంతాలకు వలసవెళ్లారు.

వడ్రంగం మనకు అనాది కాలం నుంచే ఉంది. పాతిరాతియుగానికి చెందిన మానవుడు అటు వేటాడానికీ, ఇటు చెట్లను నరికి చెక్కడానికీ రాతితో తయారు చేసుకొన్న ఆయుధాల్నే వాడేవాడు. క్రమంగా చెక్కను చెక్కడంలో నైపుణ్యం సంపాదించాడు. వడ్రంగులు విశ్వకర్మను తమ దైవంగా భావిస్తారు. ఆర్యుల కాలంలో వడ్రంగులు రథాలను తయారు చేసేవారు. ఇంటి తలుపులూ కిటికీలే కాకుండా అలంకరణార్థం ఉపయోగించే వస్తువుల్ని చెక్కతో రూపొందిస్తున్నారు. తమిళనాడులోని వెల్లూరులో దేవాలయాల మూలంగా వడ్రంగులు వెలుగులోకి వచ్చారు. అలం కరణార్థం ఉపయోగించే దారుసామగ్రికి రాజస్థాన్ ప్రసిద్ధిచెందింది. గోపికలను ఆటపట్టిస్తున్న కృష్ణునితో కూడిన దారుశిల్పానికి ఇప్పటికీ ఎంతో ఆదరణ ఉంది. ఈ దారుశిల్పం ఆంధ్రప్రదేశ్‌కు చెందినది. మన రాష్ట్రంలో నిర్మల్‌లో కొయ్యబొమ్మల్ని తయారుచేస్తుంటారు. కర్ణాటకలో చందనపు బొమ్మల్ని తయారుచేస్తారు. ఎర్రచందనం బొమ్మలు అక్కడ ప్రసిద్ధి. దేవాలయాలూ, కోటల మీద కనిపించే శిల్పాలు ప్రపంచప్రఖ్యాతి చెందినవి. మహాబలిపురంలోని రాతి రథాలు ఆ నాటి శిల్పుల కళానైపుణ్యానికి తార్కాణంగా ఇప్పటికీ నిలిచిఉన్నాయి. వరంగల్‌లోని వేయిస్తంభాల గుడి మన శిల్పుల ప్రతిభకు నిదర్శనం. ఒక్కమాటలో చెప్పాలంటే మన దేశంలోని ప్రాచీన దేవాలయాలన్నీ శిల్పకళకు ప్రతిబింబాలే. రాజస్థాన్‌లోని నటబ్వార్వాలో దేవతా విగ్రహాల్ని చెక్కుతుంటారు. అలాగే, కాంచీపురంలో లభించే నల్లని నాపరాయితో విగ్రహాల్ని మలుస్తుంటారు. ఈరోజుల్లో శిల్పుల స్థితిగతులు శిలలాగే ఉన్నాయని చెప్పవచ్చు. మన భావాల్ని తెలుపడానికి భాష వాహకంగా ఉంటుంది. భాషలేనప్పుడు ఆది మానవుడు చిత్రాలతోనే తన భాషను వ్యక్తీకరించేవాడు. రాతిగుహల్లో వేటాడే విధానాన్ని తెలిపే చిత్రాలు కనిపిస్తాయి. అంజతా గుహల్లోని చిత్రాలు జాతక కథల్ని తెలుపుతాయి. మొగల్ రాజులు పెర్షియా చిత్రకళను ప్రోత్సహించారు. రాజస్థాన్, పంజాబ్ కొండ ప్రాంతాలు, మధ్య భారతదేశంలో విభిన్న చిత్రకళారీతులున్నాయి. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల్లోని స్వర్ణ కారులు ఆభరణాలను తయారుచేస్తుంటారు.

ఉత్తరప్రదేశ్‌లోని ఫిరోజాబాద్, ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాద్ గాజులకు ప్రసిద్ధి. సముద్రతీరంలో ఉన్న ప్రాంతాల్లో గవ్వలతో ఆభరణాల్ని తయారు చేస్తారు. శంఖాలను రకరకాల డిజైన్లతో తయారు చేస్తారు. కేరళ రాష్ట్రంలో కొబ్బరి చెట్లు ఎక్కువగా ఉన్న కారణంగా కొబ్బరి పీచుతో తాళ్లనూ,పట్టాలనూ రూపొందిస్తారు. కొబ్బరిచిప్పమీద వివిధరకాల బొమ్మల్ని చిత్రించి విక్రయిస్తుంటారు. అస్సాం, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు వంటి రాష్ట్రాలలో వెదురు బుట్టల్ని తయారు చేయడమే కాకుండా వెదురుతో బొమ్మలను కూడా తయారు చేస్తారు. ప్రస్తుతం మన దేశ హస్తకళలు అడుగంటిపోయాయి. అలంకరణప్రాయంగా మిగిలాయి. విదేశీయులు వీటిపట్ల ఆసక్తి పెంచుకోవడం గుడ్డిలో మెల్ల వంటిదే! ■



# ఎ.పి. మార్క్‌ఫెడ్

## ఎ.పి. స్టేట్ కో - ఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్


5-9-58/B, 7వ అంతస్తు, పరిశ్రమ భవనం, బషీర్‌బాగ్, హైదరాబాదు - 500 004

ఫోన్ నం. 32137606 (PMBX : 4 లైన్లు) ఫ్యాక్స్ : 3237099

website : www. apmarkfed.com e-mail : info@apmarkfed.com


### *సంప్రదాయ జీవనోపాధికి చేయూతనివ్వడం ద్వారా సంస్కృతీ, వారసత్వాలను కొనసాగిస్తున్నది.*

1. మార్కెట్ ఇంటర్‌వెన్షన్ స్కీంలు మరియు మార్కెట్ సపోర్ట్ ఆపరేషన్స్ ద్వారా రైతులకు తమ ఉత్పత్తులకు గిట్టుబాటు ధర వచ్చేట్లు **మార్క్‌ఫెడ్** వీలు కల్పిస్తోంది. గౌరవ ముఖ్యమంత్రి నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ తీసుకున్న మార్కెట్ స్థిరత్వ కార్యకలాపాల్లో భాగంగా **మార్క్‌ఫెడ్ 9,763** మె.ట. ఎండు మిరపకాయలు, **11,372** మె.ట. చింతపండు, **7,787** మె.ట. కందిపప్పు/ కందులు ప్రజా పంపిణీ పథకం ద్వారా పంపిణీ కోసం సేకరించింది.

2. ఎరువులు, విత్తనాలు వంటి వ్యవసాయ ప్రధానమైన ఉత్పాదకాలను **మార్క్‌ఫెడ్** సరసమైన ధరలకు అందిస్తోంది.

3. రూ. **151** కోట్ల వార్షిక టర్నోవరుతో, **300** మందికి పైగా ఉద్యోగ సిబ్బందితో **మార్క్‌ఫెడ్** వ్యవసాయ రంగానికి బహుముఖంగా తన సహాయ సహకారాలు అందిస్తున్నది.

4. రాష్ట్ర వ్యాప్తంగా **22** జిల్లా కార్యలయాలు, ప్లాంట్‌లతో వ్యవస్థ కలిగి, శాస్త్రీయంగా నిర్వహించబడే **62** గిడ్డంగులు కలిగిఉన్న **మార్క్‌ఫెడ్** రాష్ట్రంలోని అన్ని మండలాలలో రైతులకు చేరువుగా ఉంటుంది.

5. తన ఫీడ్ మిక్సింగ్ ప్లాంటు ద్వారా శ్రేష్టమైన పశుదాణాను **మార్క్‌ఫెడ్** అందిస్తోంది.

6. కాటన్ జిన్నింగ్ మరియు ప్రాసెసింగ్ కార్యకలాపాల్లో నిమగ్నమైన **మార్క్‌ఫెడ్** దేశ విదేశాల్లోని మిల్లులకు మేలిరకం ప్రత్తిని సరఫరా చేస్తోంది.

***వి. నాగిరెడ్డి*** I.A.S.,
మేనేజింగ్ డైరక్టర్

***వి. హనుమంతరాయ చౌదరి***
ఛైర్మన్.



సమైక్య తెలుగు రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి నుండీ ఓ పుష్కర కాలంపాటు రాష్ట్ర పరిపాలనా రథం సాఫీగానే సాగిపోయింది. 60వ దశకం చివరి భాగం నుంచి 70వ దశకం తొలిభాగం వరకు మూడు ఉద్యమ తరంగాలు రాష్ట్రాన్ని ఉక్కిరిబిక్కిరి చేశాయి. తొలుత నక్సలైట్ ఉద్యమం, తర్వాత ప్రత్యేక రాష్ట్రోద్యమాలు రాష్ట్ర ప్రభుత్వాన్ని పట్టి కుదిపాయి. ఆ తర్వాత పరిపాలనా సంస్కరణలకు అవి దోహదం చేశాయి. విప్లవాత్మకమైన భూసంస్కరణల చట్టాన్ని తొలుత పి.వి. నరసింహారావు ప్రభుత్వం రూపొందించింది. పాలనాదక్షునిగా పేరొందిన జలగం వెంగళరావు ఆర్థిక వ్యవస్థ పటిష్టతకు చర్యలు తీసుకున్నారు. డాక్టర్ మర్రి చెన్నారెడ్డి పాలనా సౌలభ్యం కోసం కొత్త జిల్లాలను ఏర్పాటు చేసి తాలూకాల సైజును అసెంబ్లీ నియోజకవర్గాల సైజుకు కుదించారు. ప్రభుత్వాన్ని ప్రజల ముంగిట్లోకి తీసుకెళ్లాలన్న లక్ష్యంతో మండల వ్యవస్థను రూపొందించిన ఎన్టీఆర్ సంక్షేమ కార్యక్రమాలకు భారీగా నిధులు కేటాయించి పేదవాడి కన్నీరు తుడిచే ప్రయత్నం చేశారు. రాష్ట్ర సమగ్రాభివృద్ధినే లక్ష్యంగా ఎంచుకున్న చంద్రబాబునాయుడు సంక్షేమ పద్దుపై కోత విధించి మౌలిక వసతుల రూపకల్పనపై భారీగా వ్యయం చేస్తున్నారు. పరిపాలనా సంస్కరణలపై కె. రంగయ్య వ్యాసం...

# సంస్కరణల బాటలో సర్కారీ రథం



ఆంధ్రదేశంలో సంస్కరణలకు ఆద్యుడు కందుకూరి వీరేశలింగం పంతులు. అవి సంఘ సంస్కరణలు కావడం గమనార్హం. ప్రస్తుత సంస్కరణలు పాలనా యంత్రాంగానికి పరిమితమైనవే అయినా అవి కూడా సమాజంలో ప్రభావం చూపుతున్నాయి. ప్రభుత్వ ప్రాధాన్యతనే అవి మార్చివేస్తున్నాయి. రాష్ట్రావతరణ తర్వాత రాష్ట్రాన్ని పాలించిన ఒక్కో ముఖ్యమంత్రి ఒక్కో విధంగా నిర్ణయాలు తీసుకున్నారు. అందరూ ప్రజాసంక్షేమం, బడుగు వర్గాల ప్రయోజనమే తమ పరమావధి అంటూ తమదైన శైలిలో కార్యక్రమాలు అమలు చేశారు. కొందరిలో రాష్ట్ర భవిష్యత్తు దృష్టి కనిపించగా, మరికొందరు తక్షణ ప్రజావసరాలకు ప్రాముఖ్యత నిచ్చారు. ముఖ్యమంత్రిగా రాష్ట్రానికి సేవలందించడంతోపాటు దేశాధ్యక్ష పదవిని అలంకరించడం ద్వారా ఆంధ్రుల గౌరవ ప్రతిష్టలు పెంచిన నీలం సంజీవరెడ్డికి తోడు ప్రధాని పదవిలో కొనసాగిన పి.వి.నర్సింహా రావు పేర్లు తెలుగువారు గుర్తుంచుకుంటారు. పెట్టుబడి రంగానికి పెద్ద పీటవేయడం ద్వారా రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి బాటలు వేసి, పరిపాలనాదక్షునిగా అందరినోట కొనియాడబడిన జలగం వెంగళరావును భావితరాలు గుర్తుంచుకుంటాయి. రాష్ట్ర రాజకీయ రంగాన్నే మలుపు తిప్పి తెలుగు జాతికి అంతర్జాతీయంగా గుర్తింపు తెచ్చిన నేతగానూ, దేశంలో ప్రాంతీయ పార్టీలకు ప్రాధాన్యత పెరిగేందుకు కారకుడైన నందమూరి తారక రామారావు కూడా చరిత్రలో తన స్థానాన్ని పదిల పర్చుకున్నారు. సంస్కరణలకు, సంక్షేమానికి సమ ప్రాధాన్యత అంటూ, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, హైటెక్ విధానాలతో, ప్రజల భాగస్వామ్యంతో కొత్త ఒరవడితో నారా చంద్రబాబునాయుడు కూడా రాష్ట్ర చరిత్రలో తన ప్రాముఖ్యతను నిలబెట్టుకుంటున్నారు.

### భూసంస్కరణల భూమిక పివిదే

రాష్ట్రంలో ప్రధానంగా ఉన్న భూమి సమస్యను-దాని ద్వారా పెరుగుతున్న అశాంతిని దృష్టిలో పెట్టుకొని అప్పటి ముఖ్యమంత్రిగా పివి నర్సింహారావు తీసుకున్న విప్లవాత్మక నిర్ణయం భూసంస్కరణల అమలు. మిగులు భూముల పంపిణీ వ్యవహారం నేటికి పూర్తికానప్పటికీ పివి తీసుకున్న చొరవను ప్రత్యేకంగా ప్రస్తావించాల్సి ఉంటుంది. వేలాది ఎకరాల భూమి కొందరి ఆధీనంలో ఉండటం, దున్నే వానికి సెంట్ భూమి కూడా లేకపోవడంతో భూసంస్కరణల అమలుకు ప్రత్యేక చట్టంతెచ్చి పివి చేసిన ప్రయత్నం ముదావహమే అయినా చట్టంలోని లొసుగుల వల్ల ఆశించిన ప్రయోజనం చేకూరలేదు. హైదరాబాద్ రాష్ట్రంలో బూర్గుల రామకృష్ణారావు కూడా భూసంస్కరణ ఆవశ్యకతను ఆనాడే వెల్లడించినా భూసంస్కరణల అములులో పివియే ప్రధాన భూమిక నిర్వహించారు. ప్రత్యేకాంధ్రోద్యమం, ఇతర రాష్ట్ర సమస్యలవల్ల పివి పదవీకాలం మధ్యలోనే ముగిసి 1973 జనవరి 18న రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించారు. 1971 సెప్టెంబర్ 30న రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టిన పివి తక్కువ కాలమే ఇక్కడ ఉన్నప్పటికీ ఆయన జాతీయ ☞

రాజకీయాలలోనే ఎక్కువ కాలం రాణించారు. సరళీకృత ఆర్థిక విధానాలకు దేశ ప్రధానిగా పివి హయాంలోనే లభించిన ప్రోత్సాహంవల్ల దేశంలో సంస్కరణలకు ఊపు వచ్చింది. జలగం వెంగళరావు 1973 డిసెంబర్ 10న రాష్ట్ర ముఖ్యమంత్రిగా బాధ్యతలు స్వీకరించారు. రాష్ట్ర రెవెన్యూ గణనీయంగా పెరిగింది ఆయన హయాంలోనే. భారత రిజర్వు బ్యాంకులో దాదాపు 120 కోట్ల రూపాయల రాష్ట్ర నిల్వలుండటం ప్రత్యేకంగా చెప్పుకోవాలి. నీటిపారుదల, విద్యుత్తు రంగాల అభివృద్ధికి ఆయన తీసుకున్న చొరవవల్ల రాష్ట్రం 1982 వరకు కూడా కరెంట్ కొరత సమస్య లేకపోగా విద్యుత్తు మిగుల సాధ్యమైంది. పరిశ్రమలకు ప్రాధాన్యతతోనే ఆంధ్రప్రదేశ్ ప్రగతి సాధ్యమని ఆయన ఈ రంగానికి అధిక ప్రోత్సాహం ఇచ్చారు. ప్రభుత్వ ధనంతో స్వంత ఇంటిలో హంగు, ఆర్భాటాలు కల్పించుకుంటున్న ముఖ్యమంత్రులకు భిన్నంగా, వెంగళరావు ఎలాంటి ఆర్భాటం లేకుండా తక్కువ ఖర్చు చేసిన సిఎం కూడా ఆయనే. రాష్ట్రంలో నక్సల్స్ కార్యకలాపాలను అరికట్టేందుకు అధిక శ్రద్ధ తీసుకున్న ముఖ్యమంత్రిగానే కాకుండా, తీవ్రవాదాన్ని అణచివేసిన పేరుకూడా ఆయనకే దక్కింది. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ కాంగ్రెసు అధికా రంలో ఉండటంతో కేంద్ర పథకాలైన 20 సూత్రాల కార్యక్రమం, 15 సూత్రాల ప్రగతి కార్యక్రమాల అమలుకు జలగం అధికశ్రద్ధ చూపారు. ఉద్యోగులకు ఆయనిచ్చిన ప్రోత్సాహంవల్ల ఇప్పటికీ గుర్తు చేసుకుంటున్నారు.

### చెన్నా హయాంలో బలపడిన నక్సల్స్

జాతీయ స్థాయిలో కాంగ్రెసులో చీలిక రావడంతో ఇందిరాగాంధీకి రాష్ట్రం నుంచి ప్రధాన అండగా నిలిచిన మర్రి చెన్నారెడ్డి ఎన్నికల్లో పార్టీని విజయపదాన నడిపించారు. ఇందిరా కాంగ్రెసు పార్టీ వ్యవస్థాపక సభ్యుడు కూడా అయిన చెన్నారెడ్డి 1978మార్చి 6న ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలను స్వీకరించారు. గ్రామీణాభివృద్ధికి ప్రాధాన్యతనిస్తూ, ప్రతి గ్రామానికీ బస్సు-ఇంటింటికో బల్బు అంటూ బడుగు వర్గాలకు ఉపకరించే చర్యలు చేపట్టారు. ఏజెన్సీ ఏరియాలలో రోడ్లు, లింక్ రోడ్ల నిర్మాణం చేపట్టారు. అయితే, ఆయన రెండోసారి 1990 సెప్టెంబర్ 5న సిఎం అయిన తర్వాత తీవ్రవాదుల సమస్యను సామాజిక, ఆర్థిక సమస్యగా భావించి, నక్సల్స్‌కు పూర్తి స్వేచ్ఛ ఇచ్చారు. తీవ్రవాదుల చేస్తున్న కొన్ని కార్యక్రమాలు ప్రజాహితంగానూ, ఫ్యూడలిజాన్ని దెబ్బతీసేలా ఉండి బలహీన వర్గాల సానుభూతి పొందేలా ఉండటంతో చెన్నారెడ్డి వారిపై ఉన్న ఆంక్షలన్నీ ఎత్తివేశారు. తీవ్రవాదులు కూడా జనజీవన స్రవంతిలో కలిసిపోయి ఎన్నికలలో పోటీచేసి వారు కూడా అధికారం చేపట్టేందుకు వీలుందని తెలిపేందుకు చెన్నారెడ్డి తీసుకున్న ఈ నిర్ణయం సఫలం కాలేదు.

### ముఖ్యమంత్రుల దిగుమతి

ఇందిరా కాంగ్రెసు అధికారంలోకి వచ్చి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయిన తర్వాత 1978 నుంచి 1983 వరకు రాష్ట్రంలో సిఎంల మార్పు చర్చనీయాంశమైంది. మొదట చెన్నారెడ్డిని 1980 అక్టోబర్‌లో గద్దె దింపిన తర్వాత టంగుటూరి అంజయ్య 1982 ఫిబ్రవరి వరకు పదవిలో కొనసాగారు. ఆ తర్వాత భవనం వెంకట్రాం కేవలం ఏడు నెలలు ముఖ్యమంత్రిగా కొనసాగగా కోట్ల విజయభాస్కరరెడ్డి 1982 సెప్టెంబర్ 20 ముఖ్యమంత్రి అయ్యారు. కాంగ్రెసు శాసనసభాపక్షం నేతలను మార్చేందుకు న్యూడిల్లీలో కూర్చొని పార్టీ నేతలు పైరవీలు చేయడం దానికి అధిష్టానం అనుమతివ్వడంతో దిగుమతి సిఎంలుగా వారికి పేరు వచ్చింది. ఆంధ్రుల ఆత్మ గౌరవం హస్తినలో తాకట్టు పెట్టారని తెలుగుదేశం పార్టీని స్థాపించిన ఎన్.టి. రామారావు ఆ తర్వాత చేసిన ప్రచారం ప్రజలను ప్రభావితం చేసింది. సినీ రంగంలో దదీప్యమానంగా ప్రకాశిస్తూ, పార్టీ స్థాపించిన లతి తక్కువ కాలంలోనే ఎన్టీఆర్ రాష్ట్ర ముఖ్యమంత్రి కాగలిగారు. పేదవానికి పట్టెడన్నం- రైతన్నకు తక్కువ రేటుకే విద్యుత్తు సరఫరా, బడుగు వర్గాలకు నిలువ నీడ అనే ఎన్టీఆర్ నినాదాలు ఆయనను అధికార పీఠంపై కూర్చోబెట్టగా వాటిని యధాతథంగా అమలు చేసిన ఘనత కూడా ఎన్టీఆర్ దక్కించుకున్నారు. శాశ్వత పథకాల పేర ప్రజలను మభ్యపెట్టడం కాదు ప్రజలను వెంటనే ఆదుకునేలా ప్రభుత్వ కార్యక్రమాలుండాలని ఎన్టీఆర్ నిర్ణయించడంతో నీటిపారుదల-విద్యుత్తు రంగాలకు బడ్జెట్‌లోనూ కోత పడింది. అయితే, మిగులు జలాలతో చేపట్టిన తెలుగు గంగ ప్రాజెక్టుపై ఎన్ని అభ్యంతరాలు వచ్చినా కొనసాగించి రాయలసీమకు మేలు చేసే ప్రయత్నం చేశారు. రాయలసీమను సస్యశ్యామలం చేసేందుకు ఆయన ప్రతిపాదించి, శంకుస్థాపనలు కూడా చేసిన ప్రాజెక్టులన్నింటికీ మోక్షం లభిస్తే సీమలో కరువుండదు. పేదలకు నేరుగా సహాయం లభించే పథకాలకు ఎన్టీఆర్ ప్రాధాన్యత ఇవ్వడంతో సంక్షేమ కార్యక్రమాలకే అధిక బడ్జెట్ వ్యయం కాగా పెట్టుబడి రంగాలతోపాటు ఆర్థిక వ్యవస్థ దెబ్బతింది.

రాష్ట్రాల స్వయం ప్రతిపత్తికి రాజ్యాంగంలోని 356 అధికరణ రద్దుకు ఎన్టీఆర్ చేసిన కృషి మరవలేనిది. ఫెడరల్ రాజ్యాంగం ప్రత్యేకతను ప్రచారం చేయడంతోపాటు కేంద్రమే 'మిధ్య' అని ఆయన అంటుండేవారు. ప్రాంతీయ పార్టీలకు ఆయన వల్లనే ఇంత ప్రాదాన్యత లభించింది. నేషనల్ ఫ్రంట్ ఛైరన్‌గా ఆయన కాంగ్రెసుకు వ్యతిరేకంగా అన్ని ప్రతిపక్ష పార్టీలను ఏకం చేసి కేంద్రంలో ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పాటుకు కారకులయ్యారు. రెండోసారి ముఖ్యమంత్రిగా 1995 జనవరి 12న ప్రమాణ స్వీకారం చేయగానే రాష్ట్ర ఖజానా పరిస్థితిని ఖాతరు చేయకుండా ఎన్టీఆర్ మద్యపాన నిషేధాన్ని అమలు చేయడం కూడా ఆయనకే చెల్లింది. అపజయాలు, వెన్నుపోట్లు ఎలా ఉన్నప్పటికీ ఎన్టీఆర్ రాష్ట్ర రాజకీయాలను మలుపు తిప్పడంతోపాటు ప్రజలలో రాజకీయ అవగాహన పెంపొందడానికి ఎంతో దోహదపడ్డారు.

ఎన్.టి. రామారావు అధికారంలోకి వచ్చిన రెండుసార్లు కూడా అంతకు ముందు ముఖ్యమంత్రిగా కోట్ల విజయ భాస్కరరెడ్డి ఉండటం కాకతాళీయమే కావచ్చు. మర్రి చెన్నారెడ్డి నాయకత్వంలో కాంగ్రెసు 1990 ఎన్నికలలో తెలుగుదేశం పార్టీని పరాజయంపాలు చేసింది. అయితే, తిరిగి ఈ ఐదేళ్ల కాలంలో ముగ్గురు ముఖ్యమంత్రులు మారారు. చెన్నారెడ్డి తర్వాత వచ్చిన నేదురుమల్లి జనార్థన్‌రెడ్డి హయాంలో ప్రయివేట్ యాజమాన్యంలో మెడికల్, డెంటల్ కాలేజీలకు అనుమతించడంపై టిడిపి పెద్ద దుమారం లేవదీయగా ప్రస్తుతం అన్నీ ప్రయివేట్ రంగంలోనే జరుగుతున్నాయి. కోట్ల హయాంలో ప్రయివేట్ రంగంలో విద్యుత్తు ప్రాజెక్టుల నిర్మాణానికి ఒప్పందాలు కుదిరినా వాటిని ఆ తర్వాతి ప్రభుత్వం పునఃసమీక్షించింది. వాటిలో ఏదీ నేటికి వెలుగు చూడలేదు. రాజకీయంగా రాష్ట్రంలో రెండు ఆగస్టు సంక్షోభాలు తలెత్తగా వాటిలో మొదటిదయిన నాదెండ్ల భాస్కరరావు తిరుగుబాటును నెల రోజలలోనే ఎన్టీఆర్ ఎదుర్కోగలిగారు. కానీ, 1995 ఆగస్టు సంక్షోభంతో ఎన్టీఆర్ పూర్తిగా కృంగిపోయారు. అధికార తెలుగుదేశంలో వచ్చిన చీలికతో 1995 సెప్టెంబర్ 1న చంద్రబాబునాయుడు రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించారు.

### అటు పెరుగుతున్న రుణం

### ఇటు సంస్కరణలు

ప్రత్యేక పరిస్థితిలో రాష్ట్రం అధికార పగ్గాల చేతుల్లోకి తీసుకున్న చంద్రబాబునాయుడు క్రమంగా బలపడి 1999లో శాసనసభకు జరిగిన ఎన్నికలలో తెలుగుదేశం పార్టీని విజయపథంలో నడిపించడం ద్వారా తన సీటును పదిలపర్చుకున్నారు. రాష్ట్ర ఆదాయాన్ని పెంచుకునేందుకు విద్యుత్ చార్జీల పెంపుతోపాటు దాదాపు మూడు వేల కోట్ల రూపాయల వరకు ప్రజలపై భారం మోపినా, సంపూర్ణ మద్యనిషేధాన్ని సడలించినా, ప్రయివేట్ రంగానికి పెద్దపీట వేసినప్పటికీ చంద్రబాబు తనదైన శైలిలో ప్రజలకు నచ్చచెప్పే ప్రయత్నం చేశారు. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా మారడంతో అప్పులతో తప్ప అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టని దుస్థితి ఏర్పడటంతో అందిన చోట్ల రుణాలు తెస్తున్నారు. ఇప్పటికే రాష్ట్ర రుణభారం 26 వేల కోట్లకు పైగా ఉంది. ప్రపంచ బ్యాంకు అందిస్తున్న అప్పులకుగానూ వారు విధిస్తున్న ఆంక్షలన్నింటినీ తు.చ. తప్పకుండా అమలు చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం చర్యలు తీసుకోవడంతో సంక్షేమ కార్యక్రమాల అమలుకు ప్రాధాన్యత తగ్గింది. క్రమంగా సబ్సిడీని తగ్గించేందుకు, ఉద్యోగులపై వ్యయాన్ని తగ్గించుకునేందుకు చేస్తున్న ప్రయత్నాలవల్ల కొంత వ్యతిరేకత వస్తోంది. అయితే, సంక్షేమానికి, సంస్కరణలకు సమప్రాధాన్యతనిస్తున్నట్లు ప్రచారం చేస్తున్నారు. ప్రజల భాగస్వామ్యంతో జన్మభూమి అమలు, హైటెక్ విధానాలు ఆయనకు దేశంలోనేకాక విదేశాలలో పేరుతెచ్చిపెట్టాయి. ఐటి రంగంలో అంతర్జాతీయ స్థాయిలో రాష్ట్రానికి గుర్తింపు తెచ్చేందుకు ప్రయత్నిస్తున్నారు. ప్రాంతీయ పార్టీలకు పెరిగిన ప్రాధాన్యతా క్రమంలో చంద్రబాబు జాతీయ రాజకీయాలలో కీలకపాత్ర వహిస్తున్నారు. యునైటెడ్ ఫ్రంట్ కన్వీనర్‌గా కింగ్ మేకర్ అనే పేరుతెచ్చుకున్నారు. ■



మొన్నటి ఎన్నికల్లో చంద్రబాబునాయుడు సాధించిన విజయం సంప్రదాయ రాజకీయ పరిశీలకుల అంచనాలకు అంతుచిక్కనిది. గత పదేళ్లుగా శరవేగంగా చోటుచేసుకుంటున్న సామాజిక మార్పులను విస్తృతమౌతున్న మధ్య తరగతి పరిధినీ, ప్రాబల్యాన్ని సరిగ్గా అంచనా వేసుకున్నందువల్లే, ఆ వర్గానికి ఆయన రాజకీయ ప్రతినిధి కాగలిగారు. కృషి, పట్టుదల, క్రమశిక్షణ ఉంటే ఏదైనా సాధించవచ్చనే విజయగాధలకు 'రోల్ మోడల్'గా చంద్రబాబు స్థిరపడ్డారు. ఈ పరిణామంపై మురళి అంచనా...

# రాజకీయ 'కృషి పండిట్'

జగద్విఖ్యాత జననాయకుడైన మావో జెడాంగ్ విదానాలను తిరగదోడి, చైనా ప్రజలను మెప్పించడానికి డెంగ్ జియావోపింగ్ అంతటివాడికి పదిహేనేళ్ల సమయం పట్టింది. ఆంధ్ర రాజకీయాల్లో మేరుపర్వతం లాంటి ఎన్టీరామారావును పదవి నుంచి దింపి, ఆయన సంక్షేమ విధానాలను అటకెక్కించి, ఆ వెంటనే ప్రజావిశ్వాసాన్ని పొందగలగడం ఒక్క చంద్రబాబునాయుడుకే చెల్లింది. రాజనీతి వ్యూహకర్తలు పరిపాలనాదక్షులుగా రాణించడం, పాలనాదక్షులు రాజకీయాల్లో రాణకెక్కడం అరుదైన విషయం. చంద్రబాబుది అరుదైన పీట్. ఇరవై ఒకటో శతాబ్దానికి బారతదేశ రాజకీయ నాయకునిగా ప్రపంచం దృష్టిని ఆకర్షిస్తున్న చంద్రబాబు విజయాల వెనుక చిదంబర రహస్యమేమీ లేదు. కృషి, పట్టుదల, క్రమశిక్షణలే ఆయనకు మనవిజయాలను సాధించి పెట్టిన ఆయుధాలు. జనం 'పల్స్' తెలుసుకోగలగడం, మారుతున్న ప్రపంచాన్ని అంచనా కట్టడం ఆయనకున్న అదనపు అర్హతలు. అందువల్లనే ప్రజాబిప్రాయానికి అనుగుణంగా తన పద్ధతులను సవరించుకోవడం, తాము రూపొందించిన విదానాలకు అనుకూలంగా ప్రజాబిప్రాయాన్ని మలుచుకోగలగడం ఆయనకు సాధ్యమవుతోంది. .

ఏ రాజకీయ వారసత్వం లేకుండా, పెద్దగా ఆర్థిక ఆలంబన కూడా లేకుండా ఇరవై ఎనిమిదేళ్ల వయసులోనే రాష్ట్రమంత్రి కాగలగడమే చంద్రబాబు స్వయం ప్రతిబకు నిదర్శనం. అప్పుడు ఎన్టీఆర్‌కు ఈయన బంధువు కాదు, ఎన్టీఆర్ రాజకీయాల్లోకే రాలేదు కూడా. 1984 ఆగస్టు సంక్షోభ సమయంలో చంద్రబాబు రాజకీయ వ్యూహ నేర్పరితనాన్ని లోకం గుర్తించింది. రాజ్‌బవన్ రాజకీయాలతో అదికారం కోల్పోయిన నెలరోజుల్లోనే ప్రజాభిప్రాయం అండతో కేంద్రం మెడలు వంచి మళ్లీ అధికారపగ్గాలు చేపట్టిన ఆనాటి సంఘటన భారత ప్రజాస్వామిక చరిత్రలోనే ఒక ఉజ్వల ఘట్టం. తెలుగుదేశం పార్టీ అదికారాన్ని కోల్పోయి ☞



కాంగ్రెస్ గద్దెనెక్కిన ఐదేళ్ల కాలంలో ప్రతిపక్ష నాయకుని పాత్రను ఆచరణలో పోషించింది చంద్రబాబునాయుడే. కాంగ్రెస్ విధానాలకు వ్యతిరేకంగా ఈ ఐదేళ్ల కాలంలో సాగించిన ప్రచారం, చేసిన ఆందోళనల పర్యవసానంగానే 1994లో మళ్లీ తెలుగుదేశం పార్టీ అధికారంలోకి రాగలిగింది. తెలుగుదేశం పార్టీ అధికారంలో వున్నప్పుడూ, లేనప్పుడూ కూడా పార్టీ యంత్రాంగాన్ని నిత్యచైతన్యంగా నిలబెట్టిన వ్యక్తి కూడా నారా చంద్రబాబే.

తాను డీల్ చేస్తున్న విషయాన్ని శ్రద్ధగా ఆకళింపు చేసుకొని పట్టుదలతో కార్యాచరణలో పెట్టడం చంద్రబాబు పద్ధతి. యువజన కాంగ్రెస్ రాష్ట్ర ఉపాధ్యక్షునిగా వున్నప్పుడుగానీ, మదురానగర్ ఆఫీసులో కూర్చొని సొంత వ్యాపారం చూసుకున్నప్పుడు గానీ, రాజకీయ వ్యవహారాల్లోగానీ అంతే దీక్షతో ఆయన పనిచేసే వారు. రెవిన్యూ మంత్రిగా కొద్దికాలమే వున్నప్పటికీ ఆ శాఖలో పెద్దఎత్తున సంస్కరణలు ప్రారంబించి, తాను ముఖ్యమంత్రి అయిన అనంతరం కూడా వాటిని కొనసాగించారు.

బారత్‌పై ఆర్థిక ఆంక్షలు కొనసాగుతున్న సమయంలో కూడా ప్రపంచ బ్యాంకు రుణాన్ని తీసుకు రాగలగడం గొప్పతనమా, కాదా?... పెద్దఎత్తున ప్రైవేటైజేషన్‌ను ప్రోత్సహించడం సత్ఫలితాలిస్తుందా, దుష్పరిణామాలకు దారి తీస్తుందా? ఐ.టి. రంగంలో నిదులు ఖర్చు పెడితే వ్యవసాయిక సమాజంలో ఆర్థికాభివృద్ధి సాధ్యమౌతుందా మొదలైన ప్రశ్నలకు కాలమే సమాధానం చెప్పవలసి వున్నప్పటికీ ముఖ్యమంత్రిగా చంద్రబాబు అనేక ఘనవిజయాలను సాధించారు.

ఇరవై ఏళ్ల క్రితంతో పోలిస్తే చదువుకున్న వాళ్ల శాతం పెరిగింది. ఉపాధి మార్గాలు ఎక్కువయ్యాయి. ఇదే నిష్పత్తిలో మద్యతరగతి వర్గం కూడా విస్తరించింది. సమాజంపై ఈ వర్గప్రబావం కూడా ఎక్కువైంది. సోషలిస్టు వ్యవస్థ పతనం, సరళీకృతమైన ఆర్థికవ్యవస్థ, సమాచార విప్లవం వంటి పరిణామాలు మద్యతరగతిని బాగా ప్రబావితం చేశాయి. సామాజిక ఆశయాల స్థానాన్ని వ్యక్తిగత ఆశలు భర్తీ చేశాయి. సమిష్టి అవసరాల కోసం ఉద్యమాలు చేసే తీరిక, ఓపిక ఈ వర్గానికి లేదు. విద్యుత్ ఛార్జీలు పెంచినా, బస్సు ఛార్జీలు పెంచినా వీరికి పట్టదు. సంపాదించే అవకాశాలుంటే ఇదో లెక్కా అనే ధోరణి ప్రబలింది. హైటెక్ సమాజంలో ధనార్జన మార్గాలపై ఒక రంగుల దృశ్యం ఆవిష్కృతమై ఉంది. కళ్లముందటే కోటీశ్వరులవుతున్న వారు, చూస్తుండగానే కార్లు, బంగళాలు సంపాదిస్తున్న వాళ్లు ఎంతోమంది కనబడుతున్నారు. ఏదో ఒక మార్గంలో కష్టపడితే డబ్బు సంపాదించడం అసాధ్యం కాదన్న అభిప్రాయం బలపడింది. వీళ్లకు బాబు విధానాలు ఎంతగానో నచ్చాయి. జనం అడక్కుండానే రోడ్లు విస్తరిస్తున్నాయి, ఫ్లైఓవర్లు లేస్తున్నాయి. అడిగిందే తడవుగా రోడ్లు, డ్రైనేజీ, పాఠశాల భవనాల నిర్మాణంవంటి పనులు జన్మభూమి పేరుతో చకాచకా జరిగిపోతున్నాయి. ఇందులో జరిగే అవినీతిని వెతకనక్కరలేదు. పని జరిగిందే ప్రధానమనే ప్రజాభిప్రాయం ఏర్పడింది. ఎప్పుడో ఎనిమిది శతాబ్దాల క్రితం చోళ రాజ్యంలో ఉన్న సాగునీటి సంఘాలను పునరుద్ధరించడం సత్ఫలితాలిచ్చింది. సాగుభూమి పెరిగింది. పంట దిగుబడి పెరిగింది. విద్యుత్ ఛార్జీలు పెంచినా రైతు జీర్ణించుకోవడానికి ఇదో కారణం. ఆకస్మిక తనిఖీల పేరుతో అధికారులపై ఉరుముతుంటే జనం చప్పట్లు కొడుతున్నారు. మనం చేయలేని పనులను ఒక హీరో చేస్తుంటే కలిగే సంతోషం అది. హైటెక్ సిటీ ఏర్పాటు, టూరిస్ట్ సెంటర్‌గా ట్యాంక్‌బండ్ ప్రాంతం అభివృద్ధి, ఇంటర్నేషనల్ బిజినెస్ స్కూల్ సాదించడంవంటి పనులు చంద్రబాబుకు హైదరాబాద్ చరిత్రలో శాశ్వత స్థానాన్ని కల్పిస్తాయి. రైతుబజార్ల స్థాపన ఆయన ప్రభుత్వానికి పెద్ద ప్లస్ పాయింట్. జన్మభూమి, సాగునీటి సంఘాలు సక్సెస్ కిందే లెక్క. సిఎంఇవై ఫర్వాలేదు. విద్యాకమిటీలు మాత్రం విఫలమయ్యాయి. విద్యుత్ సంస్కరణలు వికటించినట్లే కనబడుతోంది. వ్యవసాయరంగంపై సరైన విధానంలేదన్న విమర్శ వినవస్తోంది.

కష్టపడే వ్యక్తిగా, పనిచేసే సిఎంగా చంద్రబాబు జనం దృష్టిలో స్థిరపడిపోయారు. ఆయన స్వయంకృషికి తోడు పకడ్బందీగా రూపొందించిన మీడియా వ్యూహం కూడా అందుకు దోహదపడింది. సమాజంలో బాగా విస్తృతమవుతున్న మధ్యతరగతి ప్రభావాన్ని సరిగ్గా గుర్తించడం, ఈ తరగతిని ఆకర్షించే విధానాలను అవలంబించడం కలిసొచ్చింది. ప్రజామద్ధతు ఇచ్చిన ఆత్మవిశ్వాసంతో ఇరవై ఏళ్ల అభివృద్ధి ప్రణాళికను రూపొందించుకొని విజయపథంలోకి దూసుకెళుతున్నారు. ■







ఈ సహస్రాబ్దే తెలుగు సాహిత్యానికి తొలి సహస్రాబ్ది. నన్నయ్యనే ఆదికవిగా పేర్కొన్నారు గనుక తెలుగు సాహిత్యం వయసు కూడా సుమారు వెయ్యేళ్లు. ఈ వెయ్యేళ్లలో తెలుగు సాహిత్యంలో వేయి కెరటాలు వెల్లువెత్తాయి. వేయి భావాలు వికసించాయి.

తెలుగు సాహితీ వికాసంపై 'దేవి' విహంగ వీక్షణం...

# వాణీ నా తెలుగు రాణీ

అనంత విశ్వంలో కొన్ని వందల ఏళ్ల తర్వాత మనిషి ఉద్భవిస్తే, మరెన్నో వందల ఏళ్ల తర్వాత భాష పుడితే, మరెన్నో ఏళ్లకు లిపి ఏర్పడీ, లేఖనం ఏర్పడీ, మనిషికి తీరుబడి దొరికి-సాహితీ సృష్టి జరిగింది. చరిత్ర మొదలైంది. లేఖనం లేని దశను చరిత్ర పూర్వయుగమనేట్లయితే, లేఖన దశను చరిత్రగా పేర్కొన్నారు. ఈ చరిత్రను, అనేకమంది అనేక రకాలుగా విభజించారు. కొంతమంది కాలాన్ని ప్రాతిపదికగా తీసుకుంటే, కొందరు ధోరణులను, మరికొందరు ఆయా కాలాల్లో పాలించిన రాజులను లెక్కలోకి తీసుకొని విభజన చేశారు. ఒకరి 'విభజన' మరొకరెవ్వరూ అంగీకరించలేదు. అందుకు ఎవరి కారణాలు వారికి ఉన్నప్పటికీ ప్రధానంగా మౌఖిక సాహిత్యం, లిఖిత సాహిత్యం, ప్రబంధ సాహిత్యం, భక్తి సాహిత్యం, ప్రజా సాహిత్యం, ఆధునిక సాహిత్యం వంటి విభజనే చాలామందిలో వేర్వేరుగా కనిపిస్తున్నది.

అధికారంలో వుండేవారికి, అందులో కొనసాగే వారికి దాన్ని కాపాడుకోవలసిన అవసరం వుంది. బలవంతులమని, ధనవంతులమని, విద్యగలవాళ్లమనిగాక-దైవాంశసంభూతులుగా, కారణజన్ములుగా తమనితాము పేర్కొనడం ద్వారా జన సామాన్యంలో పట్టు సడలకుండా కాపాడుకోవచ్చు. అందుకే వేంగీ దేశాన్ని పాలించిన రాజరాజ నరేంద్రుడు 'మహా భారతం'తెలుగులో రాయాల్సిందిగా నన్నయ్యను కోరాడు. ఇతర ప్రాంతీయ భాషల్లో వచ్చిన భారతాలతో పోలిస్తే నన్నయ్య భారతం విస్తృతమైనదీ, విశిష్టమైనదీ కూడా. వైదిక వ్యవస్థను దెబ్బతీయటానికి మల్లికార్జున పండితారాధ్యుడూ, నన్నెచోడుడూ కృషిచేస్తే పాల్కురికి సోమన విజృంభింప చేశాడు. నన్నయ్య అంతటి వాడు ఏర్పర్చిన పద్ధతిని వ్యతిరేకిస్తూ, జాను తెనుగు అంటూ బసవ పురాణం రాశాడు. 11వ శతాబ్దంలో నన్నయ్య వదిలివేసిన భారతాన్ని 13వ శతాబ్దిలో తిక్కన స్వీకరించి 'తుది ముట్టన్ రచియించు టొప్పు'అని భావించాడు. దేశి, జాను తెనుగు అమితంగా ఇష్టపడిన తిక్కన వ్యాకరణ రచనను ప్రోత్సహించాడు. వీరిద్దరు వదిలేసిన భాగాన్ని 14వ శతాబ్దిలో ఎర్రన పూరించాడు. 14వ శతాబ్దం ఉత్తరార్ధంలో శ్రీనాథుడు అవతరించడంతో శైలీ పరమైన చర్చ మొదలైంది. వస్తువు ఎన్నుకోడంలో, అందుకు తగిన విధంగా భాషను ప్రయోగించడంలో శ్రీనాథుడు విశేషమైన ప్రతిభకనబర్చాడు. అయితే, దీనికి బీజం వేసింది నాచన సోమనాథుడేనంటారు. 15వ శతాబ్దికి చెందిన బమ్మెర పోతన భాగవతాన్ని తెనిగించడంతో సాహిత్యంలో 'భక్తి మార్గం' ప్రారంభమైందని చెప్పొచ్చు. అప్పటి వరకూలేని తిరుగుబాటు తత్వం-కావ్యాన్ని రాజులకు అంకితం ఇవ్వకుండా, భూమి దున్నుకు కుటుంబ పోషణ చేసుకుంటానన దం-పోతనలో కనపడుతుంది. అంతమాత్రంచేత పోతన రాచరిక వ్యవస్థను వ్యతిరేకించాడనలేం. ఇదే 15వ శతాబ్దిలోని తాళ్లపాక తిమ్మక్క 'సుభద్రా కల్యాణం'ను తొలి తెలుగు కావ్యం పేర్కొంటుండటంతో ఆమెను తొలి తెలుగు కవయిత్రిగా గుర్తిస్తున్నారు. 12 శతాబ్దిలోని కృష్ణమాచార్యునితోనే సంకీర్తనా మార్గం తెరుచుకున్నప్పటికీ 1424-1503 మధ్య కాలంలో జీవించిన అన్నమయ్యతోనే అది ఉత్కృష్ట దశకు చేరుకుంది. తిరుపతి వేంకటేశ్వరునిపై కొన్ని వేల గీతాలు ఆయన ఆలపించాడు. ప్రబంధ రచనకు శ్రీకృష్ణదేవరాయలు శ్రీకారం చుట్టినట్టు భావిస్తే, ఆయన ఆస్థానంలోని అష్టదిగ్గజాల్లో ఒకడైన అల్లసాని పెద్దన దీన్ని ఉచ్ఛ స్థితికి తీసుకుపోయాడు. మహా ప్రబంధం 'మను చరిత్ర'లోని వరూధిని, ప్రవరుడు నేటికీ చిరంజీవులే. ఇదే కాలానికి చెందిన ధూర్జటి కూడా తన కృతిని రాయలుకు అంకితమివ్వడానికి ససేమిరా అన్నాడు. అంతేగాదు, 'రాజులు మత్తులు, వారి సేవ నరకప్రాయంబు...'అని నిర్మొహమాటంగా చెప్పేశాడు. 16,17 శతాబ్దాల మధ్య కాలనికి చెందిన ప్రజాకవి వేమన మతపరంగా సాగుతూ వస్తున్న సాహిత్యంలో తత్వాన్ని ప్రవేశపెట్టాడు. సులభమైన పదాలు, పోలికలు వేమనలో మనం చూడొచ్చు.

19,20వ శతాబ్దంల్లోకి ప్రవేశిస్తుంటే ఎన్నో ప్రక్రియలకు ఆద్యుడైన కందుకూరి వీరేశలింగం, తెలుగు భాషోద్యమానికి కృషి చేసిన గిడుగు రామ్మూర్తి, జాతీయోద్యమ కవిత్వాన్ని బలంగా వినిపించిన గరిమెళ్ల సత్యనారాయణ, దేశభక్తి కవిత్వానికి ఆద్యుడైన రాయప్రోలు సుబ్బారావు, 'వేయి పడగల' విశ్వనాధ సత్యనారాయణ తదితరులు కనిపిస్తారు. నేడు దాదాపుగా అందరూ అంగీకరించిన ఆధునిక కవి, తొలి కథకుడు గురజాడ అప్పారావు కొత్త సృష్టికి ప్రాణం పోశారు. వీరి 'కన్యాశుల్కం' నాటకం నేటికీ సజీవమైదే. ఇదే శతాబ్దంలో భావ కవిత్వాన్ని దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి విస్తృతంగా ప్రచారంచేస్తే, ప్రేయసి మెల్లకన్ను మీద పద్యాలు రాయడం కాదు, వాటి వెనకున్న అగాధాల్ని చూడాలంటూ గుడిపాటి వెంకటా చలం కలం ఝుళిపించాడు. ప్రాచీన సాహిత్యాధ్యయనంతోపాటు చివరి ముగ్గురి ప్రభావంతో శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీశ్రీ) తెలుగు సాహిత్యంలో కార్చిచ్చులా వ్యాపించాడు. ఎంతో సాహసంతో, ఆత్మ విశ్వాసంతో ఈ శతాబ్దం నాది అని చాటుకున్నాడు.

ఇక ఆ తర్వాతకొస్తే తిలక్, ఆరుద్ర, దాశరధి, అనిశెట్టి సుబ్బారావు, సి.నారాయణ రెడ్డి, కెవియార్, కొడవటిగంటి కుటుంబరావు, శ్రీపాద సుబ్రమణ్య శాస్త్రి, త్రిపురనేని గోపీచంద్, రాచకొండ విశ్వనాధ శాస్త్రి, కాళీపట్నం రామారావులాంటి అనేక మంది ఉద్దండులు కనిపిస్తారు. ఈ శతాబ్దం చివర్లో అనేక సాహిత్యోద్యమాలు తలెత్తడంతోపాటు, అనేకమంది కవుల్ని కళాకారుల్ని సృష్టించాయి. యాభైల చివర్లో ఏర్పడిన అరసం తర్వాత రాజకీయ చైతన్యాన్ని కోల్పోవడం, చుట్టూ పేరుకుపోయిన నిశ్శబ్దంపై దిగంబర కవుల తిరుగుబాటు, నక్సల్బరీ నిప్పురవ్వలు శ్రీకాకుళంలో రాజుకుని విరసం ఆవిర్భవించటం అందరికీ తెలిసిన నేటి చరిత్రే. ■





వందల ఏళ్లపాటు తెలుగు నేలను తెలుగేతరులే పరిపాలించినా తెలుగుజాతి తేజస్సు తగ్గిపోలేదు. ఆలయ శిల్పానికి ఆద్యులం మనం. నాట్యానికి నడకలు నేర్పింది మనం. తెలుగు నాటకానికి 'కన్యాశుల్కం' చెల్లించాల్సిందే. మానవులంతా ఒకటని చాటే 'మరో ప్రపంచం' తెలుగుజాతిది. దిగ్గజాల్లాంటి తెలుగువారు వివిధ రంగాల్లో దిగంతాల దాకా తెలుగు ఖ్యాతిని చాటిచెప్పారు. వెయ్యేళ్ల కాలంలో కాంతులు విరజిమ్మిన తెలుగు యశోచంద్రికల స్థూల ప్రస్తావన...

# చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి    మా తెలుగు...
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి    మా తెలుగు...
అమరావతీనగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగు తల్లి, జై తెలుగు తల్లీ!

*- కీ.శే. శంకరంబాడి సుందరాచార్య*

నన్నయ : తెలుగుబాషను శాస్త్రీయంగా తీర్చిదిద్ది నూత్న ఒరవడిని చేకూర్చిన కవి నన్నయ్య. తెలుగు కవులందరికీ ఈయన అన్నయ్య. ఆదికవి, శబ్దశాసనుడు, అనేవి నన్నయ్య బిరుదులు. రాజరాజనరేంద్రుని ఆస్థానంలో కవిగా రాచమర్యాదలందుకొని తెలుగుబాషను సుసంపన్నం చేసిన మహనీయుడు నన్నయ్య. వ్యాసభారతాన్ని ఆంధ్రీకరించేందుకు పూనుకొని నన్నయ్య మనకు ఆదికవి అయ్యాడు. మహాభారతంలోని ఆదిసభాపర్వాలను అరణ్య పర్వంలోని కొంత భాగాన్ని ఆయన రచించి ఆంధ్రులకు అందించాడు. ప్రసన్న కధాకలితార్ధయుక్తి, నానారుచిరార్ధసూక్తి, అక్షరరమ్యత, నన్నయ్యశైలిలోని ప్రత్యేకతలు. ఆంధ్ర శబ్దచింతామణి అనే వ్యాకరణ గ్రంధాన్ని కూడా రచించి నన్నయ్య తెలుగుబాష యశస్సును దిగంతాల వరకు వ్యాపింప చేశారు.

తిక్కన సోమయాజి : శబ్దగుణ సంయోజనం కన్నా అర్ధగుణ సంసిద్ధికి ప్రాధాన్యం ఇచ్చిన కవి తిక్కన. మనుమసిద్ధి ఆస్థానంలో కవిగా భాసిల్లిన తిక్కన హరిహర నాథ తత్త్వము అనే ఆలోచన ధోరణికి పునాదివేశాడు. మహాభారతంలో ☞

పదిహేను పర్వాలు రచించి తెలుగు భాషకు ఒక అమూల్య కానకనందించాడు. ఇతనికి ఉభయ కవిమి త్రుడనే బిరుదు వుంది.

**శ్రీనాధుడు** : కవిత్రయం నన్నయ్య, తిక్కన, ఎర్రనల తర్వాత మనం సగర్వంగా చెప్పుకొనే సర స్వతీ వరప్రసాది శ్రీనాదుడు. 14వ శతాబ్ది చివరి పాదాన జన్మించి 15వ శతాబ్ది పూర్వార్థం వరకూ 70 ఏళ్లు జీవించాడు. పండిత వంశంలో జన్మించిన శ్రీ నాధుడు బాలకవిగా మరుత్తరాట్ చరిత్ర పలికాడు. నూత్నయవ్వనంలో శాలివాహన సప్తశతిని రచిం చాడు. నిండు యవ్వనంలో శృంగార నైషధాన్ని అం దించాడు. హరవిలాసము, శివరాత్రి మహత్యము, కాశీఖండము, భీమఖండము రచనలు చేశాడు. కవి పండితుల మీద ధ్వజమెత్తుతున్న గౌడ డిండిమ భట్టును ఓడించి ఆయన కంచు ఢక్కను పగులగొట్టించాడు. రాజ భోగాలు అనుభవించిన శ్రీనాధుడు జీవిత చరమ దశలో దీన స్థితిలో మరణించాడు.

**అల్లసాని పెద్దన** : 'శిరీష కుసుమపేశల సుధామ యొక్తుల' కవిత్వాన్ని చెప్పి ఆంధ్ర భోజునిగా కీర్తిగడిం చిన కృష్ణదేవరాయల ప్రశంస లందుకున్న కవి పెద్దన. ఆయన రచించిన మనుచరిత్ర కావ్యం మహా కవులకు సైతం ప్రేరణ ఇచ్చింది. ఆంధ్ర కవితా పితామహుడని తెలుగు లోకం కీర్తించింది.

**పాల్కురికి సోమనాధుడు** : ద్విపదకు కావ్య గౌరవం కల్పించి, సాహిత్య క్షేత్రంలో పట్టాభిషేకం చేసిన శివ తత్వ ఉద్యమ కవి పాల్కురికి సోమనాధుడు. ఆయన రచించిన బసవపురాణం ప్రధమాంధ్ర దేశి పురాణమని విమర్శకుల అభిప్రాయం.

**శ్రీకృష్ణదేవరాయలు** : సామంతులను అదుపు చేసిన చక్రవర్తిగానే కాకుండా కళలను, సారస్వతాన్ని పోషించిన కళా ప్రియుడిగా పేరు పొందాడు. అష్ట దిగ్గజాలకు, నాట్య విద్వాంసులకు ఆస్థానంలో స్థానం కల్పించాడు. ఆముక్తమాల్యద అనే గ్రందాన్ని రచించి కవి పండితుడిగా పేరు సంపాదించాడు.

**మొల్ల** : చిన్న చిన్న పద్యాలలో గొప్ప అర్థాలను సమకూర్చి రచించిన కవయిత్రి మొల్ల. ఆమె రచిం చిన రామాయణం పెద్ద కవులను కూడా ఆశ్చర్య పరి చింది. తాత్వికమైన ప్రశ్నలు, చమత్కారాలు ఆమె రచనల్లో విశేషాంశాలు.

**తెనాలి రామకృష్ణ** : వికట కవి బిరుదుతో ఎంతో ప్రసిద్ధుడయ్యాడు. ఎంతటి మొనగాడి కవిత్వంలో నైనా తప్పులు చూపించగల సత్తా ఆయనకు మా త్రమే వుంది. పాండురంగ మహత్మ్యం అనే మహాకా వ్యాన్ని రచించాడు.

**అన్నమయ్య** : అన్నమాచార్య కడప జిల్లాలోని తాళ్ళపాక గ్రామంలో 1408 మే 9 వ తేదీన జన్మిం చారు. సుమారు 32 వేలకు పైగా సంకీర్తనలు తెలుగులో స్వయంగా రాసి గానం చేసిన ప్రప్రదమ సంకీర్తనాచార్యుడు, పదకవితా పితామహుడు అన్న మయ్య. ఆయన కీర్తనల్లో తాత్విక సత్యాలు, సాం ఘిక విమర్శలు, నీతినియమాలు లాలిపాటలు, బాలకృష్ణ లీలలు ఉన్నాయి.

**రామదాసు** : రామదాసుగా పేరు పొందిన కం చెర్ల గోపన్న రాసిన పాటలు, కీర్తనలు, తెలుగువాళ్ల హృదయాల్లో చిరస్థాయిగా వుండే ఆణిముత్యాలు.




**శ్యామశాస్త్రి** : కర్నాటక సంగీతంలో ప్రముఖ వాగ్గే యకార త్రయంలో త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షి తుల సరసన నిలిచినవాడు శ్యామశాస్త్రి. శ్యామశాస్త్రి రాసిన కీర్తనలు ఉల్లాసం కలిగించేవి. చక్కని లయ తాళ ప్రదర్శనలకు అనుగుణంగా ఉండేవి. శ్యామశాస్త్రి కీర్తనలలో క్లిష్టమైన తాళ రచన ఉంటుంది.

**త్యాగయ్య** : కర్నాకట సంగీతానికి విశేష ఖ్యాతిని తెచ్చిన ప్రముఖ వాగ్గేయ కారుడైన త్యాగయ్య రామబ్రహ్మ,సీతమ్మ దంపతులకు 1767వ సంవ త్సరం మే 4వ తేదీన తమిళనాడులోని తిరువా యూరులో జన్మించాడు. త్యాగయ్య పూర్వీకులు ప్రకా శం జిల్లాలోని కాకర్ల గ్రామస్తులు. భావరాగాలకు ప్రాధాన్యమిస్తూ తాగయ్య రాసిన కీర్తనలు అనేకం ఉన్నా ప్రస్తుతం వెయ్యికి లోపే లభ్యమవుతున్నాయి.

**వేమన** : సమాజంలో ఉన్న మూఢాచారాల పై తిరగబడిన విప్లవ మతసంస్కర్త వేమన. గోరంత పద్యంలో కొండంత బావాన్ని ఇమిడ్చి శతకాన్ని ఆయన రాసాడు. కడప మండలంలోని ఒక చిన్నపల్లెలో మధ్యతరగతి కాపు కులస్తులకు జన్మించాడనీ, యోగిగా రాయలసీమంతా తిరిగి,చివరకు కడప సమీపంలోని పామూరుకొండ గుహల్లో వేమన సిద్ధిం పొందినట్లు పరిశోధకులు చెబుతున్నారు.

**జిడ్డు కృష్ణమూర్తి** : జిడ్డు కృష్ణమూర్తి చిత్తూరు జిల్లాలోని మదనపల్లెలో 1895 మే 11 న జన్మించారు. ఆయన గొప్ప దార్శ నికుడు, విద్యావేత్త, రచయిత, కవి, వేదాంతి, జీవిత సమస్యల్ని అర్థం చేసుకొన్న వ్యక్తి. ఆయన 700 గ్రంధాల్ని రాసారు. కాలిఫోర్ని యాలో తన కుటీరంలో 1986 ఫిబ్ర వరి 17న ఆయన మరణించారు.

**ప్రకాశం పంతులు** : టంగుటూరి ప్రకాశం పంతులు 1872 లో ప్రస్తుతం ప్రకా శం జిల్లాలో ఉన్న కనపర్తి గ్రామంలో జన్మిం చారు. స్వాతంత్రోద్యమంలో పాల్గొని ఆయన సర్వ స్వాన్ని త్యాగం చేశారు. 1946 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేశారు. 1953 లో కర్నూలు రాజధానిగా ఉన్నపుడు ఆంధ్రరాష్ట్ర ప్రప్ర ధమ ముఖ్యమంత్రి ప్రకాశమే. 1957 మే 20 న ఆయన మరణించారు.

**కాశీనాధుని నాగేశ్వరరావు** : ప్రముఖ స్వాతం త్ర్య సమరయోధుడు. ఆంధ్రపత్రిక-దిన వార పత్రి కల సంస్థాపకుడు. భారతి మాసపత్రిక, అమృతాంజ నం కంపెనీ యజమానిగా ఆయన ఉండేవారు. దేశ భక్తికి ప్రతీకగా నిలిచిన ఆయనను గాంధీ విశ్వదాతగా అభివర్ణించారు.1924లో మద్రాసులో జరిగిన ఆంధ్ర మహాసభలో ఆయనకు దేశోద్ధారక బిరుదును ప్రక టించారు. 1938ఏప్రిల్ 11న ఆయన మరణించారు.

**పింగళి వెంకయ్య** : జాతీయ జండాను రూపొం దించిన పింగళి వెంకయ్య 1876 ఆగస్టు 2న కృష్ణా జిల్లా దివితాలూకాలో భట్లపెనుమర్రు గ్రామంలో జన్మించారు. 1921 మార్చి విజయవాడలో జరిగిన అఖిల బారత కాంగ్రెసు కమిటీ సమావేశాల్లో ☞





గాంధీజీ ఆయనను ఆహ్వానించి జాతీయ జెండాను రూపొందించవమని కోరగా కేవలం మూడు గంటల వ్యవధిలో ఆయన జెండాను రూపొందించారు.

**క్షేత్రయ్య** : శ్రీకృష్ణుని చిద్విలాస పురుషునిగా ఊహించి, పరమ పురుషునిగా భావించి, తేట తెలుగులో ఐదువేల పైచిలుకు పదాలు రచించి మధురభక్తితత్వాన్ని సమృద్ధం చేసిన పండితుడు క్షేత్రయ్య.

**సరోజినీ నాయుడు** : ఫిబ్రవరి 13,1879లో హైదరాబాద్‌లో జన్మించారు. ఆమె కవయిత్రి, వక్త, దేశభక్తురాలు. ఆంగ్లంలో ఆమె రాసిన కవితలు నాలుగు సంపుటాలుగా వెలువడ్డాయి. నైటింగేల్ ఆఫ్ ఇండియాగా ఆమె ప్రసిద్ధిగాంచారు. దండి ఉప్పు సత్యాగ్రహంతో పాటు క్విట్ ఇండియా ఉద్యమంలో ఆమె పాల్గొన్నారు. స్వాతంత్ర్యం వచ్చాక ఉత్తరప్రదేశ్ గవర్నర్గా ఆమె పని చేశారు

**భోగరాజు పట్టాభి సీతారామయ్య** : 1880 నవంబరు 24న పశ్చిమగోదావరి జిల్లా ఏలూరుకు దగ్గర్లోని గుండుగొలను గ్రామంలో జన్మించారు. స్వాతంత్ర్య సమరయోధునిగా, అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షునిగా, ఆంధ్రాబ్యాంక్ వ్యవస్థాపకుడిగా ఆయన కీర్తిగడించారు. భారత జాతీయ కాంగ్రెస్ చరిత్రను రాశారు.

**సర్వేపల్లి రాధాకృష్ణన్** : సెప్టెంబర్ 5, 1888 న మద్రాస్‌కు 40 మైళ్ళ దూరంలో ఉన్న తిరుత్తణిలో జన్మించారు. రాధాకృష్ణన్ గొప్ప తత్వజ్ఞాన నిధి, విద్యావేత్త, వక్త, వేదాంతి, మానవతావాది, మహామేధావి, రాజనీతిజ్ఞుడు, నిరాడంబరుడు. 1946లో భారత రాజ్యాంగ పరిషత్ సభ్యునిగా ఆయన పనిచేశారు. రెండుసార్లు ఉపరాష్ట్రపతిగా ఒకసారి రాష్ట్రపతిగా ఆయన పదవీ బాధ్యతలను నిర్వహించారు.1969లో ఆయనకు భారత రత్న బిరుదు లభించింది.

**అల్లూరి సీతారామరాజు** : 1897 జూలై 4న విశాఖపట్నం సమీపంలోని పాండ్రంగి గ్రామంలో జన్మించారు. మన్యంలోని గిరిజనులను సమీకృతం చేసి బ్రిటీషు వారికి వ్యతిరేకంగా సీతారామరాజు పోరాటం జరిపాడు. మన్యం ప్రజలను పోలీసులు బాధించకుండా ఉండేందుకు సీతారామ రాజు బ్రిటిష్ వారికి లొంగిపోవడంతో బ్రిటిష్ పోలీస్ అధికారి మేజర్ గుడాల్ ఆయనను కాల్చివేసాడు.

**బూర్గుల రామకృష్ణారావు** : మహబూబ్ నగర్ జిల్లాలోని కల్వకుర్తి తాలూకా పడకాల్ గ్రామంలో 1899 మార్చి 13 న జన్మించారు. బూర్గుల రామకృష్ణారావు నిర్ణయంవల్లే 1956 నవంబర్ 1న హైదరాబాద్ రాజధానిగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. హైదరాబాద్ రాష్ట్రానికి ఆయన ముఖ్యమంత్రిగా పని చేశారు. కేరళ గవర్నర్‌గా, ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా, రాజ్యసభ సభ్యునిగా ఆయన పనిచేశారు.

**పొట్టి శ్రీరాములు** : ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుకు ఆమరణ నిరాహారదీక్ష సాగించి చివరకు ప్రాణత్యాగం చేసి అమరుడయ్యాడు. 1952 అక్టోబరు 19న ప్రస్తుత చెన్నై నగరంలోని మైలాపూర్‌లో స్వాతంత్ర్య సమరయోధుడు బులుసు సాంబమూర్తి ఇంట్లో పొట్టి శ్రీరాములు నిరశన వ్రతం ప్రారంభించారు. 58 రోజులపాటు దీక్ష సాగించారు.

**స్వామి రామానంద తీర్థ** : అసలు పేరు వెంకట్రావు ఖేడ్గీకర్. నిజాం నిరంకుశ పరిపాలనను అంతమొందించ దానికి జాతీయ ఉద్యమానికి ఆయన నాయకత్వం వహించారు. స్వామీజీ జీవిత చరిత్ర సమస్తం. తెలంగాణా ప్రజల స్వాతంత్ర్య ఉద్యమ చరిత్ర. విజన్ అనే వారపత్రికను నడిపారు.



**మఖ్దూం మొహియుద్దీన్** : 1908 ఫిబ్రవరి 4న మెదక్‌జిల్లాలోని ఆందోల్ గ్రామంలో జన్మించారు. తెలంగాణాలో మార్క్సీయ భావాల వ్యాప్తికి తన రచనా పాటవాన్ని ఉపయోగించిన ఉర్దూకవి మఖ్దూం. హైదరాబాద్ సంస్థానంలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాతలలో మఖ్దూం ముఖ్యుడు. తెలంగాణా సాయుధ పోరాటంలో ఆయన చురుకైన పాత్రను పోషించారు.

**దుర్గాబాయి దేశ్‌ముఖ్** : 1909 జూలై 15న రాజమహేంద్రవరంలో జన్మించారు. ఆంధ్ర మహిళా సభను ఆమె స్థాపించారు. ఆంధ్రమహిళ అనే పత్రిక నడిపారు. దేశభక్తురాలిగా, సంఘ సంస్కర్తగా, సంఘ సేవకురాలిగా, రచయిత్రిగా, వక్తగా ఆమె పేరుపొందారు. 1975లో ఆమెకు పద్మభూషణ్ అవార్డ్ లభించింది.

**నీలం సంజీవరెడ్డి** : 1913 మే 19న అనంతపురం జిల్లా ఇల్లూరు గ్రామంలో జన్మించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తొలి ముఖ్యమంత్రిగా ఆయన పనిచేశారు. అంతేకాక భారతదేశ ఆరవ రాష్ట్రపతిగా ఆయన పదవీ బాధ్యతలను నిర్వహించారు. నీలం సంజీవరెడ్డి గొప్ప రాజనీతిజ్ఞుడు.ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు.

**పుచ్చలపల్లి సుందరయ్య** : అసలు పేరు సుందర రామిరెడ్డి. ఆయన 1913 మే నెలలో నెల్లూరు జిల్లాలోని అలగానిపాడులో జన్మించారు. ఉద్యమమే ఊపిరిగా ప్రజాసేవకు అంకితమై ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు శాఖను ఆయన స్థాపించారు. కమ్యూనిస్టు పార్టీ తరపున తొలి పార్లమెంటు సభ్యునిగా, శాసన సభ్యునిగా ఆయన ప్రజాభిమానం చూరగొన్నారు.

**ఎన్‌టి రామారావు** : కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా నిమ్మకూరులో 1923 మే 28న జన్మించారు. మూడు దశాబ్దాల కాలంలో ఆయన 292 చిత్రాలలో నటించారు. 1982 మార్చి 29న తెలుగుదేశం పార్టీని స్థాపించారు. పార్టీ స్థాపించిన తొమ్మిది నెలల్లోనే 199 సీట్లు గెలుచుకొని 1983 మార్చి తొమ్మిదో తేదీన తొలి కాంగ్రెసేతర మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు.

**కందుకూరి వీరేశలింగం** : 1848 ఏప్రిల్ 16న రాజమండ్రిలో జన్మించారు. సాంఘిక దురాచారాలు రూపుమాపడానికి ఆయన ఎంతగానో కృషిసల్పారు. 1876లో వివేకవర్థిని మాసపత్రికకు ఆయన సంపాదకత్వం వహించారు. సత్యవర్ధిని, హాస్యసంజీవిని అనే పత్రికలను ఆయన నడిపారు. తెలుగులో నాటకాన్ని అనువదించింది వచనంలో రాసింది కందుకూరే. ఆయనకు గద్యతిక్కన అనే బిరుదు ఉంది.

**గురజాడ** : దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ అని ఎలుగెత్తి చాటిన వైతాళికుడు గురజాడ అప్పారావు. సాంఘిక దురాచారాలను ఎదిరించిన సంఘసంస్కర్త. ఆయన రాసిన కన్యాశుల్కం అనే నాటకం అందరికీ సుపరిచితమే. ఈ నాటకం ద్వారా సాంఘిక దురాచారాలను ప్రతిఘటించడంతో పాటు తెలుగులో వాడుక భాషను ఆయన ప్రచారం చేశారు.

**రఘుపతి వెంకటరత్నం** : తెలుగు ప్రాంతంలో బ్రహ్మసమాజాన్ని రఘుపతి వెంకటరత్నం నాయుడు స్థాపించారు. 1862 అక్టోబరు ఒకటో తేదీన బందరులో జన్మించారు. తెలుగు నాట బ్రహ్మసమాజ ☞

వ్యాప్తికి ఆయన కృషిచేశారు.1925-28 మధ్య కాలంలో మద్రాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవిని ఆయన నిర్వహించారు.

**గిడుగు రామ్మూర్తి పంతులు** : 1910లో తెలుగు వ్యవహారిక భాషోద్యమానికి శ్రీకారం చుట్టారు. తెలుగు వ్యావహారిక భాషోద్యమానికీ శ్రీకాకుళం, విజయనగరం జిల్లా పరిసరాల్లో నివసించే గిరిజనులైన సవరల అభివృద్ధికి ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు.

**చిలకమర్తి లక్ష్మీనరసింహం** : 1867 సెప్టెంబరు 26న తణుకు తాలూకా ఖండవల్లిలో జన్మించారు. దేశమాత, మనోరమ పత్రికలను ఆయన నిర్వహించారు. వీరేశలింగం పంతులుకు చేదోడువాదోడుగా ఉండి ఎన్నో సంఘ సంస్కరణ కార్యక్రమాల్ని నిర్వహించారు. చిలకమర్తి పద్య గద్య రచనల్లో నాటకం, నవల కథలు ఎన్నో ఉన్నాయి.

**తిరుపతి వెంకటకవులు** : దివాకర్ల తిరుపతి శాస్త్రి,చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రి తిరుపతి వేంకట కవులుగా ప్రసిద్ధిచెందారు. వీరు రాసిన పాండవోద్యోగ విజయాలు,పాండవ జననం లాంటి నాటకాలు,శ్రవణానందం,లక్షణావరిణయం, పాణిగ్రహీత తదితర పద్యకావ్యాలు, దేవీ భాగవతం, శ్రీనివాస విలాసం, బుద్ధచరితం వంటి అనువాదాలు, కామేశ్వర శతకం, గుంటూరు సీమ లాంటి వివాదకావ్యాలు ఆంధ్రసారస్వత చరిత్రలో కొత్తబాటలు వేసాయి.

**కట్టమంచి** : తిరుపతి-చిత్తూరు రహదారిలో ఉన్న ఒక కుగ్రామమైన కట్టమంచిలో 1880 డిసెంబర్ 10వ తేదీన కట్టమంచి రామలింగా రెడ్డి జన్మించారు. ఆయన గొప్ప సాహితీ వేత్త. విద్యావేత్త. పాలనాదక్షుడు. పందొమ్మిదేళ్ల వయసులోనే ఆయన ముసలమ్మ మరణం అనే కావ్యాన్ని రాశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవిని దాదాపు 14 ఏళ్ల పాటు నిర్వహించారు.

**త్రిపురనేని రామస్వామిచౌదరి** : 1887, జనవరి 18న కృష్ణాజిల్లా అంగలూరు గ్రామంలో జన్మించాడు. మూఢవిశ్వాసాలతో ప్రతీది నమ్మకూడదంటూ ఆధునిక హేతువాదానికి తెలుగునాట ఆయన స్వీకారం చుట్టారు. రైతుపత్రికకు సంపాదకుడుగా పనిచేశారు. తెనాలి మున్సిపల్ ఛైర్మన్‌గా పదవీ బాధ్యతలు నిర్వర్తించారు. నిరంతరం మూఢ విశ్వాసాల నిర్మూలనకు సాహిత్య సేవకు ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు.

**గుడిపాటి వెంకటచలం** : 1894 మే 19న మద్రాసులో జన్మించారు. ఆయన దొంగ మర్యాదలనూ, దగాకోరు మాటలనూ ద్వంద నీతుల్నీ అసహ్యించుకొనేవారు. స్త్రీ స్వేచ్ఛ కోసం ఆందోళన చెంది తన జీవితాంతం ఆయన రచనలు గావించారు. చలం కదలు, కవితలు, నాటికలు, నాటకాలు, వ్యాసాలు, ఆత్మకధ రాశారు. ఆయన రచనలన్నిటిలోనూ స్త్రీల కోసమే ఆర్తి, ఆవేదన కనిపిస్తుంది.

**గుర్రం జాషువా** : 1895 సెప్టెంబరు 28వ తేదీన గుంటూరు జిల్లా వినుకొండలో జన్మించారు. పుట్టుకతో దళితుడైనా కృషితో కవిశేఖరుడై, నవయుగ కవిచక్రవర్తి అయ్యాడు. ఆయన కవిత్వం సంస్కరణ భరితంగా ముందుకు సాగింది. ఆయన రచనలైన ఫిరదౌసి, గబ్బిలం, ముంతాజ్ మహల్, శ్మశాన వాటిక ఆ కోవలోకి చెందినవే.




**అడవి బాపిరాజు** :

1895 అక్టోబరు 8 వ తేదీన పశ్చిమగోదావరి జిల్లా భీమవరం సమీపంలోని సరిపల్లె గ్రామంలో జన్మించారు. ఆయన గొప్ప చిత్రకారుడు. నవలాకారుడు. కదకుడు. నాటకకర్త. వ్యాసకర్త. వక్త. పత్రికా సంపాదకుడు. ఉత్తమ అధ్యాపకుడు. న్యాయవాది. నటుడు. అన్నింటికీ మించి ప్రధమంగా తెలుగు సినీ చలన చిత్రరంగాన కళాదర్శకత్వం చేపట్టిన కళా తపస్వి.

**విశ్వనాథ సత్యనారాయణ** : 1895 సెప్టెంబరు 10న కృష్ణా జిల్లాలోని నందమూరులో జన్మించారు. అన్ని సాహిత్య ప్రక్రియల్లో ఆయన రచనలు చేశారు. వేయి పడగలు ఆయన రాసిన గొప్ప నవలల్లో ఒకటి. ఆయన రాసిన రామాయణ కల్పవృక్షానికి గాను జ్ఞానపీఠ్ అవార్డ్ లభించింది.

**సురవరం ప్రతాపరెడ్డి** : మహబూబ్ నగర్ జిల్లా ఆలంపూర్ తాలూకాలోని ఇటికెలపాడు గ్రామంలో జన్మించారు.తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి ఆయన ఎనలేని కృషి చేశారు. తెలంగాణా ప్రాంతంలో పాఠశాలల ఏర్పాటుకు,ప్రజల్ని మేల్కొల్పడానికి ఆయన గోల్కొండ పత్రికను స్థాపించారు.

**దేవులపల్లి** : ఆంధ్ర షెల్లీ గా ప్రసిద్ధిచెందిన దేవులపల్లి కృష్ణశాస్త్రి తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం దగ్గరలోని రామచంద్రపాలెంలో 1897 నవంబరు 1న జన్మించారు. భావకవితా యుగం ఆయనతోనే మొదలయ్యింది. ఆయన గొప్ప కవే కాకుండా రచయిత, వక్త. ఊర్వశి, కృష్ణపక్షం ఆయన రాసిన పద్య కావ్యాల్లో ప్రసిద్ధిచెందినవి. మల్లీశ్వరి సినిమాకు ఆయన మాటలు పాటలు రాశారు.

**శ్రీరంగం శ్రీనివాసరావు** : ఆధునిక సాహిత్యంలో అభ్యుదయ యుగానికి నాందీ ప్రస్తావన పలికారు. ఆయన రాసిన మహాప్రస్థానం సాహిత్య చరిత్రలో మలుపు సృష్టించింది. 1938లో ఆంధ్రప్రభలో ఆయన సహాయ సంపాదకునిగా పని చేశారు. అభ్యుదయ రచయితల సంఘ స్థాపనలోనూ, విప్లవరచయితల సంఘం స్థాపనలోనే శ్రీశ్రీ ప్రముఖ పాత్ర వహించారు.

**జంధ్యాల పాపయ్య శాస్త్రి** : గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు మండలం కొప్పరు గ్రామంలో 1912 ఆగష్టు 4న జన్మించారు. ఈయన కరుణ శ్రీ అనే కలం పేరుతో గ్రంధాలు రాశారు. పద్యం, వచన, గేయ రూపాల్లో ఆయన 76 రచనలకు పైగా రచనలు గావించారు. ఈయన రాసిన పుష్పవిలాసం, ఉదయశ్రీ పద్యాలు ప్రసిద్ధిచెందాయి.

**పుట్టపర్తి నారాయణాచార్యులు** : 1914 మార్చి 28న అనంతపురం జిల్లా చియ్యేరు గ్రామంలో జన్మించారు. ఈయన బహుభాషా ప్రవీణుడు. 14 సంవత్సరాల వయసులోనే పెనుగొండ లక్ష్మి అనే కావ్యాన్ని రాశారు. ఈయన రాసిన శివతాండవం ప్రసిద్ధిచెందింది.1974లో ఆయనకు పద్మశ్రీ బిరుదు లభించింది.

**అక్కినేని నాగేశ్వరరావు** : తెలుగు చిత్రానికి తొలి పాపులర్ హీరో ఇతనే అని చెప్పుకోవచ్చు. సీతారామ జననంతో రంగప్రవేశం చేసిన అక్కినేని మరపురాని చిత్రాలను అందించాడు. ప్రతిష్టాకరమైన దాదాసాహెబ్ ఫాల్కే అవార్డును అందుకున్నారు.

**ఆదిభట్ల నారాయణ దాసు** : విజయనగరం జిల్లాలోని అజ్జాడగ్రామంలో 1864 ఆగస్టు 31న జన్మించారు. ఆయన హరికథా పితామహుడు.స్త్రీ, పురుషులిద్దరూ గజ్జెకట్టే మరాఠీ హరికదా విధానాన్ని మార్చి తెలుగు నాట నూతన హరికథా విధానానికి ఆయన శ్రీకారం చుట్టారు. ☞





**బళ్లారి రాఘవ** : అనంతపురం తాడిపత్రి పట్టణంలో 1880 ఆగస్టు 2న బళ్ళారి రాఘవ జన్మించారు. దాదాపు 35 సంవత్సరాలపాటు నాటక రంగంలో పలు పాత్రలుధరించి నటుడిగా ఆయన ఎనలేని ప్రతిభను కనబరిచారు. కొన్ని సినిమాల్లో కూడా ఆయన నటించారు.

**కోడిరామ్మూర్తి** : ప్రసిద్ధమల్ల వీరుడు. అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన బలశాలి. శ్రీకాకుళం జిల్లాలోని నాగావళి నదీతీరాన ఉన్న వీరఘట్టం గ్రామంలో 1885లో ఆయన జన్మించారు. ఆయన సర్కస్ కంపెనీని కూడా నడిపారు.

**ద్వారం వెంకటస్వామి నాయుడు** : వయొలిన్ విద్వాంసునిగా దేశవిదేశాల్లో పేరుగడించారు. ఆయన 1893 నవంబరు 8న బెంగుళూరులో జన్మించారు. సంగీత కళానిధి, కళాప్రపూర్ణ, సంగీత రత్నాకర, పద్మశ్రీ వంటి బిరుదులు ఆయనకున్నాయి.

**దామెర్ల రామారావు** : 1897 మార్చి 8న రాజమండ్రిలో జన్మించారు. ఆయన ఆంధ్రులు గర్వించదగిన ప్రముఖ చిత్రకారుడు. ఆయన గీసిన పౌరాణిక, సాంప్రదాయ, ప్రకృతి చిత్రాలు కళాభిమానుల మనసుల్ని దోచుకొంటాయి.

**బి.ఎన్.రెడ్డి** : 1908 నవంబరు 16న కడపజిల్లాలో జన్మించారు. ఆయన ప్రముఖ చలన చిత్ర దర్శక నిర్మాత. దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత. అద్భుత కళాఖండం మల్లీశ్వరి సృష్టికర్త.

**ఎస్వీ రంగారావు** : కృష్ణాజిల్లాలోని నూజివీడులో 1918 జూలై 3 వ తేదీన జన్మించారు. మూడు దశాబ్దాల పాటు 300 చిత్రాల్లో నటించి మహానటుడిగా నటసామ్రాట్‌గా ఆయన కీర్తిగడించారు.

**షేక్ నాజర్** : గుంటూరు జిల్లా పొన్నేకల్లు గ్రామంలో 1920 ఫిబ్రవరి 20న జన్మించారు. 1944లో పశ్చిమ బెంగాల్‌లో కరువు వచ్చినపుడు డొక్కల కరువు పేరుతో బుర్రకథ రాసారు. నాజర్ సొంత బుర్రకథ దళాన్ని ఏర్పరుచుకొని చాలా కాలం కళాసేవ చేశారు.

**ఘంటశాల వేంకటేశ్వరరావు** : కృష్ణాజిల్లా చౌటపల్లిలో 1922 డిసెంబరు 4వ తేదీన జన్మించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని 18 మాసాలు జైలు శిక్ష అనుభవించారు. సుమంగళి సినిమాతో ఆయన చలనచిత్ర రంగ ప్రవేశం చేశారు. మూడు దశాబ్దాలపాటు 13వేలకు పైగా పాటల్ని పాడారు.

**ఈమని శంకర శాస్త్రి** : తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారామంలో 1922 సెప్టెంబరు 23వ తేదీన జన్మించారు. వీణపై వేదమంత్రాల్ని పలికించడంతో పాటు పాశ్చాత్య బాణీని సైతం తన విన్నూత శైలిలో పలికించడం ఆయన ప్రత్యేకత.

**సావిత్రి** : 1950లో సంసారం చిత్రం ద్వారా చలనచిత్ర రంగంలోకి ప్రవేశించారు. నవరసాలను అత్భుతంగా పోషించగల మహానటి సావిత్రి. దేవదాసు, మిస్సమ్మ, మాయాబజార్‌వంటి చిత్రాల్లో ఆమె నటించిన తీరును ఎవరూ మరిచిపోలేరు.

**ఎల్లాప్రగడ సుబ్బారావు** : 1895 జనవరి 12న పశ్చిమగోదావరి జిల్లా భీమవరంలో జన్మించారు. టెట్రాసైక్లిన్, హెట్రాజాన్, ఫోలిక్‌యాసిడ్, విటమిన్ బి-12 వంటి అనేక మందుల్ని ఆయన కనుగొన్నారు.

**ముట్నూరి కృష్ణారావు** : 1879లో కృష్ణాజిల్లా దివి తాలూకాలోని ముట్నూరు గ్రామంలో జన్మించారు. కృష్ణాపత్రిక సంపాదకుడిగా తన సంపాదకీయాలతో తెలుగు వారిని చైతన్యపరిచారు. ఆంధ్ర భారతి సాహిత్యపత్రికను ఆయన కొన్నేళ్లపాటు నడిపారు.

**సి.నారాయణరెడ్డి** : విశ్వనాథ సత్యనారాయణ తర్వాత తెలుగు సాహిత్యానికి 'జ్ఞానపీఠ' అవార్డును తెచ్చిన సత్కవి డా.సి.నారాయణరెడ్డి. కర్పూర వసంతరాయలు, విశ్వంభర, శిఖరాలు-లోయలు, నాగార్జునసాగరం, ప్రపంచ పదులు మొదలైన 60పై చిలుకు కృతులను ఆయన రచించాడు.

**వట్టికోట అళ్వారు స్వామి** : కర్కశ నిజాం ముష్కర పాలనపై విజృంభించి సాహిత్యోద్యమాలను, గ్రంథాలయోద్యమాలను నడిపి విప్లవ బావుటానెగురవేసిన గొప్పకవి అళ్వారు స్వామి. భూస్వామ్య నిరంకుశ పాలన మీద తల్వార్ మా అళ్వార్ అని దాశరథిచే నివాళర్పించుకున్న మహనీయుడు.

**దాశరథి** : నా తెలంగాణ, కోటి రత్నాల వీణ అంటూ తెలంగాణకు ఒక విద్యుత్తేజాన్ని అందించిన కవిభాస్కరుడు దాశరథి. తెలంగాణ ప్రజల తిరుగుబాటు కాలంలో ప్రతి ఇంట్లో ఆయన పాటలు, పద్యాలు మారుమ్రోగాయి.

**సుద్దాల హనుమంతు** : పల్లెటూరి పిల్లగాడా...పసుల గాసె మొనగాడా పాట గుర్తుండి వుంటే సుద్దాల హనుమంతు గుర్తుంటాడు. తెలంగాణా ప్రజలు భూస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటు చేస్తున్న కాలంలో గొల్ల సుద్దులు అనే కళా ప్రక్రియకు ప్రాణం పోశాడు. అవే సుద్దులు కాలక్రమంలో పల్లె సుద్దులయ్యాయి.

**పి.వి.నరసింహారావు** : భారతావనికి తొలి తెలుగు ప్రధాని. రాజకీయాల్లోనే కాకుండా సాహిత్య రంగంలో ఆయన చేసిన సేవలు ఎనలేనివి. నూతన సరళీకృత ఆరిక విదానాలకు శ్రీకారం చుట్టిన మేధావి. బహుభాష పారంగతుడు.

**బాపు** : ఆయన చిత్రాల్లో ఒదిగి పోవాలని, ఆయన చిత్రాల్లో నటించాలని అనుకోనివారు వుండరు. చిత్రకారుడిగా, సినీ దర్శకుడిగా ప్రఖ్యాతి గాంచిన సత్తిరాజు లక్ష్మి నారాయణ (బాపు) 1933, డిసెంబర్ 15న నరసాపూర్‌లో జన్మించాడు. 1955లో ఆంధ్రపత్రికలో రాజకీయ కార్టునిస్ట్‌గా ప్రవేశించాడు. సాక్షి చిత్రంతో సినీ రంగంలో అడుగు పెట్టిన బాపు తెలుగు సినిమాలకు ఒక నూతన ఒరవడిని ప్రవేశపెట్టాడు. రఘుపతి వెంకయ్యా అవార్డుతోపాటు ఈయన అనేక అవార్డులను అందుకున్నాడు.

**ఆరుద్ర** : ఆంధ్ర భాషా సాహిత్యానికి ఆరుద్ర చేసిన సేవలు శ్లాఘనీయం. అభ్యుదయ కవిగా చక్కటి పేరు ఉంది. బాగవతుల శివశంకర శాస్త్రి (ఆరుద్ర) తెలుగు సాహిత్యానికి చేసిన సేవలు శ్లాఘనీయం. సమగ్రాంధ్ర సాహిత్యాన్ని మనకందిన సాహితీవేత్త. సినీవాలితో పేరు ప్రతిష్టలను గడించిన ఆరుద్ర తెలుగు సినిమా పాటలకు కూడా కొంత అందాలను అందించాడు.

**మంగళంపల్లి బాలమురళీకృష్ణ** : కర్నాటక సంగీతంలో అపారమైన పాండిత్యాన్ని గడించిన బాలమురళీ కృష్ణ అనేక కొత్త రాగాలను సృష్టించాడు. శంకరాచార్య వంటి సుప్రసిద్ధ చిత్రానికి సంగీత దర్శకత్వం కూడా వహించాడు.

**మహ్మద్ అజరుద్దీన్** : భారత క్రికెట్‌కు ఒక గుర్తింపు గౌరవాన్ని అందించిన అజరుద్దీన్ 1963, ఫిబ్రవరి 8న జన్మించాడు. టెస్టుల్లో ఎక్కువ విజయాలు అందించిన కెప్టెన్‌గా రికార్డుకెక్కాడు. ■

# కాలచక్రం కన్నీళ్లు

వెయ్యేళ్ల చరిత్ర సామాజిక, సాంకేతిక, రాజకీయ విప్లవాలకు, మార్పులకు మూలం అయినట్టుగానే, అనేక అనర్థాలను కూడా చవిచూసింది. ప్రపంచంలోని అనేక దేశాలు కరువు, తుపాను, భూకంపం వంటి ప్రకృతి వైపరీత్యాల బారిన పడ్డాయి. వీటి కారణంగా లక్షలాది మంది ప్రజలు ప్రాణాలు పోగొట్టుకున్నారు. లెక్కకట్టలేనంత విలువైన పంట నష్టానికి గురైంది. ఒకవైపు ప్రకృతి వైపరీత్యాలు మానవాళికి తీవ్ర నష్టాన్ని తీసుకురాగా, మానవుడి నిర్లక్ష్యం, కక్షలు హిరోషిమా,నాగసాకిలపై అణు బాంబుల దాడి, భోపాల్ గ్యాస్ లీకేజీ వంటి సంఘటనలకు కారణమయ్యాయి.


భోపాల్ గ్యాస్ లీకేజి

❁ 1584లో బంగ్లాదేశ్‌లోని బాకెర్‌గంజ్ ప్రాంతంలో తుఫాను కారణంగా రెండు లక్షల మంది మరణించారు.

❁ 1665లో ప్లేగు వ్యాధివల్ల ఒక్క లండన్ నగరంలోనే 68వేల మంది మరణించారు. ఎలుకల నుంచి పెద్ద ఎత్తున విస్తరించిన వ్యాధిని అదుపు చేయడం అక్కడి ప్రభుత్వం తరం కాలేదు. ఇలా ఇది ప్రపంచం మొత్తం పాకింది. అయితే అక్కడ సంభవించిన భారీ అగ్నిప్రమాదంవల్ల ఈ వ్యాధి అంతరించి పోయింది.

❁ 1737 అక్టోబరు 7 నుంచి 11 మధ్య పశ్చిమ బెంగాల్‌లో తుపాను తాకిడికి సుమారు మూడు లక్షల మంది మరణించారు.

❁ పోర్చుగల్‌లోని లిస్బన్ నగరంలో 1775, నవంబరు ఒకటిన పెను భూకంపం సంభవించింది. దీని వల్ల 30 వేలమంది ప్రజలు మరణించారు. మొదట భూకంపం నుంచి తప్పించుకోవడానికి ప్రజలు సముద్రతీరంలో తలదాచుకున్నారు. అయితే, ఈ ప్రాంతంలో కూడా భూకంపం సంభవించడంతో మట్టిచరియలు కూలి మరికొంతమంది మరణించారు.

❁ 1845లో ఐర్లాండ్‌లో వర్షాభావ పరిస్థితుల వల్ల క్షామం వచ్చింది. 40 లక్షల మంది ప్రజలు దీని వల్ల ఆహారానికి నోచుకోలేదు. తిండిలేక వేలాదిమంది బాలలు, మహిళలు, వృద్ధులు మరణించారు. ఈ శవాలను గుట్టలుగా వేసి సామూహికంగా దహనం చేశారు.

❁ 1985 నవంబరు 13న కొలంబియాలో సంభవించిన పెను ఉప్పెన 25వేల మంది ప్రజలను బలి గొంది. అర్మెరె పట్టణానికి సమీపంలోని నెవడో డెల్ రూజ్‌లో అల్పపీడనం ఏర్పడడం వల్ల తలెత్తిన భయానకమైన తుపాను అనేక రోజుల పాటు కొనసాగింది. దీన్ని జాతీయ విపత్తుగా ప్రకటించారు.

❁ 1985 సెప్టెంబరు 19 తెల్లవారుజామున మెక్సికో నగరాన్ని కుదిపివేసిన భూకంపం 20వేల మందికి పైగా ప్రజల ప్రాణాలను తీసింది. రెక్టర్ స్కేల్‌పై 8.1గా భూకంప స్థాయిని గుర్తించారు. ఈ సంఘటనలో మరో 30వేల మంది నిరాశ్రయులయ్యారు. మరుసటి రోజే మరోసారి భూమి కంపించడంతో సహాయక చర్యలకు అంతరాయం కలిగింది.

❁ సోవియట్ రిపబ్లిక్ ఆఫ్ ఆర్మేనియాలో 1988 సంవత్సరాంతంలో సంభవించిన భూకంపం లక్ష మంది ప్రాణాలను తీసింది. లెనినాకన్, స్పిటక్ పట్టణాలు భూకంపం కారణంగా భూస్థాపితమయ్యాయి. వేలాదిమంది శిధిలాల కింద నలిగిపోయారు. ఈ సంఘటన తర్వాత రెండు నగరాల్లో భవనాల శిధిలాలు మాత్రమే మిగిలాయి.

❁ టోక్యోలో 1923లో జరిగిన తర్వాత అత్యంత వినాశకర భూకంపం జపాన్‌లో మళ్లీ 1995 ☞


హిరోషిమా-నాగసాకిలపై అణుబాంబు





జనవరి 17న కోబ్ నగరంలో సంభవించింది. దీనివల్ల 5వేలమంది మరణించగా, 2 లక్షల 50వేలమందికి పైగా ప్రజలు నిరాశ్రయులయ్యారు. వేలాది మంది గాయపడ్డారు.

1908 డిసెంబరు 28 యూరప్‌లోకెల్లా అత్యంత వినాశకరమైన భూకంపంగా చెప్పుకునే భూకంపం సిసిలీ దేశంలోని మెస్సినా నగరంలో సంభవించింది. ఈ ప్రమాదంలో లక్షా 50వేల మంది మరణించగా.లక్షలాది మంది గాయపడ్డారు.

యావత్ ప్రపంచానికి చిరపరిచితమైన టైటానిక్ ఓడ 1912 ఏప్రిల్ 15నఅట్లాంటిక్ సముద్రంలో మునిగింది. దీంతో దానిలో ప్రయాణిస్తున్న 1500 మంది ప్రయాణికులు మరణించారు. ఈ ఓడలో అధిక శాతం దనిక, ఉన్నత వరాల వారు ప్రయాణిస్తున్నారు. కాగా 1985లో అట్లాంటిక్ సముద్రం ఉత్తర ప్రాంతంలో రెండున్నర కిలోమీటర్ల అడుగున రెండు ముక్కలుగా పడిఉన్న ఓడ శకలాలను కనుగొన్నారు.

1920లో చైనాలోని కన్సోలో సంభవించిన పెను భూకంపంలో రెండు లక్షల మంది మరణించారు.

రెండవ ప్రపంచయుద్ధ సమయంలో జపాన్‌ను లొంగదీసుకోవాలన్న ఉద్దేశంతో అమెరికా అధ్యక్షుడు హర్రీ ఎస్.ట్రూమన్ ఆ దేశంపై అత్యంత వినాశకరమైన అణుబాంబును ప్రయోగించడానికి నిర్ణయించుకున్నారు. 1945 ఆగస్టు 6న హిరోషిమాపై, ఆగస్టు 9న నాగసాకిపై అణుబాంబులను ప్రయోగించారు. దీనివల్ల లక్షా 20 వేల మంది మరణించగా, లక్షలాది మంది అనారోగ్యానికి గురయ్యారు. అక్కడి పరిశ్రమలు ధ్వంసమయ్యాయి.

1978 మార్చిలో ప్రపంచంలోకెల్లా అతిపెద్ద జలకాలుష్యం సంభవించింది. 2.3లక్షల టన్నుల క్రూడ్ ఆయిల్‌ను గల్ఫ్‌దేశాల నుంచి రోట్టర్ డ్యాంకు తీసుకు వెళ్తున్న అమెకా క్యాడిజ్ ఓడ సముద్రం మధ్యలో రెండు ముక్కలుగా విడిపోయింది. దీంతో ఓడలోని క్రూడ్ ఆయిల్ సముద్రంలో కలిసిపోయింది. వందలాది ఎకరాల సముద్రతీరం కలుషితమైంది. సముద్రంలోని జీవరాశి సమూలంగా నాశనమైంది.

1977లో ఆంధ్రప్రదేశ్‌లోని దివిసీమ తుపాను కారణంగా గోదావరి జిల్లాలతో పాటు రాష్ట్రంలోని మరో 8 జిల్లాలోని పలు ప్రాంతాలు తీవ్రంగా నష్టపోయాయి. ఈ సంఘటనలో సుమారు 10వేల మంది మరణించారు. లక్షలాది ఎకరాల్లోని తోటలు, పంట ధ్వంసమైంది.

మతగురువు ఆదేశం మేరకు ప్రార్ధనా మందిరంలో సామూహికంగా ఆత్మహత్యలకు పాల్పడిన సంఘటన 1978లో జరిగింది. ఘయానాలోని జోన్స్ టౌన్‌లో రెవరెన్ జిమ్ జోన్స్ అన్న మతగురువు ఆదేశానుసారం 900 మంది భక్తులు ప్రార్ధనా మందిరంలో సైనైడ్ తీసుకొని సామూహికంగా ఆత్మహత్య చేసుకున్నారు.

భారత్‌లోని అస్సాంలో 1983లో జరిగిన మతఘర్షణల్లో సుమారు మూడు వేలమంది మరణించారు. వీరిలో ఎక్కువగా బంగ్లాదేశ్ నుంచి వలస వచ్చిన వారున్నారు.

క్రిమిసంహారక మందుల ఫ్యాక్టరీ నుంచి అత్యంత ప్రమాదకరమైన విషవాయువులు లీక్ కావడంతో రెండువేల మందికిపైగా మరణించడమేకాక, లక్షా 80 మంది అస్వస్థతకు కారణమైన 'భోపాల్ ఉపద్రవం' 1984 డిసెంబరు 4న జరిగింది. యూనియన్ కార్బైడ్ ఫ్యాక్టరీ నుండి వెలువడిన మిథైల్ ఐసోసైనేట్ గ్యాస్ భోపాల్ నగరం పరిసరాల్లో 40 కిలోమీటర్ల వైశాల్యం విస్తరించింది. ఈ సంఘటనలో ఇళ్లలో ఉన్న వారు, రోడ్లపై వెళ్తున్న వారు పెద్ద సంఖ్యలో మరణించారు. సుమారు రెండు లక్షలమంది శ్వాసకోస వ్యాధులు, మూర్ఛ, నోటి సంబంధ వ్యాదులకు గురయ్యారు. గ్యాస్ లీకేజీ తర్వాత సుమారు రెండు లక్షల మంది ప్రజలు భోపాల్ నగరాన్ని విడిచి ఇతర ప్రాంతాలకు వలసవెళ్లారు.

1991 ఏప్రిల్ 29 బంగాళాఖాతంలో ఏర్పడిన అల్పపీడనం వల్ల బంగ్లాదేశ్‌లోని చిట్టాగ్యాంగ్,కాక్స్ బజార్ ప్రాంతంలో లక్షా50వేల మంది మరణించారు.

1993 సెప్టెంబరు 3 మహారాష్ట్రలోని లాథూర్ ప్రాంతంలో భూకంపం సంభవించింది. ఈ సంఘటనలో 9700 మంది మరణించగా, వేలాది మంది నిరాశ్రయులయ్యారు.

సహస్రాబ్ది చివర 1999 అక్టోబరు నెలాఖరులో ఒరిస్సాలో సూపర్‌సైక్లోన్ సంభవించింది. 15వేల మంది మరణించారు. కోటి 50 లక్షలమంది నిరాశ్రయులయ్యారు. రవాణా, టెలిఫోన్ సంబంధాలు తెగిపోయాయి. ■

సేకరణ : కె. శ్రావణ్‌కుమార్



హైందవ సమాజానికి ఫలానా గ్రంథం ప్రామాణికమని శాస్త్ర నిర్ధారణ ఏదీ లేనప్పటికీ కాలక్రమంలో భగవద్గీత సాధికార గ్రంథంగా స్థిరపడిపోయింది. ప్రాచీన కాలంకంటే ఆధునిక యుగంలోనే భగవద్గీత ప్రభావం విస్తరించడం కనబడుతోంది. నిష్క్రియా పరుడ్ని కర్తవ్యోన్ముఖిని చేసే గీతాసారం స్వాతంత్ర్యోద్యమానికి ఊపిరులూదింది. ఆధునిక హైందవ సమాజంలో గీత ప్రాధాన్యతపై టీ.కె. లక్ష్మణరావు ఉల్లేఖనం...

# కర్తవ్య ప్రబోధానికి కొత్త వెలుగు

హిందూ సమాజానికి భగవద్గీత పవిత్ర గ్రంథంగా బాసిల్లుతోంది. ఇది మత గ్రంథం కాదు. సాంప్రదాయాలు, ఆచార్య వ్యవహారాలు, కట్టుబాట్లు, యజ్ఞయాగాదులు, పూజా పునస్కారాలు వంటివేమీ భగవద్గీత బోధించదు. 'సంశయాత్మా వినశ్యతి' (ఏదీ తేల్చుకోలేక సంశయంతో ఉండేవాడు నాశనమవుతాడు) అన్నది సారాంశం. మహాభారత యుద్ధ ప్రారంభానికి ముందు కౌరవ పాండవ సేనలు ఇరువైపులా మోహరించిన సమయంలో అర్జునుడు భీష్మ, ద్రోణ, కృపాది ఆచార్యులను, కౌరవ సోదరులను, సేనావాహినినీ చూసి యుద్ధ విముఖుడవుతాడు. బంధుగణాన్ని, గురువర్యులను' యుద్ధభూమిలో సంహరించి కురుక్షేత్రాన్ని రక్తసిక్తం చేయడం ద్వారా సంక్రమించే రాజ్యం తనకు మనశ్శాంతిని కలిగించలేదన్నాడు. అలా యుద్ధ విముఖుడైన అర్జునుణ్ణి యుద్ధోన్ముఖుణ్ణి చేయడానికి రథసారధిగా ఉన్న కృష్ణుడు 'గీత'ను ఉపదేశిస్తాడు. అర్జునుడు దాయాదులను, వారి మహాసైన్యాన్ని నిర్మూలించేందుకు దృఢచిత్తుడయ్యే వరకూ అతనికి ఎన్నో సందేహాలను తీరుస్తాడు. అదే భగవద్గీత. అది కేవలం శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించినదే అయినా సమస్త మానవాళికీ కూడా ఉపయుక్తంగా ఉంటుందనడంలో సందేహంలేదు. అందుకే కురు క్షేత్రం యుద్ధం జరిగి నాలుగువేల సంవత్సరాలు గతించినా భారతీయ సమాజంలో, చారిత్రక పరిణామాల్లో దాని పాత్ర కాలపరీక్షకు నిలబడింది. భగవద్గీత అంటే భగవంతుని గీతం అని అర్థం. శ్రీకృష్ణుడు భగవంతుని అవతారమని, అంటే మహావిష్ణువు దశావతారాల్లో ఎనిమిదవదనీ హైందవుల నమ్మకం. పురాణ ప్రశస్తిని మిన హాయించి గీతాకారుడైన కృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన అంశాలను పరిశీలిస్తే -

"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫల హేతుర్భూః మా తే సంగోస్త్వ కర్మణి"

"నీకు నీ విద్యుక్త కర్మలను చేయుటయందే అర్హత కలదు. కానీ, ఆ కర్మ పలములననుభవించుటకు అధికారము లేదు. నీ కర్మఫలములకు నీవు కారణుడవు కాదు. నీ కర్మలను చేయుటయందు నీవు ఉపేక్ష చేయరాదు" అని భావం.

ఇలా 18అధ్యాయాలలో 'గీత'లో అర్జునుని సందేహాలను తీరుస్తూ యుద్ధోన్ముఖుడుగా స్థిరచిత్తుడిగా కృష్ణుడు మలచగలుగుతాడు. భగవద్గీత పరస్పర విరుద్ధ మానసిక ప్రవృత్తులుగల వారినెందరినో ఆకట్టుకుంది. గీతకు ఎవరి భాష్యం వారు చెప్పుకున్నారు. ఎవరు ఎలా అర్థం చేసుకున్నా వారు అర్థం చేసుకున్నదాన్ని దృఢంగా నమ్మగలిగేటట్టు చేయడమే దీని ఘనత. ఒక్క మాటలో చెప్పాలంటే భగవద్గీత 'హిప్నొటైజ్' చేస్తుంది.

*"సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమువాప్స్యసి"*

"నీవు సుఖ దుఃఖములనుగాని, లాభ నష్టములనుగాని, జయాపజయాలనుగాని ఏమీ లెక్కచేయక, యుద్ధము చేయవలయుననే దృష్టితోనే యుద్ధము చేయుము. అట్లు చేసినచో నీకేపాపఫలము అంటదు"- ఇలా సాగే గీత, మానవ జీవితంలో ఎదురయ్యే అనేక సంఘర్షణలను, ఆటుపోట్లను ఎదుర్కొనే శక్తిని కలిగిస్తుంది. కర్తవ్యోన్ముఖుణ్ణి చేస్తుంది. మానవ జీవితమే సంఘర్షణల మయం. కర్మము (డ్యూటీ), జ్ఞానము (నాలెడ్జి), భక్తి (వర్షిప్) ఈ మూడింటి ద్వారా బంధవిముక్తులు కావాలి. దేని మీదా మమకారాన్ని పెంచుకోకూడదు. తెంచుకోవాలి. స్వధర్మాన్ని నిర్వర్తించడంలో సందిగ్ధత ఉండరాదు. ఆత్మకు చావులేదు. మనిషి దుస్తులు మార్చినట్టుగా ఆత్మ శరీరాలను మారుస్తుంది. ఆత్మకు చావులేదు. శరాఘాతాలకు అది తూట్లుపడదు. నిప్పు దాన్ని దహించలేదు. నీరు ముంచెత్తలేదు. గాలిలో కొట్టుకొనిపోదు. సంతోషం, దుఃఖం, లాభం, నష్టం, భయం, ఆగ్రహం, విజయం, అపజయం ఇవేవీ ఆలోచించకుండా మనిషి స్వధర్మాన్ని పాటించాలి. అరిషడ్వర్గాలను జయించి స్థితప్రజ్ఞుడు కావాలి. తాబేలు తన నాలుగు కాళ్లను తనలోనికి ఎలా ఇముడ్చుకొనగలదో అలాగే మనిషి కూడా ఇంద్రియాలను తన అదుపులో ఉంచుకోగలగాలి. ఇంద్రియ నిగ్రహంతోపాటు దేని మీదా వ్యామోహాన్ని పెంచుకోకుండా ఉండడం, సార్వజనీన దృష్టి, భగవంతునిపై ఏకాగ్రత- వీటి ద్వారా మోక్షాన్ని సాధించవచ్చు. విముక్తి ఎక్కడో కాదు. ఇక్కడే! భగవద్గీతను ఆదిశంకరులు బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులతో పోల్చి భాష్యం చెప్పి దానికి అత్యున్నస్థాయి కల్పించగా, అనంతరం రామానుజాచార్యులు కూడా గీతాభాష్యం చెప్పారు.

తరతరాలుగా భగవద్గీత భారతీయ సమాజాన్ని ప్రభావితం చేస్తూనే ఉంది. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా భారతీయుల్ని కూడగట్టేందుకు స్వాతంత్ర్యోద్యమ పితామహుడు అనదగ్గ బాలగంగాధర తిలక్ 19వ శతాబ్దిలో సైతం భగవద్గీత ద్వారానే స్ఫూర్తినిచ్చాడు. జాతిపిత మహాత్మాగాంధీ సైతం గీత ద్వారా స్వాతంత్ర్య స్ఫూర్తిని పెంపొందించి 'అనాసక్తి' అనే పేరుతో గీతా విశ్లేషణ చేశారు. ఎందరో సంఘసంస్కర్తలు, తత్వవేత్తలైన రామకృష్ణ పరమహంస, వివేకానంద, అరవిందఘోష్, దయానంద సరస్వతి వంటివారు గీతాసారాన్ని ప్రబోధించి భారతీయుల్లో స్వాతంత్ర్య కాంక్షను రగించినగలిగారు. భగవద్గీత సర్వసజీనం, సర్వకాలీనం. ■





# హైజాక్‌కు గురైన అద్భుతం

ఇరవయ్యో శతాబ్దపు మహాద్భుతం సమాచార విజ్ఞానం. ఇది ప్రపంచాన్ని ఒక కుగ్రామంగా మార్చింది. సమస్త సమాచారాన్ని చిటికెలో కంటిముందు నిలుపుతుంది. అయితే, అంతులేని విద్యావైజ్ఞానిక, సామాజిక అంతరాలు కొనసాగుతున్న ప్రపంచంలో ఈ విజ్ఞానాస్త్రం కొందరికే కల్పవృక్షం కాగలదని 'ఎన్. వేణుగోపాల్' వాదన...

ఇవాళ ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ ప్రభావంలేని జీవనరంగం లేదంటే అతిశయోక్తి కాదు. సమాజ జీవితంలోని అన్ని రంగాలూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ సహాయంతోనే నడుస్తున్నాయి. కంప్యూటర్ గురించి ఎన్నడూ విని ఉండని, కంప్యూటర్ ఎన్నడూ చూసిఉండని వాళ్ల జీవితాలను శాసించే నిర్ణయాలను ☞

కంప్యూటర్లు తీసుకుంటున్నాయి. లేదా కంప్యూటర్లను నమ్ముకున్న ప్రభువులు తీసుకుంటున్నారు. ఒక లోహయంత్రానికి ఇంత విస్తృతమైన అధికారం ఎలా వచ్చింది? ఆ అంతులేని అధికారానికి పరిణామాలేమిటి? నిస్సందేహంగా కంప్యూటర్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ మానవమేధ సృష్టించిన అత్యద్భుతమైన పరికరాలు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి పునాది అయిన గణితశాస్త్రం, ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్‌కు తొలి రూపమైన బాబేజ్ మిషన్ గత శతాబ్దంలోనే రూపొందినప్పటికీ, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ శాఖోపశాఖలుగా విస్తరించింది మాత్రం ఇరవయ్యో శతాబ్దపు చివరి దశకాల్లోనే. పదేపదే ఒకేపని చేయడం, కోటికోట్ల సమాచారపు శకలాలను క్షణాలలో క్రోడీకరించడం, వాస్తవ జీవితంలో కష్టతరమైన శిక్షణలను, పనులను కంప్యూటర్ తెరమీద ప్రదర్శించి, వాస్తవానికీ, ఊహకూ తేడా చెరిపేయడంలాంటి ఎన్నో పనులు కంప్యూటర్లు సాధిస్తున్నాయి. 1980లలో ప్రారంభమైన పర్సనల్ కంప్యూటర్ మొత్తంగా మనిషికీ-యంత్రానికీ మధ్య సంబంధంలో ఒక గొప్ప విప్లవం. అది విడివిడిగా ప్రతిమనిషికీ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వినియోగించుకోగల అవకాశాల్నిచ్చింది. అంతవరకూ కేవలం శాస్త్ర, సాంకేతిక, పారిశ్రామిక రంగాలలో వాడుతున్న కంప్యూటర్ ప్రతి ఇంట్లోకీ, ప్రతి మనిషికీ అందే అవకాశం వచ్చింది. అయితే, ఈ పరిణామాలకు మరోముఖం కూడా ఉంది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత విపరీతంగా పెరిగిన యుద్ధ పరిశ్రమ అమెరికాలో దాదాపు దాని అంతిమ అవధిని చేరింది. ఈలోగా సోవియట్ యూనియన్ కూలిపోయి ప్రచ్ఛన్న యుద్ధం మొదలవడంతో అమెరికన్ యుద్ధ పరిశ్రమ తన ఉత్పత్తులను అమ్ముకోలేని స్థితి వచ్చింది. యుద్ధ పరికరాల స్థానంలో కొత్త, అమ్మదగిన పరికరంగా కంప్యూటర్ హార్డ్‌వేర్ వచ్చింది. అలాగే, అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో 60శాతానికి పైగా ఆక్రమించే సేవారంగ ఉత్పత్తులు-బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, వినోద రంగాలు-అమ్ముకోవాలంటే ప్రపంచానికంతా సాఫ్ట్‌వేర్ రుచి చూపి, అలవాటు చేసి అమ్మవలసి వచ్చింది.

సాఫ్ట్‌వేర్‌ను రుచిచూపే మార్గంగా అద్భుతంగా పనిచేసినది ఇంటర్‌నెట్. ప్రచ్ఛన్న యుద్ధం రోజుల్లో, మూడో ప్రపంచ యుద్ధం వస్తే భౌతిక ఆస్తులన్నీ కుప్పకూలిపోయినా, సమాచారాన్ని యధాతథంగా నెట్‌వర్క్‌ల మీద కాపాడడమెట్లా అని అమెరికన్ రక్షణశాఖ కనిపెట్టిన ఇంటర్‌నెట్ నిజానికి రెండంచుల కత్తి. అది ఒకవైపు మనుషుల మధ్య, దేశాల మధ్య దూరాల్ని చెరిపేస్తుంది. మరోవైపు కంప్యూటర్లు మన సమాజంలో ప్రవేశించినప్పటి నుంచి అవి ఉద్యోగాలు పోగొడతాయని, అందువల్ల కంప్యూటర్లను వ్యతిరేకించాలని కూడా ఒక అభిప్రాయం బలంగానే ఉంటూ వస్తోంది. ఈ నేపథ్యంలో, కంప్యూటర్లు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ మనిషికి ఇవ్వగల సౌకర్యాన్నీ, సౌలభ్యాన్నీ గుర్తిస్తూనే, ఈ ఇరవయ్యో శతాబ్దపు అత్యద్భుత మానవమేధో సృష్టి ఎలా ఉన్నత వర్గాల, సామ్రాజ్యవాద దేశాల గుత్తసొమ్ము అయిపోయిందో, హైజాక్ అయిపోయిందో గుర్తించాలి. నూటికి యాభై మందికి పైగా నిరక్షరాస్యులున్నచోట, కేవలం పది మంది మాత్రమే ఇంగ్లీషు తెలిసిన వాళ్లున్న చోట కంప్యూటర్లు ప్రవేశపెట్టడం అంతరాలకు మాత్రమేకాక, కంప్యూటర్ల చుట్టూ మాయ అల్లుకోవడానికి దారితీస్తుంది. సాంకేతిక పరిజ్ఞానానికి, సమాజానికీ మధ్య సంబంధాన్ని అధ్యయనం చేసిన ఒక సామాజిక శాస్త్రవేత్త చెప్పినట్టు, ప్రతి కొత్త సాంకేతిక పరిజ్ఞానమూ సమాజంలో కొత్త అవకాశాల్ని, సౌకర్యాల్నీ కల్పిస్తూనే, అధికారుల అధికారాన్ని పెంచుతాయి. సాంకేతిక పరిజ్ఞానం సహాయంతో మొత్తం సమాజం మీద, సమాచారం మీద తమ అధికారాన్ని, పట్టును పెంచుకోవడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి.

ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగాన్ని ఒక్క మాటలో చెప్పాలంటే శ్రీశ్రీ అన్నట్టు 'ఇది ప్రపంచ కుగ్రామం, ఇది గ్లోబల్ సంగ్రామం' అనిపిస్తుంది. ప్రపంచాన్ని ఒక్కచోటికి, ఒక గ్రామం దగ్గరికి తేగల అవకాశం కల్పించిన ఈ సాంకేతిక పరిజ్ఞానమే సంపన్న దేశాల సరుకుల వ్యాపారుల క్రీడాస్థలిగా, యుద్ధభూమిగా మారిపోతోంది. విద్యారంగానికన్నా ఎక్కువగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీని, యుద్ధానికి, ఇ-కామర్స్‌కూ వాడుకోవడమే ఇందుకు నిదర్శనం. ■







బ్యాంకింగ్ వ్యవస్థకు భారతదేశంలో బీజం వేసింది బ్రిటిష్ పాలకులే. ఆరంభంలో జాయింట్ స్టాక్ బ్యాంకుల రూపంలో పరిమితమైన బ్యాంకింగ్ వ్యవస్థ ప్రస్తుతం విశ్వరూపం దాల్చింది. 1969లో జరిగిన జాతీయకరణ అనంతరం, ప్రజాసంక్షేమ రంగంలోకి ప్రవేశించిన బ్యాంకింగ్ వ్యవస్థ ప్రస్తుతం దేశ ఆర్థికాభివృద్ధిలో కీలకపాత్రను పోషిస్తోంది. భారతదేశంలో బ్యాంకింగ్ వ్యవస్థ పరిణామంపై

'ఆకెళ్ల సత్యప్రకాష్' నివేదిక...

# అభివృద్ధికి ఆలంబనగా మారిన బ్యాంకింగ్

భారతదేశంలో బ్యాంకుల వ్యవస్థకు 19వ శతాబ్దం ఆరంభంలోనే బీజం ఏర్పడింది. బ్రిటీష్ 'మార్కు'లో తెల్ల దొరలు బ్యాంకులకు శ్రీకారం చుట్టారు. మొదట్లో జాయింట్ స్టాక్ బ్యాంకుల రూపంలో వీటిని ప్రారంభించారు. అనంతర కాలంలో 'నిధి'లు, వడ్డీ వ్యాపారం, లోకల్ బ్యాంకులు రూపుదిద్దుకున్నాయి. స్థానిక కమ్యూనిటీల నియమ నిబంధనల మేరకు ఈ జాయింట్ స్టాక్ బ్యాంకులు నడిచేవి. కాలక్రమంలో ఈ వ్యాపారం అభివృద్ధి చెందడంతోపాటు అనేక మంది ఈ వ్యాపారంపట్ల మొగ్గుచూపుతుండడంతో ఇందుకోసం ఒక ప్రత్యేక చట్టం తీసుకురావాల్సిన అవసరం ఏర్పడింది. పుట్టగొడుగుల్లా పుట్టుకు వస్తున్న అనేక బ్యాంకింగ్ కంపెనీల వ్యవస్థను అజమాయిషీ చేసేందుకు ఒక ప్రత్యేక చట్టం ఉండాలన్న ప్రతిపాదనలు 1773లో వచ్చాయి. డిపాజిటర్ల ప్రయోజనాల దృష్ట్యా, అవకతవకలను అరికట్టేందుకు, బ్యాంకింగ్ వ్యవస్థను మరింత అభివృద్ధిపర్చేందుకు 1921లో ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా యాక్ట్ పేరుతో మొట్టమొదటి బ్యాంకింగ్ చట్టానికి రూపకల్పన చేశారు. 1841నాటి బొంబాయి ప్రెసిడెన్సీ బ్యాంక్, 1843నాటి మద్రాస్ ప్రెసిడెన్సీ బ్యాంక్, 1906నాటి బెంగాల్ ప్రెసిడెన్సీ బ్యాంకులన్నింటినీ ఒకే గొడుగు కిందకు తెచ్చి వాటికి చట్టబద్ధత కల్పించారు. దేశంలో ఒక సెంట్రల్ బ్యాంక్‌ను ఏర్పాటు చేయాలని 1926లో హిల్టన్ కమిషన్ చేసిన సిఫారసుల మేరకు 1934లో రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా యాక్ట్‌ను తయారుచేశారు. అప్పటి వరకూ భారత్, పాక్‌లకు ఉమ్మడి బ్యాంక్‌గా సేవలందిస్తూ వచ్చిన రిజర్వ్ బ్యాంక్‌కు 1948 సెప్టెంబర్ 30న 'జాతీయ' గీతం ఆలపించారు. స్వాతంత్ర్యానంతరం సెంట్రల్ బ్యాంకును సర్కార్ చేతుల్లోకి తెచ్చేందుకు రిజర్వ్ బ్యాంక్ చట్టాన్ని సవరించారు. 1949లో కొత్తగా బ్యాంకింగ్ కంపెనీల చట్టాన్ని ఆమోదించారు. వ్యవసాయ రంగంలో, ఉత్పాదక రంగాలలో కూడా రిజర్వ్ బ్యాంక్ ఇతోధికంగా సేవలందించింది. సహకార రంగంలో మరిన్ని ఆర్థిక సంస్థలను నెలకొల్పడంతో కీలకపాత్ర వహించిన ఈ బ్యాంక్ 1963లో అగ్రికల్చర్ రీఫైనాన్స్ కార్పొరేషన్‌ను స్థాపించి- తర్వాతి కాలంలో దీనిని 'నాబార్డ్'గా మార్చారు. ☞

పారిశ్రామికాభివృద్ధిలో భాగంగా 1948లో ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, 1952లో రాష్ట్ర ఆర్థిక సంస్థలు, 1958లో రీఫైనాన్స్ కార్పొరేషన్ ఫర్ ఇండస్ట్రీ (దీనిని 1984లో ఇండస్ట్రియల్ రీకన్‌స్ట్రక్షన్ బ్యాంక్ ఆఫ్ ఇండియాగా మార్చారు)ని, 1964లో ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఐడిబిఐ)లు ప్రారంభమయ్యాయి. 1955లో ఇంపీరియల్ బ్యాంకును కూడా ప్రభుత్వ బ్యాంక్‌గా మార్చేందుకు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఎస్‌బిఐ) యాక్టును రూపొందించారు. 1959 సెప్టెంబర్‌లో ఎస్‌బిఐ (అనుబంధ బ్యాంకులు) మరో చట్టం ఏర్పడడంతో 8 బ్యాంకులు ఎస్‌బిఐ కిందకు వచ్చాయి. దేశంలో బ్యాంకింగ్ వ్యవస్థను పటిష్టపర్చేందుకు స్వాతంత్ర్యానంతరం దాదాపు ప్రతీఏడాది ఈ చట్టాలను సవరిస్తూ వచ్చారు. దీంతో ప్రభుత్వ, ప్రైవేట్, సహకార రంగాల్లో బ్యాంకులు కొత్తపుంతలు తొక్కాయి. దేశంలో 1987నాటికి 4,58,782 ఆర్థిక సంస్థలు సేవలందిస్తుండగా ప్రస్తుతం ఆసంఖ్య 7లక్షల పైచిలుకే. ఆర్థికాభివృద్ధి, కమర్షియల్ బ్యాంకుల సేవలు అత్యావశ్యకమవడంతో ప్రభుత్వ, ప్రైవేట్ బ్యాంకులను కమర్షియల్ బ్యాంక్‌లుగా గుర్తించారు. వీటిని షెడ్యూల్డ్, నాన్ షెడ్యూల్డ్‌గా విభజించారు. 1985 ఫిబ్రవరి నాటికి కమర్షియల్ బ్యాంకుల సంఖ్య 271. వీటిలో 267 షెడ్యూల్డ్ కాగా, మిగతా 4 నాన్ షెడ్యూల్డ్. ఈ 267 షెడ్యూల్ బ్యాంకుల్లో 19 బ్యాంకులు విదేశాల్లో సేవలందిస్తున్నాయి, మిగతా 183 ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థను కూడా పటిష్టపర్చేందుకు, గ్రామస్తుల్లో పొదుపును అలవర్చేందుకు 1975లో భారతీయ బ్యాంకింగ్ ముఖచిత్రంపైకి ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు (ఆర్ఆర్‌బి) వచ్చాయి. ప్రారంభంలో వీటికి కమర్షియల్ బ్యాంకులు ఆర్థికంగా సహాయపడ్డాయి. గ్రామాల్లో వ్యవసాయాబివృద్ధికి, వర్తక, వాణిజ్యం పెంపుదలకు, ఉత్పాదక స్థాయిని పెంపొందించడమే ఈ బ్యాంకుల ప్రధాన లక్ష్యం. 1985నాటికి దేశంలోని 23 రాష్ట్రాలలో ఉన్న 322 జిల్లాలలో 183 ఆర్‌ఆర్‌బిలు ఉన్నాయి. 1990నాటికి ఈ సంఖ్యను 300కు పెంచాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. ప్రస్తుతం వీటిసంఖ్య 18,000. కాలక్రమంలో ఎదురైన సమస్యల నేపథ్యంలో వీటిని మరింత అభివృద్ధిపర్చేందుకు ఐఆర్‌డిపిని, జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ(డిఆర్‌డిఎ)లను, ప్రాథమిక వ్యవసాయ సొసైటీ (పిఎసిఎస్)లను గ్రామీణ బ్యాంకులకు అనుసంధానం చేశారు. అనేకానేక శాఖలతో దేశవ్యాప్తంగా విస్తరించి ఉన్న భారత బ్యాంకింగ్ వ్యవస్థకు ప్రపంచంలోనే ఒక ప్రత్యేక గుర్తింపు ఉంది. ప్రపంచంలో దాదాపు నలభైవేల బ్యాంక్ బ్రాంచీలుగల ఏకైక దేశం భారత్ ఒక్కటే. 1985 జూన్‌నాటికి కమర్షియల్ బ్యాంకుల బ్రాంచీల సంఖ్య 51,385. ప్రస్తుతానికి ఈ సంఖ్య ఎనభైవేలకు చేరుకున్నట్లు అంచనా. సహకార సంస్థల సంఖ్య కూడా దీనికి రెట్టింపుగానే ఉంది. పలుశాఖలు గల బ్యాంకులో ఇంగ్లండ్, కెనడాలలో ఒక డజన్ కూడా లేవంటే అతిశయోక్తి కాదు. అమెరికాలో అయితే ఈ బ్రాంచ్ బ్యాంకింగ్‌కు గుర్తింపే లేదు. గ్రామీణ బ్యాంకింగ్ వ్యవస్థలో లీడ్ బ్యాంకులు సరికొత్త అధ్యాయానికి నాందీ పలికాయి. రోజురోజుకీ విస్తృతమవుతున్న బ్యాంకింగ్ సేవలను మరింత విస్తృపర్చేందుకు ఇవి అవతరించాయి. 50కోట్లకు పైగా డిపాజిట్లు ఉన్న 14 పెద్ద బ్యాంకులన్నింటినీ 1969 జులై 19న జాతీయం చేస్తూ కేంద్ర ప్రభుత్వం చారిత్రక నిర్ణయం తీసుకుంది. స్వాతంత్ర్యానంతరం బ్యాంకింగ్ రంగంలో చేపట్టిన సంస్కరణల్లో బ్యాంకుల జాతీయకరణ కీలక పరిణామం. '80లో మరో 6 బ్యాంకులను జాతీయం చేశారు.

### ఆటోమేషన్

1985లో బ్యాంకింగ్ రంగం సాంకేతికంగా మరో అడుగు ముందుకు వేసింది. ఖాతాదారులకు విశిష్ట సేవలందించేందుకు, లావాదేవీల్లో ఆలస్యాన్ని నివారించేందుకు కంప్యూటర్లను ప్రవేశపెట్టాలని అప్పటి ఆర్‌బిఐ గవర్నర్ డాక్టర్ సి. రంగరాజన్ సూచనల మేరకు ఈ నిర్ణయం తీసుకున్నారు. ఆటోమేషన్‌లో భాగంగా ఎలక్ట్రానిక్ మెయిల్ ట్రాన్స్‌ఫర్, టెలీబ్యాంకింగ్ సౌకర్యాలు కూడా వచ్చాయి. ఇప్పటివరకూ నిర్ణీత పనివేళల్లోనూ సేవలందిస్తున్న బ్యాంకులు ఖాతాదారులకు 24గంటలూ సేవలందించేందుకు ఆటోమేటెడ్ టెల్లర్ మెషీన్లు (ఎటిఎం)లు ప్రవేశపెట్టాయి. దేశంలోని ఎక్కడ నుంచైనా ఇప్పుడు క్యాష్‌ను తీసుకోవచ్చు. తాజాగా ఇంటర్‌నెట్ బ్యాంకింగ్ కూడా అందుబాటులోకి వచ్చింది. ■



**దళిత ఉద్యమానికి తాత్విక భూమిక గౌతమ బుద్ధుని బోధనల్లోనే ఉన్నా, బౌద్ధం పతనమవడంతో సుదీర్ఘ కాలంపాటు దేశంలో దళిత చైతన్య జ్యోతి వెలగలేకపోయింది. మహాత్మా జోతీరావు పూలే, నారాయణ గురు, సాహుమహరాజ్, డాక్టర్ అంబేద్కర్, పెరియార్ రామస్వామి నాయకర్, తదితరుల ఉద్యమాలు, బోధనల ఫలితంగా ఇరవయ్యో శతాబ్దం చివరి నాటికి దళిత ఉద్యమం ఆత్మవిశ్వాసంతో నిలబడగలిగింది. ఆంధ్రదేశంలో సాహితీ సాంస్కృతిక రంగాలను గణనీయంగా ప్రభావితం చేసిన దళిత ఉద్యమం రాజకీయ రంగంపై పట్టుసాధించలేకపోయింది. 'ఎం. లక్ష్మయ్య' పరిశోధన...**

మనం ఈనాడు చూస్తున్న దళిత వాదం, దళిత చైతన్యం, దళిత స్పృహకు రెండున్నర వేల తాత్విక నేపథ్యం ఉన్నది. ఈ భూమి మీద పుట్టిన మనుషులందరూ సమానమేననే భావనే ఈ చైతన్యానికి భూమిక. అయితే గౌతమ బుద్ధుడు ప్రవచించిన మానవత్వ తత్వంతో అంకురించిన ఈ చైతన్యం ఈ సహస్రాబ్దిలో మొక్కై, మానై, నేడు పెకిలించినా కదలని ఒక మహావృక్షమైంది. బుద్ధుని తాత్వికత మతంగా మారింది. క్రమంగా భారతదేశంలో వైదిక మతం దానిని మింగివేసింది. కానీ, అందులోనే మళ్లీ తిరుగుబాటు లేచింది. వీర శైవం పేరుతో బసవేశ్వరుడు, వీరవైష్ణవంతో పేరుతో రామానుజుడు సాగించిన పోరు మనుషులందరూ సమానమేననే తాత్వికతలో భాగమే. బుద్ధుని నాడు ఒక రూపం దాల్చని కులాలు పదకొండవ శతాబ్దం నాటికి తమ ప్రతాపాన్ని చూపెట్టాయి. అందువల్లనే వైదిక మతంలోనే కుల వివక్షకు వ్యతిరేకంగా ఉద్యమం బయలుదేరింది. ఆ తర్వాత కబీర్ లేవనెత్తిన ఉద్యమం ఒక కొత్త కోణంగా చెప్పుకోవచ్చు. ఆయన ఇటు వైదికమతం పేరుతో ఉన్న హిందూమతం, ముస్లిం మతంలో ఉన్న చెడులకు వ్యతిరేకంగా తన నిరసనను ప్రకటించి భక్తి మార్గంలోనే ఉద్యమం నడిపారు. ఈ మధ్యకాలంలోనే ఇరాన్ నుంచి భారతదేశానికి వ్యాపించిన సూఫీమతం కులాల ఐక్యతే కాకుండా, సర్వమతసమైక్యతను చాటింది. ముఖ్యంగా అట్టడుగు వర్గాల, వర్ణాల అభ్యున్నతి ధ్యేయంగా ప్రచారాన్ని నిర్వహించింది. వీలైనచోట్ల వైద్య, విద్య అవసరాలను తీర్చడానికి సూఫీ తత్వవేత్తలు అంకితమయ్యారు. ఈరోజు మనం చూస్తున్న దర్గాలు, జరుపుతున్న ఉర్సులన్నీ ఆ తత్వవేత్తల సమాధులు, వాటి వద్ద జరుగుతున్న ఉత్సవాలేననేది వాస్తవం.



### పందొమ్మిదవ శతాబ్దం ప్రాధాన్యత

ఈ సహస్రాబ్దిలో అత్యంత కీలకమైనది పందొమ్మిదవ శతాబ్ది. భారతదేశంలో ఉన్న రుగ్మతలలో కుల వివక్ష, అంటరానితనం ప్రధానమైనవి. మొత్తం సమాజం విచ్ఛిన్నానికి, వెనుకబాటు తనానికి కులం ఒక చీడపురుగులా వ్యాపించింది. సరిగ్గా ఈ దారుణంపై భక్తి ఉద్యమాలతోపాటు వేమనలాంటి కవులు, బ్రహ్మంగారి లాంటి దార్శనికులు, బ్రహ్మన్న లాంటి రాజకీయవేత్తలు కొంతమేరకే ప్రభావాన్ని కలుగజేశారు. కానీ 19వ శతాబ్దంలో వచ్చిన ఉద్యమాలు గత వారసత్వ కొనసాగింపుగా చెప్పుకొన్నప్పటికీ, వీటిలో నిర్మాణాత్మకమైన మార్పు కనిపించింది. దీనికి కారణం అమెరికా, యూరోప్‌లలో వచ్చిన మానవ హక్కుల ఉద్యమాల ప్రభావం బలంగా ఉంది. 19వ శతాబ్దంలో ప్రారంభమైన ఈ ఉద్యమానికి ఆద్యుడు జ్యోతిరావు ఫూలే. ఈయన పుట్టుకతో శూద్రుడు. అప్పుడు అమలులో వున్న సామాజిక అణచివేతలో అన్ని రకాల అవమానాలను ఎదుర్కొన్నాడు. బ్రాహ్మణులతో సమానంగా కనీసం పెళ్లి ఊరేగింపులో పాల్గొన్నందుకు తిట్లు తిన్నాడు. ఆ విధంగా ఈ వ్యవస్థకు వ్యతిరేకంగా ఉద్యమించ పూనుకున్నాడు. ఒకవైపు హిందూమత భావజాలానికి వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ సంస్కృతిని ప్రచారం చేస్తూనే, రెండోవైపు శూద్రులకు, వారితోపాటు అంటరాని కులాలకు అప్పటి వరకు అందుబాటులో లేని విద్యను అందించడానికి పూనుకున్నాడు. అందులో ముఖ్యంగా బాలికలకు ఆ అవకాశం కల్పించడానికి నిశ్చయించుకోవడం ఆయన ముందుచూపుకు నిదర్శనం. వ్యక్తి సర్వతోముఖాభివృద్ధికి పాటుపడాలని, పాలనలో జనాభా నిష్పత్తి ప్రకారం ప్రాతినిధ్యం ఉండాలనీ, ప్రతివ్యక్తి తన అనుభవాలనుండి తనకు నచ్చిన జీవన విధానం నిర్ణయించుకోవాలనీ ఆయన చాటాడు.

ఫూలేలో ఎంతో ప్రజాస్వామిక దృక్పథం ఉన్నది. అణచివేస్తున్న కులాలతో పోరాటం చేస్తూ, తమకన్న తక్కువ కులాల వారితో సమభావం ప్రదర్శించారు. ఈ దృక్పథం రాబోయే ఉద్యమాలకు, తరాలకు మార్గదర్శకంగా ఉంటుందనే దాంట్లో సందేహం లేదు. ఆయనతోపాటు తన బార్య సావిత్రిభాయి పూలేను విద్యావంతురాలిని చేయడమే కాకుండా, భారత అట్టడుగు వర్గాలకు ఒక ప్రప్రథమ మహిళా ఉద్యమనాయకురాలిని అందించాడు. సావిత్రిభాయి ☞





మహిళా విద్యకోసం పాటుపడడమే కాకుండా, అంటువ్యాధులు ప్రబలిన సమయంలో ఆరోగ్య కార్యకర్తగా పనిచేసింది. బతికినంతకాలం నిరుపేదల, నిమ్న వర్గాల, స్త్రీల అభ్యున్నతి కోసం కృషిచేసిన సావిత్రి బాయిని ఇవాళ భారత సమాజం మరిచిపోయే స్థితి వచ్చింది. మహారాష్ట్రలో మొదలైన ఈ ఉద్యమకెరటం నారాయణగురు రూపంలో కేరళను ముంచెత్తింది. ఇళవ కులంలో పుట్టిన నారాయణగురు అంటరానితనాన్ని స్వయంగా చవిచూశాడు. అయితే అప్పటికి ఆర్థికంగా కొంత మెరుగైన స్థితిలో ఇళవ కులంలో పుట్టడంవల్ల చదువు నేర్చుకోవడంలో ఇబ్బంది కలుగలేదు. ఆ విధంగా సమాజ పురోగతి కోసం చదువు, పరిశ్రమ ప్రధానమని తలచారు. కిందికులాల వారు పైకి రావడమంటే వారు విద్యావంతులు కావాలనీ, విడివిడిగా కాక సమైక్యంగా ఉండాలని, ఆర్థిక అభివృద్ధి కోసం కుటీర పరిశ్రమల స్థాపన అవసరమని భావించాడు. కుల వివక్ష పనికిరాదని నిరసించడమే కాకుండా, దానిని ఎదుర్కొని చదువు, ఆర్థిక పురోగతి సాధించాడు.

ఆ తర్వాత మళ్లీ రంగం మహారాష్ట్రకే మారింది. సాహు ఛత్రపతి మహరాజు కొల్హాపూర్ సంస్థానాధీశుడు. యూరోపియన్ దేశాలలో విద్యను అభ్యసించిన సాహు మహారాజ్‌ను మన దేశంలో కొనసాగుతున్న సామాజిక అణచివేతలు కలిచివేశాయి. అందువల్లనే అగ్రకులాలు అందరూ వ్యతిరేకిస్తున్న అంటరాని కులాల వారిని దగ్గరకు చేర్చుకున్న మానవతావాది. అంటరాని కులానికి చెందిన వ్యక్తి నడిపిన టీ హోటల్‌లో కూర్చుని టీ తాగి అందరి నోళ్లు మూయించాడు. రాజోద్యోగులలో అంటరాని కులాల వారిని చేర్చుకొని రిజర్వేషన్ భావనకు అంకురార్పణ చేశాడు. అంతేకాకుండా బిఆర్ అంబేద్కర్ నడిపిన ఉద్యమాలకు ఆర్థికంగా, హార్థికంగా ఎంతో సాయపడిన వాడు సాహు మహరాజ్. తమిళనాడులో బలంగాఉన్న అగ్రవర్ణ ఆధిక్యతను దెబ్బకొట్టడానికి భావజాలరంగంలో, ఉద్యమరూపంలో ముందుకొచ్చిన ఒక ఉగ్రరూపం పెరియార్ రామస్వామి నాయకర్. 'ప్రతి వ్యక్తి తత్వమూ ఒక విశాల మానవత్వం అయిన నాడు, ప్రతి వ్యక్తి జీవిత లక్ష్యమూ మానవులందరి సంక్షేమం, ప్రగతి అయిననాడు, ఒకరిని ఒకరు ద్వేషించుకునే ప్రశ్న ఉదయించదు' అని పెరియార్ అన్నట్లుగా ఆయన తత్వం మానవత్వం. ఈ సహస్రాబ్దిలో మానవత్వ భావనకు అత్యున్నత ఉద్యమరూపం అంబేద్కర్. గతంలో తమ జీవితాలను కుల వివక్ష వ్యతిరేక పోరాటానికి అంకితం చేసిన వారికన్న అంబేద్కర్‌ది ప్రత్యేక వ్యక్తిత్వం. పుట్టుకలో కూడా ఆ తేడా ఉన్నది. కులాల నిచ్చెన మెట్లలో అట్టడుగున వున్న మహార్ కులంలో పుట్టాడు. ఆయన అనుభవించిన అవమానాలకు లెక్కలేదు. వివక్షకు అంతులేదు. కుల అసమానతలను అంతంచేయాలనే లక్ష్యం కలిగిన అంబేద్కర్ సమాజంపై శాస్త్రీయ విశ్లేషణను అందించారు. దీనికోసం సంవత్సరాల తరబడి శ్రమించారు. రాజ్యాంగంలో బలహీనవర్గాలకు ఎన్నో రక్షణలు కల్పించారు.



అంబేద్కర్



పెరియార్ రామస్వామి

దళిత చైతన్యానికి తాత్విక భూమికను బుద్ధుడు అందిస్తే, సిద్ధాంత ప్రాతిపదికను అంబేద్కర్ రూపొందించారు. దానికి అంతిమరూపమే రాజ్యాధికారమని నిర్ధారించాడు. కానీ, ఆయన జీవితకాలంలో దానిని దర్శించలేకపోయాడు. అయితే, ఆ తర్వాత ఆ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ముందుకొచ్చిన కాన్షీరాం 'ఓట్లు మావి - సీట్లు మీవా' అనే నినాదంతో దేశంలో రాజకీయ చైతన్యాన్ని రగిలించడంలో సఫలీకృతుడయ్యాడు. అయితే, సామాజిక చైతన్యాన్ని సాధించడంలో కాన్షీరాం విఫలమయ్యాడు. ఆ కర్తవ్యం నేటి దళిత, బడుగు, బలహీన వర్గాల ఉద్యమాలపై ఎంతైనా ఉంది. ■







## సుగంధ తైలాల మొక్కల పెంపకం చేపట్టు.
## దేశాభివృద్ధికదే తొలిమెట్టు.
## గ్రాసమున సుగంధ తైలంబుదీయవచ్చు.
## సమగ్ర స్వావలంబన సాధించవచ్చు.



### జపనీస్ మెంధా సాగు
(మెంధా ఆర్వెన్‌సిస్) లాబి యేటి

★ ఈ బహువారిక మొక్కనుండి తీసే నూనెలో ముఖ్యంగా లభించే పదారం మెంథాల్, మెంటోన్ మరియు మెంథైల్ ఎసిటేట్. ★ దీన్ని మందులు, సుగంధ ద్రవ్యాలు, బేకరి, ఆహార పదారాల సువాసనను పెంచేందుకు, దగ్గు బిళ్ళలు, నొప్పిని నివారించే మందులు, కిల్లీలు, టూత్ పేస్టులు, షేవింగ్ క్రీమ్‌లు, వక్కపొడి ఇంకా అనేక ఇతర పదార్థాల తయారీలో ఉపయోగిస్తారు. ★ మెంథాల్ ప్రధానంగా ఆకులలో నూనె గ్రంథులలో నిక్షిప్తమై ఉంటుంది. ★ 0.3 - 0.81 శాతం వరకు నూనె ఉంటుంది.

**నేలలు** : ఎక్కువ సేంద్రీయ పదారాలు, తగినంత పోషకాలు, నీటివసతి, మురుగు నీటి పారుదల సౌకర్యంగల తేలికపాటి గరపనేలలు అనువైనవి.

**నాటే విధానం** : జపనీస్ మెంధా నాటేందుకు కాండపు కట్టింగ్స్, స్టోలాన్ కటింగ్స్ ఉపయోగించాలి.

★ ఒకసారి కట్టింగ్స్ నాటిన పిదప 5 సం॥ల వరకు క్రొత్త కట్టింగ్స్ నాటుకొనవసరము లేదు. ★ ఎక్కువ ఆకుల దిగుబడి, నూనె దిగుబడికి 45×10 సెం.మీ. లేదా 60×10 సె.మీ. దూరంలో నాటుకోవాలి. ఎకరాకు 200 కిలోల స్టోలాన్స్ అవసరమవుతాయి.

**ఎరువులు** : జపనీస్ మెంధా అధిక దిగుబడికి బాస్వరం, యూరియా చాల అవసరం.

హెక్టారుకి ఎరువుల వివరాలు :

| | ఎరువుల వివరాలు | నత్రజని (కిలోలు) | భాస్వరం (కిలోలు) | పొటాష్ (కిలోలు) |
|---|---|---|---|---|
| 1. | దుక్కిలో | 50 | 40 | 60 |
| 2. | నాటిన 45వ రోజు | 50 | - | - |
| 3. | నాటిన 65వ రోజు | 50 | - | - |
| 4. | మొదటి కోత తర్వాత వారం రోజులకు | - | 50 | - |

**సస్యరక్షణ** : కీటకాలు ఆశించకుండా నాటిన 20-50 రోజుల మధ్యకాలంలో రెండుసార్లు మోనోక్రోటాఫాస్ 1.5 మి.లీ. ఒక లీటరు నీటిని కలిపి పిచికారి చేయాలి.

**కోత విధానం** : మొక్క ఆకులలో నూనె గ్రంథులుండుటవలన భూమికి నాలుగైదు సెం.మీ. పైనున్న కాండము ఆకులతో సహా కోసి డిస్టిలేషన్ చేసిన నూనె లభిస్తుంది.

★ జపనీస్ మెంధాను సరైన సమయంలో కోయడం వలన అధిక దిగుబడి, నూనె శాతాన్ని పొందవచ్చు. ★ రంగారెడ్డి జిల్లాలో మొదటి కోత నాటిన 93-100 రోజుల మధ్య ఆ తర్వాత ప్రతి 60 రోజులకొకసారి తీసుకోవచ్చు. ★ మొదటి కోతలో మొక్కలను భూమిపైన నాలుగైదు సెం.మీ. వదలి పెట్టి కొయ్యాలి. ★ రెండవ కోతలో భూమికి దగరగా కోయటం మంచిది. ★ కోత కోయటంలో ఆలస్యమైతే కింది ఆకులు రాలి పోవడం వల్ల నూనె దిగుబడి తగ్గిపోతుంది. ★ కోత సమయంలో వాతావరణంలో అధిక ఉష్ణోగ్రత ఉంటే ఆకులలో నూనె శాతం గణనీయంగా పెరుగుతుంది. ★ పంట కోసిన పిదప ఒక రోజుపాటు పొలంలో ఆరబెట్టడంవల్ల డిస్టిలేషన్ బాగా జరిగి నూనెశాతం పెరుగుతుంది.

[illegible]
1. మొత్తం నాలుగు కోతల నుంచి ఆకుల దిగుబడి ఎకరాకు : 30 టన్నులు.
2. నూనె దిగుబడి ఎకరాకు నాలుగు కోతల నుండి : 120 కిలోలు.
3. మార్కెట్‌లో కిలో నూనె రేటు : @ రూ. 400 కిలో ఒక్కింటికి.
4. ఆదాయం ఎకరాకు : రూ. 48,000-00
5. సాగు ఖర్చు ఎకరాకు : రూ. 10,000-00
6. నిఖర లాభం ఎకరాకు : రూ. 38,000-00

### నిమ్మగడ్డి (లెమన్ గ్రాస్) (సింబోపోగాన్ ఫ్లెక్సుయోసస్)

★ ప్రధానంగా లభించే పదార్థం సిట్రాల్ (75-90%), లినోలాల్., జిరానియాల్, సిటోనెల్లార్ ఇతర పదార్థాలు.
★ ఈ నూనె సుగంధతైలములు, సబ్బులు మరియు విటమిన్ 'ఎ' తయారీలో వాడబడుచున్నది.



**నేలలు** : బహువార్షికమైన ఈ పంటను సారము తక్కువగానున్న భూములలో బంజరు, క్షార (పిహెచ్ 9.5 వరకు) భూములలో, అటవీ ప్రాంతంలో వర్షాధారపు పంటగా గాని, నీటిపారుదల పంటగా గాని పండించవచ్చు.

**సాగు విధానము** : జపనీస్ మెంధా సాగువలే సాగు చేయవలెను.

### కామాక్షి కసువు (సిట్రోనెల్లా) (సింబో పోగాన్ విన్టెరియానస్)

★ సిట్రోనెల్లా సుగంధ తైలము సబ్బులు, అగరువత్తులు, దోమలను పారద్రోలు పదార్థములు మరియు కొన్ని మందుల తయారీలో వాడుతారు.

**నేలలు** : నీరు నిలువని, తేలికైన, లోతైన, సారవంతమైన భూములు సిట్రోనెల్లా సేద్యమునకు అనువైనది.

**సాగు విధానము** : జపనీస్ మెంధా సాగువలె సాగు చేయవలెను.

### రుష్యాగడ్డి (పామారోజా) (సింబో పోగాన్ మార్టిని)

★ పామారోజా గడ్డి తైలమును సబ్బులు, పొగాకు, అగరువత్తులు మరియు ఆహార పదారములు సువాసనలను హెచ్చించుటకు, దోమలను వికర్షించు పదార్థముల తయారిలోను ఉపయోగిస్తున్నారు.

**నేలలు** : నీరు నిలువని, తేలికైన, లోతైన సారవంతమైన భూములు సిట్రోనెల్లా సేద్యమునకు అనువైనది.

**సాగు విధానము** : జపనీస్ మెంధా సాగువలె సాగు చేయవలెను.

### డిస్టిలేషన్ విధానం :



★ నూనె తీసే బట్టీలను జింకు పూత పూసిన ఇనుపరేకుతో నిర్మించినవి ఉంటాయి.
★ నూనె తీసే బట్టీలను కొంతమంది రైతులు కలిసి ఏర్పాటు చేసుకోవడంవల్ల లేదా బట్టీలు కలిగిన వ్యక్తులతో ఒప్పందం కుదుర్చుకోవడం వలన ఖర్చును తగ్గించుకోవచ్చు.

**డిస్టిలేషన్ యూనిట్** :

| క్రమ సం. | డిస్టిలేషన్ కెపాసిటీ | పంట విస్తీర్ణం (ఎకరాలలో) | ఖరీదు సుమారుగా రూ.॥ |
|---|---|---|---|
| 1. | 250 కిలోలు | 5-8 | 45000-00 |
| 2. | 500 కిలోలు | 12-15 | 55000-00 |
| 3. | 1000 కిలోలు | 20-25 | 75000-00 |
| 4. | 1500 కిలోలు | 25-40 | 85000-00 |

**గమనిక :**
★ మెంథాల్‌ను తప్పనిసరిగా నీటి వసతి ఉన్న భూములలో సాగు చేయాలి.
★ లెమన్‌గ్రాస్, సిట్రోనెల్లా, పామారోజా మొదలైన గడ్డిజాతి పంటలను వర్షధార పంటగా కూడా సాగుచేయవచ్చును. కాని నిఖర అదాయం ఎకరాకు రూ. 10,000 - 12,000 ఉంటుంది.

### అంతర పంటలు :

అంతర పంటలుగా వేసుకొనుటకు ఈ మొక్కలు చాలా అనువైనవి.
ఈ క్రింది పంటలలో ఈ మొక్కలను సాగిచేసిన అధిక లాభాలు పొందవచ్చు.

1. మెంథాల్ - ఉల్లి, వెల్లుల్లి.
2. మెంథాల్ - బెండ, టమేటో
3. మెంథాల్ - చిక్కుడు, గోకర
4. మెంథాల్ - చెఱుకు
5. లెమన్‌గ్రాస్ - బొప్పాయి
6. లెమన్ గ్రాస్ - కంది.



### సుగంధ నూనెల ఉత్తనం లభ్యం

మెంథాల్ (జపనీస్ మెంధా) - కోసీ, హిమాలయ రకములు, లెమన్ గ్రాస్ - కావేరి, కృష్ణా రకములు, పామ్ రోసా - కృష్ణా రకములు మరియు 32 రకాల (బెనిష, మల్లిక, ఆమ్రపాలి మొ॥) మామిడి అంట్లు అమ్మకమునకు సిద్ధంగా ఉన్నవి.

**Contact: S.C. SCS., Ph: No: 3212273, 3233845.**

**కె.వి. సత్యనారాయణ**
ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్

**ఐ. రాణి కుముదిని**
జిల్లా కలెక్టర్ / ఛైర్ పర్సన్



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M271 |
| పుస్తకం పేరు | లాల్ జెండా |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 118 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1to12 |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |